# కెరటాలు

ధనిష్ఠ

నవోదయ పబ్లిషర్సు
విజయవాడ 2

ప్రథమ ముద్రణ
ప్రచురణ నెం. 66
జనవరి, 1963
వెల : రు6-50

ఆంధ్రపత్రిక సచిత్ర
వారపత్రిక నుండి
పునర్ముద్రితం

అచ్చు : "వెంకటరత్నా". విజయవాడ-2.

నా మీద ఎనలేని
అనురాగాన్ని ఎక్కువ
కాలం ప్రదర్శించడానికి
నోచుకోని స్వర్గీయులు
నాన్నగారు, మీనాక్షి,
సరస్వతి అక్కలకు
అశ్రుకణాలతో —

'ధనిష్ఠ'

# కృతజ్ఞతలు

ఈ రచనకు ఊపిరి సలిపిన పూజ్యమిత్రులు, ప్రఖ్యాత రచయితలు అయిన హితశ్రీగారిది 'సంజవెలుగు' అనే కథానిక. రచనకు అడుగడుగునా చేయూత నిచ్చి ముఖ్యంగా ఖాన్‌పాత్ర మలచిన ప్రియమిత్రుడు శ్రీ సత్యంగారు - తప్పుల తడికెగా ఉన్న చిత్తు ప్రతిని చదివి అమూల్యాభిప్రాయాలనీ, ప్రోత్సాహాన్నీ యిచ్చినవారు. ఆప్తమిత్రుడు వెంకటేశ్వర్లూ, మా సావిత్రి పిన్నినూ. వ్రాతప్రతిని చదివిఎంతో ప్రోత్సాహం యిచ్చినవారు కుమారి అచ్యుతవల్లీ. శ్రీయుతులు తణికెళ్ళ శ్రీరామమూర్తి, లక్ష్మినారాయణ, గణపతిరావుగార్లు — ధారావాహినిగా ప్రచురించి ఆదరించిన వారు ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక సంపాదకులు — ఓర్పుతో చదివి ఆగ్రహించకుండా అభిమానించిన పాఠకులు —

వీరందరకూ నా హృదయపూర్వక కృతజ్ఞతలూ, ధన్యవాదాలూ —

రచయిత

5



# కెరటాలు

తెలివితో కొట్టొచ్చేట్టున్న ముఖాన్ని పైకెత్తి శాల నయనాలతో విశ్వం కళ్ళలోకి సూటిగా చూసింది అనూరాధ. పద్మసన్నిభమైన ఆమె ముఖంలోని జంకులేని ర్యానికి ముగ్ధుడై విశ్వం చేసిన శిరఃకంపన ఆమెకు అర్థమై హజమైన లజ్జతో చిరునవ్వు నవ్వుతూ ముఖం దించుందామె. అతని మనోజ్ఞమైన రూపం, గంభీర ప్రకృతి, దుస్తులని నిరాడంబరత ఆమెకు ఆనందం చేకూర్చాయి. నకు తెలియకుండానే అంగీకారం కనపడిందామె కళ్ళలో.

పిల్లను చూసి మురిసిన శాంతమ్మగారు కొడుకుకేసి చూసి అతని భావం గ్రహించి తృప్తిగా నవ్వుకుంది.

పెళ్ళి చూపులకు కూడా వచ్చిన విశ్వం స్నేహితుడు శంకరం విషయాలు సేకరించడంలో నిమగ్నుడయ్యాడు.

అనూరాధ తండ్రి రామనాథంగారు మాత్రం ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. పెళ్ళి చూపులన్నప్పట్లో

ఆయన జీవితానికి ఒక పరీక్షగాను, సమస్యగాను త
రాకుంది. విభిన్న ప్రకృతులుగల మనుష్యులు వివిధ
పరీక్షలు పెడతారు. అవి అంటారు యివి అంటా
పిటితో ఆయన మనస్సు వేగిపోయింది. కాని తాను
తండ్రి; భరించక తప్పదు. పిల్లను చూస్తారు. అంగీకా
తెల్పరు; కట్నాల విషయం ఎత్తుతారు. బేరం ఆడతా.
ఇంటికి వెళ్ళి రాస్తామని వెళ్ళిపోతారు.

కాఫీల అనంతరం అసలు విషయం కదిపాడు.

"అక్కగారూ, ఏమంటారు?" అన్నాడు శాంతమ
గార్ని ఉద్దేశించి.

"బాబూ, ముహూర్తం పెట్టించండి" అందావి
సమాధానంగా.

ఆ మాటలు ఆయనకు అర్థం కాలేదు. ఏ విష
యమూ తేల్చుకోకుండా ఆమె ముహూర్తం పెట్టించ
మంటే ఆయనకు భయం వేసింది, తరవాత ఏం పేచీలు
వస్తాయోనని. పాత అనుభవాలాయనకు చాలా పాఠాలు
నేర్పాయి. అంత్య నిష్ఠూరం కంటె ఆదినిష్ఠూరమే మేలని
తెలిసి వచ్చింది.

అందుకే—

"కాని. అక్కగారూ—" అంటూ నసిగాడు.

"చెప్పండి, బాబూ! సందేహిస్తారేం?" అడిగింది
శాంతమ్మగారు.

"కట్నం కానుకల విషయం—"

"బాబూ! కష్టపడి పెంచి పెద్దచేసిన కొడుకును చేతులారా అమ్ముకోలేను. మీకు తోచిందేదో పిల్లకే పెట్టండి" అంటూ నవ్వింది.

తల పైకెత్తిన అనురాధ కళ్ళలో కృతజ్ఞత కనపడింది. విశ్వం ముఖంలో గర్వం తొణికిసలాడింది.

రామనాథంగారికే అనుమానం పట్టుకుంది - ఇది కలా, నిజమా అని. ఆయన కళ్ళలోకి నీళ్ళు నిండుకొచ్చాయి. ఆదిలో అనుభవించిన బాధలకు అలవాటుపడిన ఆయన హృదయానికి ఇంత అకస్మాత్తుగా కలిగిన ఈ ఆనందం తాత్కాలికంగా భరింపరానిదే అయింది. జీవితంలో పొందిన ఎన్నో సౌఖ్యాలకంటె ఇది మిన్నగా తోచిందాయనకు. ఆయన కిది తొలి అనుభవం-యిటువంటివార్ని కలుసుకోవడం. ఎన్నో సంబంధాలను తిరిగాడు. ఇంత మంచితనం ఎక్కడా కనపడలేదు. అందర్నీ పిల్చినట్టే వీరినీ పిల్చాడు. పాత పాటే అవుతుందనుకున్నాడు. కాని ఇంతి ఋణాలమీద ఈ సంబంధం స్థిరపడుతుందని కాని, కట్నం ఇవ్వనక్కర లేకుండానే తానుకూతురికి పెళ్ళి చెయ్యగలడనిగాని ఆయన కలలో కూడా ఊహించలేదు.

అనుకోని ఆనందంతో ఉక్కిరబిక్కిరి అయిన ఆయన ఈ విషయాన్ని అంత సులభంగా తీసుకోలేకపోయాడు. ఎలాగో పెళ్ళివార్ని సాగనంపాడు.

"చదువుకున్నందుకు సార్థకత చూపించావురా!" అభినందించాడు శంకరం విశ్వాన్ని దారిలో.

"నాదేముంది? మా అమ్మ ఇష్టం. ఆమె హృదయం అంత నవనీతంగాక, ఆమెకు కట్నంమీద కోరికే ఉంటే నేను కాదనకుండా ఉండడం నా విధి అయి ఉండేది" అన్నాడు విశ్వం ఆగొప్ప తల్లికే దక్కనిస్తూ.

"చూడు, శంకరం. నా గొప్ప ఏమీ లేదు. ఏదో మాకున్నది మాకుంది. వాడా సంపాదించుకుంటున్నాడు. పిల్లలు గలవాళ్ళను ఇరుకున పెట్టి యెందుకు బాబూ బాధ పెట్టడం!" అంది.

"కోట్లకు విలువైన మాటన్నావమ్మా! పాపం రామనాథంగారు ఇదివరకటి అనుభవాలవల్ల యెంత బాధపడ్డారో, ఏమో నీ మాటలవల్ల కలిగిన సంతోషం పట్టలేక అయనకు కళ్ళ నీళ్ళు నిండుకొచ్చాయి. బహుశః ఇంత ఆనందం ఆయన జీవితంలో అనుభవించి ఉండడు" అన్నాడు శంకరం.

"బాబూ! పిల్ల లక్షణంగా ఉంది. అబ్బాయికి నచ్చినట్లు వాడి ముఖమే చెప్పింది. ఇంటర్ ఫస్ట్‌క్లాస్‌లో పాస్ అయిందిట! అంతకంటె ఏం కావాలి? పిల్ల ముఖంలో సిరి ఒలికిపోతూంది" అంది అనూరాధ సుందరవదనాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ.

విశ్వం నవ్వుకున్నాడు.

అక్కడ విశ్వాన్నీ, అతని తల్లినీ తల్చుకుని అనూ తన అదృష్టానికి పొంగిపోయింది.

# 2

విశ్వం బి. ఎ., బి. ఇడి. విశాఖపట్నంలో ఒక హైస్కూల్లో టీచర్ అతను.

వేసవి సెలవుల అనంతరం ఇంక నాలుగురోజులకు స్కూళ్లు తెరుస్తారనగా భార్యా సమేతంగా వచ్చేశాడు స్వంత ఊరునుంచి.

వచ్చిన రెండు రోజులవరకు ఇల్లు సర్దుకోవడంతోనే సరిపోయింది అత్తాకోడళ్లకు.

మూడోనాడు సాయంకాలం-

విశ్వం పేపరు పుచ్చుకుని హాల్లో కూర్చున్నాడు. పక్కనే చాపమీద పుస్తకం చదువుతూ కూర్చుంది అనూరాధ.

వంటఇంట్లోంచి ఇటెందుకోవచ్చిన శాంతమ్మగారు ఇద్దర్నీ చూసి-

"బాబూ, ఇంట్లో ఊరికే కూర్చోకపోతే రాధకు ఊరు చూపించరాదూ?" అంది కొడుకుతో.

"రాణీగారికి అత్తగారి గారాం ఎక్కువయింది. ఆజ్ఞ అయింది. అలంకరించుకుని తయారుకండి" అన్నాడు విశ్వం నవ్వుతూ.

అనూరాధ మూతి ముడుచు వంకర్లు తిప్పి లోనికి వెళ్ళింది ముస్తాబు కావడానికి.

కింగ్‌జార్జి హాస్పిటల్ రోడ్డమ్మట డౌన్‌లోకి క్రిందికి దిగి బీచ్‌కి చేరుకున్నారు. సముద్రం ఊళ్లోకి చొచ్చుకురాకుండా సిమెంట్ దిమ్మలు గోడలా కట్టారు. కోస్టల్ బాటరీ పక్కనుంచి అడ్డం తిరిగి 'హవా మహల్' ఎగువకు వెళ్ళి యూనివర్సిటీ లేడీస్ హాస్టల్ దగ్గర ఇసుకలో నడుస్తున్నారు.

హోరెత్తి పోరెత్తి పొంగులు సాగరమే కాని, కరికళే బరంలా మాత్రం లేదు కొండ. ఉవ్వెత్తుగా ఎగిరి విరిగిపడే కెరటాలు. మనసు చల్లబరిచే చల్లనిగాలి. కొండలమాటున అస్తమించబోతున్న సూర్యుణ్ణి నల్లని మేఘం ఒకటికప్పింది. చుట్టూ ఉన్న వర్ణారవం విభ్రాంతి కల్పిస్తూ ఉంది. చిన్న పిల్లలు కెరటాలతో ఆడుకుంటున్నారు. కెరటం కాళ్లు తడిపే వేళకు తప్పుకోబోయి ఈ లోపునే అది వారి పాదాలను తడిపేస్తూంటే చేతులు చరిచి కేరింతాలు కొడుతున్నారు. పిల్లల సంతోషంలో పాలుపంచుకుంటూ పెద్దలు కూడా మహానందంతో ఉన్నారు. ఆ దృశ్యం ఎంతో హృద్యంగా ఉండడంచేత రోజూ చూసే విశ్వంకూడా అలా చూస్తూనే ఉండిపోయాడు. అనూరాధమాట చెప్పనే అక్కర లేదు. ఆమె భావనా వీధులలో విహరిస్తూంది.

"ఆంధ్ర దేశంలో ఉండిపోవడంవల్ల బూజుపట్టిపోయి ఆలనా పాలనా లేక ఇలా ఉండిపోయింది కాని ఈ బీచ్‌కి

ఉన్న సహజ సౌందర్యం యెక్కడా కనపడలేదు నాకు. మేళ్ళ తరబడి నిత్యం చూస్తూ ఉన్నాను కాని రోజుకో కొత్తరూపంతో సాక్షాత్కరిస్తుంది.బీచ్ పొడుగునా మంచి రోడ్డేనా లేదుకదా! యెవరికీ పట్టదు. అయినా - అరె! "శైలు... ...శైలూ!" అంటూ బిగ్గరగా పిల్చాడు విశ్వం.

చుట్టూఉన్న సుందర దృశ్యాలను తిలకిస్తూ విశ్వం మాటలు శ్రద్ధగా వింటూ అందులో లీనమైపోయిన అనూరాధ ఈ మార్పుతో ఉలిక్కిపడి విశ్వంకేసి చూసి, అతని దృష్టి ప్రసరిస్తున్న దిక్కుకు మరల్చింది చూపు.

ఉలిక్కిపడి గిరుక్కున వెనక్కుతిరిగిన శైలజ కళ్లు విశ్వంవైపు మళ్ళాయి.

"ఓ! అన్నయ్యా—"అనుకుంటూ సంతోషంగా లేచి వచ్చింది వారివద్దకు.

"ఏరు వదినగారు గాబోలు! నమస్కారం" అంది అనూరాధకు నమస్కరించి చిలిపిగానవ్వుతూ.

అనూరాధ ప్రతి నమస్కారంచేసి విశ్వానికి చెల్లెలైన ఈమె తన కెందుకు తెలియలేదా అని ఆలోచిస్తూంది.

"నువ్వెప్పుడు వచ్చావ్? ఇంత తొందరగా వచ్చావేం? ఇంటి కెందుకు రాలేదు?" ప్రశ్నల పరంపర కురిపించాడు విశ్వం.

"ఆగిందా వర్షం? ఇంకా ప్రశ్నలు మిగిలిపోయాయేమో అడిగెయ్యి. మరిచిపోగలవ్!" నవ్వింది శైలజ.

విశ్వం నవ్వాడు. అనూరాధ శ్రుతి కలిపింది.

"చాలా తెలివిగా మాట్లాడావ్ గాని సమాధానాలు మాత్రం చెప్పలేదు."

"అయితే నీ ప్రశ్నలకు సమాధానాలు వరుసగా:— ఇవాళే వచ్చాను. ఫైనలియర్ గదా అని ముందే వచ్చాను. మీరింకా వచ్చి ఉంటారనుకోకపోవడంచేత ఇంటికి రాలేదు. సరిపోయాయా? వాటి కేంగాని, అమ్మకులాసాగా ఉందా? మీ రెప్పుడు వచ్చారు?"

"మేం వచ్చి నాలుగు రోజులైంది. ఇంటికి పద. అమ్మ నువ్వు పెళ్ళికి రానందుకు చీవాట్లు పెట్టడానికి సిద్ధంగా ఉంది. తిందుగాని" అన్నాడు విశ్వం.

"అమ్మ పెట్టే చీవాట్లేనా! వదినగారికీ పాటికి తెలిసే ఉంటుంది. అవి భరించడం ఎంత సులువో!" చిరునవ్వుతో అంది.

ఆ మాట విని అత్తగార్ని తలుచుకుని మనస్సులోనే మురిసింది అనూరాధ.

"రాధా! శైలు మాట చెప్పడం మరిచిపోయాను. నాకు చెల్లెలివరస. పది పన్నెండేళ్ళపాటు పక్క పక్క ఇళ్లలోనే ఉండేవాళ్లం. అమ్మకు కూతుళ్ళు లేని లోటు ఈమే తీర్చింది. ఇక్కడ యూనివర్సిటీలో ఫైనలియర్ యికనామిక్స్ ఆనర్స్ చదువుతూంది" అంటూ అనూరాధకు పరిచయం చేశాడు.

"ఆపవయ్యా, బాబూ, స్తుతి, ముందింటికిపద. అమ్మనుచూడాలి" అంటూ ఆపింది విశ్వాన్ని.

ముగ్గురూ కదిలారు.

శైలజను చూసిన శాంతమ్మగారి ముఖం చేటంత అయింది.

"అమ్మా! అన్నయ్య, నువ్వునాకోసం చిట్లు అట్లే పెట్టావనీ, తినడానికి రమ్మనీ అన్నాడు. వచ్చాను నీ ఇష్టం" అంది చేతులు జోడించి.

"అయితే, అమ్మాయ్, నీకు దెబ్బలేనే తగిన శాస్తి. అయినా ఇంత చదువుకుంటున్నావ్! కొట్టడానికి చేతు లెలా వస్తాయ్? అల్లా చేశావేమిటే పెళ్ళికి రాకుండాను?"

"దానికి కారణాలు చెపుతూ కూర్చుంటే యుగాలు పడుతుంది. నువ్వు మడికట్టుకో. నా కాకలిగా ఉంది. లేక పోతే నేను కట్టుకోనా?"

"నీకు వంటకూడా వచ్చునూ? ఆ వైభోగం అయిం దిగా ఒకసారి! మిమ్మల్ని చేసుకున్నవాడు నాలుగుచేతులు ఎరువు తెచ్చుకుని తినాలి."

"నాలుగు చేతులు ఎరువు తెచ్చుకునే తింటాడో, పెడతాడో, నాకేంవండి? అస లింతకీ నేను పెళ్ళాడినప్పు డుగాఅంది?" శైలజ.

"ఎంతకైనా తగుదువు నువ్వు! మీరు కబుర్లు చెప్పు కుంటూ ఉండండి. నేను పోయి మడికట్టుకుంటాను" అంటూ లోనికి నిష్క్రమించింది శాంతమ్మగారు.

"అయితే వదినా! నువ్వు ఇంటర్ ఫస్ట్‌క్లాస్‌ట. గ్రూప్ ఏమిటి?" అని అడిగింది అనూరాధ కేసి తిరిగి.

"ఎ. బి. సి." అంది అనూరాధ.

"ఏమిటీ! ఎ. బి. సి!! ఫస్ట్‌క్లాస్!!!" అంది ఆశ్చర్య పోతూ.

సంతోష సమ్మిళితమైన చిరుసిగ్గుతో తలవంచుకుంది అనూరాధ.

"అయితే అన్నయ్యా, వదిన్ని ఆనర్స్‌లో చేర్పించ కూడదూ? ఉన్న ఊరే కాబట్టి ప్రత్యేకపు ఖర్చేం ఉండదు" అంది విశ్వంతో శైలజ.

"అల్లాగే. దానికేం!" నవ్వుతూ అన్నాడు విశ్వం.

"వేళాకోళానికి కాదు. సీరియస్‌గా చెప్పుతున్నాను. ఇంత తెలివితేటలుండీ, ఇంతవరకు చదువుకుని కూడా ఎందుకూ కాకుండా మానెయ్యడం ఎందుకూ? నిజంగా చెప్పించు చేస్తైతే,"

"నేను నవ్వుతూ అన్నాను గాని వేళాకోళంగా అన లేదు శైలూ! ఆమె ఇష్టపడితే నేనందుకు సిద్ధమే అన్నాడు విశ్వం.

"ఏమమ్మా" శైలజ అడిగింధి అనూరాధను.

"మీ అన్నా చెల్లెళ్ళిద్దరికీ నా కృతజ్ఞత. కాని నే నింక చదువుకోను" అంది అనూరాధ క్లుప్తంగా.

"ఏం?" అంది శైలజ ఆశ్చర్యపోతూ.

"నా కా ఆసక్తి పోయింది."

విశ్వం కూడా సాశ్చర్యంగా చూస్తూ ఉండి పోయాడు.

ప్రసంగం తరువాత ఇతర దారులు పట్టింది.

మర్నాడు శైలజ హాస్టల్‌కు వెళ్ళిపోయింది.

తను నిజంగానే ప్రోత్సహించినా అనూరాధ యెందుకు అంగీకరించలేదో తెలుసుకోలేకపోయాడు విశ్వం. తెలివితేటలు అవకాశం ఉండి కూడా వద్దనడంలో గల కారణం అతనికి అర్థం కాలేదు.

రాత్రి అదే విషయం ఎత్తాడు.

"రాధా! నిన్న నేను నిజంగానే అన్నాను చదువుకో మని. నువ్వెందుకు వద్దన్నావో అర్థం కాలేదు" అన్నాడు.

"మీకు పుణ్యం ఉంటుంది. నన్నిలా ఉండనివ్వండి." అంది అనూరాధ రుద్ధకంఠంతో.

తనన్న దాంట్లో ఆమెను బాధించే మాట ఏమిటో తెలియక నిర్ఘాంతపడిపోయాడు విశ్వం. అతని కలవరపాటు చూసి ఆమే మాట్లాడింది.

"నేనలా అన్నందుకు క్షమించండి! నాకు, మా కుటుం బానికి ఇప్పటికే మీరు చేసిన ఉపకారమే ఎంతో ఎక్కువ. ఎన్ని జన్మల పుణ్యమో ఉంటేగాని మీలాంటివారు, అత్తయ్యలాంటివారు దొరకరు. నాకింతకంటె పెద్ద చదువు చదవాలనిగాని, గొప్పదాన్ని కావాలనిగాని లేదు. ఇప్ప టున్నంత తృప్తిగా జీవితం అంతా గడిచిపోతే చాలు నాకు ఏడుపొచ్చేటట్టుంది మీ మంచితనం భరించలేక."

ఆమె అమాయకత్వానికి అతనికి ఏడవాలో, నవ్వాలో తెలియలేదు. సంతోషానికీ సంతాపానికీకూడా అశ్రువులే ప్రకటించేవారు కొందరుంటారు కాబోలు. ఆవేళ కట్నం వద్ద ఆరోజున రామనాథంగారిముఖం కూడా ఇట్లాగే తయారైంది. ఆ తండ్రికి కూతురు కాదూ?

"బలే పిచ్చిదానిలా ఉన్నావే! నన్నూ మా అమ్మనూ తెగ పొగిడేస్తున్నావు! ఇతరుల మంచితనాన్ని అర్థం చేసుకుని గౌరవించగల సంస్కారం కలిగిన నువ్వు దొరకడం నాఅదృష్టం కాదూ? పెళ్ళిచూపుల రోజున నువ్వు నా కళ్ళలోకి సూటిగా చూసినప్పుడే నీ నిర్మల హృదయాన్ని గుర్తించాను. అవకాశం ఉంది గనకా నీకు తెలివి ఉంది గనకా చదువుకోమటున్నాను. శైలుచెప్పేదాక తట్టనేలేదు నాకు" అని దగ్గరగా తీసుకుని నచ్చచెప్పాడు.

"పోనిద్దురూ! నే నింకా చదువుకుని ఉద్యోగాలు చెయ్యాలా, ఊళ్ళేలాలా? సంస్కారం పెంపొందించుకోవడానికి తగిన చదువు మానాన్నే చెప్పించాడు కట్నం ఇచ్చి పెళ్లి చెయ్యలేక. ఇంట్లో అత్తయ్యకు సాయంగానైనా ఉండకుండా పుస్తకాలు ముందువేసుకుని కూర్చోలేను. అంతేకాక నాకు ఆ కోరిక బొత్తిగా పోయింది.

"ఆసక్తి లేదంటే నే నొప్పుకోను. నువ్వేదో కారణం నా నుంచి దాస్తున్నావు. అది చెప్పమని నేను నిర్బంధించను. కాని మరోమాటు ఆలోచించుకుని మరీ చెప్పు"అన్నాడు.

అనూరాధ మాట్లాడలేదు.

మర్నాడు శాంతమ్మగారు కాఫీ కాస్తున్న అనూ రాధ పక్కన చతికిలబడింది.

"అదేమి టత్తయ్యా, రోజూ మడికట్టుకునే వారివాళిల్లా చతికిలపడ్డారు!" అంది విస్తుపోతూ.

"అది కాదుగా నమ్మాయ్. నీ పద్ధతి నాకేం నచ్చలేదు" అంది శాంతమ్మగారు.

అనూరాధ కంగారు పడింది. ఇంతవరకు తను కాపరానికి వచ్చినతరువాత అత్తగారిలా మాట్లాడి ఎరగదు. తనవల్ల జరిగిన ఎన్నో తప్పులను అసలు మందలించనేనా మందలించకుండానే క్షమించింది. ఇవాళ ఇలా మాట్లాడడానికి తనవల్ల జరిగిన లోపమేమిటో తెలియక ఇరుకున పడిపోయి ఎటూ మాట్లాడలేకపోయింది అనూరాధ.

"నిన్న అబ్బాయి ముచ్చటపడి చదువుకోమంటే వద్దన్నావుటేం?" కృత్రిమ కోపంతో అంది శాంతమ్మగారు.

అనూరాధ తల తిరిగిపోయింది. వీళ్ళు మనుష్యులలో కోవకు చెందుతారో ఆమెకు అర్థంకాలేదు. పుట్టింట్లో కూడా తనకింత మంచితనం కనపడలేదు. తనకున్న కొద్ది అనుభవంలోను ఇటువంటి వ్యక్తులుంటారనే తనకు తట్టలేదు. మొదటినుండీ అత్తగారి మంచితనం రోజురోజుకూ ఎక్కువ తేటపడుతున్నా, పెళ్ళయిన తరువాత కూడా స్త్రీలకు ఉన్నత విద్యను ప్రోత్సహించే సంస్కారం కాని విశాలభావం కాని ఆమెలో ఊహించలేకపోయింది. మనుష్యులను అర్థం చేసుకోవడంలో తనకేదో ప్రత్యేకత ఉందని

భావించిన ఆమె అహం దెబ్బతిన్నది. రోజూ కలిసి ఉంటూనే ఆప్యాయత కనబరుస్తూనే ఉండిన శాంతమ్మ గారిలో ఉన్న సంస్కారంలో లేశమైనా తానర్థం చేసుకో లేకపోవడం ఆమెను బాధించింది. ఆ క్షణంలో ఆమె ఈ ప్రపంచపు మనుగడే మరిచిపోయింది. అసలు తనకు చదువు కోవాలనే ఉన్నా ఈమె ఏమంటుందో ననేదే ఒక కారణం అయి ఆ విషయం చర్చలోకి దింపడం ఇష్టంలేకే విశ్వాన్ని ఆ ప్రసంగంనుంచి తప్పించి తనకు ఇష్టం లేనట్లు వ్యక్తం చేసి ప్రవర్తించింది. కాని ఆ విషయం విశ్వం తల్లి చేతనే అడిగించగలడని కలలో కూడా ఊహించలేకపోయింది.

"మాట్లాడవేం!" రెట్టించింది శాంతమ్మగారు.

"పనంతా మీరు చేసుకుంటూంటే సాయమైనా చెయ్యకుండా పుస్తకాలు ముందేసుకుని కూర్చోతే నత్తయ్యా నేను"-అంది.

"పిచ్చి పిల్లా! శైలు చదువుకోవడం లేదూ? నువ్వు ఇంట్లో ఉండిపోతే మాత్రం నా ఒంట్లో ఓపిక ఉన్నంత కాలం నిన్ను చెయ్యనిస్తానులే!"

"కాకపోతే మాత్రం? ఉద్యోగాలు చెయ్యాలా, ఊళ్ళేలాలా? ఏం చెయ్యాలత్తయ్యా, ఇంకా చదువు కుని?"

"అంత అదృష్టమే పడితే ఉద్యోగమే చేద్దుగాని. రేపు శైలు పెళ్ళి చేసుకుంటే మాత్రం ఉద్యోగం చెయ్య దూ? ఇద్దరూ సంపాదించుకోవచ్చు. ఈ ఊళ్ళో ఉన్నాం గనక జీతం ఖర్చు, పుస్తకాల ఖర్చుతో సరిపోతుంది.

వందలూ వేలూ ఖర్చు పెట్టక్కర్లేదు గదా! ఇంకో ఊళ్ళో ఉంటే నిన్నిక్కడికి పంపించి చెప్పించబోయామా ఏమిటి!"

"అయినా—"

"అయినా లేదు, గియినా లేదు. ఇందాకా ఎలానూ చదువుకున్నావు. మూడేళ్ళు కష్టపడితే ఎమ్మే అయిపోతుంటిటగా? ఊరికే ఇంట్లో కూర్చుంటే మాత్రం, వచ్చిందంతా మరిచిపోవడమేగా! పొద్దున్న పది గంటలకు వెళ్ళిపోతే వాడు అయిదింటిదాకా రానే రాడు, కాఫీకితప్ప. అయిదింటికి నువ్వూ రానే వచ్చేస్తావు. అందుచేత కాదనక చదువు" అంటూ నచ్చజెప్పింది.

అనూరాధకు విశ్వంమీద, కోపం భక్తి కూడా హెచ్చాయి. తనేదో గొప్పగా ఇతరులను నొప్పించకుండా ఎంతో గంభీరంగాను, సహనంతోను వ్యవహరిద్దామనుకుంటూంటే, ఆ విషయం ఇతరులకు తెలియనీయకుండా రహస్యంగా అట్టే బెట్టుకుందామనుకుంటూంటే ఇట్టే పసికట్టి తల్లికి చెప్పి ఆమె చేతనే తనకు చీవాట్లు పెట్టించాడు. ఆవిడ ఆయనకంటె నాలుగాకు లెక్కువ చదివింది. తనేదో మహాపరాధం చేసినంత హంగామా చేసి అసలు సంగతి బయటపెట్టి తనకు మూర్ఛవచ్చేటట్టు చేసింది. ఛీ మనుషులు ?

పడక గదిలో బద్ధకంగా పడుకుని అత్తా కోడళ్ళ సంభాషణ విన్న విశ్వానికి నవ్వు వచ్చింది.

కాఫీ పట్టుకువచ్చి బల్లమీద ఉంచి నిశ్శబ్దంగ వెళ్ళిపోబోయింది అనూరాధ.

"రాధా!" పిలిచాడు విశ్వం.

ఆగింది కాని పలకలేదు అనూరాధ.

"మౌనవ్రతమా? ఎందుకు దేవి ఆగ్రహం?" నవ్వు వచ్చిందామెకు.

"పలకవోయ్! నోటి ముత్యాలేం రాలిపోవులే!"

"పొండి! మీతో మాట్లాడను."

"ఏం?"

"చేసేవన్నీ చేసి ఇంకా నన్నెందు కడుగుతారు?" నిష్ఠూరంగా అడిగింది.

"ఏం చేశాను?" అమాయకత ఉట్టిపడేలా అడిగాడు.

"ఎంత అమాయకులండీ! నా చదువు సంగతి అత్తయ్యతో ఎందుకు చెప్పారు?"

"నీ అనుమానం గ్రహించి."

"ఏమిటో ఆ — గ్రహించడం?"

"అమ్మ ఏమంటుందోనని నీ భయం!"

"అని ఎవరన్నారు?"

"నేను అనుకున్నాను."

"సర్వాంతర్యామి! అందరి మనస్సులలోనూ ఏముంటుందో తెలుస్తుందిగాబోలు అయ్యగారికి. ఇంతకూ నా కారణం అది కానేకాదు" అంది గంభీరంగా.

"మరి!" ఆశ్చర్యపోయాడు విశ్వం.

"నా కిష్టంలేదు. మీరు నామీద ఒత్తిడి తెస్తున్నారు. నా ఇష్టం వచ్చినట్టు చెయ్యడానికి. నా కే విష

యంలో నన్నా స్వాతంత్ర్యం లేదూ? మీరు చెప్పినట్టే నడవాలన్నమాట!" దృఢస్వరంతో అడిగింది.

"అని నేననలేదే!" అన్న విశ్వం ముఖం నల్ల బడింది.

"అయితే అందరికీ చెప్పి నే నందరి మాటా కాదం టున్నానని నెపం వెయ్యడమేనా మీకు ఇష్టం?"

"నీ మంచికోరే చెప్పాను."

"అవును, నా మంచి చెడ్డలు నాకంటె మీ కెక్కువ తెలుసుకదూ!" అణుచుకున్నా ఆగని చిరునవ్వును విశ్వా నికి కనపడనీయకుండా ఉంచడంకోసం ముఖం తిప్పు కుంది.

"క్షమించు రాధా!" గంభీరంగా అన్నాడు విశ్వం.

అనూరాధ కళ్ళు చమరించాయి.

"ఛ! అల్లాంటి మాట లనకండి—ఎంత అమాయ కులండీ మీరు!" అంటూ నవ్వేసింది.

విశ్వాని కప్పుడర్థం అయింది.

"హాసి నీ ఇల్లు బంగారంగాను!" అంటూ వచ్చి అమాంతం అనూరాధను కౌగిలిలో బంధించాడు.

"అబ్బ! ఉండండి! మరీ చిలిపితనం ఎక్కువౌ తూంది. వస్తున్నా నత్తయ్యా—" అంటూ పిలవని అత్త గారు పిల్చినట్టు నటించి కౌగిలి విడిపించుకుని పారిపోయింది.

3)

# 3

మర్నాడు మధ్యాహ్నం విశ్వం శైలజకోసం హాస్టల్‌కు బయలుదేరదా మనుకుంటూండగా ఆమే వచ్చింది.

"నూరేళ్ళాయుష్షమ్మా నీకు!" నవ్వుతూ అన్నాడు విశ్వం.

"ఇరవై ఏళ్ళు గడిచేసరికే తాతలు దిగివస్తూంటే ఇంకా ఎనభై ఏళ్ళే! నీకు, పెద్దలకు పుణ్యంగాని అటువంటి దీవనలు మాత్రం చెయ్యకు!"

"ఏమన్నా కష్టాలలో మునిగిపోతున్నా వసమ్మా అంత నిర్లిప్తత!" అనూరాధ అడిగింది.

"నా మాట వినసని ఊరుకున్నావు గాబట్టి సరిపోయింది. నువ్వూ ఆనర్స్‌లో చేరి ఫైనలియర్‌లో ఉంటే తెలిసేది!"

"ఇప్పుడు అందుకనేగా 'వద్దు మొర్రో!' అంటే పరాయిదాన్నయిపోతున్నాను ఈ ఇంట్లో" సాగదీస్తూ అంది అనూరాధ.

"ఏమిటి కథ?" శైలజ అడిగింది.

"అంటే మరేంలేదు. అమ్మా, నేనూ ఈవిణ్ణి చదువు కోమంటున్నాం. అదికష్టంగా ఉందని చెప్పి మనల్ని నమ్మించాలని చూస్తూంది." విశ్వం చెప్పాడు సమాధానం.

"అదే వద్దన్నది. నేను నిజంగానే చదువుకో నంటున్నాను. మీ పోరు పడలేకగాని—"

"రాని నేను రాక మానేస్తాంటే వచ్చి, చక్కగా చదువుకోమంటూంటే గుణుస్తున్నావు నువ్వు." విశ్వం అన్నాడు.

శైలజ కళ్ళింత చేసుకుని ఏదో చెప్పబోతూంటే సైగచేసి వారించాడు విశ్వం. మాట మార్చి అంది శైలజ.

"ఇంటి పట్టున ఉండి బుద్ధిగా చదువుకోవే పిల్లా అంటూంటే నీకీ గీర్వాణం ఎందుకమ్మా?"

"నా ఇష్టం" అంది అనూరాధ వెక్కిరింపుగా.

"మీరిద్దరూ మాట్లాడుకుంటూ ఉండండి. నే నటు వెళ్ళొస్తాను" అన్నాడు విశ్వం.

"సరే, మా మాటల కేంగాని—ఇంతకూ నువ్వు నాకోసం ఎందుకు ప్రయాణమైనట్టు?" శైలజ ప్రశ్నించింది విశ్వా న్నుద్దేశించి.

"అదే—అప్లికేషన్ అవీ రాయించి ఈ మొగాణ్ని ఆ వాతావరణంలో పడేస్తావని."

"అయితే ఒప్పుకుం దన్నమాట!"

"నా మెడలు విరిస్తే నేనేం చేసేది!"

"సిగ్గుండాలి అల్లా మాట్లాడడానికి!" విశ్వం అన్నాడు.

"అవును. నేను సిగ్గులేని దాన్నే! మీ దురదృష్టం కొద్దీ నన్ను కట్టుకోవలసి వచ్చింది."

"కాక__"

"అయితే ఇప్పుడేం మించిపోయిందీ! ఇంకో త్రిని కట్టుకోండి"

"ఆ పనే చేద్దును. కాని 'లా' ఒప్పకోదు."

"'లా' అడ్డం రాకపోతే అంతపనీ చేద్దురన్న మాట!"

శైలజకు ఎంత అణుచుకున్నా ఆగటంలేదు నవ్వు.

"అబ్బబ్బ! ఆ పండర్రా, బాబూ, ఇద్దరికిద్దరే. అయినా అదేమి టన్నయ్యా, నువ్వు మరీను!"

"లేకపోతే ఏమిటా వాగుడు?" విశ్వం నవ్వుతూ అన్నాడు.

"అయినా నువ్వేమిటన్నా పెద్దా పిన్నా లేకుండాను?" అనూరాధను మందలించబోయింది శైలజ.

"ఆయన మాటలు మహా శావున్నాయి గాబోలు_ ఎటయినా అన్నగారాయె! నీకు పక్షపాత బుద్ధి ఎందుకు పోతుందీ?"

"అయ్యో రామ! నేనే వెడతాన్లెండి" అంటూ పోబోయింది శైలజ.

"ఎక్కడికా వెళ్ళేది? నేనుండగానే! చాల్చాలు నేర్చుకుపోయావ్__ముందిటురా" అంటూ రెక్క పట్టుకుని ఆపింది అనూరాధ.

"అన్నట్టు అడగడం మరిచిపోయాను__పని మీదేం రాలేదుగదా నువ్వు?" శైలజ నడిగాడు విశ్వం.

"ఆహా! మర్యాదంటే అదయ్యా నాయనా! వచ్చిన గంటకు—ఇప్పుడడగడం—ఎందు కొచ్చావ్ అనీ—ఓహ్ గొప్పగా ఉంది!" ఎత్తి పొడిచింది శైలజ.

"ఏం సాదిస్తావులే అమ్మా!" అనూరాధ అంది.

"ఏం సాదించక ! ఇంక మీ ఇంటికొస్తే అడుగు. నన్ను చూడగానే పోట్లాట మొదలెట్టారిద్దరూ. బేజారెత్తి వెళ్ళిపోతా ననేగా!"

"అంతమాత్రానికే బేజారెత్తిపోయేవాళ్ళు రావడ మెందుకు ?" అనూరాధ అంటించింది చల్లగా.

"అననే అన్నావా తల్లీ ! అనుకుంటూనే ఉన్నాను. నువ్వు అంతకంటే ఏం అంటావ్ మాంమ్మా !" శైలజ రెండింతలు వెటకారం ఒలకబోస్తూ అంది.

"అచ్చా! అల్లాగే సాగిస్తూ ఉండండి! తిన్నతిండేనా అరుగుతుంది. నేనటు కాస్త వెళ్ళి ఒకర్ని కలుసుకుని వస్తాను" విశ్వం నవ్వుతూ అన్నాడు.

"అయితే చప్పున వచ్చెయి అన్నయ్యా ! అల్లా షాపింగుకు వెళ్ళాలి."

"అలాగేనమ్మా!" అంటూ వెళ్ళిపోయాడు విశ్వం.

"అయితే ఒప్పించా డన్నమాట !" శైలజ అనూ రాధతో అంది.

"అత్తయ్యకూడ పట్టుబడితే ఏం చెయ్యను చెప్పు? బొత్తిగా మొండి కేసుకు కూర్చోబడం నాకే సిగ్గనిపిస్తుంది."

"అయినా నీ వెర్రిగాని—ఎగిరి గంతేసి మొదటే ఒప్పుకుందురు మరొళ్ళయితే !"

"నువ్వాలా అంటావుగాని చదివి ఏమిటి సార్థకం ! చెప్పు."

"ఉద్యోగం చెయ్యొచ్చు."

"ఆయన అలిసి ఇంటికి వచ్చే వేళకు నవ్వుతూ పలకరించక, ముఖం వేలవేసుకుని మరో గంట ఆలస్యంగావచ్చి చిర్రులు బుస్సులు ఆడుకోవడానికా ?"

"ముసలమ్మ కబుర్లు చెప్పకు! మన దేశం అధోగతిలోకి రావడానికి కారణం నీలా ఆలోచించే వాళ్ళే. ఒక్కడి రెక్కలమీద ఆధారపడి పదిమంది బతుకుతూంటే ఇంక ఆ ఇంట్లో ఆనందం ఏముంటుందమ్మా ! ఓ మూల కడుపు కాలుతూంటే నవ్వుతూ పలకరించేవాళ్ళెవరు? పలకరించినా ఆనందించేవాళ్ళెవరు ?"

"అలా ఆలోచిస్తే అంతేననుకో. కాని ఆ తర్కం నా కెందుకో సరిపడదు."

"ఇప్పుడు సరిపడదు. ఇంకా నీకు లోకానుభవం ఏదీ? నువ్వెవరిని చూశావ్ అనుభవం రావడానికి? నలుగురు పిల్లలు పుట్టి మొగుడు తెచ్చే వందా చాలక ఏమీ చెయ్యలేక, పిల్లల్ని మాడ్చి తను మాడి నానా అవస్థ పడి సంసారాన్ని సాగిస్తున్న స్త్రీని ఎప్పుడేనా చూశావా? అదే స్థితిలో ఆమెకూడా నాలుగురాళ్ళు తెస్తే వేణ్ణీళ్ళకు చన్నీళ్ళు తోడైతే ఎంత బాగుంటుందా సంసారం ?"

"అల్లా అన్నావా? ఇద్దరూ ఉద్యోగాలు చేస్తూంటే ఇంక ఆ యింట్లో పిల్లలగతి ఏంకావాలి ? వంటా పెట్టూ ఇవన్నీ మరి ఆడదానికి రెండు పనులు కావా?"

"అప్పుడు అటువంటి వాటికి ఇతరులను నియమించు కోవచ్చుగా? ముందర కావలసింది డబ్బు. అదుంటే ఎన్న యినా వస్తాయి"

"కాని నువ్వెన్ని చెప్పు. ఇద్దరూ ఉద్యోగాలుచేస్తే లక్ష గొడవలొస్తాయి. పోల్చి చూసుకోవడాలు, అన్నీ డబ్బు లెక్కలలో మాట్లాడుకోవడం, జీవితం దైనందిన వ్యాపారంగా తయారై ఊరుకుంటుంది."

"అది దృక్పథాన్నిబట్టి ఉంటుంది."

"అదే నేననేదీను. చాలడం చాలకపోవడం కూడా దృక్పథాన్నిబట్టే ఉంటుంది" అంది అనూరాధ.

"తగ్గవమ్మా! ఊఁ; చెప్తావ్! చాలడం చాలకపోవడం దృక్పథాన్నిబట్టి ఉంటుందేం? పిల్లలకు పాలులేక మొగుడు తెచ్చే నాలుగురాళ్ళూ చాలక నానా యాతనా పడడం ఏ దృక్పథంలోనుంచి మాత్రం మరోలా కనపడుతుంది? కనీస అవసరాలు లేక చస్తూంటే —"

"కనీస అవసరాలు అంటే —"

"తిండి, బట్ట, ఉండడానికి ఇల్లు —"

"ఎటువంటి తిండి? ఎటువంటి బట్ట? ఎటువంటి ఇల్లు?"

"వారి వారి తాహతునుబట్టి!"

"తాహతంటే?"

"మొత్తాని కివన్నీ సాపేక్షమని చేయిస్తున్నావ్. చేసేతో వాదిస్తే ఇవ్వదల్చుకున్న కాఫీకూడా పోనే

స్తాన్. అందుచేత ఆపేస్తాను. కాని వాదనకోసం కాక మనస్ఫూర్తిగా చెప్పు."

"అల్లా అన్నావ్, బాగుంది. నీతో మనస్ఫూర్తిగా ఏకీభవిస్తాను" అంది అనూరాధ.

"అన్నట్టు ఇంతకూ అమ్మేదీ? అమ్మా" అంటూ పిలిచింది శైలజ.

"ఆహా! ఇందాక మీ అన్నగార్నన గానే సరా! గంటై వచ్చి ఇప్పటికి గుర్తుకొచ్చింది అమ్మ!"

"ఎలా అయితేనేం? మాటకు మాట అందించావులే బాబూ! ఇంతకూ ఏదీ?"

"అలా ఆ వీధిలో ఎరిగి ఉన్న వాళ్ళింటికి వెళ్ళారు. ఈపాటికి వస్తూనే ఉండాలి."

మరో పది నిమిషాలకు శాంతమ్మ వచ్చింది.

"మా ఇల్లు కనబడిందిటే నీకు?" అంది శైలజతో నిష్ఠూరంగా.

"లేదమ్మా! వెతుక్కుని నానా అవస్థాపడ్డాను" అంది ఎంతో ఇదిగా శైలజ.

"కాలేజీలు తెరిచేదాకా ఇక్కడే ఉండమంటే ఉండనైతివి! పోనీ రోజుకోసారైనా వచ్చి మొహమైనా చూపించి వెళ్ళకూడదమ్మటే?"

"మొన్ననే కదమ్మా వచ్చాను?"

"అవును, నిన్నకూడా వచ్చావు కదూ? చోద్యమే?"

"పోనీ మొన్న కాదు అవతల మొన్న. అంతేగా ?"

"అవునే, అమ్మాయ్, మరి పూట పూటా తిండి మాత్రం ఎందుకే ?" నిదానంగా అడిగింది శాంతమ్మ గారు.

అనూరాధా శైలజా కడుపు చెక్కలయ్యేలా నవ్వుకున్నారు.

ఇంతలో విశ్వం తిరిగి వచ్చాడు.

"తయారుగా ఉన్నారా?" అని అడిగాడు.

"ఒక్క పది నిమిషాలు!" అంది అనూరాధ.

"ఇంత సేపూ ఏం చేస్తున్నట్టు ?" విశ్వం విసుగు చూపించాడు.

"కబుర్లు చెప్పుకుంటున్నాం." శైలజ అంది.

"బాగుంది" సాగదీస్తూ అన్నాడు విశ్వం.

"నువ్వరగంట ఆలస్యంచేస్తే ఫరవాలేదు గాని మేం పది నిమిషాలు అంటూంటే నీకు విసుగొస్తూంది."

"నే నరగంట ఆలస్యం చేశాననిగదా మీఫిర్యాదు! ఆ లెక్కను మీరు అరగంట ముందునుంచే సిద్ధంగా ఉండి ఉండాలి."

"సరేనయ్యా ! క్షమాపణ కోరుకుంటున్నాంలే" అని శాంతమ్మగారి దగ్గరకెళ్ళి ఆమె చేతులు పట్టుకుని, "నువ్వుకూడా రా అమ్మా" అంది.

"నే నెందుకే !"

"నాకు చీరలు ఎన్నిక చేసిపెడుదువుగాని."

"నాకు నచ్చినవి మీకు నచ్చవర్రా."

"అదుగో—అయితే నేనసలు వెళ్ళనే వెళ్ళను." బుంగమూతి పెట్టింది శైలజ.

"అబ్బ, మొండి ఘటం అంటే నువ్వేనే!"

"ఆమాట మాత్రం మరిచిపోకు !"

ఇంటికి తాళంపెట్టి అంతా బయలుదేరారు.

షాపింగ్ పూర్తి చేసుకుని మొదటి ఆట సినిమా కూడా చూసి ఇంటికి వచ్చేసరికి రాత్రి పది అయింది.

మర్నాడు శైలజ, అనూరాధచేత అప్లికేషన్ అఫీ పూర్తి చేయించి తన బాధ్యత నెరవేర్చుకుంది.

## 4

ఫోర్త్ ఇకనామిక్స ఆనర్సులో చేరింది అనూరాధ.

కాల్టెక్స పెట్రోల్ బంక్ దగ్గర బస్ ఎక్కి, అప్స, డౌన్సలో బస్సు కుదుపుల మధ్య ప్రయాణించడం ఒక విచిత్రమైన అనుభవంగా తోచింది అనూరాధకు. పార్క్ పక్కనుంచి గంజిపేట జంక్షన్ వరకు అప్‌లో బర్రు బర్రు మంటూ మహాప్రయాసగా నడుస్తుంది బస్. అక్కడినుంచి సన్నిసైడ్ బంగళావరకు డౌన్. మళ్ళీ పెద్ద అప్. ఒక పక్క లోతుగా రాళ్ళు, లోయలు, రెండోపక్క గుట్ట. గుట్టమీద గవర్నర్‌గారి వేసవి విడిది. ఎదురుగా స్పెన్సర్

కంపెనీ. అక్కడ అప్ మీదనుంచి చూస్తే విచిత్రంగా కనపడుతుంది ఊరు. ఫస్ట్ గేర్‌లో చెడ్డ శబ్దం చేసుకుంటూ వచ్చిన బస్ ఒక్కసారిగా అగాధంలోకి దిగుతుంది, గుండెలు ఝల్లుమనేటట్టుగా సిరిపురం బంగళా దగ్గర కుడివేపుకు తిరుగుతుంది. ఈ రోడ్ వాల్తేరు స్టేషన్‌నుంచి వచ్చి ఇక్కడ కలుస్తుంది. ఇందాకా వచ్చిన రోడ్డు తిన్నగా యూనివర్సిటీ వెనక రిజిస్ట్రార్ ఆఫీసు పక్కనుంచి పెద వాల్తేరు వెడుతుంది. సిరిపురం బంగళా దగ్గర కుడిపక్కకు తిరిగిన బస్ నాలుగు రోడ్ల జంక్షన్ దగ్గర ఎడం పక్కగా మళ్ళీ యూనివర్సిటీ ముందుకు వెళ్ళే రోడ్డులోకి వస్తుంది. కుడివైపు నాలుగు ఫర్లాంగులలో ఉన్న సముద్రం ఏ అడ్డూ లేకుండా అగుపిస్తుంది. నురుగులు కక్కుకుంటూ ఎగిరిపడే కెరటాల హోరు శ్రవణపేయంగా ఉంటుంది. ఇటువంటి సుందర దృశ్యం ఇంచుమించు మూడు ఫర్లాంగుల దూరం కనిపిస్తూ ఉంటుంది. ఇంతలోనే ప్రిన్సిపాలుగారి ఇల్లు— ఇన్ గేట్. లోపలకు చొచ్చుకు పోతుంది బస్. ఫాకల్టీ క్లబ్ దాటి లేడీస్ వెయిటింగ్ రూం, నాచురల్ సైన్సు కాలేజి దాటి, ఇమెన్ దగ్గర కుడిపక్కకు తిరిగి అశోకవర్ధన హాస్టల్ దగ్గర మళ్ళీ 90 కోణం చేసి, హాస్టల్, లోయర్ షెడ్స్ మధ్యనుంచి బ్యాంక్ "ఫీ" ఆఫీసు పక్కనున్న నెహ్రూ సర్కిల్ దగ్గర అంతమవుతుంది ప్రయాణం. ఎడం చేతి పక్కన లైబ్రరీ. కుడిపక్కన ఆర్ట్స్ కాలేజి. కాలేజీ ఎదురుగా హాకీ కోర్టు. ఎదురుగా మీటిరియాలజీ వాళ్ళ షెడ్. కాలేజి బ్రహ్మాండమైన రాతి కట్టడం. ముందు

పోర్టికో ఎదురుగా మెట్లు. ఈ ప్రయాణంలో ఇన్నివంపులు సొంపులు ఉన్నాయి.

మొదటిరోజు క్లాసామెకు విచిత్రమైన అనుభూతిని కలిగించింది. తనకు ముగ్గురు సహాధ్యాయినులు. పదహారు గురు విద్యార్థులు. మొత్తం ఇరవై మంది క్లాస్.

నూట డెబ్బయిమంది ఎ. బి. సి. సెక్షన్‌లో తానొక్కతే ఎంతో అవస్థ పడింది. లెక్చరర్ వచ్చిన తరువాతే రావడం, పాఠం అయిపోతూనే తానే ముందు దారి తీయడం, మళ్ళీ లెక్చరర్ వచ్చేదాకా ఏ వరండాలోనో ఎక్కడో గడపడం—అన్నీ కష్టాలే జ్ఞప్తికొచ్చాయి. లెక్చరర్ ఉన్నా కొన్ని క్లాసులు సంతలాగే ఉండేవి.

ఇక్కడ తీరే వేరు. క్లాసుకు విద్యార్థులతో సమానంగా వచ్చి ముందే కూర్చుంటారు విద్యార్థినులు కూడా. లెక్చరర్ వచ్చేలోగా గోలగానే ఉన్నా ఒకర్ని కించపరిచే రకానిది కాదు. పిచ్చాపాటీ సాగుతుంది. హైమ, కళ్యాణి, భారతి, తనుకూడా కబుర్లలోకి దిగారు పరిచయానంతరం.

లెక్చరర్ నిరుటి యూనివర్సిటీ ఫస్ట్. పాఠంసాగుతూ ఉన్నంత సేపూ సూది మొనమోపితే వినపడేటంత నిశ్శబ్దం. కారణం ఏమిటంటే ఉన్నది ఇరవైమందే. గోలచేస్తే పట్టుబడి పోతారు. ఒకసారి అటువంటిది జరిగితే ఇంక మళ్ళీ జన్మలో కాలేజీ ముఖం చూడనక్కర్లేదు. అదీగాక చదువు మీద ఎక్కువ శ్రద్ధ చూపిస్తారు.

ఇల్లాంటి చోట చదవటం ఎన్నిజన్మాల సుకృతమో అనుకుంది అనూరాధ.

మధ్యాహ్నం వెయిటింగ్ రూంలో శైలజ కలిసింది.

ఫైనలియర్ విద్యార్థులకు ఒక వింతగౌరవం ఉంటుంది. థర్డ్, ఫోర్త్ ఇయర్ విద్యార్థులు వీళ్ళ ప్రాపు సంపాదించి పుస్తకాలూ అవీ సేకరించాలని తంటాలు పడుతూ ఉంటారు.

"ఎల్లా ఉందమ్మా కాలేజి?" అడిగింది శైలజ.

"ఏవ్యంగా ఉంది" అంది అనూరాధ హృదయ మంతటితోను.

శైలజ తన ఇతర మిత్రులాంద్రను పరిచయం చేసింది.

మూడూ పదితో అనూరాధకు క్లాసులు ఆఖరు. వెంటనే బస్. నాలుగింటి లోపునే ఇల్లు చేరుకుంది అనూరాధ. నాలుగున్నరకు విశ్వంకూడా వచ్చాడు.

విశ్వానికి కాఫీ అందించి ఎదురుగా కూర్చుంది అనూరాధ.

"ఎల్లా ఉందండీ కాలేజి?" అడిగాడు కాఫీ త్రాగుతూ విశ్వం వ్యంగ్యంగా.

"అబ్బ! ఎంత గంభీరమైన వాతావరణమండీ! నిజంగా ఎంతో ముచ్చట వేసింది. మా కాలేజి ఉండేది, ఎందుకు? కూర్చుందుకు, నుంచుందుకూ కూడా భయంగానే ఉండేది. రెడ్డిగారెంత ఆలోచించి కట్టాడో ఇక్కడ."

"అంత తొందరగా ఒక నిశ్చయానికి వచ్చెయ్యకు. నీది ఇంకా ఒక్కరోజు అనుభవం మాత్రమే. ఇంతకే మురిసిపోతే ఎలా?"

"ఏమో సుమండీ! నేనంత అదృష్టవంతురాలినో మీలాంటివారిని పొందడానికి!"

"అహహ! ఏం భక్తి! చిట్టితల్లి! నీ ఊహలు మారిపోవచ్చు. అప్పుడు విచారించవలసి వస్తుంది" అన్నాడు నవ్వుతూ.

సూదులు పొడుస్తూ తీక్షణంగా విశ్వం ముఖంలోకి దృష్టి సారించిన అనూరాధకు, క్షణంలో ఆ తీక్షణత తొలగి ముఖం ఆర్ద్రంగా మారి కనుకొలకులలో నీళ్ళు నిల్చాయి.

విశ్వం మనసు చలించిపోయింది. ఆమెను అక్కున జేర్చుకొని ఊరడించాడు.

ఒక కార్యక్రమానికి అలవాటుపడ్డ జీవుల విధులు యాంత్రికంగా సాగిపోతాయి. విశ్వం అనూరాధల జీవితం కూడా ఒక నిర్దిష్ట కార్యక్రమానికి లోనయింది.

పొద్దున్నే అయిదుగంటలకు లేస్తారు శాంతమ్మగారు, అనూరాధ. విశ్వం కూడాను.

కాలకృత్యాలు కానిచ్చి అనూరాధ కాఫీకాస్తుంది. ఆవేళకు శాంతమ్మగారు పూజ ముగించుకుంటుంది. ముగ్గురూ కాఫీలు సేవించిన తరువాత అత్తగారు వంటలోకి, విశ్వం పాఠాలు చూసుకోవడం, పేపర్ చదవటం లాంటి వాటిలోకి, అనూరాధ చదువులోకి నిష్క్రమిస్తారు.

ఎనిమిదిన్నరకు అనూరాధ చదువు కట్టిపెట్టి కాలేజీకి ప్రయాణమవుతుంది. బట్టలు కట్టుకొని పుస్తకాలు అవీ

తీసుకుని అంతా తయారయేటప్పటికి శాంతమ్మగారు భోజనాలకు పిలుస్తుంది.

అనూరాధ, విశ్వం ఒక్కసారే భోజనం చేస్తారు.

ఇద్దరూ బయలుదేరి హాస్పిటల్ రోడ్డంట కాలేజీ దాకా వెడతారు. అక్కడ అనూరాధ బస్‌కోసం ఆగిపోతుంది. విశ్వం ముందుకు సాగిపోతాడు.

సాయంకాలం నాలుగు గంటల లోపునే వచ్చేస్తుంది అనూరాధ. నాలుగున్నర అయిదు లోపున విశ్వం వచ్చేస్తాడు. కాఫీలు తాగి బీచ్‌కో ఎక్కడికో షికారు బయలుదేరుతారు. ఆరున్నరకు వచ్చేస్తారు. భోజనాలు కానిచ్చి ఏడింటికి అనూరాధ పుస్తకాలు తీస్తుంది. పదింటి దాకా చదువు.

ఎంతో సాఫీగా గడిచిపోతూంది కాలం.

శనివారం సాయంత్రం శైలజ తప్పకుండా వస్తుంది. ముగ్గురూ కలిసి సినిమాకు వెడతారు. ఒకొక్కప్పుడు శాంతమ్మగారిని కూడ బలవంత పెడుతుంది అనూరాధ. శైలజ మద్దతు దానికి. వారిద్దర్నీ సన్న సన్నగా చీవాట్లు వేసి ఆమె బయలుదేరుతుంది. ఆదివారం సెలవంతా ఆట పాటలతోను, ఉత్సాహాలతోను గడిపేస్తారు. ఇది ఇంటి దగ్గర కార్యక్రమం. కాలేజీలో జరిగే విశేషాలు, పింత అనుభవాలు విశ్వానికి వెంటనే వినిపిస్తుంది అనూరాధ. స్కూలులో ఉపాధ్యాయుడుగా తన అనుభవాలను అనూరాధకు నివేదిస్తాడు విశ్వం.

ఇల్లా గడిచేవి రోజులు.

కాలం సాగినకొద్దీ విశ్వవిద్యాలయాన్ని గురించి తను సృష్టించుకున్న ఆదర్శాలన్నీ మంచులా కరిగిపో నారంభించాయి అనూరాధకు. కాలేజీ ఎన్నికలు దగ్గరకు వచ్చేసరికి ఇంత ఎమ్మేలు, ఎమ్మెస్సీలు చదువుకుంటున్న విద్యార్థులు సాధారణ ఎన్నికలలోని సామాన్య ప్రచారకుల కంటె తక్కువ స్థాయికి దిగిపోవడం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఓట్లు వేసే విధానంకూడా అంతకన్న బాగా లేదు. వ్యక్తి శక్తి సామర్థ్యాలకంటె అతనికిగల పలుకుబడే ఎక్కువ దోహదం ఇస్తుంది నెగ్గడంలో. అటువంటప్పుడు చదువుకున్న వారికీ పామరులకూ తేడా ఏమిటి ? ఇక్కడా రాజకీయాలే. ఎన్నికలు ముగిశాయి. కార్యదర్శికి బల్ల ఎక్కితే వణుకు. మాటరాదు. ఆడిన నాలుగు మాటల లోనూ ఆరుతప్పు లుంటాయి. అధ్యక్షుడు ఫరవా లేదు.

విద్యార్థిసంఘ ప్రారంభోత్సవంలో యూనివర్సిటీలో చదివినంత మాత్రాన బుద్ధులు అమాంతంగా మారిపోవనీ, పైకి ఎల్లా కనబడినా ఇదీ అంతేననీ అనూరాధకు అర్థ మైంది.

తినుబండారాలు పంచిపెట్టారు. బాదంహల్వా, కేక్, మిక్చర్ పొట్లాం తిని కూర్చుండలేక ఒకడు ఖాళీ పొట్లం లోకి గాలి ఊది మూతి బిగించి చేతులమధ్య చరిచి పెద్ద శబ్దం చేశాడు. వెంటనే మరొకడూ, ఇంకొకడూ, ఇల్లా చిట పట శబ్దాలతో నిండిపోయింది ఆడిటోరియం అంతా. అంతటితో ఆగకుండా ఒక ప్రబుద్ధుడు ఒక పొట్లం

అమ్మాయిలవైపు విసిరారు. ఇంకొన్ని కవులు దాన్ని కాపీ చేశాయి. వాళ్ళ సంస్కృతిలేని చదువులకు అనూరాధ ఎంతో వింత పడింది.

ఈ అనుభవాలవల్ల ఈ వాతావరణం మరింత నిస్పృహ కలిగించ సాగిందామెకు. ఈ కళాశాల టెక్నికల్ పాటికంటె ఏమీ అత్యున్నత స్థాయిలో ఉన్నట్టు కనపడ లేదు. కాకపోతే అనుబంధ కళాశాల లంత అధ్వాన్నం గాదు. కాని పాఠాలు చెప్పడం విషయంలో అదే సయ మనిపించేది. ఇక్కడ లెక్చరర్లు అక్షరాల లెక్చర్స్ ఇచ్చే వారు మాత్రమే. అది పిల్లలకెంత ఉపయోగపడుతూందనే ధ్యాసే వారికుండదు. తన డ్యూటీ తాను నెరవేర్చుకుని సిలబస్ అయిందనిపిస్తాడు. ఇక రీసెర్చి విద్యార్థులకు మార్గదర్శకత్వం వహించే ఆయన పాఠాలు చెప్పవలసివస్తే ఆయనకు కేవలం చదువుకొనే (స్టడీ) వాళ్ళమీద అసలు శ్రద్ధే ఉండదు. ఎందుకంటే రీసెర్చి విద్యార్థులు ఆయనకు కీర్తి సంపాదించి పెడతారు. విద్యార్థులంతా తామే చదువుకోవలసి ఉంటుంది. పుస్తకాలకు లైబ్రరీలో పోటీ. సిలబస్ అంతకూ కావలసినన్ని పుస్తకాలు కొనేతాహతు విద్యార్థులకు ఉండదు. అందుచేత విధిగా చాలావరకు లైబ్రరీమీద ఆధారపడవలసి ఉంటుంది. ఉపాధ్యాయులు కూడా స్వర్గం నుంచి దిగివచ్చిన వారేం కాదు! అందుచేత సహజంగా వారికి ఇష్టాలూ అయిష్టాలూ ఉంటాయి.

5)

ఇటువంటి విశ్వాసంతో మొరపెట్టుకునేది అనూరాధ. అతను సానుభూతిగా నవ్వి ఊరుకునేవాడు.

లేడీస్ వెయిటింగ్‌రూం దగ్గర 'లా' వాళ్ళగోల ఎక్కువగా ఉండేది. మార్కులతో నిమిత్తం లేకుండా యూనివర్సిటీలో చేరి అల్లరి చేద్దామనుకునేవారికి 'లా' కాలేజీ మంచి అమను. అందరూ అల్లాంటివారని కాదు. కాని అల్లాంటి వారికి యూనివర్సిటీలో ప్రవేశం దొరకడానికి ఆధారమంచివారి. అటువంటి ఉద్దేశ్యంతో చేరిన వాళ్ళంతా ఏదో అల్లరి లేవదీసేవారు.

ఇంక క్లాసులో--

మొదటిరోజునే ఎందుకో హైమకు, అనూరాధకు ఎక్కువ సన్నిహితత్వం ఏర్పడింది. ఆమె విద్యార్థి వేషంలో చదువుతూంది. నెమ్మదైనది. చాలా విషయాలలో ఏకీభావం కుదిరి స్నేహం పెంపొందింది ఇద్దరి మధ్యా.

కల్యాణి కలవారి పిల్ల. కారులో వస్తుంది. ఆమె తండ్రి పెద్ద గవర్నమెంటు ఉద్యోగి. కొంచెం గర్వంకూడా ఉంది. అంతమాత్రాన ఇతరులను నిరసనగా చూస్తుందని కాదు కాని, తన హద్దులలో తానుండి 'ఓహో' అంటే 'ఓహో' తప్ప పూసుకుని తిరగదు. భారతి తత్వమే వేరు. చాలా మితభాషంగా ఉంటుంది. పలకరిస్తే పలుకుతుంది లేకపోతే లేదు. ఎవరితోనైనా అంతే ఆమె. అవసరం ఉంటేనే మాట్లాడుతుంది. ఆమె హాస్టల్ నివాసి.

హైమ తండ్రి మధ్యతరగతి కుటుంబీకుడు కష్టం

ఇచ్చి పెళ్ళి చెయ్యలేక చదివించేస్తున్నాడు. సహజంగా తెలివికలదీ, అణకువకలదీ కనుక ఆయనకు హైమ చదువు వల్ల బాధ లేకపోయింది. విద్యార్థి వేతనం ఏడాదికో రెండు వందలు వస్తుంది. ఇంక పైగా మహాఅయితే తనో రెండువందలు పెట్టుబడి పెట్టాలి. పెళ్ళి చెయ్యక, చదువూ చెప్పించక ఎల్లా? చదువుకైతే పెట్టుబడి ఒక్కసారి పెట్టనక్కరలేదు.

సాన్నిహిత్యం అధికం కావడంతో హైమను ఇంటికి తీసుకువచ్చింది అనూరాధ.

శాంతమ్మగారిని చూసిన హైమ హృదయం భక్తితో నిండింది. శాంతమ్మగారు హైమను చూసి ముచ్చటపడింది.

"హైమ — మా క్లాస్‌మేట్ — హైమా వీరు—" అంటూ నవ్వేసింది. హైమను విశ్వానికి పరిచయం చేస్తూ అనూరాధ.

"నమస్కారం!" అంది హైమ వినయంగా.

ప్రత్యభివాదం చేస్తూ "చూడమ్మా! నిన్ను గురించి రాధవల్ల విన్నాను. నీకంటె పెద్దవాణ్ణి. నాకా చెల్లెళ్ళు లేరు — శైలుతప్ప. నిన్ను నువ్వంటున్నానని ఏమీ అనుకోకేం!" అన్నాడు విశ్వం.

"అబ్బే. ఎందు కనుకుంటాను అన్నగారూ! అల్లాగే పిలవండి" అంది హైమ స్వాభావికమైన కలుపుగోలుతనంతో.

"అయితే మరి నువ్వు కూడా నన్ను మన్నించడం మానేసి అన్నయ్యా అంటే సంతోషిస్తాను" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"అల్లాగే అన్నయ్యా!" అంది హైమ.

అదీ వారి తొలి పరిచయం.

## 5

తొమ్మిదింటికి క్లాస్‌నుంచి వచ్చి తొందరగా బట్టలు వేసుకుని పుస్తకాలు తీసుకుంది శైలజ. తన గదిలోంచి బయటపడి ఇంకో గది దగ్గరకెళ్ళి "ప్రియా!" అని పిలిచింది. ఎవరూ పలకలేదు. ఓరగా వేసిఉన్న తలుపు తోసుకుంటూ గట్టిగా "ప్రియా, ప్రశాంత హృదయా, విష్ణుప్రియా" అని అరుస్తూ లోపలకు అడుగెట్టింది.

ఒకమూల టేబుల్ పక్క కుర్చీలో కూలబడి మరో లోకంనుంచి.

"ఏవరే? శైలూ—" అంది విష్ణుప్రియ.

"ఏ లోకంలో ఉన్నావే మహాతల్లీ! పిలుపేనా అందటం లేదు!" ఎత్తిపొడిచింది శైలజ.

"కట్టిపెట్టవే, బాబూ. నీ ఆగడం!"

"టైమెంతయిందో తెలుసా?"

"ఎంతైం దేమిటి?"

"తొమ్మిదీ పది. మొహం చూస్తే మెతుకులు పడట్టు లేదే?"

"అవును."

"ఏం? ఇంక కాలేజీ కెప్పుడు బయలుదేరతావు?"

"ఇవాళ కాలేజీకి రాను."

"ఎందుకు రావు?"

"నా ఇష్టం. నేను రాను. నువ్వేం నా గార్డియన్‌వా? నీకేం నేను సంజాయిషీ చెప్పుకోనక్కర్లేదు."

"అల్లాగే వాగుతూండు. మీ నాన్నకు ఉత్తరం రాసి చదువు మానిపించి ఆ మూడుముళ్ళూ వేయిం చెయ్యకపోతే నా పేరు శైలజే కాదు."

"శైలజ కాకపోతే గిరిజ అవుతుంది. ఇంతా చేస్తే రెండుంపావలా కట్టేస్తావు గవర్నమెంట్ ప్రెస్‌కి. అంతేగా?"

"ఆ,—అంతే—నువ్వు ముందు కదులు."

"అబ్బ. నన్ను చంపకే."

"ఇంతకూ నువ్వు వెలగబెడుతున్న రాచకార్య మేమిటంట!"

ప్రియ మాట్లాడలేదు.

"ఏమిటీ బల్లమీద! ప్రణయ కవిత్వమా? మళ్ళీ మొదలెట్టావ్!" అంది బల్లమీది కాగితాలు తీస్తూ శైలజ.

"శైలూ, నువ్వవి ముట్టుకోవద్దు!" "ఏం చేస్తావ్

ముట్టుకుంటే?" "ముట్టుకో నువ్వి చెప్తాను ఇంక జన్మలో నీముఖం చూడను."

"చూడవుటే?—చూడవ్—ఇప్పుడు?" అంటూ ప్రియ ముఖం తన కభిముఖంగా తిప్పుకుంది శైలజ.

ప్రియకు నవ్వు వచ్చింది.

"శని!" అంది పళ్ళు పటపటలాడిస్తూ.

"కాదు తల్లీ! శని పడితే ఏడేళ్లే. మరి మనం పట్టుకుంటే జన్మంతానూ" అంది నవ్వుతూ శైలజ.

"ఏం చమత్కారంగా మాట్లాడతావే!"

"ఇదిగో అమ్మాయ్! నన్ను మాటల్లో పడేసి తప్పించుకుందా మనుకుంటున్నావేమో? ఆ పప్పులుడకవ్ మనదగ్గర. నువ్వు ముందు మెస్సుకు బయల్దేరు. సరిగ్గా నాలుగు నిమిషాల్లో ముగించు భోజనం—ఏం అర్థమైందా—ఊఁ! నడు" అంటూ గద్దించింది.

"అర్థం అయిందండీ!"

"అయితే కదలండి!"

"ఊహూ."

"ఏయ్ నా సంగతి తెలుసుగా నీకు! కదులు—"

"నీకు పుణ్యముంటుంది నన్నివాల్టికి వదిలెయ్యవే." బతిమాలింది ప్రియ.

"అయితే కారణం చెప్పు. తగినంత కనపడితే సెలవు మంజూరు చేయిస్తాం."

ప్రియ మళ్ళీ మౌనమే వహించింది.

"అవున్లే. అదీ నిజమే—కాని మరి నీ కాలేజి?"

"నేనూ వెళ్ళను."

"ఏం?—నేనే చెడగొట్టినట్టున్నాను."

"నువ్వు చెడగొట్టడమేమిటి? ఊరికే ప్రతిదానికీ తప్పంతా నాదేననే తత్వం మానుకో. ఇవాళ నాకూ వెళ్ళాలని లేదు."

"ఇందాకా మా నాన్నకు ఉత్తరం రాస్తానని బెదిరించావే? ఇప్పుడు నేను వెళ్ళి మీ విశ్వం అన్నయ్యకు చెప్తే!"

"అక్కడే నీకూ నాకూ తేడా. ఫలితాలను ఊహించుకుంటూ కూర్చుని బాధపడను నేను. అదీగాక మా అన్నయ్యకు ఆ మాత్రం నమ్మకం ఉంది నామీద. కాలేజీకి వెళ్ళకుండానే నేను నా చదువు చదువుకోగలనని తోస్తే ఆ పనే చెయ్యమంటాడు."

"మా నాన్నకే నన్నమాట నా మీద నమ్మకం లేంది?"

"అది నీకు తెలియాలి. నేను రాస్తానంటే రాసుకోమనలేకపోయావేం!"

"నేనే నేరం చేసినట్టుగా భావిస్తాను. అందుకే వేళాకోళానికైనా నిన్ను రాయమని అనలేక పోయాను. ఒకలా నువ్వు చెప్పిందే నిజం. చదువుమీద నిజంగానే శ్రద్ధ చూపించలేకపోతున్నాను."

"నువ్వింక ఊరికే బాధపడటం తగ్గించు. నువ్వు నిజంగా వ్యర్థం చేసే కాలంకంటె, దానిని గురించి బాధపడటంలో ఎక్కువ కాలం వృథా చేస్తున్నావు. నాకివాళ బస్సెలాగా తప్పిపోతుంది. నువ్వు నాలుగు మెతుకులు తినిరా. నే నీలోపున ఈ గ్రంథంయొక్క సారం గ్రహించడానికి ప్రయత్నిస్తాను."

"సరే, నీ ఇష్టం—" అంటూ నిష్క్రమించింది ప్రియ.

ఫఫ్ఫై పేజీలు ఉంటుంది నాటకం.

అబ్బ! రెండు మాటలు మాట్లాడడానికి జంకుతుంది. నలుగురితో స్వేచ్ఛగా కలిసి తిరగడానికి భయపడుతుంది. ఇన్నన్ని పేజీలు ఎలా రాసిందా అని ఆశ్చర్యపోయింది శైలజ. మొదటి పేజీతో ఆరంభించింది చదవటం. సున్నితమైన హాస్యంతోను, వ్యంగ్యంతోను ధారాళంగా సాగిపోతున్నాయి సంభాషణలు. ఎంతో చక్కని అభిప్రాయాలను చాలా సులభంగా వెలిబుచ్చింది. చిక్కని సస్పెన్స్‌తో నిండిఉంది రచన. అడుగడుగునా ముందే ముందోననే ఉత్కంఠ కలిగిస్తూఉంది. చక్కని ఇతివృత్తం. దానికి అనువైన పాత్రలు. ఇంత బాగా ఎల్లా రాయగలిగిందో!

చదువుతూ, ఆపుతూ, ఆలోచిస్తూ పదిహేను పేజీలు తిరగేసేటప్పటికి అరగంట గడిచి పోయినట్లే తెలియలేదామెకు.

మళ్ళీ చదవటం మొదలెట్టింది.

ఇంతలోకే భోజనం ముగించుకుని వచ్చిన ప్రియ, శైలజ పక్కన నిలబడి పేజీలలోకి తొంగి చూస్తోంది. శైలజ తల ఎత్తలేదు. ప్రియ ఉనికి ఆమె గ్రహించినట్టు లేదు. ప్రియకూడా పలకరించలేదు.

మరో నాలుగు పేజీలు చదివి ఆపి ఆలోచించడానికి తల ఎత్తినప్పుడు గ్రహించింది ప్రియ వచ్చినట్టు.

"అప్పుడే అయిందేం భోజనం ?" అడిగింది ప్రియ నుద్దేశించి.

"అప్పుడే ఏమిటి? అరగంట అయితే నేను వెళ్ళి!"

"తెలియనే లేదుస్మా !– అచ్ఛా. Congrats Dear (అభినందనలు అందుకో)" అంటూ నవ్వింది.

"బోరెత్తిపోయావా ?"

"లేదు. చాలా బాగుంది."

"వేళాకోళం చెయ్యకే."

"అల్లా అంటేనే నాకు మంట ! నిజం చెప్పినా గ్రహించలేవేమిటే వెర్రిమొహమా ?"

"ఏం చెప్పనే! నువ్వు నిజం ఎప్పుడు చెప్తావో వేళాకోళం ఎప్పుడు చేస్తావో ఇన్నాళ్ళయిందిగాని గ్రహించలేక పోయాను. ఇంతకూ నీ అభిప్రాయమేమిటి?"

"నీ దరిద్రం తీర్చుకున్నావు."

"అంటే!"

"ఏ పాత్రకూ నీబలహీనతలు అంటకుండా తంటాలు పడ్డావు. కాని ఎల్లా రాయగలిగావే యిల్లా ? నువ్వంటే నాకు నిజంగా అసూయగా ఉంది సుమా ?"

"కాలేజి అంతా నిన్ను చూచి అసూయపడుతూంటే నువ్వు నేనంటే ఈర్ష్యపడ్డవేమిటే! ఎల్లా నమ్మను నేను? క్రిందటి ఏడాది హాస్టల్ కార్యదర్శినివి. బాగా నడిపించి మెస్సు ఖర్చు తగ్గించావు. డిబేట్స్‌లో కాలేజీకి ప్రాతినిధ్యం వహించి మొదటి బహుమతి కొట్టావ్! ఈ ఏడు యూనివర్సిటీ ఫస్టు నీదే అనుకుంటున్నారంతా. ఇంకా—"

"ఇంకా—నోరు ముయ్యవే చెపలమ్మా! హాస్టల్ కార్యదర్శిపని ఎవరూ వద్దంటే నా మీద పడింది. డిబేట్స్ మాటంటావా—అంతా చవటలైతే పెద్ద చవటకు వచ్చి ఉండచ్చు బహుమతి. కాని నీ పనికి స్వతంత్రమైన ఆలోచనాశక్తి కావాలి. అదీగాక ప్రతివాళ్ళకూ తాము చెయ్యలేనిది ఎంతో ఘనమైనదిగా కనపడుతుంది."

"ఇన్ని చక్కని వాదనలు చేస్తావు. ఇవన్నీ కాగితం మీదకు ఎక్కిస్తే మంచి రచనలు అవుతాయి. తలుచుకుంటే నువ్వూ రాయగలవు."

"రాయలేను బడబడ వాగమంటే వాగగలను గాని రాయమంటే అసలు అక్షరం ముందుకు దొర్లదు. కాని, నిన్నినాళ్ళు నిరుత్సాహ పరిచినందుకు క్షమించవే!"

"కాని ఇంకా నువ్వు చెప్పింది నిజమని నమ్మలేకుండా ఉన్నాను" అంది ప్రియ.

"వినయం సద్గుణమే కావచ్చు. కాని అతి వినయం మాత్రం ధూర్తలక్షణం. నువ్వు కాస్సేపు అటుపోయి ఇంకేదేనా చదువుకో. నేనిది ముగిస్తాను" అంది శైలజ.

"ఏమైనా మార్పులు సూచించవే!"

"నా మొహం నాకేం తెలుస్తుంది! అయినా అల్లాగేలే. ముందు నువ్వు మాత్రం దయచెయ్!"

శైలజ నాటకం చదవడం పూర్తి చేసేటప్పటికి మధ్యాహ్నం రెండు గంటలైంది.

చదువుకు సంస్కృతికి గల వైరుధ్యాన్ని గురించి ఎంతో చక్కగా నడిపించింది ప్రియ నాటకాన్ని. ఎన్ని పరీక్షలు పాసైతేనేం, ఎన్ని ఉద్యోగాలు చేసి ఎంత సంపాదిస్తేనేం, ఇటువంటి ఒక్క రచనకు సాటికావు అనిపించిందామెకు. ఇది చదివి, సహృదయంతో అర్థంచేసుకొని ఆచరించ బూనుకుంటే సమాజం ఎంత ముందుకు వస్తుందో అనుకుంది. ఈ ఆలోచనతో ప్రియ అంతస్థు ఎంతో పెరిగిందామె దృష్టిలో. ఒక వ్యక్తిలో మరుగుపడి ఉన్న లోతులు ఎంత గొప్పవి కావచ్చునో అన్నది మొట్టమొదటిసారిగా ఆమెకు స్ఫురించింది. తానిన్నాళ్లూ ప్రియ రాసిన వాటిని చదవనేనా చదవకుండా వేళాకోళం ఆడి ఆమెను బాధించింది. నిరుత్సాహ పరిచింది. తనదృష్టిలో ప్రియ కాలం వ్యర్థంచేసి చదువు పాడుచేసుకుంటూందని, తానేనో ఆమె నుద్ధరించి దారిలోకి తీసుకువచ్చి చదువుమీద శ్రద్ధ ఎక్కువచెయ్యాలని ఆశించింది. ఆ దోవ తప్పించడమే ప్రియ శ్రేయస్సుకు దోహదం అని భావించింది. అందుకే ఆమెను తిట్టేది తను. న్యూనపరిచేది. ఆ ఊహ ఎంత పొరపాటు ఊహో ఇప్పుడు తనకు తెలిసి వచ్చినట్లయింది. ఇంతా చేస్తే తా నూహించినదే ఆమెకు తగిన పథమని నిర్ణయ

మేమిటి? ఈ రచనలలోనే ఆమె భవిష్యత్తు ఉండి ఉండవచ్చు. నాలుగు రాళ్లు సంపాదించి కూపస్థమండూకంలాగ బ్రతకడమేనా గొప్ప? తను ఊహించి తన ఊహ ఇతరులకు అందించి ఇతరులలో చైతన్యం ఉత్పన్నం చెయ్యడానికి పాటుపడటం ఎంత ఘనత! కాని ప్రియ ఏమనుకుంటూంది? పశ్చాత్తాప పడుతూంది. బలహీనతకు బానిస అయినట్టు భావిస్తూంది. ఆమెను ప్రోత్సహించాలి. ఆమె ఊహను పురిగొల్పి ఆమెను ఒక గొప్ప రచయిత్రి కాగలిగేలా ప్రోత్సాహం ఇవ్వాలి. ఆమెలో ఉన్న బాధ పోగొట్టాలి. ఆమెకు ఏ గొప్ప బహుమతియో రావచ్చు—ఇట్లాంటి ఆలోచనలతో కొట్టుకుపోయింది శైలజ

నిద్ర ముగించుకుని వచ్చిన ప్రియ, శైలజను తట్టి ఈ లోకపు పరిధిలోకి తీసుకువచ్చింది.

"ఇవాళ్లా నా వంతు నువ్వు పుచ్చుకుంటావా ఏమిటే?" అడిగింది శైలజను.

"నీ వంతేమిటే?"

"అదే. ఊహల్లో తేలిపోవడం."

"ఇవాళ నాకో గొప్ప సత్యం తెలిసివచ్చిందే!"

"ఏమిటమ్మా అది—వేళాకోళం కాదుగద!"

"ఛీ చవట! ఎప్పుడూ వెధవ అనుమానంనువ్వూను. ఆ పద్ధతే వదిలిపెట్టమని చెప్తున్నాను—"

"అబ్బ, ఆపవే—ఇంతకూ నీకు తెలిసివచ్చినసత్యం ఏమిటంట?" అడిగింది మాట మధ్యలో శైలజను ఆపి.

"ఇతరుల విషయంలో మనం వాళ్ళకు మంచి అనుకున్నది నిజం కాకపోవచ్చునని !"

"నీకు భాష్యం చెప్పేవాడు ఇంకోడు ఉండాలి!"

"ఏం అర్థం కాలేదా !"

"ఏమిటే అర్థం అవడం నీ మొహం !—ఏదో వాగేసి—"

"అది కాదే ప్రియా ! ఇన్నాళ్ళూ నువ్వు చేసినదంతా తప్పనీ, నువ్వేదో కాలం వ్యర్థం చేస్తున్నావనీ నిన్ను తిట్టాను. ఇప్పుడాలోచిస్తూంటే చదివి ఉద్యోగంచేసి వెలగబెట్టే దేమిటో అర్థం కావడంలేదు. నువ్వు చేసే దాంట్లోనే ఎక్కువ తృప్తి ఉందనిపిస్తూంది."

"ఏమో లేవే ! ఇల్లా ఆలోచించే నా తల తిరిగిపోతూంది. నీలా ఉండగలిగితే బాగుణ్ణని నాకనిపిస్తూంది" అంది ప్రియ.

"తను చేసేపనిలో మానవుడికి తృప్తిఅంటూ ఉండదనుకుంటాను. దీని కేంగాని, నాకో చిన్న ఉపకారం చేస్తావ్ ?"

"నేనా!" ఆశ్చర్యపోయింది ప్రియ.

"తెల్లబోకు, ఈ రచన నాకిచ్చేయ్. రేపు ఆంధ్రా వీక్లీలో విద్యార్థినుల తరఫున వేయిస్తాను. ఒక్కసారైనా వాళ్ళ విరక్తిపిగు అణుగుతుంది."

"నీకు పుణ్యం ఉంటుంది—అటువంటి పనిమాత్రం చెయ్యకు. ఇది మనస్సులో పెట్టుకుని నన్ను నానా మాటలూ అంటారు."

"అయితే మారుపేరు పెట్టుకో. నువ్వని ఎవరి చెప్పన్లే. నా యీ కోరిక మాత్రం కాదనకు. ఏం ? మనస్ఫూర్తిగా అడిగింది శైలజ.

విష్ణుప్రియ ముఖంలో ఉజ్వలత గోచరించింది ఆమెకు ఆనందం పట్టలేక కళ్ళనీళ్ళు తిరిగాయి.

"ఇంక నేనిక్కడ ఉండలేనే పద. అల్లా బజార్లోకి పోయి కాస్సేపు తిరిగి సినీమాకు పోదాం" అంది ప్రియ.

"రైటో పద!" వంత పలికింది శైలజ.

ఇద్దరూ కదిలారు.

*　　　*　　　*

మూడోరోజు మధ్యాహ్నం ఇంటర్వెల్‌లో లేడీస్ వెయిటింగ్ రూం కిటకిటలాడుతూ ఉంది. బాతాఖానీ తోను, ఆటలతోను మహాసందడిగా ఉంది.

"శైలజగారున్నారా ?" బయటనుంచి పిలుపు వడింది.

నర్మద బయటకు తొంగి చూసింది. పిలిచిన నాటక సంఘం కార్యదర్శి శేఖరం.

"శైలూ—నిన్నూ" అంటూ శైలజను పిలిచింది.

శైలజ బయటకు వచ్చింది.

"గుడ్ మార్నింగ్!" అభివాదం చేశాడు శేఖరం.

"ఓహో! శేఖరంగారా? ఏమిటిలా దయచేశారు!" అంది శైలజ తనుకూడా ప్రత్యభివాదం చేసి.

"ఒకసారిలా వస్తారా? మీతో మాట్లాడాలి"

"ఏమిటి కథ?"

"ఏం లేదు. అటు మీరు కాస్త కాంటీన్‌కి వస్తే కొంచెం తీరిగ్గా మాట్లాడుకోవచ్చు."

"సరే పదండి" అంటూ అతనితో బయలు దేరింది.

ఇద్దరూ కాంటీన్‌కు వెళ్ళి వరండాలో కూర్చున్నారు. 'బేరర్' వచ్చాడు. శేఖరం ఏదో ఆర్డర్ ఇవ్వబోగా తనకు కాఫీ మాత్రం చాలని చెప్పింది శైలజ.

"రెండు కాఫీ" అన్నాడు శేఖరం బేరర్‌తో.

"అదేం! నాకోసం మీరూ మానేస్తున్నారు. నా కింతకుముందే ఒక హోటాము పడింది. బాగుండదనిగాని ఈ కాఫీ కూడా ఇష్టంలేదు."

"ఫరవాలేదు లెండి."

ఇంతలో కాఫీ వచ్చింది. ఇద్దరూ తాగడం మొదలెట్టారు.

"ఇంతకూ నన్నెందుకు రమ్మన్నారో చెప్పారు కారు" అంది శైలజ.

"అదే — ఆంధ్ర వారోత్సవాలు వస్తున్నాయి కదా—"

"ఊఁ."

"మీ విద్యార్థినుల తరపున ఏదైనా నాటకం వేయించమని అడుగుదామని—"

"ఎందుకు లెద్దురూ !"

"అదేమిటి మీరూ అలా అంటున్నారు !"

"నిరుటి భాగోతం చాలదూ ?"

"ఈ ఏడాది అటువంటివి జరగకుండా చూసే భారం నాది."

"వద్దు లెద్దురూ శేఖరంగారూ—"

"అబ్బే, అలా అంటే వీలు లేదు."

"సరే పోనీ ఒప్పేసుకుందాం ! ఈ ఏడు అల్లరి జరగకుండా చూస్తామంటున్నారే మొన్న ప్రారంభోత్సవంలో జరిగినదాన్ని అరికట్టలేకపోయారేం ?"

"మొన్నటిది అనుకోకుండా జరిగింది. నాకు నిజంగా చాలా బాధగా ఉంది అది తలుచుకున్నప్పుడల్లా."

"అయితే ఇప్పుడు కట్టుదిట్టం చేస్తానంటారు ! వినోదంకోసం నాటకం ఏర్పాటుచేసి ముళ్ళమీద కూర్చోబెట్టినట్టు కట్టిపడేస్తే ఏం ప్రయోజనం?" నవ్వింది శైలజ.

"అయితే అల్లరే సాగాలంటారా ?" మతిపోయింది శేఖరానికి.

"అరే కంగారు పడకండి ! నేననేదది కాదు. మేం నాటకంవేస్తే సహించగలిగే సంస్కారం మీలో లేనప్పుడు ఏదో విధిగా నిర్బంధంగా కూర్చోబెట్టి సాధించేదేమీ ఉండదు."

శేఖరం మాట్లాడలేదు కాని ముఖం ఎరుపెక్కింది.

"చూశారా ? నేను నిర్మొహమాటంగా అనేశాను

మీకు అప్పుడే కోపం వచ్చింది. చేసేవి చేస్తూనే ఉంటారు. అనవసరంగా తగువులెందుకు గాని ఈ పేటికి వద్దని చెప్పండి."

"నా మాట తీసెయ్య రనుకున్నాను—" నసిగాడు శేఖరం.

"మీ రెందుకు బాధపడతారు? ఇదేం ఉపకారం కాదు. అసలు మా అంతట మేమే ముందుకు రావలసింది. కాని పరిస్థితులు కలిసిరాలేదు. దానికి బాధెందుకు?"

"మీ అంతట మీరే ముందుకు రావలసిన మాట అనీ మీరే అంటున్నారు. మళ్ళీ వీలుండదనీ మీరే అంటున్నారు. మీరంతా చిత్రంగా మాట్లాడతారు."

"చిత్రం కాదండీ! జరుగుతున్నవాటి దృష్ట్యా అన్నాను. సహవిద్య అంటూ నోరెత్తి చాటటమే గాని మన సామాజిక ప్రవర్తన ఏం పెరిగింది చెప్పండి. స్త్రీలు ముందుకు రావటం లేదంటారు. నాలాటిదాన్ని నలుగురితో స్వేచ్ఛగా మాట్లాడితే నా వెనకాల నా గురించి సాగే గుసగుసలకు అంతుండదు. ఎందుకండీ ఈ బురఖాలు?"

"మొదట్లో అన్నింటికీ ఆటంకాలే ఉంటాయి. ఈనాటి కట్టుబాటు అనుకునేదాన్ని దాటేవారిని అంతా వింతగానే చూస్తారు. నలుగురు ముందుకొచ్చి దాన్నే బలపరిస్తే ఆ కొత్తపద్ధతే మళ్ళీ కట్టుబాటు అయి కూర్చుంటుంది. ఆ కొత్త కట్టుబాటును అతిక్రమించినవారినీ మళ్ళీ వింతగానే చూస్తారు. అది సహజం. అందుకని పాత కట్టు

బాటు పోవాలంటే కొంత శ్రమకోర్చి అది అలవాటయ్యే వరకు ప్రతికూల విమర్శకు సహనం వహించాలి. ఇంతకూ అందరూ అల్లాగే ఉన్నారంటారా? ఎవరో కొందరు చేసిన దానికి అందర్నీ నిందిస్తారా? మీరూ చదువుతున్న వారేగా కొందరి తప్పుకు అందర్నీ ఎందుకు దుయ్యబడతారు చెప్పండి?" అన్నాడు శేఖరం.

"అల్లా అంటా రేమిటండీ! ఆనాళ ప్రారంభోత్సవం విషయం తీసుకోండి—మిగతావారంతా తమ విధులను ఎరిగి ఉన్నవారే అయితే ఆ పొట్లాలు విసిరిన నలుగుర్నీ మోసుకుపోయి అవతల విసిరేసి ఉండేవారు. అది జరిగిందా? లేదు. అందరూ ఆ ఆటతో వినోదించారు. అదా వినోదం అంటే? ఒకళ్ళకు కళ్ళమ్మట నీళ్ళు తెప్పించే అసహాయస్థితినా వినోదంగా తీసుకోవడం! అక్కడ ఉన్న జనాభాలో మీా సంఖ్య ఎక్కువ గనక అది చెల్లింది" నిదానంగా అంది శైలజ.

"ఆ మాట నిజమే ననుకోండి—"

"అనుకుంటూనే ఉండడం, చేసేవి చూస్తూ ఉండడం—ఏమిటి దీనివల్ల సాధించేది?"

"మరి మీా రిన్ని కబుర్లు చెప్తున్నారు గదా—అణిగి మణిగి ఊరుకుని మాత్రం ఏం సాధిస్తారు చెప్పండి?"

"అణిగి మణిగి ఊరుకోవటం లేదు. అవసరమైన వాటిల్లో అన్నీ భరించే ముందుకు వస్తున్నాం—చదువుకుందుకు వస్తున్నాం గదా అన్నింటికీ ఒప్పుకుని! అంత మాత్రాన అన్ని విషయాలలోను కల్పించుకుని హేళనకు

గురి కావడం ఎందుకు చెప్పండి ? మేం నాటకం వెయ్యక పోతే కొంపేం మునిగిపోదు గదా ?"

"ఏమిటో మొగాళ్ళు మొగాళ్ళని జబ్బలు చరుచుకోవడమే గాని మీకు సమాధానం చెప్పలేకపోతున్నాం." నవ్వాడు శేఖరం.

"కబుర్లు పోగులం. అంతే. అంతవరకే మా మాట చెల్లుతుంది."

"మీతో వాదనెందుకు గాని ప్రయత్నించి చూడండి."

"నా మటుకు నా కేమీ అభ్యంతరంలేదు. నేను రెడీని. అల్లాగే ప్రయత్నిస్తాను లెండి. మరి సెలవా ?" అంటూ లేచింది శైలజ.

"థాంక్స్" అన్నాడు శేఖరం.

## 6

అనూరాధ వెయిటింగు రూములో ఉన్నంత సేపూ ఒకతను బయట నిలబడి అల్లరిచేయడం ప్రారంభించాడు. మొదట తనను కాదన్నట్టు ఊరుకొంది గాని అతను విడువ లేదు.

హైమతో ఆ విషయం ప్రస్తావించింది.

అతను ఇంటర్‌లో తన క్లాస్‌మేటనని, 'లా ప్రిలిమినరీ' చదువుతున్నాడని, ఆ కాలేజీలో బాగా పేరుమోసిన

అల్లరివాడని చెప్పింది హైమ. పేరు కళానిధి. చాలా తెలివైనవాడు; లక్షాధికారి కొడుకూను. అతనితో గొడవ పడవద్దని హెచ్చరించింది హైమ.

కాని అలా ఊరుకుంటే కూడా సాగలేదు.

ఒకరోజున అనూరాధ, హైమ వెయిటింగు రూము నుండి వస్తూంటే 'అనూరాధా' అన్న పిలుపు వినపడింది. వెనక్కు తిరిగారు.

కళానిధి కొంటెగా నవ్వుతూ తల త్రిప్పుకొన్నాడు.

హైమ చేయి పట్టుకొని లాగబోయినా విదిలించుకొని నిలబడి పోయింది అనూరాధ.

"మిస్టర్!" మృదువుగా పిలిచింది.

వెంటనే మతిపోయి తిరిగిచూచి మంత్రబద్ధుడులా వచ్చాడు.

"చూడు, తమ్ముడూ! నువ్వు నాకన్న వయస్సులో పెద్దవాడివి లాగే కనబడుతున్నావు కాని నీ కుర్రతనం చూస్తే తమ్ముడూ అని పిలువబుద్ధి అవుతూంది. అంత ఆనందంగా పిలిచిన వాడివి నేను వెనక్కు తిరిగితే మొహం తిప్పుకున్నావేం? బహుశా అది తప్పని నీ మనస్సుకు తట్టి ఉంటుంది. నన్నేదో ఏడిపించి ఏం బావుకుందామనుకొంటున్నావ్? నీ విషయంలో ప్రిన్సిపాల్‌కు రిపోర్టుచేసి నిన్ను కాలేజీ నుంచి బయటకు గెంటిస్తాననుకో! నీ మిత్ర బృందం నన్నుమాత్రం ఉండనిస్తుందా? పోనీ నీ ఇంత అభిమానానికి ప్రతిఫలంగా నిన్ను పెళ్ళిచేసుకుందామన్నా నాకిదివరకే అది జరిగిపోయింది. పోనీ ఆయనను విడిచిపెట్టి

నిన్ను చేపట్టడానికి తగిన కారణం కనపడదు. ఆయన సంస్కారం గొప్పది. చూడు తమ్ముడూ! నువ్వు తెలివైన వాడివేనట. మా హైమ చెప్పింది. నీకు నువ్వే ఆలోచించుకొని చూస్తే ఇలాంటి పని చెయ్యడం ఎంత తప్పో తెలిసి వస్తుంది. నువ్విలా చాలా కాలంనుంచి చదువు, మనస్సు పాడుచేసుకుంటున్నావు. ఎప్పటికప్పుడే నీకీవిషయం చెప్పాలనుకున్నాను గాని పడలేదు. ఇవాళ కుదిరింది. నువ్వింకా ఇలా సాగించావంటే నేను కాలేజీ మానెయ్య వలసి వస్తుంది. అది నాకేం బాధలేదు. కాని ఆయననిరుత్సాహ పడిపోతారు. నువ్వు నిష్కల్మషంగానే నాతో స్నేహం చెయ్యదలచుకుంటే ముఖాముఖిని అడగరాదా ? నిజంగా నీ తెలివితక్కువకు నవ్వు వస్తూంది తమ్ముడూ. కోపగించుకోకు ఇల్లా అన్నానని. ఆలోచించి చూడు" అంటూ కొయ్యబారిపోయిన హైమ చెయ్యి పట్టుకొని లాక్కొని వెళ్ళిపోయింది కాలేజీవైపు.

ఇద్దరూ నిశ్శబ్దంగా క్లాసుకు వెళ్ళిపోయారు. రెండు పీరియడ్స్ రెండు యుగాలుగా జరిగాయి. పాఠందారి పాఠానిదీ, వారి ఆలోచనలదారి వాటిదీ అయిపోయింది వారికి.

బయటకు వచ్చి బస్ దగ్గరకు వెళ్ళబోతూంటే హైమ అనూరాధను ఆపి లైబ్రరీలోకి లాక్కుపోయింది. బుక్ సెల్ఫ్‌లకు మధ్యనున్న ఖాళీలోకి జొరబడి కిటికీ దగ్గరకు వెళ్లారు.

బయటకు చూస్తూ నిలబడింది అనూరాధ. కిటికీలను

ఉన్న ఊచలు చాలక 'ఎక్స్పాండెడ్ మెటల్ మెష్' కూడా బిగించారు. తల 'మెష్'కు ఆనించిచూస్తే తప్ప బయట ఏమున్నదీ కనపడదు. వెనకాల గోతులు, ముళ్ళు, రాళ్లు. కొంతభాగం కంచెవేసి వదలివేయబడింది. ముస్లిముల స్మశానం అని వినికిడి. ఆ వెనకాల 'సద్ధర్మ సదన' హాస్టల్ కనిపిస్తూ ఉంటుంది.

కొంతసేపు అలా నిశ్శబ్దంగా గడిపిన తరువాత ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ హైమే అడిగింది అనూరాధను—

"ఏమిటొదినా! ఇవాళ ఇల్లా అయిపోయావ్! నేను చెప్పినా వినిపించుకోలేదు!" అని.

"కాదు హైమా. చాలా రోజులనుంచి చూస్తున్నాను. ఊరుకున్నకొద్దీ లోకువ కావడం తప్ప ప్రయోజనం లేదు."

"అయితేమాత్రం అతనితో పేచీ పడడమేమిటి? ఉత్త మొండి ఘటం. ఇదివరకు కాలేజీలో ఇతనిమీద ఎన్ని రిపోర్టులో. అతనితో పేచీ పెట్టుకున్న వాళ్లు మళ్ళా కాలేజీ ముఖం చూడలేదు. నువ్వెందుకు వదినా అతనితో మాట్లాడావు?" కళ్ళ నీళ్ళ పర్యంతం అయింది హైమకు.

"పిచ్చిపిల్లా! అలా బేలవైపోతున్నావేమిటి? అల్లా ఊరుకుంటే ఎంతకాలం సాగుతుంది? అతనికి సరిగ్గా తెలియజేసిన వాళ్ళుండి ఉండరు. రిపోర్టులు ఇచ్చి రెచ్చగొట్టి ఉంటారు. అతనిలోనూ మానవత్వం ఉంది. అది మేల్కొల్ప

డానికి సరైన మార్గం ఆలోచించాలి. అందరు మనుష్యులూ ఒక్కలా ఉండరు. అందరి భావాలూ, మార్గాలూ ఒక్కలా ఉండవు. అందరూ ఒక్కపంథాలో నడవలేరు. కాని మానవత్వం అందరిలోనూ ఒక్కటే. అది కొందరిలో మరుగు పడి ఉంటుంది. అది మేల్కొలిపి నచ్చచెప్పే ధోరణిలో ప్రయత్నించాలి. అంతా గొడవ అయిపోతుందంటావు! అయితే ఏం భయం? మనయందు తప్పులేనప్పుడు మనం కంగారు పడకూడదు. అంతగా అయితే కాలేజీ మానేస్తాను కాని ఊరుకోవడం ఎల్లా?"

"ఏమో, బాబూ! నీ అంతయిదిగా నేను నా జన్మలో మాట్లాడలేను. తిట్టేస్తావనుకున్నాను. కాని అంత నెమ్మదిగా మాట్లాడావేమిటి? అతను నిన్నూ నీ సహృదయతనూ అర్థం చేసుకోగలడా? ఏవో ధర్మపన్నాలు ఏకరువు పెట్టావనుకొంటాడు. బూడిదలో హోమం చేస్తే ఏమిటి ప్రయోజనం?"

"కాదమ్మా! కాదు! అతనింక మారతాడని నా నమ్మకం. ఇంత నెమ్మదిగా ఎవరూ చెప్పి ఉండరు. చెపితే దిద్దుకుంటాడు. అతను తెలివైనవాడు అని నువ్వు చెప్పినప్పుడే అనుకున్నాను—ఇదే పద్ధతి అని. నువ్వేం కంగారు పడకమ్మా."

"కాని అతను రెచ్చిపోయి గొడవచేస్తే నువ్వు కాలేజీ మానెయ్యవలసి వస్తే అన్నయ్య ఎంత బాధపడతాడో ఆలోచించావా?"

"ఎంత అమాయకురాలి వమ్మా! ఆయన మనస్సు నొచ్చేపని నేను చేస్తానా? లేక ఈ సంగతి ఆయననుంచి దాస్తానా? ఇంత చదువుకుంటున్నావుగాని లోకజ్ఞానం సున్న." వెన్నెలలు చిందుతూ నవ్వింది అనూరాధ.

"ఫో వదినా. ఎప్పుడూ ఇంతే. నువ్వు కాలేజీ మానెయ్యవలసి వస్తుందేమోనని అనిపించి ఏడుపొచ్చింది. అది సరేగాని నీకు ఇంత తెలివి ఎల్లా వచ్చింది?" అంది నవ్వుతూ. కళ్ళల్లో నీళ్ళు, పెదవులమీద చిరునవ్వు వింత శోభ కూర్చాయామె ముఖానికి.

"ఈమాత్రం తెలీదూ! మీ అన్నయ్యలాంటి మొగుడెవడైనా దొరికితే అప్పుడు తెలుస్తుంది అమ్మాయికి" అంది హైమ బుగ్గను చిటికవేసి నవ్వుతూ.

హైమ సిగ్గుపడడంతో ముఖం అరుణిమ దాల్చింది. ఎంత చదువుకొన్నా స్త్రీ ముఖానికి సిగ్గే శోభ.

అయిదూ ఇరవై బస్సెక్కి ఇంటికి వచ్చారు.

ఇంటిదగ్గర విశ్వం, శాంతమ్మగారు స్వాగతం చెప్పారు.

"ఇంత ఆలస్యమైందేం రాధా? ఆలస్యమౌతుందని తోస్తే ముందే చెప్పి వెళ్ళేదానివిగా? ఏమైందోనని కంగారుపడిపోయి విశ్వాన్ని పంపిద్దామనుకొంటున్నాను" అంటూ ఆదుర్దా ప్రకటించింది శాంతమ్మగారు.

"ఏం లేదు అత్తయ్యా!" సిగ్గుపడుతూ చెప్పింది అనూరాధ.

"అయినా కోడలంటే ఎక్కడలేని ప్రేమాను. గంట నేపటినుండి నా ప్రాణాలు తోడేస్తూంది" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"ఏం అమ్మవమ్మా! చాదస్తం నువ్వూను. కోడలేం నాలుగేళ్ళదా? పిల్లి ఎత్తుకుపోతుందా? నేను కూడా లేనూ? అనవసరంగా అన్నయ్యను ఇబ్బంది పెట్టావా?" అంది హైమ నవ్వుతూ.

"పోవే పెంకి పిల్లా! ముసలిదాన్ని చేసి నన్నేడిపిస్తున్నారు. మీ అమ్మ నడుగు తెలుస్తుంది. లేకపోతే నీకూ నలుగురు పిల్లలు పుడితే అప్పుడు తెలుస్తుంది. ఈ పూటకు నువ్వుకూడా భోంచేసెయ్యొక్కడే. విశ్వం దిగబెడతాడులే" అంటూ ఇంటిలోకి దారితీసింది.

హైమ సిగ్గు పడిపోయింది.

అనూరాధ కళ్ళలో నీళ్లు నిల్చాయి.

వేదాంతిలా నవ్వాడు విశ్వం.

హైమ ఎదురు చెప్పలేదు భోజనానికి. అందరు భోజనాలు కానిచ్చారు—నవ్వుతూ, తుళ్ళుతూ, కబుర్లు చెప్పుకుంటూ.

"హైమను దిగబెట్టి వస్తామమ్మా" అన్నా విశ్వం.

"మంచిది. రాధకూడా వస్తూందా? తొందర రండి" అంటూ సాగనంపింది.

"వెళ్తానమ్మా" అంది హైమ

"వెళ్ళొస్తా ననవే పిల్లా."

"మరీ చాదస్తం నీకు. వెళ్ళొస్తాను మరి."

"వస్తా నత్తయ్యా."

"ఓహో! అత్తగారి ఆజ్ఞ లేందే కదలరు కాబోలు రాధమ్మగారు." వేళాకోళం చేశాడు విశ్వం.

చురుక్కున చూసింది అనూరాధ విశ్వాన్ని.

"అమ్మా, గారంచేసి పాడుచేస్తున్నావు రాధను. చూశావా ఎలా తినేసేలా చూస్తూందో?"

"ఊరుకోరా, వేళాకోళం నువ్వూను. ఇంక కదలండి! హైరాను గురించి ఆదుర్దా పడుతూంటారు వాళ్ళు" అంది శాంతమ్మగారు నవ్వుతూ.

ముగ్గురూ కదిలి బయటకు వచ్చారు.

అనూరాధే దారిలో ప్రసంగం ఎత్తింది.

"ఇవాళ ఆలస్యానికి కారణం అడగరేం?" అంది.

"అదేమిటి రాధా! ఎప్పుడేనా నే నడిగానా? అంత అవసరం ఉంటే నువ్వే చెబుతావుగా?"

"అంతే నన్నమాట. ఇంక మీకు నా విషయం ఏమీ అక్కర్లే దన్నమాట."

"అదేమిటి రాధా? కొత్తగా మాట్లాడుతున్నావు. అసలు సంగతేమిటి?" విస్తుపోతూ అడిగాడు.

"గాభరా పడ కన్నయ్యా! వదిన నీతో కొంత తగవు తెచ్చుకోవాలని చూస్తూంది—ఇందాకా ఉడికించావని.

అసలు సంగతేమిటంటే—" అంటూ జరిగినదంతా పూస గుచ్చినట్టు చెప్పింది హైమ.

"అంతా బాగానే ఉంది కాని ఒక్క పొరబాటు మాత్రం చేశావు" అన్నాడు విశ్వం అనూరాధతో.

కళ్ళతోనే ప్రశ్నించింది అనూరాధ.

"అతన్ని మనింటికెందుకు పిలవలేదు మరి ? నేను మాట్లాడి ఉండేవాడినే! నువ్వేనా చెప్పలేదుటమ్మా మీ వదినకు ?"

"ఆఁ హైమ చెప్పవలసిందే! మా గొప్ప చెల్లెలు. నే నతనితో మాట్లాడినందుకే వణికిపోయింది ఇంత ఎమ్మే గారూను. మాట్లాడవేం ముంగిలా !" అంది అనూరాధ హైమను పొడుస్తూ.

హైమ సిగ్గు పడిపోయింది. ఆ అలుమగల హృదయ నైర్మల్యాన్ని పూర్తిగా గుర్తించి.

హైమను ఇంటిదగ్గర దిగవిడిచేసి తిరిగి వచ్చేశారు ఇంటికి.

అనూరాధ మెత్తని కటూక్తులతో తనను అలా అనగానే కళానిధి ముఖం కందిపోయింది. కోపంతోను, పౌరుషంతోను తను వాళ్ళను ఏదో అనేలోపునే వాళ్ళు వెళ్ళిపోయారు. అయినా ఎందుకో మాట అనగలిగే ధైర్యం సడలిపోయింది. బహుశః అనూరాధ చెప్పిన తీరు దానికి కారణమై ఉండచ్చు.

చుట్టూ తన్నెవరైనా చూస్తున్నారేమోనని భయ

పడ్డాడు. తనకు తల కొట్టేసినంత పనైంది. కాలేజీ ఎగగొట్టి తన గదికి దారి తీశాడు.

తలుపులు బిగించి మంచంమీద పడున్నాడు.

కోపంతోను, అసహాయతతోను ఉడికిపోతున్న అతను అలా మంచంమీద పడుకోలేకపోయాడు. పిచ్చెత్తి పోయేట్టుందతనికి. అటూ యిటూ పచారు సాగించాడు.

ఒక ఆడపిల్ల తనను అల్లా నిలబెట్టేసింది. పుట్టి బుద్ధెరిగిన తరువాత తనింత చచ్చు స్థితిలో ఎప్పుడూ పడలేదు.

దీనికి ప్రతిక్రియ ఏమిటి!

తన బృందాన్నంతటినీ ఉసికొల్పి ఆమెకు కళ్ళ నీళ్లు రప్పించేటట్టు చెయ్యాలి. నోటి కొచ్చినట్లల్లా వాగితే జరిగే ఫలితాలు తెలియజెప్పాలి. ఇంక కాలేజీ ముఖం చూడకుండా చెయ్యాలి. తనతోనా తగవు! ఎవరనుకుంటూందో తను!! పాపం పాముతో చెలగాటమని ఆమెకి తెలిసి ఉండదు!

హైస్కూల్లో తనతో పేచీపడ్డ పద్మ పని ఏమైంది! మూడోనాడు స్కూలు మానిపించేశాడు ఆమె తండ్రి. తన్నెవరూ ఏమీ చెయ్యలేకపోయారు. కాలేజీలోనూ అంతే. ఎన్ని రిపోర్టులు తనమీద వెళ్ళినా తననేమీ చెయ్యగలిగిన దమ్ముండేది కాదు. చిలిపితనానికి ఏడిపిస్తే తనమీద కళ్ళెర్రజేసిన విమల ఇంటర్మీడియేట్ సగంలో ఆపేసి సెలవు తీసుకుంది. తన పోరుపడలేక! అటువంటి తనతో—ఇష్టం వచ్చినట్టు మాట్లాడడమా!

కాని తనదేమిటి ఆమె ముందు నోరెత్తలేక పోయాడు.

మంత్రముగ్ధుడులా ఆమె అన్నవన్నీ విన్నాడు. తన అహంకారం ఎందుకో ఆమె ముందు తల వంచింది? ఎందుకు?

ఇంత పెద్దవాణ్ణి తనను తమ్ముడూ అని సంబోధించింది.

ఆ మాటలు, ఆ మాట్లాడే తీరు—ఏదో గొప్ప శక్తి ఉందందులో. అందుకే తను లొంగిపోయాడు. ఒక్క పిలుపుతోనే తనను క్షుద్రవాణ్ణిచేసి పారేసింది. అందుకే తనకు మాటలు పెగలలేదు. అలా చూస్తూ ఉండి పోయాడు.

తనను తిట్టలేదు. కళ్ళెర్ర జేయులేదు. రిపోర్టు ఇస్తానని బెదిరించలేదు. మరి ఆమెమీద ఎందుకు కోపం!

తానే కాలేజీ మానెయ్యవలసి వస్తుందని, అందుకు భర్త బాధపడతాడనీ అంది. తను చూపిస్తున్న అభిమానానికి పెళ్ళి చేసుకుందామని చూసినా అది తన కిదివరకే జరిగిపోయిందంది—

ఈ ఆలోచనతో కళానిధికి నవ్వు వచ్చింది. దానితో కొంచెం ఉపశమనం కలిగింది. ఆవేశం, ఉద్వేగం తగ్గాయి.

మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

ఇంకా ఏమంది?

మొగుణ్ణి వదిలివేయటానికి కారణాం కనపడ లేదాంది.

భలే పిల్లలే !

ఇన్నాళ్ళూ తనను రెచ్చగొట్టిన వాళ్ళే కనపడ్డారు గాని ఇల్లా చెప్పినవాళ్లు ఒక్కళ్ళూ లేరు. రిపోర్టు లిచ్చే వారు. బెదిరించేవారు. దానితో తన కోపం మరింత హెచ్చేది. తనకు కావలసినంత బృందం ఉండేది. ఎల్లా చెప్తే అల్లా వినేవాళ్ళు కోకొల్లలుగా ఉండేవారు.

తండ్రి లక్షాధికారి. మంచి పలుకుబడి ఉన్నవాడు. పెద్దపెద్ద వాళ్ళంతా ఆయన స్నేహితులు తానొక్కడే కొడుకు. ఆడింది ఆటగాను పాడింది పాటగాను సాగేది. దానితో అల్లరి పెరిగింది. గారాబం అవడంచేత తండ్రి ఏమీ అనేవాడు కాదు. అది తన ఆగడం పెరగడానికి మరింత దోహదం ఇచ్చింది.

తన హైస్కూలు చదువువచ్చేసరికి తండ్రి ఎక్కువ విరాళాలిచ్చి తమ ఊళ్లోనే హైస్కూల్ పెట్టించాడు. ఆ కమిటీకి తండ్రే ప్రెసిడెంట్. హెడ్‌మాస్టరు దగ్గరనుంచి తనకు ఎక్కువగా గౌరవం ఇచ్చేవారు. క్లాసులో అల్లరి చేసినా మాస్టర్లు ఊరుకొనేవారు. దానికి తోడు తను తెలివైనవాడవడంవల్ల పరీక్ష తప్పకుండా పాసౌతూండడంతో తనకు మరింత గర్వం పెరగడం, ఇతరులు కూడ మెచ్చుకోవడం, తన లోపాలను ఎత్తిచూపక పోవడం జరిగాయి. ఎంత అల్లరి చేస్తున్నా మార్కులుకూడా బాగా వస్తూండడంచేత తనంటే టీచర్లకు వాళ్లకు ఒక విధమైన వింత అనురాగం ఉండేది.

స్కూలు చదువు గడిచి కాలేజీ వాతావరణంలో అడుగు పెట్టేసరికి ఇవన్నీ మరింత బలపడ్డాయి. ప్రిన్సిపాల్ తండ్రికి బాల్య స్నేహితుడు.

కాలేజీలో అడుగు పెట్టేసరికి అదివరకటి బాల్య చాపల్యానికి తోడు యవ్వనోదయమై స్త్రీలోని ఇంకో భావం తనకు గోచరించసాగింది. తన తెలివి అంతా ఉపయోగించి అమ్మాయిలను ఏడిపించేవాడు. తన్ను తిట్టేవారు. రిపోర్టు లిచ్చేవారు. కాని ప్రయోజనం లేకపోయేది. తనమీద ఏ అభియోగమూ తీసుకురావడానికి వీలులేనంత చాకచక్యంగా ప్రవర్తించేవాడు తను.

సూక్ష్మంగా పరిశీలిస్తే ఇదీ తన జీవిత సింహావలోకనం!

ఆమె అన్నదంటే తప్పేముంది? ఉత్త పుణ్యానికని తనెన్ని అపచారాలు చేశాడు! ఎందర్ని బాధించాడు! వాళ్ళంతా తనను మరింత రెచ్చగొట్టకుండా ఈ విధంగానే చెప్పిఉంటే తను అల్లా ప్రవర్తించి ఉండేవాడా! తన కెవరూ ఈవిధంగా బుద్ధి చెప్పడానికి ప్రయత్నించలేదు.

తన తెలివి తక్కువతనానికి ఆమె సిగ్గుపడింది. ఒక ఆవేశం, ఆవేదన కనిపించాయి ఆమె మాటలలో. తమ్ముడు చెడ్డపని చేస్తే మందలించే అక్కలా ప్రవర్తించింది ఆమె. ఎంత నిస్సంకోచంగా మాట్లాడింది! మొగుణ్ణి గురించి ఎంతగానో చెప్పింది.

నిర్మల దృష్టితో పరికిస్తే ఎంత అనుభవయుతంగా ఉన్నాయా మాటలు! తనకంటె చిన్నది ఒక్క సంబోధనతో పసివాడిని చేసేసింది. గృహిణి కాగానే స్త్రీ మానసికంగా ఎంతో ఎదిగిపోతుంది. ఆమె ఆలోచించే తీరేవేరు! ఎంత చక్కగా మాట్లాడింది! వ్యంగ్యంగా ఉన్నా ఆ మాటల్లో ఎంతో సత్యముంది. భర్త ఎంత సంస్కారం గలవాడో! నిజంగా తను నిష్కల్మషంగా ఆమె స్నేహం, ఆదరణ వాంఛించి ఉంటే హృదయ పూర్వకంగా అంగీకరించి ఉండేది. ఆ సంగతి స్పష్టంగా ఆమె నోటినుంచి వెలువడింది.

ఇన్నాళ్ళు ఇంత ధైర్యంగా మసిలిన తను ఆమె మాట్లాడుతూ ఉండగా ఆమె ముఖంమీంద గోచరించిన వెలుగును భరించలేకపోయాడు.

తాగినవాడిని లెంపకాయ కొడితే నిషా దిగిపోయి నట్లు కళానిధికి కూడ కనువిప్పు కలిగింది.

ఆలోచనలు ఇటు తిరగగానే అంతదాకా కోపంతో వేగిపోయి ఉడికిపోయిన హృదయం పశ్చాత్తాపంతో కుమలడం ఆరంభించింది.

ఈ సంఘటన జరగకపోయి ఉంటే—

ఇక తను ఇతరులకు ముఖం ఎట్లా చూపగలడు?

తోటివారిలో తన పరువు ప్రతిష్ఠ ఏమవుతాయి?

అబ్బబ్బ! ఈ ఆలోచనలనుంచి ఎలా తేరుకోనేది!

రూంమేటు ఊరికి వెళ్ళాడు. అది గుడ్డిలో మెల్ల. ఒంటరితనం మరీ పీడిస్తూంది.

నాలుగు గంటలకు మెస్సుకు వెళ్ళాడు కాఫీ త్రాగడానికి.

ఒక్కడూ వెళ్ళి ఒకమూల కూర్చున్నాడు. తక్కిన చోట్లల్లా ముగ్గురేసి నలుగురేసి ఉన్నారు. కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూ ఉన్నారు. ఎందుకనో వాళ్ళంతా తనను చూసి నవ్వుతున్నట్టే అనిపించింది కళానిధికి. బహుశః వాళ్ళలో ఎవరైనా మధ్యాహ్నం ఆ సంఘటన జరిగినప్పుడు చూసి ఉండచ్చు. అదే విషయం మాట్లాడుకుంటూ ఉండచ్చు.

ఇక అక్కడ కూర్చోలేకపోయాడు.

తిన్నగా బయలుదేరి బీచ్‌కి వెళ్ళాడు.

ప్రకృతి మామూలుగానే ఉంది. సముద్రం ఉరకలు వేస్తూనే ఉంది. చల్లని గాలి వీస్తూనే ఉంది. గంటల తరబడి ఈ ఒడ్డున కూర్చుని ఎంతో ఆనందించిన తనకు ఇవన్నీ ఇవాళ ఎందుకో ఉత్సాహాన్ని కలిగించలేక పోతున్నాయి. మనస్సు వికలంగా ఉంది.

అనూరాధ ఇంటికి వెళ్ళి ఈ విషయం భర్తకు చెప్తే!

అత నీ విషయం అందరికీ చెప్పి ప్రిన్సిపాల్‌కూ, ప్రొఫెసరుకూ చెప్తే? ఎంత తలవంపు! ఈ ప్రిన్సిపాలు తన

తండ్రికి తెలిసి ఉన్నవాడు కాదు. ఇక్కడ తనకు మద్దతు ఇచ్చేవాళ్ళు లేరు.

తనను కాలేజీనుండి వెళ్ళగొట్టిస్తే! తన తండ్రికి విషయం తెలిస్తే! ఇప్పటికి బహుశః తన ప్రవర్తనను తండ్రి గ్రహిస్తూ ఉండచ్చు. ప్రేంచుకోలేని మమకారంతో తనను క్షమిస్తూ ఉండచ్చు. కాని ఆయన మాత్రం ఎంత కాలం సహించగలడు ?

మానవత్వంలో ఉన్న అందం అక్కడే ఉంది. ఆవేశంలో, కోపంలో ఉన్నప్పుడు ఎన్నో పనులు చేస్తారు. వాటికి తమ జీవితంమీద ఏలాంటి ప్రభావం ఉన్నదో ఆలోచించరు ఏమైనా లెక్కపెట్టరు. కాని ఒకసారి కను విప్పు కలిగితే వెంటనే ఫలితాలు తలుచుకుంటే భయం ఆవరిస్తుంది. అదవరలో అటువంటి సంఘటనలు ఎన్నో ఎదురౌతున్నప్పుడు ఉన్న ధైర్యం సడలిపోతుంది.

అటువంటి భయానికే లోనయ్యాడు కళానిధి.

రాత్రి ఎనిమిది అయిపోవచ్చింది. వెన్నెలలో సముద్రం మరింత అందంగా కనుపిస్తూంది.

కళానిధి ఆలోచనలు మాత్రం తెగడంలేదు.

మెస్సు కట్టేస్తారింక. బయులుదేరాడు.

రాత్రంతా కలత నిద్రతోటే గడిపాడు. ఎవరితోనూ తన బాధ విప్పి చెప్పుకోలేదు.

అనూరాధ ఎదురౌతుందేమోననే భయంతో రెండు రోజులు కాలేజీ ఎగగొట్టి గదిలోనే గడిపాడు.

మూడో రోజు ఆదివారం. మధ్యాహ్నం మెస్ నుంచి వచ్చి వారపత్రిక చేత పట్టుకుని కూర్చున్నాడే కాని మనస్సు దానిమీద లగ్నంకావడం లేదు.

"కళానిధిగారూ !" అన్న పిలుపు విని ఉలిక్కిపడ్డాడు.

ఆ కంఠం తానింతవరకూ వినలేదు. ఎంతో గంభీరంగానూ, మృదువుగానూ ఉంది.

"లోపలికి రండి" అన్నాడు.

తలుపు త్రోసుకుని విశ్వం వచ్చాడు.

"కళానిధిగా రున్నారా?" అన్నాడు.

"నేనే కళానిధిని. ఏంకావాలి మీకు ?"

"నమస్కారం. నా పేరు విశ్వం. నేను మీకు తెలియదు. కాని రాధ చెప్పింది, మిమ్మల్ని కలుసుకోమని. ఆమె దురుసుగా మాట్లాడింది. అందుకని ఆమె తరఫున క్షమాపణ చెప్పడానికి వచ్చాను. కాదనకండి."

కళానిధి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. నోటమాట రాలేదు. జీవితంలో అది అతనికి మొదటిసారి.

"చూడండి విశ్వంగారూ ! మొన్న జరిగిన సంఘటనకే నేనెంతో కుమిలి కృశించిపోతున్నాను. నాకు కనువిప్పు కలిగింది. ఇప్పటికే క్షోభించి పోతూన్న నా మనస్సును మీ మంచితనంతో మరింత కలవరపెట్టకండి. నా అసభ్య ప్రవర్తనను, ఆమె భర్తగా నిందించండి. తల వంచుకొని తప్పు ఒప్పుకొంటాను. నా క్షమాపణ అంగీక

రించండి. ఇక జన్మలో నా ముఖం ఆమెకు కనపడనీయనని చెప్పండి" అన్నాడు పూడిపోయిన గొంతులోనుండి బల వంతంగా మాట్లాడుతూ.

విశ్వం తట్టుకోలేకపోయాడు ఈ సంఘటనకు. నిధి భుజంమీద చెయ్యివేసి ఇలా అన్నాడు: "చూడు బాబూ! నువ్వింత బాధపడతావని తెలిస్తే అసలు వచ్చేవాడినే కాదు. కాని రాధ ఇంకా బాధపడుతూంది. నిన్నెలాగైనా ఇంటికి తీసుకురమ్మంది. నా యీ మాటలు వేళాకోళాని కంటున్నవి కావు."

కళానిధి విశ్వాన్ని కౌగలించుకుని ఏడ్చేశాడు. వర్ణనకు అతీతమయిన అనుభూతి, దాని ఫలితమూను దానికి కారణాలు.

వెంటనే నిగ్రహించుకొని అన్నాడు, నవ్వుతూ_

"రెండు నిమిషాలు బావగారూ! ఇన్ని నీళ్ళుముఖాన కొట్టుకొని వచ్చేస్తాను" అంటూ బయటకు దారితీశాడు. విశ్వం ముఖంమీద శరజ్జ్యోత్స్నాసన్నిభమైన మందహాసం తొణికిసలాడింది.

ముఖం కడుక్కుని వచ్చాడు కళానిధి, బట్ట మార్చుకున్న తరువాత ఇద్దరూ బయలుదేరారు. ఎక్కడికని నిధి అడగలేదు. విశ్వం చెప్పలేదు.

ఔట్ గేటు దాటిన తరువాత హోటల్‌కు ద

లియ్యబోతే వారించాడు విశ్వం. బండి పిలవబోయినా అల్లాగే అన్నాడు.

"హాయిగా ఈ నాలుగు అడుగులూ నడిచే పోదాం."

నాలుగుకోడ్ల జంక్షన్ దగ్గర వాల్తేర్ క్లబ్‌కుపోయే రోడ్డంట నడక సాగించారు.

ఎదురుగా రెండు ఫర్లాంగులలో ఉంది సముద్రం. ఆరు వంకర్లతో ఆరు ఫర్లాంగుల రోడ్డు, తారుది. అదంతా డౌన్. వాహనం ఎక్కితే నడపకుండానే జారిపోయేటంత దిగుడుగా ఉంటుంది. పక్కన అడ్డగోడ, చిన్నది, పడిపో కుండాను. క్రిందికి లోతుగా ఎర్రమట్టి గుట్టలు. వర్షాలకు నీరు మట్టినికోసి బీటలు తీస్తుంది. విచిత్రమైన శోభతో కూడి ఉంటాయా గుట్టలు. మెలికలు తిరిగిన ఈ రోడ్డు రామకృష్ణా మిషన్ సత్రం పక్కన బీచ్ రోడ్‌లో కలు స్తుంది. అక్కడ సిమెంట్ బెంచీలు, ఇసుకలో ఆడుకునే పిల్లలు. ఎల్లా వచ్చిందో పేరు తెలియదు గాని. ఆ ప్రదే శాన్ని 'స్కాండల్ పాయింట్' అంటారు.

కళానిధి నోరు విప్పి తన గత చరిత్ర అంతా విశ్వానికి వినిపించాడు. విశ్వం సానుభూతితో విన్నాడు.

ఇంటిదగ్గర అనూరాధ ఎదురు చూస్తూంది వీరి రాకకు. హైమకూడా అక్కడే ఉంది.

"వచ్చావా తమ్ముడూ! రావేమోనని భయపడ్డాను" అంది అనూరాధ నిధిని ఆప్యాయంగా ఆహ్వానిస్తూ.

"రాధా! మీ తమ్ముడు అసలెప్పుడూ నువ్వను కున్నంత చెడ్డవాడు కాదు. ఇప్పుడసలే కాదు. ఏమోయ్" నవ్వుతూ అన్నాడు విశ్వం.

"అక్కయ్యా! ఆవాళ జరిగిన సంఘటనకు నేనెంతో సిగ్గుపడుతున్నాను. కాని ఒకందుకు అది నా మంచికే జరిగింది. లేకపోతే నిన్నుగాని ఇటువంటి బావగారిని కాని జన్మలో సంపాదించి ఉండలేకపోదును."

"మీ బావగారి విషయం నీకింకా పూర్తిగా తెలియక నువ్వలా మాట్లాడుతున్నావు. ఆవాళ విషయం చెపితే నన్నెంత కేకలేశారో అడుగు హైమను. ఏం హైమా?"

హైమ నవ్వి ఊరుకుంది.

హైమను చూసి తల దించుకున్నాడు నిధి.

"నీ ప్రతాపం అంతా హైమ ఇదివరకే చెప్పిందోయ్. నువ్వింక సిగ్గుపడక్కర్లేదు. ఆమెతో మాట్లాడడానికి" అన్నాడు విశ్వం.

నవ్వేశాడు నిధి.

అది మొదలు ఆ యింటికి వచ్చే అతిథుల సంఖ్య 'మరొక్క మెట్టు' పైకి వెళ్ళింది.

# 7

యూనివర్సిటీ కార్యకలాపాల్లో అనురాధకు ఆహ్లాదం కలిగించిన మరో ఘట్టం ఆంధ్ర వారోత్సవాలు. సంక్రాంతి సెలవులు వారం పది రోజులున్నాయనగా మొదలౌతాయి సాధారణంగా స్నాతకోత్సవం అనంతరం.

వివిధ విషయాలమీద అందులో నిష్ణాతులైన వక్తలు వచ్చి మాట్లాడుతూ ఉంటారు. రాత్రి విధిగా నాటకాలు, నాటికలు ఉంటాయి. ఈ నాటికలు, నాటకాలు వివిధ అనుబంధ కళాశాలలు ప్రదర్శిస్తాయి. వాటిలో ఉత్తమ ప్రదర్శనకు, ఉత్తమ నటులకు బహుమతులు పంచి[illegible] బడతాయి. ఈ నాటకాల పోటీలలో పాల్గొనే అర్హత విశ్వవిద్యాలయ కళాశాలకు లేదు. లోగడ స్థానబలంవల్ల బహుమతుల నిర్ణయంలో పక్షపాతం జరిగిందని విమర్శ. అందుకే విశ్వవిద్యాలయ కళాశాలకు ఆ అర్హత తొలగించారు.

సాహిత్యం, కళలు, చరిత్ర మొదలైన వివిధ విషయాలమీద ప్రసంగాలు జరుగుతాయి సాధారణంగా సాహిత్యం మీద జరిగే ప్రసంగాలకు జనం చాలా తక్కువగా ఉంటారు. మొదట చాలామంది ఉన్నా పోను పోను జారుకుంటారు.

ఒకనాటోజున ఒక వక్త మాట్లాడారు. మామూలుగా అందరూ వచ్చారు, ఏదో అరగంట ఉండి వెళ్ళిపోవచ్చు నని. కాని వక్త ప్రభావం ప్రేక్షకులమీద ఎంత ఉంటుందో ఆనాడు రుజువైంది. మూడుగంటలసేపు ఎంతో ఓపిక గాను, సులువుగాను మాట్లాడా డాయన. సూదిమొన మోపితే వినపడేటంత నిశ్శబ్దం; ఆయన ఆగినప్పుడల్లా కరతాళధ్వనులు. క్లాసులలో ఏభై నిమిషాలు ఎప్పటి కౌతాయా అని క్షణాలు లెక్కపెట్టే విద్యార్థులందరూ శిలా ప్రతిమల్లా, మంత్రముగ్ధులుగా కూర్చుండిపోయారు భోజనాలు మానిచి సాధారణంగా మరో ఆసక్తితో కూడా విద్యార్థులు ఇటువంటి సభలకు వస్తూంటారు. నలుగురు మిత్రులు ఒకచోట కూర్చుని బాతాఖానీ వెయ్యొచ్చుగదా అని. కాని ఆ నాడటువంటివేమీ జరగలేదు. పోనీ ఆయన చెప్పిన విషయాలైనా నలుగురినీ కాస్సేపు నవ్వించి కూర్చో బెట్టి తన పరువు దక్కించుకోనేలాగ కూడా లేవు. ఎంత ప్రతిభాశాలో ఆయన! లెక్చరర్లంతా పాఠాలావిధంగా బోధించగలిగితే అర్థంకాని విద్యార్థి ఒక్కడుంటాడా అను కుంది అనూరాధ.

ఎన్నో చక్కని విషయాలు చెప్పాడాయన. ఒకసారి ఆయనను, రాయలు పెద్దనకు కంకణం బహూకరించిన సంఘటనను ఊహించి చెప్పమని ఆలిండియా రేడియో వారు కోరారట! ఆయన తన ఊహాను ఊపిరిపోసి వర్ణిం చాడు ఆ ఘట్టాన్ని. అది ఆవాళ ఉపన్యాసంలో కూడా

చెప్పాడు. ఆ దృశ్యాలన్నీ కళ్ళకు కట్టినట్టు చూపించాడు. ఎంత భావోన్నతిగలవాడో! గంభీరుడైన రాయలమూర్తి, బంగరు తూగుటుయ్యాలలో ఊగుతూ, చామర గ్రాహిణులు నెమలి పింఛపు వీవనలతో విసురుతూండగా, కస్తూరి తాంబూలాలు సేవించే మహాభోగి పెద్దన్న, తదితరకవుల, ఆ హడావిడి అంతా వేదికమీద చూపించా డాయన తన మాటల ప్రతిభతో.

కాకినాడలో తాను చదువుకునే రోజులలో సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శిష్యుడుగా తన అనుభవాలను చెబుతూ గురువును తలుచుకుని కన్నీరు స్రవించాడు. అంత అనుభూతి గల సున్నితమైన మనస్సు. గురుభక్తి అంటే అదే కాబోలు ననిపించింది.

గురజాడవారిని గురించి మాట్లాడుతూ అదివరలో ఎన్నడూ చూడని గొప్పతనం చూపెట్టాడు 'కన్యాశుల్కం'లో. నిత్యజీవితంలో గిరీశం మూర్తీభవించిన దుర్మార్గుడు. అతను చెయ్యని చెడ్డపని లేదు. కాని అల్లా అనిపించదు చదివినంతసేపూ. పైగా సానుభూతి కలుగుతుం దతనిమీద. చివరకు ఆ మహాకవి కూడా అల్లాగే చేశాడు; 'డామిట్! కథ అడ్డం తిరిగింది' అంటూ భరతవాక్యం పలికాడు. చెరసాలకు ఈడ్పించలేదు! ఉరికొయ్యకు గురిచెయ్యలేదు!! దైనందిన జీవితంలో ఎందరో గిరీశాలు తారసిల్లుతారు. రచయిత ఉన్నతి పాత్ర సృష్టిలోని వైచిత్రిలోనే ఉందంటాడావక్త మహాకవి అంత

ఉదాత్తుడు కాక ఎవరెవ్వరైనా గిరీశాన్ని చిత్రించడానికి ప్రయత్నిస్తే సినీమాలలో కనబడే విలన్‌లవలె కనపడతా రంటా డాయన. ఉన్నతిలేని రచయిత విలన్‌ను చిత్రవధ చేసిగాని వదలలేడు. పాత్రలకన్న మరోమెట్టు పైనుండి అందరినీ నిష్పాక్షిక దృష్టితో చూడలేడు. అల్లా చెయ్య లేని రచయిత సృష్టించే పాత్రలన్నీ పాక్షికమైన దృక్ప థానికి చిహ్నాలుగానే ఉంటాయి.

శరత్ ఇదే సత్యాన్ని ఇంకోలా చెప్పాడు. రచ యిత, న్యాయమూర్తి ఒకలాంటి వారన్నారు. ఇద్దరూ ఒక విషయాన్ని నిష్పాక్షిక దృష్టితో చూస్తారు. ఎవరి వేపూ వారి మమతలు మొగ్గవు. న్యాయమూర్తి సమాజ క్షేమం కోరి దుర్మార్గునికి శిక్ష విధిస్తాడు. రచయిత ఇంకో మెట్టు పైకివెళ్ళి 'మనం మనుష్యులం!' అనుకుని ఆ దుర్మా ర్గుణ్ణి చూసి అతని బలహీనతకు జాలి పడతాడు

అనూరాధకు ఆయన చెప్పినవన్నీ ఎంతో నచ్చాయి. అబ్బ! ఎన్ని యేళ్ళు విద్యాలయాల్లో చదివి ఆయన గంటల్లో చెప్పినవి నేర్చుకోగలం! అని ఆశ్చర్యపోయింది. అదివరలో ఆమె 'కన్యాశుల్కం' చదివినప్పుడు అందు లోని హాస్యపూరితమైన సంభాషణలను ఎంతో ఆనందిం చింది. కాని ఇంత విలువ ఉన్నట్టు గ్రహించలేకపోయింది. అందుకే గాబోలు రచయిత రచనకు విమర్శ మెరుగు పెడుతుందంటారు అనుకుంది అనూరాధ.

మరో రోజున నాటక కళను గురించి మరొకరుప న్యసించారు. ఈయన పద్ధతి ఇంకోలా ఉంది. ఒక విష

యాన్ని గురించి మాట్లాడే ముందు కొంత ఉపోద్ఘాతం ఇస్తారుగదా! చాలామంది వక్తలలో ఆ ఉపోద్ఘాతం ఉపన్యాసంకంటె దీర్ఘమై ప్రయోజన శూన్యంగా కనపడడంతో ఎందుకిలా కాలం వృథాచేస్తారా? అనిపించేది అనూరాధకు. ఎందుకో ఈయన తన ఉపన్యాసంలో చక్కగా చూపించారు. లలిత కళలు, వాటి అవసరాలు గురించి మొదలుపెట్టి నాటక కళలోకి క్రమంగా లీనమయ్యారు. మానవుడి అవసరాలు విచిత్రంగా ఉంటాయి. అవి అవసరాలని మనకు తెలియడం కూడా, అవిలేనప్పుడు మనకు కనిపించే లోటువల్లే! కళ అనేదాని అవసరాన్ని వివరించేముందు ఆయన ఒక ప్రశ్నవేశారు. తిండి, బట్ట, ఇంకా కావలసిన అవసరాలను సమకూర్చి ఒక జైలు లాంటి దానిలో నిర్బంధించి ఉంచితే ఉండగలరా? అని. ఉండలేరు. ఎందుకంటే కావలసినది కేవలం తిండి, బట్ట మాత్రమే కావు. నచ్చిన తీరులో సంచరించగల స్వాతం

త్ర... ...రి అభిరుచులనుబట్టి వినోదం,

...బతుకు పరిపూ

...తినట్టయి

కేవలం ఒక భావాన్ని చిత్రించడంలో ఉపయోగించిన ఉపమానం మాత్రమే అది! ఇంకో విషయం ఏమిటంటే- మానవుడు వాస్తవ జీవితంలో తను చూసేవాటితో సంతృప్తి చెందలేకే, ఆనందాన్వేషణలో కళలను వెంటాడుతాడు. ప్రతి మానవుడికీ కొన్ని కొన్నిటి రూపాలు ఒకలా ఉండాలనిపిస్తుంది. స్త్రీ సౌందర్యాన్నే తీసుకోండి. వారి అవయవ నిర్మాణం ఒకలా ఉంటే బాగుంటుందనిపిస్తుంది. వాస్తవ జీవితంలో అది అతనికి కనబడకపోతే తన ఊహను పురిగొల్పి చిత్రాన్ని కాని, శిల్పాన్ని కాని రూపొందిస్తాడు. అదీగాక వాస్తవికత మనం రోజూ అనుభవించేదే. అందులోని విలక్షణతనూ, లోపాలను ఎల్లా సవరించాలో కళ ప్రబోధిస్తుంది. అందుకే కళలలో అతిశయోక్తి ఎక్కువగా కనపడుతుంది. నాటకాలలో అభినయాన్ని గురించి చెబుతూ, దుస్తులెల్లా ఉండాలో, ఒక పాత్రకు ఒక నటుడు నప్పుతాడో లేదో ఎల్లా చూసుకోవాలో, మాటల తీరు ఎల్లా ఉండాలో, హావభావ ప్రకటనలు ఎల్లా ఉండాలో, నా... ...లో

మామూలు ...

విరుద్ధమై...

అవి. అందుచేత నటుడు తనను తాను గుర్తుంచుకుని తన నటనతో ఆ పాత్ర ప్రవర్తనను ప్రేక్షకుల హృదయాల మీద హత్తేలాచేసి వారిలో సంచలనం తీసుకురావాలి. తీసుకువచ్చి ఆ రసం వారిలో ఉద్దీపింప జెయ్యాలి అన్నారు.

రోజూ రాత్రి నాటకాలు ఉండేవి. చాలా చక్కగానూ, కష్టపడీ ప్రదర్శించేవారు. రంగస్థలం అలంకరణ, శబ్ద ప్రసారక యంత్రాలు, దీపాలు అన్నీ ముచ్చటగా అమర్చేవారు. అక్కడ మాత్రం విద్యార్థి, అధ్యాపకుడు అనే భేదం లేకుండా ఎంతో పరస్పర సహకారంతో సంచరించేవారు.

ఇంక, పోటీ నాటకాలలో ఆయా ఊళ్ళనుంచివచ్చి విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేస్తున్న విద్యార్థులు, ఆ ఊళ్ళలోని అనుబంధ కళాశాలల తరపున వచ్చిన బృందాలకు మద్దతు ఇచ్చేవారు. వారికే బహుమతి రావాలని ఉబలాట పడేవారు. ఇతర నాటకాలలో గొడవ చేసేవారు.

ఈ హడావిడి అంతలోనూ గోచరించే ఒక్క విషయ మేమిటంటే—వక్తలుగాని, కళాకారులు గాని —తాము నిర్వహించబోయే పనులలో నిజంగా ప్రజ్ఞలేకపోతే వేళాకోళాలకు గురి అయ్యేవారు. వేదిక దిగిపోయేవరకు గోల జరిగేది. కాని వాళ్ళల్లో నిజంగా ప్రతిభ ఉంటే మన్ననకు పాత్రులయే వారు.

ఈ కార్యక్రమాలన్నిటికీ అనూరాధ, ఆమెతోపాటు హైమ, విశ్వం తప్పకుండా హాజరయ్యేవారు. ప్రదర్శనల అనంతరం ఊళ్ళోకి వెళ్ళడానికి బస్సు ఏర్పాట్లు విశ్వ విద్యాలయం వాళ్ళే చేస్తారు.

# 8

ఈ ఉత్సవాలన్నీ గడిచిపోయేసరికి పరీక్షలు దగ్గరకు వచ్చేశాయి.

ఒకరోజున తుఫాన్‌లా వచ్చింది శైలజ ఒక అర డజను పుస్తకాలు పట్టుకుని. అప్పుడే సాయం వాహ్యాళికి బయలుదేరుతున్న అనూరాధ, విశ్వం ఆమెను చూసి వెనక్కి మళ్ళారు.

"బొత్తిగా కనపడడం మానేశావేం అన్నయ్యా? ఇదివరకు తరుచు హాస్టల్‌కి వచ్చేవాడివిగా? ఇప్పుడసలు రావటమే లేదేం? నేను పరీక్షలు దగ్గర పడుతున్నాయి గదా అని మానేస్తే నువ్వూ మానుకున్నావన్నమాట! లేకపోతే ఈమె కట్టిపడేస్తూందా? ఈమె ఒకతి!" అంది కృత్రిమ కోపంతో.

విశ్వం, అనూరాధ నవ్వుకున్నారు.

"మరే మరే! ఈయనే నేను కట్టిపడేస్తే ఆగేద! నీకంత కంటగింపుగా ఉంటే పోతానులే! అయినా మీ అన్నా చెల్లెళ్ళ మధ్య నేనెందుకు?" అంటూ అనూరాధ

కూడా కోపం ప్రదర్శించబోయింది గాని నవ్వు వచ్చేసిం దామెకు.

"మీ ఇద్దరికీ నేనే లోకువగా దొరికినట్టున్నాను. కానీండి! ఒకళ్ళనొకళ్లు ఆడిపోసుకుంటూ కూర్చోండి. నే నలా వెళ్ళొస్తాను" అంటూ లేపబోయాడు విశ్వం.

"ఇంతకీ తమ రెండుకంటీ దయచేశారు చదువు కట్టిబెట్టి?" అనూరాధ శైలజ నడిగింది.

"నీతో పని ఉండి కాదు లేవమ్మా."

"మరి?" అనూరాధ ప్రశ్న.

"మా అన్నయ్యతో పని ఉండి."

"నాతోనా?"

"మరే. ఈ దస్త్రం చూశావా? ఎల్లుండి వస్తాను. నా కివన్నీ చెప్పాలి."

"నేనా!!!"

"ఓస్! అంత గాభరా ప్రదర్శించకు. ఒక చిన్న కాగితం ముక్క మీద కావలసినవన్నీ రాశాను. చదివి కొంచెం అర్థం అయేలా చెప్పాలి. ఏమమ్మోయ్! ఎల్లుండికి ఆయన అవన్నీ చెప్పలేకపోతే నీ భరతం పడ తాను! ఇక వెడతాను. అమ్మోదీ! అమ్మా!" అంటూ వంటింట్లోకి వెళ్ళి శాంతమ్మగార్ని కూడా పలకరించి ఎంత హడావిడిగా వచ్చిందో అంత అల్లాగా వెళ్ళిపోయింది.

విశ్వం నవ్వుకున్నాడు. కాని అనూరాధకు మతి పోయింది.

ఈయన బియ్యే. ఆమెగారి పాఠాలు ఎమ్మేవి. ఈయన చదివి అర్థం అయ్యేటట్టు చెప్పగలడని ఆమెకు అన్నగారిమీద ఎంత అచంచల విశ్వాసమో! ఈ విషయం తన ఊహ కెన్నడూ రాలేదు. తనకర్థం కానివి అలా ముద్దలా పడేసి అట్టే పెడుతూంది కాని విశ్వాన్ని అడగాలని ఊహే రాలేదు. పెరట్లో సంజీవి పెట్టుకుని మందు కోసం ఊరంతా గాలిస్తూంది తను. విశ్వం ఎంత గంభీరుడు! మాటవరసకైనా తా నిదివరలో శైలజకు పాఠాలు చెప్పినట్టు తనతో అనలేదు. నివురుగప్పిన నిప్పులాంటి వారాయన. బూడిద ఊదితే తప్ప లోపల నిప్పుందని కాని, దాని నుపయోగించుకోవడంగాని తెలియదు. తుఫాన్‌లా వచ్చి నాలుగు వేళాకోళపు కబుర్లాడి తనకో గొప్ప బాట చూపి పోయింది శైలజ. తనకు తెలియకనే పోనుగదా, ఆమె చెప్పకపోతే! విశ్వంమీద గౌరవం పెరగడంతో పాటు చిరుకోపం కూడా వచ్చింది.

ఇటు భార్యపై పుటిరిగిన విశ్వం ఆమెలోని మార్పుకు కారణం ఊహించలేకపోయాడు.

"రాధా! ఏమిటలా ఉన్నావ్ ?" అడిగాడు మృదువుగా.

"ఏం లేదు. కాని మీరు శైలుకి పాఠాలు చెప్పేవారని నాతో చెప్పలేదేం?"

"ఆ విషయం మన ప్రసంగంలోకి రాందే !"

"అంతే నన్నమాట! ఆమెకు మీ రిదివరలో పాఠాలు చెప్పి ఉన్నట్లు తెలిస్తే నేనూ చెప్పించుకుని ఉండేదాన్ని మీచేత. ఒక్కనాడు నేనెల్లా చదువుతున్నానో అడిగారా? నాకేమైనా సందేహాలొస్తున్నాయేమో తెలుసుకునేందుకు ప్రయత్నించారా?"

"నువ్వు చెప్పందే నాకెలా తెలుస్తుంది?" కొంటెగా అన్నాడు విశ్వం.

"అవును. మీకు వేళాకోళంగానే ఉంటుంది. కాని నాకు చెప్పగలనని తెలిసి ఉండీకూడా నన్ను ఆ ఉపయోగానికి దూరం చేశారు ఈ ఆరునెల్లూను. ఇవాళ శైలు వచ్చి చెప్పేదాకా తెలియనే లేదు."

"అందుకు బాధగా ఉందా?"

"ఉండదు మరీ! నన్నో వెర్రిదాన్నిచేశారిన్నాళ్లూ. ఎంతఇదండీ మీకు." బాధగా అంది.

"కోప్పడకు!" అంటూ నవ్వేశాడు విశ్వం.

ఆ రాత్రి ఆమెకు ఎంతకూ నిద్రపట్టలేదు. ఈ విషయాలే ఆలోచించింది. నవ్వుతూ, త్రుళ్ళుతూ అల్లరిచేసే ఆయనలో ఎంత గాంభీర్యం ఉందో! తను ఆయనను పూర్తిగా అర్థం చేసుకున్నాననుకుంది. తీరా చూస్తే ఏమీ తెలియనే తెలియదు తనకు. తనలోని ఎన్ని తప్పులనో కూడ అతనింత క్షమా దృష్టితోనే చూస్తున్నారా? తను అతన్నెన్నటికైనా అర్థం చేసుకోగలదా? ఈ ఆలోచనలతో ఆమె కొక భయం పట్టుకుంది. తనను ఆయనెంత

సన్నిహితుడనుకున్నా. ఏదో దూరం కనపడుతూనే ఉంది మధ్య మధ్య.

పక్కనే ప్రశాంతంగా నిద్రపోతున్నాడు విశ్వం. అనూరాధ అటువైపు చూసి ముగ్ధురాలై పోయి అటునుంచి దృష్టి మరల్చుకోలేకపోయింది. అప్రయత్నంగా తనవేళ్లను అతని జుట్టులోకి పోనిచ్చి నిమురసాగింది. అంతలో విశ్వానికి మెలకువ వచ్చింది. ఆమెకేసి చూసి చిరునవ్వు నవ్వాడు.

"ఏం రాధా, నిద్ర పట్టటం లేదా?" అన్నాడు ఆమె భుజం తట్టుతూ.

ఆమె అల్లా అతని ముంగురులు సవరిస్తూ ఉంది. కాని సమాధానం చెప్పలేదు.

"ఏమిటి రాధా?" అన్నాడు ఆత్రుతగా.

"ఏం లేదు. ఇవాళ నా కెందుకో బాధగా ఉంది. మిమ్మల్నెంతో అర్థం చేసుకున్నా ననుకున్నాను గాని ఏమీ లేదని ఇవాళ తెలిసింది. మీరు ఇంత దగ్గరగా ఉండి కూడా దూరంగా ఉన్నట్టే భాసిస్తున్నాను. ఎప్పటికైనా అర్థం చేసుకోగలనో లేదో! ఎంత గంభీర హృదయులండీ మీరు!"

"ఛీ పిచ్చిపిల్లా! శైలు నన్నేదో పెద్ద చేసిందని అదంతా నిజం అనుకుంటున్నావా? ఒక వ్యక్తికి గొప్పతనం రెండు విధాల ఆపాదింపబడుతుంది. ఒకటి: అతను నిజంగా గొప్పవాడు కావడం. రెండు: నలుగురికి అతని మీద విశ్వాసం ఉండి అతనేం చెప్పినా గొప్పగా కన

పడడం. శైలుకి నేనంటే అభిమానం. నేను చెప్తే తనకు అర్థమౌతుందని ఒక వెర్రి నమ్మకం; శంకుశబోస్తే తీర్థమైనట్లు. చిన్నప్పుడు మాకొక మేష్టారుండేవారు. పద్యాలకు అర్థాలు చెప్పడం మహా విచిత్రంగా చేసేవారు. ఏదో 'మందార మకరంద... మధుపంబు బోవునే మదనములకు' అని చదివి, పోతుందా? ఎందుకు పోతుంది? పోదని భావము అని టకీగా చెప్పి ఇంకా అర్థం కాకపోతే అడగమనే వారు నేను శైలుకు చెప్పినా అంతే. అయితే మనలో ఒక బలహీనత ఉంటుంది. మనకు ఒకటి తెలియదనుకుని ఫలానావాడు చెప్తే అర్థమౌతుందని నమ్మకం ఉంటే, ఆ భావం మన సత్వంమీద పనిచేసి మనం ఎంత చదివినా అర్థం కానట్టుండి ఆ ఫలానావాడు ఊరికే చదివితే చాలు అర్థమైపోతుంది. తేలు మంత్రం విషయం చూడు. అంతే—"

"ఆపండి అల్లాంటి కబుర్లు. నా కళ్ళలో మీరు కారం కొట్టలేరు. మీరు బాగా చెప్పడంచేతే, శైలుకి నమ్మకం కుదిరి ఉంటుంది. మీరేదో డొంక తిరుగుడుగా సమాధానం చెప్పి నా కన్నుగప్పాలని చూస్తున్నారు. కాని ఒక శక్తి ఉన్నవాళ్ళు గుప్తంగా ఉంచేసుకుని అది ఇతరులకు ఉపయోగపడకుండా చేస్తే ఎంత నష్టం జరుగుతుందో ఆలోచించారా ? ఒకళ్ళు తప్పుచేస్తే తప్పని తెలిసీ ఊరుకున్నవాళ్ళను ఏమనాలంటారు ?"

"నీకివాళ ఏదో అయింది. నీమనస్సు మనస్సులో

లేదు. ఎందుకో బాధ పడుతున్నావు. నేను కథ చెపుతాను. నువ్వు 'ఊ' కొడుతూ పడుకో. నిద్ర వస్తుంది."

"కట్టిపెట్టండి వేళాకోళాలు! నా మనస్సెంత కుమిలి పోతూందో. నే నెంత బాధపడుతున్నానో మీరూహించి కూడా ఉదాసీనత వహిస్తున్నారు. ఏనాడేనా నేను ఘోరమైన పొరపాటుపడ్డా నన్ను సరిదిద్దడానికి ప్రయత్నించకుండా నా దారినుంచి వైదొలగిపోతారేమోనని భయం వేస్తూంది. అల్లాగే జరుగుతుందని కూడా మనస్సు కీడు శంకిస్తూంది" అంది కన్నీళ్ళతో.

"ఊరుకో రాధా! లేనివన్నీ ఊహించుకుని బాధ పడకు. నువ్వలా ఎప్పుడూ పొరపాటు పడవని నాకు తెలుసు" అన్నాడు విశ్వం ఆమె కన్నీళ్ళు తుడుస్తూ.

"పొరపడ్డా మాత్రం మీరు నేను చెప్పినట్టే చేస్తారు కదూ ?"

"ఏమిటి రాధా నీ వెర్రి!" తీక్షణంగా అన్నాడు విశ్వం.

అనూరాధ చలించిపోయింది. ఇంకేమీ మాట్లాడకుండా ఊరుకుంది.

మర్నాడు ప్రొద్దుట, రాత్రి మూడు గంటల వరకు విశ్వం శైలజ ఇచ్చిన పుస్తకాలు చదువుతూనే ఉన్నాడు. ఎంతో ఓపికగా ముప్పై పేజీల నోట్సు తయారు చేశాడు. దినపత్రికలు తిరగేసి మరికొంత గ్రంథం సేకరించాడు. అతని ఓపిక, పట్టుదల చూసేవరకు అనూరాధ తల తిరిగి పోయింది.

మూడో రోజు సాయంకాలం ఆరు గంటలకల్లా శైలజ వచ్చింది. అంతా ఒక్కసారే భోజనాలు కానిచ్చి చదువుకు ఉపక్రమించారు.

మిగతాఅప్పుడు చిలిపిగా అల్లరిచేస్తూ వేళాకోళంగా కనపడే శైలజకూయిప్పటిశైలజకూ పోలికేలేదు. అకుంఠిత దీక్షతో విద్య అభ్యసించడానికి గురువువద్దకు వచ్చినశిష్యురాలీమె. విశ్వం ఆమెకు గురువు. వారు చదువుకు సంబంధించినంత వరకు అన్నా చెల్లెళ్ళు కారు. ఆ హాస్యపు సంభాషణలు, ఎత్తి పొడుపులు లేవు. విశ్వం ఎడల శైలజకు గల అనంత విశ్వాస గౌరవాలకు అనూరాధ మనస్సు పులకించింది.

అదివరకు ఉపాధ్యాయుడుగా విశ్వాన్ని ఎరగదు అనూరాధ. శైలజకు పాఠాలు చెప్పుతూంటే పక్కనే కూర్చుంది, తన కా పాఠాలవల్ల అప్పుడే ఉపయోగమూ లేకపోయినా. శైలజమీద ప్రశ్న పరంపరలు కురిపించి, చెప్పలేకపోతే ఆమెను నిందించి విడమరిచి చెప్పేవాడు. అతనికి అంతశక్తి ఎలా పట్టుబడిందో! రాత్రి రెండుగంటల వరకు వివిధ విషయాలూ చెప్పుతూనే ఉన్నాడు. అత్యంత శ్రద్ధతో ఆలకించిన శైలజ 'ఊ' కొడితే ఊరుకోక ఏం అర్థం అయిందో చెప్పించి రైటైతే ముందుకు వెళ్ళేవాడు; తప్పితే నాలుగు తిట్టి చక్కగా విప్పి చెప్పేవాడు. తన క్లాసులోనూ ఉన్నారు లెక్చెరర్లు ఎందుకూ ? అనుకుంది అనూరాధ. శైలజ కూడా చాలా తెలివైనది. ఎన్నో వాదనలు సాగించారిద్దరూ. అనూరాధ శిలాప్రతిమలా

కూర్చుని చూస్తూ ఉండిపోయింది ఆ పూట చదువుకు స్వస్తిచెప్పి.

సుర్నాడు వెళ్ళిపోతూ శైలజ, "నీకు చాలా శ్రమ ఇచ్చానన్నయ్యా! కాని ఎన్ని రోజులు చదివితే ఇంత బాగా అర్థం అవుతుంది? నువ్వు ఎమ్మేకి ఎందుకు కట్టవన్నయ్యా!" అంది.

"ఆపు చెల్లీ జాగ్రత్త! నాకు చదువుకోడానికి నువ్విచ్చిన అవకాశానికీ, ఏం చెప్పానో ఏమో విసుక్కోకుండా విన్నందుకూ నీకు నేను థాంక్స చెప్పద్దూ!"

"నీతో అల్లా వాదించి ఎవరు నెగ్గారులే! చంపలేసుకుంటాను. కాని నిన్నంతా వదినగారిని ఇరుకున బెట్టినట్టున్నాను. ఏమమ్మా!"

"నిజం నిజం! వారు కాస్త చెప్పలేకపోతే నా భరతం పట్టిస్తానంటే గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకుని నేను కూర్చున్నాను. ఇబ్బంది మాట దేవుడెరుగు!" అంది అనూరాధ నవ్వుతూ.

"ఎంతదానవమ్మా! మాటకు మాట అందించందే నిద్ర పట్టదు నీకు!" అంది చిలిపిగా నవ్వుతూ. మళ్ళీ మామూలు శైలజే.

శైలజ హాస్టల్‌కు వెళ్ళిపోయింది.

అనూరాధ మనస్సు మళ్ళీ ఆలోచనలతో నిండింది....

అంత చక్కని అర్థ పరిజ్ఞానం కలిగి, ఇతరులకు బోధించగలిగిన విశ్వం హైస్కూల్లో స్కూల్ఫైనల్ లోపు పిల్లలకు మాత్రమే పాఠాలు చెప్పడం ఎంత అన్యాయం? శైలజ 'ఎం. ఏ. కి కట్టవేం?' అంటే ఆ ప్రశ్న ఉపేక్ష చేశారు ఏమిటి అతని ఉద్దేశ్యం? అతని తెలివంతా అలా వృధా కావలసిందేనా?

సాయంకాలం విశ్వాన్ని అదే అడిగింది.

"ఏమండీ! శైలు 'ఎమ్మేకు కట్టవేం?' అంటే సమాధానం చెప్పకుండా ఊరుకున్నారేం?"

"ఆ అల్లరి పిల్ల నీకేదో మాత్రవేసి పోతూంటుంది. ఆ ముక్కలు పట్టుకుని నువ్వు నా ప్రాణాలు తోడేస్తూంటే ఎల్లా వేగేది నేను!" అంటూ నవ్వాడు విశ్వం.

"అదుగో మళ్ళీ అదే తంతు! మాట తప్పించెయ్యడం. ఇంత తెలివిగలవారు కదా పైకి చదివి ఏ ప్రొఫెసరో అయి ఎంతోమంది విద్యార్థులకు ఉపకారం చెయ్యొచ్చు! కొత్త విషయాలు సిద్ధాంతీకరించి దేశానికి ప్రజలకు ఎంత ఉపకారం చెయ్యవచ్చును! ఉదాసీనంగా ఊరుకుంటారేం, చెప్పండి?"

"అక్కడే నువ్వు పెద్ద పొరపాటు పడుతున్నావు గాధా! లేని దాన్ని నాలో ఊహించి అనవసరంగా బాధ పడుతున్నావు. శైలు చిన్నతనంనుంచీ నా దగ్గర చదువు తుంది. చాలా తెలివైనది. ఆమెకు ఏ పద్ధతిలో బోధిస్తే

అర్థమౌతుందో ఆ విధానం నాకు బాగా తెలుసు. అంత మాత్రాన నేను అందరికీ బోధించలేను. అదీకాక పరీక్షకు కూర్చుని చదవటం అంటే నా కిష్టం ఉండదు. నీకు తెలియదేమో, నేను బియ్యే రెండుసార్లు తప్పానని ! తరువాత, నేను శైలుకి ఉపయోగపడినంతగా అందరికీ ఉపయోగపడను. ఒకవేళ నీవు చెప్పినట్టే నే నేదేనా పరీక్షకు కట్టి పాసై పదవి సంపాదించినా పాఠం చెప్పడం వచ్చేసరికి మీకు మీ టీచర్లు చెప్పినదానికంటె ఎక్కువ చెప్పడం కుదరదు. ఒక తెలివైన పిల్లకు నేను చెప్పగలిగిన ప్రమాణం ప్రకారం నా తెలివిని అంచనా కడితే నువ్వు తప్పుతావు. అదీగాక ఆశ చాలా చెడ్డది రాధా ! మనం పైకి వెళ్ళేకొలదీ స్వార్థం పెరిగి అంతులేని ఆశతో క్రుంగిపోతాం కాని సౌఖ్యం అనుభవించలేం. విశాల దృష్టి తగ్గిపోతుంది. నువ్విటువంటి ఆలోచనలు పెట్టుకుని మనస్సు పాడుచేసుకోకు రాధా !"

"సరే, మీ రెన్నయినా చెప్పండి ! నేను నమ్మను. కాని ఇప్పట్లో చెయ్యగలిగిందేమీ లేదు. ఆ రోజు ఎప్పటికైనా వస్తే అదృష్టవంతురాలినే కాని ఈ లోపున శైలు మార్గం అనుసరించి మీ కాలం కొంత ఉపయోగించుకుంటాను మాష్టారూ!" అంటూ నవ్వింది అనూరాధ.

"సరిసరి ఇదొకటా !" దిగజారిపోతూ అన్నాడు విశ్వం.

అనూరాధ తృప్తిగా నవ్వింది.

# 9

అందరికీ పరీక్షలై పోయాయి. ఇంక విశ్వం ఇల్లు పెళ్ళివిడిదిలా తయారైంది. విశ్వం, అనూరాధ, శాంతమ్మ గార్ల బలవంతంవల్ల శైలజ మరోవారం ఉండిపోవడానికి ఒప్పుకోవలసి వచ్చింది.

నిధి, హైమ, శైలజ, అనూరాధ, విశ్వం రోజూ ఏవో విషయాలమీద వాదనలతోటీ, పేచీలతోటీ సంతోషంగా గడిపేవారు కాలాన్ని.

ఒకరోజున—

"పరీక్ష లెలా వ్రాశారు?" నిధి శైలజ నడిగాడు.

"నేనా? నేను రాస్తే సున్నలొచ్చేవి" అంది శైలజ నవ్వుతూ.

"అంటే!"

"పరీక్షలు నేను కాదు మా అన్నయ్య రాశాడు అని. ఆయనగారు చెప్పినవన్నీ ముక్కున పెట్టుకుని వెళ్ళి అక్కడ ఎక్కించి వచ్చేశాను."

"నిజం! బావగా రెప్పుడూ చెప్పరు కాదే!"

"తేని గొప్పలు చెప్పుకోవడం అమ్మాయిల నేడిపించేవాళ్ళ పని. గొప్పవాళ్ళు చెప్పుకోరు పైకి" అంది శైలజ కొంటెగా.

నిధి తలవంచుకున్నాడు సిగ్గుతో.

"అమ్మాయిలు నీలా వెకిలిగా ఉంటే ఏడిపించ కేం జేస్తారు? మహ ఇతరుల సనొచ్చావ్! తమ్ముడూ, మనం ఊరుకుంటే లాభంలేదు. ఇల్లాంటివాళ్ళ నింకా ఏడిపించ వలసిందే ఏదీ ఆవిడికి కళ్ళమ్మట నీళ్ళు వచ్చేలా ఒక్క విసురు విసరాలి. బుర్ర ఎత్తు తమ్ముడూ" అంటూ ఊర డించింది అనూరాధ.

అప్పటికీ నిధి మాట్లాడలేదు.

"చూడు నిధీ! చిన్న వేళాకోళాలను మనస్సుకు పట్టించుకుని ఏవో పాతవన్నీ తిరగేసుకుని బాధ పడే వాళ్ళంటే నాకు సానుభూతి లేదు. నువ్వేదో సరదాగా తీసుకుంటావనుకున్నాను గాని అక్కగారు నీ నోట్లోకి మాటలు కూరవలసి వస్తుందనుకోలేదు" అంది శైలజ గంభీర ముద్ర భంగపరుస్తూ.

అందరూ నవ్వేశారు.

"మీరెలాగయినా గొప్పగా మాట్లాడతారు" నిధి అన్నాడు మళ్ళీ దారిలోకి వస్తూ,

"ఊ!?" అంది శైలజ కళ్ళు పెద్దవిచేసి.

"ఊ. అది సరేగాని మీ భవిష్యత్తు మాటేమిటి?"

"నీలాంటి గాడిదల్ని నలుగురిని పోగుచేసి కాయ డం" అంది శైలజ.

"కాని గాడిదకు వదినగార్లు వగైరా చుట్టాలంతా ఆ జాతివారే కావలసివస్తుందని మరిచి పోతున్నారు ఎమ్మే గారు" అంది అనూరాధ.

"అప్పుడు మనమూ మందలో కలిసిపోతాం. ఏమోయ్ నిధీ!"

"అవును! అయితే అఖిల భారత ఖర రక్షణాలయం స్థాపించి ప్రథమాధ్యక్షపదవి మీరలంకరిస్తారన్నమాట!"

"నిజంగానే! లేకపోతే ఏమిటీ చదువులు? చదివిన దానికి చేసే ఉద్యోగానికీ సంబంధం లేకపోతూంటే! మా అన్నయ్యకు వచ్చిన చదువేమిటి! ఆయన చేసే ఉద్యోగ మేమిటి! ఏదో చదివెయ్యడం, వచ్చిన ఉద్యోగం చేసెయ్యడం, వ్యక్తిత్వపు విలువలను చంపేసుకోవడం."

"మీరంతా చిత్రంగా మాట్లాడతారు. ఇల్లా కాకపోతే ఎల్లా ఉండాలంటారు?"

"ఎల్లా ఉండాలో చెప్పడానికి నాకేం తెలుసు? నా చదువు నాకలాంటి శక్తి నివ్వందే! పొట్ట గడవకగాని ఈ చదువులు చదవడంకన్న మానుకోవడం ఉత్తమం."

"ఇన్ని కబుర్లు చెప్పేదానివి నన్నెందుకు లాగావ్ ఈ ఊబిలోకి!" అంది అనూరాధ.

"ఇదుగో! శైలు మాట లెవరూ పట్టించుకోకండి! ఆమెకు రోజు రోజుకూ అల్లరి ఎక్కువ అయిపోతూంది" అన్నాడు విశ్వం.

"మరే! నాతో మాట్లాడకమ్మోవ్ చెడిపోతావు! మీ ఆయన చెప్తున్నాడుగా" అంది శైలజ సాగదీసుకుంటూ.

పొట్ట చెక్కలయ్యేలా నవ్వారంతా.

శాంతమ్మగారు వచ్చింది కూతురు పక్షానికి—

"ఏమిటర్రా అందరూ కలిసి దాన్నేడిపిస్తున్నారు?" అంటూ.

"చూడమ్మా! అన్నయ్యా..." అంటూ ఏడుపు ముఖంపెట్టి మరింత నవ్వించింది శైలజ.

"ఆవిడిని ఏడిపించడమా! అల్లా చెయ్యదలుచుకున్న వాళ్ళు మూడు గంటలు ఏడ్చివచ్చి ఇక్కడ తీరుబడిగా మళ్ళీ మొదలెట్టాలి" అన్నాడు నిధి.

"ఇందాకా నిధి అడిగాడు ఏం చెయ్యదల్చుకున్నావని. ఏదో వెటకారంగా అన్నావ్ కాని ఇంతకూ ఏం చేద్దామని?" అడిగాడు విశ్వం.

"అదే తోచటం లేదన్నయ్యా! ఏం చెయ్యమంటావ్? కనపడిన వాటికల్లా దరఖాస్తు పెట్టి మొదట పిల్చిన వెధవ దగ్గర పని చేస్తాను" అంది శైలజ.

"రామ! రామా! వాడు నీకు ఉద్యోగం ఇచ్చినందుకు వెధవై పోతాడన్నమాట! ఏం అన్యాయం అక్కా!" ఇంతసేపటినుంచీ ఊరుకున్న హైమ అంది.

"లేకపోతే ఏమిటీ? కొన్ని కొన్ని ఉద్యోగాలకు ప్రకటనలు చూస్తాను. మూడు వందలు జీతం. వట్టి బి. ఏ. పాసై తేచాలు. ఎవడి కిద్దామని ఉద్యోగం? ఎవడో మామ కొడుకు ముందరే ఉంటాడు. వాడి గురించి లోకం కళ్ళు కప్పడానికిదో ఎత్తు. విసుగొచ్చేస్తూంటే!"

"నువ్వు ఈ లోకంలో ఇమడలేవక్కా" అంది హైమ.

"అయితే సెలవు తీసుకోమంటావా చెల్లీ" అంది శైలజ నవ్వుతూ.

"క్షమించు అక్కా!" అన్న హైమ కళ్ళలో నీళ్లు తిరిగాయి.

"వేళాకోళానికన్నానమ్మా పిచ్చితల్లీ! బాధపడకు. అయినా నా నోరు మరీ మితిమీరుతూంది" అన్న శైలజ ముఖం తిప్పుకుందెందుకో.

"మీరలా అంటే నేనొప్పుకోను. మీరు జీవితాన్ని అంత తేలికగా తీసుకోగలగడంవల్ల అల్లా మాట్లాడగలుగుతున్నారు. అంచేతే ఏ విషయమూ మీరు మనస్సుకు పట్టించుకుని బాధపడరు. మీలా ఉందామని ప్రయత్నించినా అంతా ఉండలేరు. నా అనుభవంలో మీలాంటి వ్యక్తి నాకు కనపడలేదు" అన్నాడు నిధి.

"నీ కెన్నేళ్ళు నిధీ?" చల్లగా ప్రశ్నించింది శైలజ.

"అబ్బ! ఆపవమ్మా. ఎల్లాగైతేనేం నేర్చావ్ మాటలు. తొంభై రెండు మా తమ్ముడికి" అంది అనూరాధ కల్పించుకుని.

"అయితే నీకు నూరు నిండినట్టున్నాయి" అంది శైలజ.

"ఇంత సంతోషంగా ఉన్నరోజున నిండితే బాగుండును" అంది అనూరాధ నవ్వుతూ.

శైలజ నోరు కట్టుబడిపోయింది. ముఖం గంభీరమైంది.

అది చూసి అనూరాధ బాధపడింది.

వాతావరణం నిశ్శబ్దమైంది.

"శైలూ, నా కాకలిగా ఉంది. హల్వా చేసిపెట్టవ్? ఇదివరకోసారి తిన్నాను. ఇంకా మరిచిపోలేదు" అన్నాడు విశ్వం, ఆ వాతావరణం మార్చడంకోసం.

"అంతకన్నానా అన్నయ్యా! ఏమర్రోయ్ ఆడాళ్లూ కదలండి. తేరగా కూర్చుని తిందామనుకుంటున్నారేమో" అంది అనూరాధ, హైమల నుద్దేశించి.

ముగ్గురూ కదిలారు లోపలికి.

"అబ్బ. ఎంత అదృష్టమండీ బావగారూ, ఇల్లాంటి వాళ్ళను కలుసుకోవడం!" అన్నాడు నిధి.

విశ్వం మాట్లాడలేదు.

"కాస బావగారూ, ఈమె ఇంత నిష్కర్షగాను, కుండ బద్దలు కొట్టినట్టుగాను మాట్లాడితే అంతా హర్షిస్తారా? ఇటువంటి ఆమె ఎక్కడేనా పని చెయ్యగలదా ?" అన్నాడు నిధి మళ్ళీ.

"నువ్వెక్కడే పొరబడుతున్నావు నిధీ. బలహీనులకూ, ఆత్మస్థైర్యం గలవారికీ అక్కడే ఉంటుంది తేడా. ఒకరు ఫలితాలకు భయపడి స్వార్థానికి లొంగిపోయి నిజాన్ని చెప్పడానికి భయపడతారు. రెండోరకం వాళ్ళకు ఫలితాలతో ప్రమేయంలేదు. తమకు నిజమని తోచినది నొక్కి పలుకుతారు. దానివల్ల తమ కెంత ముప్పువచ్చినాసరే. అదే కాదు. మరో చిత్రమేమిటంటే ఒకరి దృష్టిలో

ముప్పైనది మరొకరి దృష్టిలో సహజం. ఎదటివాడు బల హీనుడైతే ముప్పు వస్తుందని భయపడి నిజం చెప్పడానికి వెనుకాడతాడు. కాని ప్రపంచంలో అన్నింటికన్నా సులువైనది నిజం చెప్పడం. ఎందుకంటే దానిని నమ్మించడానికి మనం బాధ పడక్కర్లేదు. ఒకనాడు కాకపోయినా మరో నాటికైనా దాని రూపు బయటపడక మానదు. నిజం పలికిన వ్యక్తి ఆదిలో నిష్ఠూరానికి గురిఅయినా చివరకు ఫలితం సాధిస్తాడు."

"కాని అల్లా ఎంతకాలం ఎదిరించి నెగ్గుకు వస్తారు? ఎన్నాళ్ళు కష్టపడవలసివస్తుంది!"

"అరే! మళ్ళీ మొదటికొస్తా వేమిటోయ్! వాళ్ళ దృష్టిలో అవి కష్టాలు కావు. దారిద్ర్యం అనుభవించవలసి వచ్చినా బాధపడరు. ఎవరికీ ఫిర్యాదు చెయ్యరు. జీవితమే అలాంటిది - అని సరిపుచ్చుకుంటారు. అంచేతే వాళ్ళు నెగ్గలేకపోవటం అంటూ ఉండదు. నువ్వూ నేనూ బాధపడతాంగాని వాళ్ళకు ఆ భావమే ఉండదు. ఇటువంటి వాళ్ళు నిజంగా ఏది తలుచుకున్నా చెయ్యగలరు" అన్నాడు విశ్వం.

వంటింట్లోంచి విపరీతమైన గోల వినబడుతూంది.

"అల్లా ఊరికే మంట పెట్టేస్తా వేమిటి ఆ పొయ్యి? హైమూ, కొద్దిగా నీళ్ళు చల్లు. అడుగంటిపోగలదు." అనూరాధ గొంతుక అది.

"మాకూ తెలుసులేవమ్మా వంట! పెద్ద చెప్పొచ్చావ్!" శైలజ అరుస్తూంది.

"అబ్బబ్బా! అల్లా అరవకుండా మెల్లిగా మాట్లాడలేరూ?" అంటూంది హైమ.

"మనం ఇంకా నయం! మొగాళ్ల పేకాటగాని చదరంగంగాని చూళ్ళేనట్టుంది నువ్వు! గొడవ లేకుండా పన్లెలా అవుతాయ్? ఏవమ్మోయ్! రాధమ్మగారూ, ఆ నేతి గిన్నె ఇలా అందుకో" అంది శైలజ.

నిధికి నవ్వు ఆగలేదు.

"ఎంత చదువుకున్నా 'ముగ్గు రాడు[illegible]ాదు కూడిన' సామెత ఊరికే పోనివ్వరు బావగారూ వీళ్లు" అన్నాడు.

"నిజం! నిజం!" అన్నాడు విశ్వం.

"ఏమిటీ కూస్తున్నారిద్దరూ!" మెరుపులేనిపిడుగులా వినపడింది శైలజ గొంతు లోపలనుంచి.

నిధికి నిజంగానే భయంవేసింది.

"ఆడవాళ్ళకు ఓర్పు ఎక్కువ అంటున్నాడు నిధి" అంటూ అరిచాడు సమాధానంగా విశ్వం.

"ఇదిగో అన్నయ్యోయ్! ఇటువంటి మాటలేమన్నా అం[illegible]ాలి కు[illegible]లడం, బదులు వీపులు చదునౌతాయి" అంది శైలజ లోపలినుంచి.

"ఊరుకో అక్కా! ఎందుకు పేచీకి పెదమ్మలా అలా గొంతుక చించుకుంటావ్?" హైమ వారించింది శైలజను.

"అబ్బా! నే నన్నదానికి సరిగ్గా వ్యతిరేక పదం

ఎల్లా స్ఫురించిందండీ బావగారూ, మీ సమయ స్ఫూర్తి గొప్పది. ఆవిడ సరిగ్గా వినిఉంటే నా భరతం పట్టిఉండేది" అన్నాడు నిధి.

"ఆమె అంటే అంత భయం ఎందుకోయ్?" నవ్వుతూ అన్నాడు విశ్వం.

"అదే ఆలోచిస్తాను నేనూను" అన్నాడు నిధి.

ప్రళయంచేసి, మిన్నూ మన్నూ ఏకంచేసి అయిందనిపించారు హాల్నా.

సాయంకాలం షికారువెళ్ళివస్తూ హైమనూ, నిధినీ వదిలేశారు.

"రేపొద్దున్న 8 గంటలకు వస్తాను, సింహాచలం వెడదాం బావగారూ, ఏం అక్కా!" అన్నాడు నిధి సెలవు తీసుకునేముందు.

"అంటే హైమా, నేనూ రానక్కర్లేదనా నీ ఊహ?" కోరి తగువు తెచ్చుకునేదానిలా అడిగింది శైలజ.

"మీరుంటే మాట్లాడడమే భయమండీ. నే న్న దాంట్లో అందర్నీ కలిపే అన్నాను. ఇల్లా షరీకుగా స్తే ఎక్కడ చావను?" నిధి నవ్వాడు.

"ఇంత పిరికివాడివి అమ్మాయిల నేం ఏడిపించగలిగావోయ్? వాళ్లు బహుశః నీ తాతలయి ఉండాలి" అంది శైలజ కొంటెగా, అదును దొరికితే వదిలిపెట్టే రకం కాదామె.

"ఆ రోజులు వేరండీ. అప్పుడు ఆలోచించే తీరే

వేరుగా ఉండేది. నేననుకున్న పని జరగడమే ప్రధానంగా ఉండేది. కాని ఫలితాన్ని గురించి ఆలోచించేవాణ్ని కాదు. ఇతరులను నొప్పించడానికి వెనుకాడేవాడిని కాదు” అన్నాడు నిధి.

“అయినా నీకు మహాపొగరు బలిసిపోతూందమ్మా. ఏం చూసుకుని ఆ నీలుగు? మాతమ్ముడు దొరికాడా నీకు వేళాకోళానికి? చాలుగాని ఇక ఆపండి సోది. మీ రిద్దరూ దయచెయ్యండి. హైమా, పొద్దున్నే వస్తావ్ కదూ?” అంటూ అక్కడికి ఆపింది అనూరాధ.

నిధీ, హైమా అటు వెళ్ళిపోయారు. శైలజ, అనూరాధ, విశ్వం ఇంటికి తిరిగి వచ్చారు.

మర్నాడు పొద్దుట అంతా సమావేశమయ్యారు.

శాంతమ్మగారు బయల్దేరే సూచన లేమీ కనపడ లేదు.

“అత్తయ్యా, మరి రుమీ బయల్దేరరేం!” అడిగింది అనూరాధ.

“మీరు వెళ్లండే! నాతో మీకెక్కడ సాగుతుంది? అసలు మీరు వెళ్ళిన ఉత్సాహం కూడా ఉండదు నాతో వస్తే” అంది శాంతమ్మగారు నవ్వుతూ.

“అదేమిటమ్మా అలా అంటావు? నువ్వు లేకపోతే అసలు సరదాయే ఉండదు” అన్నారు శైలజా, హైమాను.

“సరే అయితే ఇటు వినండి. మీ కబుర్లలో మీరు పడి కొట్టుకుంటూంటే నాకేం తోస్తుందర్రా. నాలాంటి ముసలమ్మ మరొత్తి ఉంటే మాకు పొద్దుపోతుంది. ఇంకా

వాదన లెందుకుగాని మీరు చక్కగా వెళ్ళిరండి'' అంది.

"అయితే మేం వస్తామమ్మా" అన్నాడు విశ్వం ఇంక వాదనల కాస్కారం లేకుండా. మిగతా అంతా విస్తుపోయారు. కాని తల్లీ కొడుకులు నవ్వుకున్నారు.

పెద మార్కెట్ సందులో అరగంట వేచిఉండి ఎల్లాగయితేనేం బస్సు ఎక్కారు.

సిమ్హాద్రి అప్పన్నను తలచుకుంటూ తూరుపుభాష మాట్లాడే జనంతో కిటకిట లాడుతూంది బస్సు.

"ఒసి అప్పియ్యమ్మా కూసింతటు జరుగెస్" అని ఒకామె.

"రేట్నంతా యిచ్చీసినారా!" అనే కండక్టరు అరుపు.

"ఎంత బాబో" అనే ప్రశ్న.

"పడణాల పరక" అని సమాధానం.

"అంగెదా యాండియల్ కొట్టు," డ్రైవర్ కేక.

మొత్తానికి బయలుదేరింది బస్సు.

చక్కని రోడ్డు. మధ్య తారు. ఇరుప్రక్కలా కాంక్రీట్. విశాలంగా ఉంది. రోడ్డుకిరుప్రక్కలా ఊడలతో పెద్ద పెద్ద మర్రిచెట్లు. ఎత్తు పల్లాలతో ఎగుడు దిగుడుగా ఉండే ఆ రోడ్డుమీద బస్సు ప్రయాణం ఒక వింత అనుభవం.

మర్రిపాలెం అవతల ఎడంచేతివేపు విమానాశ్రయం. విశాలమైన మైదానంలో రెండో మూడో భవనాలు, ఎత్తయిన ఏరియల్ టవర్స్. వలయాలు చుట్టుతూ

ఎత్తు తగ్గుచూ కిందకు దిగే విమానం. అటే చూస్తే దూరాన హార్బర్ క్రేన్లు, రోడ్డుపక్క స్థలాలన్నీ మిలటరీ షెడ్లతో ఉన్నాయి.

చక్కని దృశ్యాలన్నీ.

సింహాచలం స్టేషన్‌నుంచి మైలులోపుదూరంవచ్చిన రోడ్డంటే వెళ్ళి అక్కడినుంచి పక్కకు తిరిగి కొండలమధ్య నుంచి కంకరరోడ్డుమీదుగా కొండ దగ్గరగా వెళ్ళి సరిగ్గా మెట్లదగ్గర ఆగుతుంది బస్.

కొబ్బరికాయలు, అగరువత్తులు, అరటిపళ్ళు, పూల దండలు కొనుక్కోమని పోటీలు పడుతూ వస్తారు కుర్రాళ్లు. మోత కూలి దండుగ అని కొందరు తెలిసినవాళ్ళు. వాళ్ళను తప్పించుకుని కొండ ఎక్కడానికి ఉపక్రమించారు విశ్వం వాళ్ళూ.

మొదట నాలుగైదు మెట్లు ఎక్కిన తరువాత ఒక సింహద్వారం, అక్కడ అటూ ఇటూ దేవతా విగ్రహాలు, వాటిముందు చిన్నపూజారులు, పళ్లు ఇచ్చి దక్షిణ సమర్పించి పుణ్యం కొనుక్కోళ్ళమని ఆదరంగా ఆహ్వానిస్తారు. అది చూస్తూంటే నవ్వు వస్తుంది.

విశ్వం అయిదు రూపాయలు చిల్లరపైసలు తీసుకుని బయలుదేరాడు. బిక్షుకులకు ధర్మం చెయ్యడానికి.

పది పన్నెండేసి మెట్లు తరవాత చాలా చదునైన విశాలమైన మెట్టు ఒకటి వస్తూంటుంది. కుడిచేతి పక్కన

పిట్ట గోడలా పైదాకా ఉంటుంది. క్రిందికి లోతుగా ఉంటుంది గోతులతోను, గుట్టలతోను. వేసంకాలమేమో పనసచెట్లు విరగ కాసి ఉన్నాయి. కళ్ళు కుట్టేలాగ చెట్టుకు లెక్క పెట్టలేనన్ని కాయలున్నాయి. స్థలమహాత్మ్యమేమో. ఆ పిట్టగోడకు పక్కనే లోతుగా వున్న వైపుకు నీటి స్టరఫరా గొట్టాలున్నాయి. కొంటెగాళ్ళయిన కుర్రాళ్లు మెట్లువదలి ఆ పిట్టగోడమీదనుంచి ఎక్కుతారుకొండ. ఎడంచేతిపక్కన ఎత్తుగా కొండ. అక్కడక్కడ గుహలు. మెట్టుకు ఒకరు అటు ఒకరు ఇటు చొప్పున బిచ్చగాళ్లు. ఈ చదునైన మెట్టు కాస్త ఆయాసం తీర్చుకుందుకు బావుంటుంది.

పైకి వెళ్ళేలోపున రెండు మూడు ధారలువస్తాయి. అక్కడ వివిధ స్థాయిల నగ్నస్వరూపాలతో పవిత్రస్నానం చేస్తూంటారు భక్తులు. ధారంటే ఏమీలేదు. ఏ నంది చెక్కడమో, ఏ దేవతా విగ్రహమో నోరు తెరుచుకుని ఉంటుంది. అందులోంచి సంతత ధారగా నీరు పారుతూ ఉంటుంది భక్తులుముక్తికోసం స్నానంచేస్తూంటారక్కడ.

ఆ రేడు వందల మెట్లు ఎక్కిన తరువాత మరో సింహద్వారం, అక్కడో ఆంజనేయస్వామి గుడి.

ఇంకా ఎక్కి అక్కడనుంచి చూస్తే (కిందకు) అద్భుతమైన దృశ్యం కనబడుతుంది. దృష్టి ఆనినంత మేర చుట్టూ పచ్చని చెట్లు, ఒక పక్క కొండ; అదివరకువచ్చిన రోడ్డు మెలికలు తిరుగుతూ పచ్చని కాగితంమీద ఇటుక రంగు గీతలా కనపడుతుంది. కన్నులపండువుగా కనపడే

దృశ్యం అది. ఒక్క తోటలా కనపడుతుంది ఎత్తుమీద నుంచి చూస్తే.

ఇక ఈ ఎక్కడం పూర్తవుతుం దనగా దట్టమైన చెట్ల మధ్యనుంచి ఏడెనిమిది మెట్లు మాత్రమే ఒక వంద గజాల దూరం ఉంటాయి. అక్కడినుంచి రెండు షడ్భుజాకార మందిరాల మధ్యనుంచి పది మెట్లు ఎక్కితే కొండ ఎక్కడం పూర్తయినట్టే.

ఎదురుగా సత్రం. కుడి ఎడమలకు దారి. కుడిపక్క నుంచి ఒక పాతిక గజాలు వెళ్ళి ఎడంపక్కకు తిరిగితే ఎదురుగా గుడి కనపడుతుంది.

ఈ దారి పొడుగునా దుకాణాలు కిక్కిరిసిఉంటాయి. లక్క పిడతలు, ఆట బొమ్మలు. సింహాచలం నరసింహ స్వామి పటాలు మామూలువీ, గంధం చెక్కతో చేసినవీ అన్నీ లెక్కకు మిక్కిలిగా అమ్మకానికి ఉంటాయి. ఇరవయ్యో శతాబ్దానికి ప్రాతినిధ్యమా అన్నట్లు గొడుగు విలాస్ కాఫీహోటళ్లుకూడా ఉన్నాయి.

ఇవి గడిచి గుడిదగ్గరకు చేరిన తరువాత పూజా ద్రవ్యాలన్నీ కొన్నాడు విశ్వం.

తళతళా మెరిసిపోయే గోపురంతో ఎత్తుగా ప్రత్యక్షమౌతుంది ఆలయం. మరో ఇరవై మెట్లు యెక్కి ప్రాంగణం చేరుకోవాలి. ప్రాంగణంలో జనసమూహమూ, రద్దీ ఆ రోజునుబట్టి ఉంటాయి. స్వామికి శిఖలుసమర్పించిన స్త్రీ పురుషులు దైవదర్శనంఅయి విశ్రాంతి తీసుకునేవారు. తడిబట్టలవారు, పొడిబట్టలవారు, వివిధరకాలవారుఉంటారు.

ఆలయ ద్వారం ఎదురుగా ఎత్తైన ధ్వజస్తంభం. ఎడమ చేతిపక్క వివాహ మంటపం. కుడిచేతి వైపు బుకింగ్ ఆఫీసు. దైవ దర్శనానికి టిక్కట్టు లేదు. పూజలు, సహస్ర నామార్చనలు వగైరా ఇతర కార్యక్రమాలకు రేట్లపట్టీ ఉంది.

టిక్కట్టు కొనుక్కుని మూడు ప్రదక్షిణాలుచేసి గుడిలోకి ప్రవేశించారు 'క్యూ'లో.

లోపల కుడిచేతి పక్కగా పూజార్లవారికి ఎత్తుగా కటకటాల గదిలాంటిది ఒకటి ఉంది. దేవుడికి నైవేద్యం పెట్టిన అన్నభోగం, ప్రసాదం, అవి విక్రయిస్తారక్కడ.

మధ్యలో మరో చిన్న మంటపం. అది కల్యాణ సమయంలో ఉపయోగపడేదే. ఈ మంటపం పక్కనుంచి వెడితే ఒక కర్ర అడ్డంపెట్టి ఒక్కొక్కరినే లోపలికి వదులుతూ పూజారి కుర్రాయన ఒకడు. ఆయన పక్కనే భక్తుల ఉపయోగార్థం డిబ్బి. ఈ పూజారిని దాటివెడితే గర్భగుడి. పళ్ళాలు, శఠగోపం, గంట, హారతులతో పూజారి. లోపల నివేదన లన్నిటినీ చూసి నోరూరించుకునీ కూడా తినలేక చూసి మాత్రమే సంతృప్తి చెందే స్వామి. గంధపు వలుపునాడు తప్పించి మిగతా అన్ని రోజులలోను స్వామి కనపడే తీరు ఒక గంధపు లింగాకారం.

దేవాలయంలో అడుగు పెట్టినప్పటినుంచీ ఏదో అనిర్వచనీయమైన ప్రశాంతత గోచరిస్తుంది. మనస్సులసీ్న

ఎందుకో చల్లగా అనిపిస్తాయి. ఏకోన్ముఖమైన భక్తి తాండవిస్తుంది అందరిలో.

స్వామి ముందు నిల్చి భక్తితో కేలు మోడ్చేవారు, సంకీర్తించేవారు, ధ్యానమగ్నులయ్యేవాళ్ళు కనిపిస్తారు. వాస్తవ ప్రపంచంలో రోజూ విసుగెత్తే సంఘటనలకు విరుద్ధమైన ప్రశాంతత కనపడుతుందక్కడ.

ఈ అత్యంత ప్రశాంత వాతావరణానికి విరుద్ధంగా కనపడి వాస్తవ ప్రపంచాన్ని గుర్తుకు తెచ్చేది పూజారి మాత్రమే. స్వామితోడి సాన్నిహిత్యం ఎక్కువ కావడం చేత కాబోలు యాంత్రికంగా జరిపించేస్తాడు విధి అంతా. నిర్వికార నిరామయుడు. ఎంత జ్ఞాపకశక్తో, ఎంత గణిత శాస్త్ర పరిజ్ఞానమో మరి, మనుష్యులను గుర్తుంచుకొని నారికేళం ఇచ్చినవాళ్ళకు ఒక చెక్క, అరటి పళ్ళిచ్చిన వారికి అందులో సగం స్వామికి నివేదించి, ప్రసాదంఇచ్చి భక్తులను సంతృప్తి పరుస్తాడు. తీర్థం ఇవ్వడం, హారతి చూపెట్టడం, శఠకోపం శిరస్సున ఉంచడం ఎంత త్వరగా ముగిస్తాడని! లేకపోతే ఎప్పటికి తరగను ఆ జనం.

దైవ సందర్శనం చేసుకుని పూజారికి సంతోషం చేకూర్చి ఇవతలకు వచ్చారు విశ్వం వాళ్ళూ. దారిలో పూజారి దగ్గర స్వామిప్రసాదం పుష్కలంగా కొన్నాడు విశ్వం.

ఆలయ ప్రాంగణంలో ఎడమ చేతి పక్కకుందనుకున్నామే ఆ కళ్యాణ మంటపం చాలా పెద్దది. అందులో స్వామి తాలూకు ఉత్సవ వాహనాలూ అవీ వుంటాయి.

ఎన్నో శిలాస్తంభాలు ఉన్నాయి. ప్రతిదానిమీద మెచ్చదగిన శిల్పం ఉంది. అవిచూసి అంతా ముగ్ధులయ్యారు.

అక్కడినుంచి ఇంకా పైకి ఎక్కడానికి మెట్లు ఉన్నాయి. కొండ అవతలకు దిగితే విశాఖకు దగ్గరదారి ఉందని వాడుక. కొంతదూరం కొండ ఎక్కి చదునుగా చూసుకుని చెట్లక్రింద కూర్చున్నారంతా.

ఇంతసేపూ ఎవ్వరూ మాట్లాడలేదు.

కూర్చోగానే అందరికీ ఏదో ఊపిరి తిరిగింది. అంతసేపూ మంత్రబద్ధుల్లా ఉన్నవాళ్ళంతా ఆ మత్తు విడిపోయి మామూలు మనుష్యులై పోయారు.

"వాస్తవ ప్రపంచానికి విరుద్ధంగా ఇక్కడ విలసిల్లే ఇంత ప్రశాంతతకూ విరుద్ధంగా ఉంటాడేమండీ ఆపూజారి! ఆలయానికి దగ్గర దైవానికి దూరం అన్న సామెత యథార్థం అనిపిస్తుంది అతన్ని చూస్తే. దానికి కారణం ఏమిటంటారు?" నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అడిగాడు నిధి.

"కామెర్ల రోగికి లోకం అంతా పచ్చగా కనపడుతుందిట. ఆ సామెత విన్నావా?" అడిగింది శైలజ.

"ఆఁ."

"అయితే నీ ప్రశ్నకదే సమాధానం."

"నా చిన్న బుర్రకు వదినగారి పరిభాష అర్థం కావడంలేదు" నిధి నవ్వుతూ అన్నాడు.

"కామెర్ల రోగికి లోకం అంతా పచ్చగా కనపడుతుంది; రోగ లక్షణం కాబట్టి. అదే ఎక్కువ మందిలో

సహజం అయితే రోగం లేనివాడి కిది విరుద్ధంగా కనపడుతుంది. వాస్తవ ప్రపంచంతో, రోజూ అనుభవిస్తున్న వాటితో విసిగిపోయి భయంకొద్దీ భక్తికొద్దీ జనం ఇల్లాంటి చోట్లకు వస్తారు. ఆ వద్దామని సంకల్పించుకోవడంలోనే కొంతసేపైనా దైనిక జీవితాన్ని మరిచిపోదామని తీర్మానించుకుంటారు. అందుచేత ఆ విషయాలన్నీ మరిచిపోయి ప్రశాంత హృదయాలతోను, వదనాలతోను వస్తారు. పాపాలకు ప్రాయశ్చిత్తంగా కొన్ని మంచిపనులు చెయ్యాలని నిశ్చయించుకుంటారు. కాని ఆ పూజారికో___"

ఆమెను మధ్యలో ఆపి నిధి అందుకున్నాడు:

"ఆగండి ఆగండి! కామెర్లతో మొదలుపెట్టి ఎక్కడికో వెళ్ళిపోతున్నారు. నేనడిగింది పూజారి వైరుధ్యానికి కారణం. మీరేదో చెబుతున్నారు భక్తిని నిరసిస్తూ."

"పూర్తిగా వినకుండా గొడవ చేస్తావేం? వినడానికి ఓపిక లేనివాడవు అసలు ప్రశ్న అడగడం తప్పు" శైలజ విసుగ్గా అంది.

"లేదులెండి. కానీండి" అన్నాడు నిధి కాస్త చిన్న బుచ్చుకుని.

"భక్తుల తత్వం అది. కాని ఆ పూజారికో___ఇటువంటి క్షణిక భక్తులను చూడడమే పరిపాటి. అతనికి నిత్యం వాస్తవ ప్రపంచం అదే. ఈ భక్తులమీద అతనికి సానుభూతి ఉండదు. వారి బలహీనతకు అతనికి నవ్వు వస్తుంది. బీదలకు కానీవిదపని మహానుభావులు, ఎంగిలి చేత్తో

కాకిని కూడా కొట్టడానికి ఇచ్ఛగించని స్వార్థమూర్తులు, దేవుడి కేదో లంచంగా డబ్బు నీళ్ళలా ఖర్చు చేస్తూంటే, అతనికి ఆశ్చర్యం వేస్తుంది. అతనికి తాను జరపవలసిన తంతంతా ప్రతివారికీ జరపడం ఒక పని. అందరిలోని బల హీనతే అతనిలోనూ ఉంటుంది. అందరూ తమతమ పను లను ఎగగొట్టాలని చూసినట్టే, ఎగగొట్టినట్టే తన నిత్యవిధి అయిన ఈ తంతంతా ఏదో విధంగా అయిందనిపిస్తాడు. ఏడాది కోసారో, జన్మకోసారో భక్తిని ప్రదర్శించబోయే జనం అతనికి క్షణాని కిద్దరు చొప్పున తారసపడతారు. అతనికి పని విసుగెత్తుతుంది. అంటే అతని వాతావరణంలో అతనో వ్యక్తి అన్నమాట! జన్మకోసారి భక్తి చూపించిన నీ కెలా కనపడతాడు!"

"గొప్పగా చెప్పావు అక్కా!" అంది హైమ.

"ఇంతమంది అచంచల భక్తితో ఇక్కడికి వచ్చే వాళ్ళకు తన స్వార్థంతో అన్యాయం చేస్తున్నట్టు ఒప్పు కుంటావా? మనం ఇంత నమ్మే దైవసన్నిధిలోనేనా ఇంత మోసం!" అనూరాధ కల్పించుకుని అడిగింది.

"ఓహో! తమ్ముడికి మద్దతు గాబోలు! పూజారి స్వార్థంతో అన్యాయం చేస్తున్నట్టు ఒప్పుకోమంటావా? ఎల్లా? అతను బజార్లోకి, కొట్లోకి వస్తాడు, సరసమయిన ధరకు న్యాయంగా సరుకు ఇస్తారనే విశ్వాసంతో. మన ప్రపంచంలో వ్యాపారస్తులు మామూలుగా చేసేదానివల్ల అతను నష్టపోతాడు. అతని గతేమిటి? స్వార్థం అంటావు: మనం కల్పించుకున్న ఈ ఆంక్షలన్నీ స్వార్థ సంచితాలు

కావూ? నీకున్న విశ్వాసాలేగా దేవుడన్నా, భక్తి అన్నా మరేదన్నానూ. వీటికి అందరూ విలువ ఇవ్వాలని సిద్ధాంత మేముందీ? నలుగురు నమ్మినంత మాత్రాన అది సిద్ధాంత మైపోయి నమ్మని అయిదోవాడు స్వార్థమూర్తా? ఇదెక్కడి న్యాయమమ్మా? మనం ఇంత నమ్మే దైవం అంటావ్! మనం ఇంత నమ్మే దైవం ఎదటేగా స్వార్థంతో కళ్ళు కప్పుకుపోయి ప్రవర్తిస్తూంట! మన శాస్త్రాలు చెపుతా యిగా దేవుడు సర్వాంతర్యామి అని. పాపాలన్నీ చేస్తూ వీలైనప్పుడోసారి దేవుని ముందు మోకరిల్లి 'అయ్యో దేవుడా! ఏం చెయ్యమంటావ్! అక్కడున్నంత సేపూ బుద్ధి అలాగే ఉంటూంది. క్షమించు' అంటాం చెంపలేసుకుని. పూజారికూడా మరింత గట్టిగా లెంపలు వేసుకుని 'నాయనా! నీ ఎదుటే ఇటువంటివి చెయ్యడం చాలా బాధగా ఉంది. కాని ఏం చెయ్యను? అయినా అంతా నీ లీలేకదా!' అని తన ప్రవర్తనకంతా కారణం దేవుడి నెత్తినే రుద్ది రెండ క్షింతలు కూడా వేస్తాడు. ఇప్పుడు చెప్పు. ఎవరు స్వార్థ మూర్తులు? ఎవరు అచంచల భక్తి పరులు?" గుక్క తిప్పు కుంది శైలజ.

"మీ కేదో గట్టి సమాధానం చెప్పాలని ఉంది కాని చేతకావడంలేదు. అంతమాత్రాన మీతో ఏకీభ వించలేను" అన్నాడు నిధి.

"నువ్వు ఏకీభవించ నక్కర్లేదు. గట్టి సమాధానం చెప్పడానికి అంతకంటె ప్రయత్నించక్కర్లేదు. కాని బుద్ధి ఉపయోగించి ఆలోచించు. నీ దృష్టితో నువ్వు చూసిన

అవతలివాడి కింకో దృక్పథం ఉంటుందని అందుకు అంగీకరించద్దూ? మనం మనుషులం. లోపాల పుట్టలం. మనమే ఒకళ్ళ నొకళ్ళు సహించలేకపోతే ఎల్లా?" అంది శైలజ.

"మరి నువ్వెందుకు నిధి చూసిన దృష్టిలోంచి చూడలేక పోయావ్! ఇంత వ్యాఖ్యానం చేస్తావ్! తనదాకా వస్తేకాని తెలీదు. రేపు నువ్వీమాట ఎంత నిలుపుకుంటావో నేను చూడలేకపోతానా? ఈ కంటికీ రెప్పలు దూరం కావు." అందందింది అనూరాధ.

"నేనూ మనిషినే! నాలోనూ ఉంది స్వార్థం. అన్నవన్నీ ఆచరించగలిగితే అంతా పరమహంసలమై పోమూ?" అంటూ నవ్వింది శైలజ.

"అయితేఅక్కా! అందరూ స్వార్థం చంపేసుకుంటే లోకం ఆనందమయంగా ఉంటుందంటావా ?" అడిగింది హైమ.

"నాకు 'కీ' ఇచ్చి తెగ వాగించేస్తున్నారు. అన్నయ్యేమో పెదిమేనా కదపడంలేదు. నవ్వుకుంటున్నాడో ఏమో? ఏమయ్యా!"

"లేదమ్మా. ఎంతో చక్కగా మాట్లాడుతున్నావ్. ముచ్చట వేస్తూంది వినడానికి. నిజంగా నువ్వు నా చెల్లెలివని చెప్పుకోవడానికి ఎంతో గర్వంగా ఉంది" అన్నాడు విశ్వం.

"అప్పు బాబూ పొగడ్త! నువ్వు మా ఆలోచనలకు అవతలి తీరాన ఉంటావు."

"నాకు సమాధానం చెప్పకుండా అడ్డదారి పట్టిం చేశావ్ బండీ!" ఎత్తి పొడిచింది హైమ.

"ఏమవుతుంది? శాశ్వతత్వం వస్తుంది. ప్రగతిఅనేదే ఆగిపోతుంది" నిధి అన్నాడు సమాధానంగా.

"దారిలోకి వచ్చావోయ్, అబ్బాయ్" అంది శైలజ.

"మనం ఎప్పుడూ దారిలోనే ఉన్నామండీ !"

"మరి!!!" ఆశ్చర్యపోయింది శైలజ.

"లేకపోతే ఇంత చర్చ ఎల్లా వస్తుందండీ ! ప్రతి దాంట్లోనూ ఏకీభావమే అయితే ఇంక వైరుధ్యం ఏదీ ! వైరుధ్యం లేకపోతే స్తబ్దంగా ఉంటుంది. మార్పుకోసం అలమటించిపోయే మానవులం గదా ! అదీకాక వాదనల లోనే ఎవడి వాదన వాడు సమర్థించుకుందామని ప్రయ త్నించడంలో మెదడు కింతమేత దొరుకుతుంది!"

సాయంకాలానికి ఇంటికి చేరుకున్నాడు.

ప్రతిరోజూ ఏవో వాదనలు జరుగుతూనే ఉండేవి. ముఖ్యంగా పాల్గొనేవారు శైలజ, నిధి. అనూరాధ, హైమ అప్పుడప్పు డేవో ప్రశ్నలు వేసేవారు. విశ్వం చాలా కుతూహలంగా వినేవాడు.

ఒక రోజున దినపత్రిక తిరగవేస్తూ, నిధి ఇలా చది వాడు: "—గ్రామంలో పెళ్ళి పీటలమీద వధువు చచ్చి

పడిపోయింది. సాయంకాలం ఊరవతల పాటుపడిన దేవాలయంలో ఒక యువకుని శవం ఉచ్చుకు వేళ్ళాడుతూంది. పీటలమీది వధువు, ఈ యువకుడు పరస్పరం ప్రేమించుకున్నారనీ, తలిదండ్రుల ఆటంకంవల్ల ఇల్లా జరిగిందని భావించబడుతున్నది. పోలీసు దర్యాప్తు సాగుతూంది—"

"అరెరె !"

"పాపం !"

"ప్చ !"

అనూరాధ, హేమ ఒక్కసారే అన్నారు.

శైలజ మాట్లాడలేదు. ఆమె ముఖంలో మార్పు లేదు. ఆ వార్త ఆమెమీద పని చెయ్యలేదు.

"మీకు చీమ కుట్టినట్టుకూడా లేదే!" నిధి ఆశ్చర్యపోతూ అడిగాడు.

"హృదయ దౌర్బల్యంతో ఆత్మహత్యకు పూనుకునేవాళ్ళకు నేను సానుభూతి చూపించలేను" అంది శైలజ నిర్వికారంగా, నిశ్చలంగా.

"అంటే మీ దృష్టిలో పవిత్ర ప్రేమకు విలువ లేదన్నమాట !"

అందరూ ఏం చెప్తుందోనని ఆత్రపడ్డారు.

"పవిత్ర ప్రేమ సంగతి తరవాత ఆలోచిద్దాం కాని అసలు ప్రేమంటే?" ఎదురు ప్రశ్న వేసింది.

"ప్రేమంటేనా ?" ఇంత చవ్చు ప్రశ్న ఏమిటని ఆశ్చర్యంతో కొయ్యబారిపోయినట్టయ్యాడు నిధి.

"మరేనయ్యా! ప్రేమంటే ఏమిటనే అడుగుతున్నది." రెట్టించింది.

కొన్ని కొన్ని అతి సహజమనుకున్న వాటిని విపులీకరించమన్నా నిర్వచించమన్నా ఇరుకున పడి పోతూంటారు చాలామంది. అంతా తెలిసినట్టే ఉంటుంది. కాని చెప్పడం మహా కష్టం. అటువంటి పరిస్థితిలోనే పడ్డాడు నిధి.

"ప్రేమంటే—అంటే—" నీళ్ళు నమిలాడు నిధి.

"అంటే—అంటే-ఏమిటీ అనే నేను అడుగుతుంట! నానుస్తావేం?"

"అంటే—ఒకరిద్దరిమధ్య ఉండే అన్యోన్య సంబంధంవల్ల ఒకరినొకరు అర్థం చేసుకుని సానుభూతితో మెలగడం—ఒకరి కష్ట సుఖాలు ఒకరితో పంచకోవడం—ఏమిటో నాకే సంతృప్తిగా లేదు ఈ నిర్వచనం" తన అసమర్థతకు తానే సిగ్గిలుతూ అన్నాడు నిధి.

"సంతృప్తిగా లేకపోవడమే కాదు. ఇంకాచూడు-నీ నిర్వచనం ప్రకారం—నీకూ నీక్లయంటుకూ అన్యోన్య సంబంధం ఉంది. కేసు గెలిస్తే సంతోషంలో పాలు పంచుకుని ఫీజు గుంజుకుంటావు. ఓడిపోతే సంతాపం వెలిబుచ్చి ఓదారుస్తావు—ఈ లెక్క ప్రకారం నువ్వూ నీక్లయంటు పరస్పరం ప్రేమించుకుంటున్నారన్నమాట!" అంది నవ్వుతూ.

అందరికీ నవ్వు వచ్చేసింది. నిధి మొహం తప్పేలాలాగ తయారైంది.

"కాలికివేస్తే తలకూ, తలకు వేస్తే కాలికీ ముడెట్టడం వాదనకాదు....కుయుక్తి. నువ్వు చెప్పదల్చుకున్నదేమన్నా ఉంటే చెప్పు. ఊరికే ఊరించక !" అంది అనూరాధ.

"సరే. ఉపన్యాసం ఇస్తున్నానని ఆపైన నామీద పడి ఏడవకండి" శైలజ అంది.

"ఉపోద్ఘాతం ఒకటా? కానీవమ్మా బాబూ!" అనూరాధ విసుక్కుంది.

"మీరు ప్రేమ అనుకునేది రెండు విధాలు. ఒకటి శారీరకం. భార్యాభర్తల మధ్యది. రెండోది అశారీరకం. తలిదండ్రుల మధ్య, పిల్లల మధ్య, స్నేహితుల మధ్య ఉండేది! నా దృష్టిలో ఇవన్నీ వివిధ అంతస్థులలో ఉన్న బాధ్యతలు. ఇవి మూడు విధాలు. ఒకటి దాంపత్యం. రెండు బాంధవ్యం. మూడు స్నేహం. స్నేహం అనేది ఒకళ్ళ కష్టసుఖాలు ఒకరు సానుభూతితో చూసుకోవడంలో ఉంది. ఒకరి బాధ్యతలు ఒకరిమీద ఉండవు. ఒకరి కష్టాలు ఇతరుల జీవితాలలో మార్పు తీసుకు వచ్చేవిగా ఉండవు. ఈర్ష్యలు జుగుప్సలు ఉండవు. నిష్కల్మషమైన పవిత్ర సంబంధం అది. ఇద్దరు స్నేహితులమధ్య ఒకరినుంచి ఒకరు ఆశించేది నైతికమైన సహాయం మాత్రమే. ఒకరి డబ్బు ఒకరు ఆశించరు. ధనవంతుడైన
తుడు బీదవాడైన మిత్రుడికి ఆర్థిక సహాయం చెయ్య
చ్చు. అంతమాత్రంచేత ఆ బీదవాడు తనకు సహాయం

చెయ్యడం తన స్నేహితుడికి పని అనుకోడు. అలా భావిస్తే ఆ అంతస్థు స్నేహం గడిచి బాంధవ్యంలోకి వచ్చిందన్న మాట. దాని వెనకనే ఈర్ష్యలు క్రోధాలు అవన్నీ వచ్చి అది కలుషితమై పోతుంది. ఇక దాంపత్యం విషయం తీసుకుంటే: ఇది దృఢంగా ఉండడానికి కారణం ఒకటి. ఒకరి నుంచి మరొకరు శారీరకమైన తృప్తి పొందడం. దానివల్ల ఒక చెప్పలేని సంబంధం ఏర్పడి వృద్ధిపొందికొద్దీ త్రెంచరానిదిగా తయారౌతుంది. అదేకాక ఒకరి బాధ్యతలు ఒకరు స్వీకరించడం, వారి అనుబంధ జన్యులయిన బిడ్డలను సాకడం వాళ్ల విధి అవుతుంది. దానితో ఆ అనుబంధం మరింత గట్టి పడుతుంది. బాంధవ్యం ఈ రెంటికీ మధ్యది—"

"అంతేనా!" అన్నాడు నిధి మధ్యలో.

"కాదు. ఇంకా ఉంది. అనాదిగా వస్తున్న కట్టుబాట్లకు లొంగి ఉంటున్నాం. ఈ బాంధవ్యం అనే ప్రేమకు హెచ్చు తగ్గుకూడా విచిత్రంగా ఉంటాయి. అన్నదమ్ములు. చెల్లెళ్ళమధ్య ఉండే ప్రేమ తీసుకో. చిన్నతనంలో ఎంతో దృఢంగా ఉంటుంది. అప్పట్లో ఒకరికోసం ఒకరు ప్రాణత్యాగం చేసేటంతగా ఉంటారు. ఒకర్ని కొడితే ఒకరు సహించలేరు. అప్పట్లో ఒకరి బాధ్యతలు ఒకరిపైన ఉండవు. అమాయికమైన అనురాగం. నిర్మల స్నేహం అన్నమాట. రోజులు గడిచేకొలదీ వారివారి జీవితాల మార్పులు వస్తాయి. ఈర్ష్యాసూయలు, ఒకరితో ఒ

పోల్చి చూసుకోవడాలు వస్తాయి. తరువాత పెళ్ళిళ్ళయి పోయి ఎవరి నూతన పథాలలో వారు అడుగిడిన తరువాత ఎవరిమట్టుకు వాళ్ళకే బాధ్యతలు పెరిగిపోతాయి. అన్న దమ్ములను గురించి పట్టించుకుందుకు తీరికే ఉండదు. పోతే పండగకో చీర పెట్టలేదనో, సారె పెట్టలేదనో సాధింపులు మాత్రం మిగులుతాయి. అన్నదమ్ముల ఆస్తి పంపకాలలో తగాదాలు వస్తే ఇంక చెప్పక్కర్లేదు. ఇదొక చక్రనేమి క్రమం. తరతరంలోనూ ఈ సంఘటనలు జరుగుతూనే ఉంటాయి. ఇంత సామాన్య విషయాన్ని ఎంతగానో పెద్దది చేసి ఆలోచనలతో కాలం వ్యర్థం చెయ్యడంలో నాకు అర్థం కనపడదు" అని గుక్క తిప్పుకుంది.

"అయితే యువతీ యువకుల ప్రేమమాట! ఎప్పుడో ఎలాగో మారినా అప్పటి కది సత్యమేగా?" అడిగాడు నిధి.

"ఏమిటి సత్యం! ఇలా ప్రేమ ప్రేమ అని గుండెలు బాదుకున్న వాళ్ళెంతమందో అనుకున్న సంబంధాలు కాక పోయినా నిక్షేపంలా సంసారాలు సాగిస్తున్నవాళ్ళను చూపి స్తాను. మరి ప్రేమంతా ఏమయిపోయినట్టు?" వెక్కిరింపుగా అంది శైలజ.

"అయితే ప్రేమకోసం ప్రాణాలు త్యజించిన వాళ్ళ మాట? అదంతా వారి బలహీనతగా తోసేస్తారా?" నిధి అన్నాడు.

"లేకపోతే ఏమిటి! ఒక యువతిని ఒక యువకుడు

ప్రేమిస్తున్నాడంటావు. అంటే—ఆమెను శారీరకంగా వాంఛిస్తున్నాడా? ఆమె సౌందర్యాన్ని ఆరాధిస్తున్నాడా? లేక ఆమె స్నేహం కోరుతున్నాడా? ఏదీ ఈమూడింటిలో? మొదటిదైతే ఉట్టి మోహమన్నమాట. అంతకుమించి ఏమీకాదు. ఆమె ఇంకెవరినో పెళ్ళిచేసుకుంటే భరించలేక ఆత్మహత్య చేసుకుంటే దాన్ని పవిత్రప్రేమకు బలిదానం అంటారంటే అసూయవల్ల జనించిన బలహీనతకు తట్టుకోలేక ప్రాణాలు కోల్పోయాడంటాను. దీనికి నిత్య జీవితంలో ఒక చిన్న ఉపమానం ఇస్తాను. ఒక చిన్న కుర్రాడు ఉంటాడు. వాడేదో వస్తువు చూసి మమతపడి అది కావాలని పట్టుబడతాడు. సవాలక్ష కారణాలవల్ల అది కుదరదు. వాడు ఏడుపు మొదలు పెడతాడు. భోజనం మానేస్తాడు. వాడి దృష్టితో చూస్తే ఆ వస్తువులేని లోపం ఎంతో పెద్దది. అది తీరకపోతే సర్వప్రపంచం వాడికి శూన్యంగా కనపడుతుంది. పెద్దవాళ్ళకు, అనుభవజ్ఞులకు అది కుర్ర చేష్టలా కనపడుతుంది. దానికీ, నువ్వు చెప్పే పవిత్ర ప్రేమకూ ఏమైనా తేడా చూపించగలవా మరిదీ? పోతే సౌందర్యారాధన. తాజ్‌మహల్ చూసి ఆనందించక అది తన పెరట్లో లేదే అని ఏడ్చేవాడిని మూర్ఖుడనక మానతామా? ఇక స్నేహం వాంఛించే వాడికీ చిక్కులుండనే ఉండవు."

"అయితే ప్రేమంటే మిథ్యేనంటావు. అంతేనా అక్కా! నీ దృష్టిలో అదొక బలహీనతన్నమాట!!" హైమ అడిగింది.

"మిధ్య ఎందుకౌతుంది చెల్లీ! కాని ఒకరిద్దరు వ్యక్తులు బలహీనతవల్ల లేని కష్టాలు తెచ్చిపెట్టుకుని జీవితాలు బలిచేసుకుంటే దాన్ని త్యాగం అని మాత్రం నేను అభినందించలేను" అంటూ ముగించింది శైలజ.

ఇలా గడిచేది వారి కాలం.

వారం రోజులు ఏడు క్షణాలలాగ ముగిశాయి.

ఎనిమిదోరోజున శైలజ ప్రయాణమైంది.

"ఇంకో రెండు రోజు లుండి వెళ్ళవే పిల్లా! ఇల్లు చిన్నబోతుంది. ఏదో చిలోబాలో మంటూ గడిపారీవార మూను" అంది శాంతమ్మగారు.

"ఎన్నాళ్ళుంటే తనివితీరుతుందమ్మా నీకూ నాకూ" నవ్వుతూ అంది శైలజ.

"నువ్వెళ్ళి అక్కడ గుడ్డి గుర్రానికి పళ్ళేమీ తోమక్కర్లేదుగా! వెదుదువు గానిలే! ఊహలు తొందర పడిపోతున్నావ్!" అంది అనూరాధ నిష్ఠూరంగా.

"నీ వెర్రిగాని ఎన్నాళ్ళున్నా వెళ్ళిపోయే రోజున బాధపడక మానం. అందుకని ఒక్కొక్కరోజు చొప్పున ఎన్ని రోజులు పొడిగిస్తావ్!" అంది శైలజ.

"పోనీ నా వెర్రితనమేగాని ఎల్లుండి వెదుదువుగాని"

"సరే కాని ఎల్లుండి మాత్రం పంపించెయ్యాలి. ఏం అన్నయ్యా;"

"అలాగేనమ్మా! ఏదో అమ్మా రాధా సరదా పడుతున్నారు గదా, ఉండిపో ఈ రెండు రోజులూ" అన్నాడు విశ్వం.

"అయితే నీకేం అభ్యంతరం లేదన్నమాట నే నెప్పుడు వెళ్ళినా!"

"నిధి అంటే ఏమో ననుకున్నానుగాని నీతో మాట్లాడడం మహాకష్టం. సందుదొరికితే దెప్పకుండా విడిచిపెడతావా!" నవ్వాడు విశ్వం.

"మా వదినగారే నేర్పింది చిట్కా!"

"ఉరుమురిమి మంగలం మీద పడినట్లు నా మీదకు తోస్తున్నావేమిటి అన్నీను" అంది అనూరాధ.

శైలజ ప్రయాణం వాయిదా పడింది.

మూడోరోజున విశ్వం ఒక ఖరీదైన చీర, రవికగుడ్డ తీసుకు వచ్చాడు శైలజకు.

అనూరాధ తాంబూలం, పసుపు కుంకుమలతో అందించింది.

"ఏమిటన్నయ్యా ఇవన్నీను!" అన్న శైలజ కళ్ళలో నీళ్ళు నిల్చాయి.

"కట్టుకో అమ్మా! నా సంతోషం కొద్దీ ఇచ్చినప్పుడు కాదనకు."

"ఊ కానీవే పిల్లా! పెళ్ళికొస్తే ఆడపడుచు లాంఛనాలు రావలసినమాట!" అంది శాంతమ్మగారు.

కొత్తచీర కట్టుకొని శైలజ శాంతమ్మగారికీ, విశ్వానికీ నమస్కరించి అనూరాధకు గూడా నమస్కరించబోయింది.

అనూరాధకు కళ్ళనీళ్ళు తిరగాయి.

"చెయ్యవలసిన ఇద్దరికీ చేశావు నన్ను జ్ఞాపకం ఉంచుకుంటే చాలమ్మా!" అంటూ అక్కున జేర్చుకుంది ఆడపడుచును.

మాటలు మరిచిపోయి రెండు నిమిషా లలాగే ఉండి పోయారు.

విశ్వం నవ్వుకున్నాడు.

శాంతమ్మగారికి ముఖమంతా కళ్ళే అయిపోయాయి ఆ దృశ్యం చూస్తూంటే.

శాంతమ్మ, విశ్వం, అనూరాధ, నిధి, హైమ వెళ్ళారు స్టేషన్‌కు శైలజను దిగబెట్టడానికి.

"ఉత్తరాలు రాస్తుంటావు గదమ్మా?" అడిగాడు విశ్వం.

"నాకు తీరుబడి ఎక్కడుంటుందన్నయ్యా?" గంభీరంగా అంది శైలజ.

"నిజమే మరి! లోకం మరమ్మత్తు పూర్తయ్యేదాకా ఊపిరి పీల్చేందుకైనా తీరుబడి ఉండ దామెకు. మీకూ నాకూ ఉత్తరా లెక్కడ రాస్తారు!" నిధి అందించాడు.

"గొప్పగా అన్నావ్ మరిదీ! నిన్ను మాత్రం మర్చిపోను లే!"

"కాన్వొకేషన్‌కు తప్పకుండా వస్తావ్ గదక్కా!" హైమ అడిగింది.

"ఆనాటికి జ్యోతి ఆరిపోకుంటేను!"

"ఈ గడ్డిపూవు మరి వాడిపోకుంటేను!"
కవిత్వ ధోరణిలో అంది శైలజ.
హైమ ముఖం మలిన మైంది.

"ఛీ! అవాచ్యపు మాటలూ నువ్వూనూ! పాపం హైమ ఎంత నొచ్చుకుందో చూడు. అసలే ముత్యాలు రాలిపోతాయన్నట్లు ఎప్పుడోగాని నోరు విప్పదు. మాట్లాడితే చాలు నువ్వు ఏదో వికటంగా రెండని ఆమెను బాధ పెడతావు" అంటూ కసిరింది అనూరాధ.

"క్షమించు చెల్లీ! నా నాలుక మీద శని తాండవ మాడుతున్నట్లున్నాడు. ఏం మాట్లాడినా విపరీతార్థాలే వస్తున్నాయి."

"పొరబడుతున్నారు. మీ మాటలు మీ చదువుకు సంస్కారానికి వన్నె తెచ్చేవిగా ఉంటాయి" అభినందించాడు నిధి.

"ఈ భట్రాజు పని ఎప్పటినుంచి మొదలెట్టావు బాబూ! వ్యాపారంలోకి గాని దిగుతావేమిటి? అయినా ప్లీడరీ మాత్రం టోపీ వ్యాపారం కాదేమిట్లే" అంది శైలజ.

"నిజంగా మీ మీద సరస్వతికి చాలా వాత్సల్యం ఉందండి. ఎంత గంభీరమైన మాటనైనా సున్నితమైన హాస్యంలోకి దించెయ్యగలరు" అన్నాడు నిధి.

"ఊఁ!" అమాయికంగా ముఖంపెట్టి అందర్నీ నవ్వించింది శైలజ.

ఇంతసేపూ నవ్వుతూ త్రుళ్ళుతూ ఉన్న శైలజకు రైలు కదిలే సమయానికి నెత్తిమీది కుండకు చిల్లిపడింది.

నవ్వుతూ తేలిగ్గా వెళ్ళిన వాళ్ళంతా గంభీరంగాను, భారంగాను తిరిగి వచ్చారు,

## 10

మూడు నెలల తరువాత—

జూలైలో కాలేజీలు తెరిచే వేళకు శైలజ దక్షిణాదిని ఒక స్త్రీల కళాశాలలో అర్థిక శాస్త్రోపాధ్యాయినిగా నియమితురాలైంది. మే మూడో వారంలో ఫలితాలు వచ్చాయి. ఫస్ట్ క్లాసులో ఉత్తీర్ణురాలు అయిందామె. వరుసగా దరఖాస్తులు పంపించింది ఉద్యోగాలకోసం. మొట్టమొదట ఈ కళాశాలనుంచి పిలుపు వచ్చింది. వెంటనే వచ్చి చేరింది. స్త్రీల కళాశాల అనగానే ఆమెకు ఎంతో సంతోషం అయింది. ఒకరితో పోరు పొక్కిడి లేకుండా హాయిగా గడిచిపోతుందని ఆనందించింది. అధ్యాపకులు, విద్యార్థులు కూడా స్త్రీలే కావడం ఎంతో సౌఖ్యంగా ఉంటుందని ఆశించింది.

ఉద్యోగంలో చేరే రోజున ప్రిన్సిపాల్ తక్కిన అధ్యాపకురాండ్రను పరిచయం చేసింది. ఒక అరగంట సేపు కాండక్టు రూల్స్‌ను గురించి ఉపన్యాసం ఇచ్చి అటువంటి

విషయాలలో ఈ కాలేజీకి ఎంత ఘనంగా ఉంటుందో ఉదహరించింది.

కాలేజీ అనుబంధంగానే హాస్టల్ కూడా ఉంది అదే ఆవరణలో.

హాస్టల్ జీవితానికి తాను అప్పటికే అలవాటు పడి ఉండడంతో ఆమె ఇటువంటి వాతావరణంలో ఉద్యోగం అయినందుకు ఎంతో సంతోషించింది.

బి. ఏ. సీనియర్, జూనియర్ తరగతులకు ఆమెను అధ్యాపకురాలుగా నియమించారు. వారానికి పది గంటలు పని. జీతం రెండువందల యాభై రూపాయిలు. అదివరకు తమ అధ్యాపకుల మీద పడిన అసూయంతా ఆనందంగా మారిపోయిందామెకు.

తమకు తమ లెక్చరర్లు చెప్పినట్టు కాక ఎంతో బాధ్యతాయుతంగాను, విద్యార్థులకు అర్థమయ్యేట్టుగాను బోధించాలని తీర్మానించుకుంది. ప్రతి విద్యార్థిని సమానంగా చూసి, అందరినీ పండితులను చెయ్యాలని అనుకుంది. ఆమె దృష్టికి అంతవరకు అధ్యాపకులలోపమే కళ్ళకు కట్టినట్టు కనపడ సాగింది. ఏవో నాలుగు ముక్కలు వాగేసి తమ పని అయిందని, కోర్సు అయిందని మాత్రమే సంతోషించి ఊరుకునేవారు అధ్యాపకులు తన అనుభవంలో. ఎవరికి అర్థం అవుతూందో, ఎవరికి కావటంలేదో వారు పట్టించుకునేవారు కాదు. విద్యార్థులకు అనుమానాలేమైనా వస్తున్నాయేమో తెలుసుకునేవారు కాదు. తను విద్యార్థిగా పడిన శ్రమంతా తన విద్యార్థులకు కలుగకుండా

చెయ్యాలని అనుకుంది శైలజ. అధ్యాపకులు శ్రద్ధవహిస్తే ప్రతి విద్యార్థినీ ఉత్తమంగా తయారు చెయ్యగలరని ఊహించింది. విద్యార్థులతో వారి స్థాయికి దిగి వారితో కలిసి మెలిసి ఉండి, వారి కష్ట సుఖాలు కనుక్కొని వారిలో చదువు మీద ధ్యాసను ఎక్కువ చెయ్యాలని నిశ్చయించింది.

మొదటి రోజు క్లాసు తన కేదో వింతగా తోచింది. ఎంతో బాగా తయారు అయి వచ్చి ప్రతి అంశమూ విడమరిచి వాళ్ళకు బోధించింది. అంతా వింటున్నట్లు కనిపించారు. అందరికీ అర్థమైనట్లే కనిపించింది. అనర్గళంగా ఉపన్యాసం ఇచ్చేసరికి గంట ఇట్టే కొట్టేసినట్లనిపించిందామెకు.

ఎంతో హాయి అనుభవించిందామె. ఏమైనా పాఠాలు చెప్పడం కష్టంకాదు అనుకుంది. తను చెప్పినవి పదే పదే మననం చేసుకుని ఎక్కడెక్కడ పొరపాట్లు పడిందో గుర్తుకు తెచ్చుకుంది. ఇటువంటి లోపాలు రాకుండా చూడడానికి ప్రయత్నించాలనుకుంది.

మర్నాడు అదే క్లాసుకు వెళ్ళింది. వెనుకటి క్లాసులో చెప్పిన వాటిమీద ప్రశ్నలు వేసింది. ఎంతవరకు గ్రహించారో తెలుసుకోవడానికి. ఒక్కళ్ళూ సమాధానం చెప్పక పోయేసరికి ఆమె ఆశ్చర్యానికి అంతులేకపోయింది. చిరాకు వచ్చింది. ఎందుకు చెప్పలేక పోయారో కారణం అడిగింది. చదవలేదన్నారు కొందరు. చదివితే అర్థం కాలేదన్నారు కొందరు. ఇంకా గుచ్చి గుచ్చి అడిగితే అసలామె

చెప్పింది ఏమీ అర్థం కాలేదన్నారు. దానితో ప్రమాణపడి పోయింది. కోపం తారాపథం అందింది. అర్థం కాకపోతే అడక్కుండా కూర్చున్నారేం అని గద్దించింది, సమాధానం లేదు.

రోజులు గడిచే కొలది ఆమెకు ఈ అనుభవాలు ఎక్కువ కాసాగాయి. విద్యార్థులు చదవరు, పరీక్ష రోజులలో తప్ప. విడవకుండా చదివేవాళ్ళు ఏ నలుగురో అయిదుగురో ఉంటారు. మిగతావాళ్ళు చదవరు. గట్టిగా ప్రశ్నలు వేస్తే సమాధానం చెప్పలేక అర్థం కాలేదంటారు. దానితో అధ్యాపకులు నేరం చేసినట్లుగ భావించుకుంటారు. అది చూచి విద్యార్థులు నవ్వుకుంటారు.

తనతోటి ఉపాధ్యాయినులు తామరాకుమీది నీటి బొట్టుల్లా తమ పాఠాలు తామెందుకు చెప్పుకుపోయి విద్యార్థులను వదిలేస్తారో అర్థం అయింది నెలకు. ఒక విధమైన ఉడుకుమోతుతనం వచ్చేదామెకు. కాని నిస్సహాయంగా ఉండేది పరిస్థితి. ప్రశ్నలడగకుండా వారికేమీ తెలియకపోయినా ఊరుకున్నవాళ్ళు విద్యార్థుల దృష్టిలో మంచివాళ్ళు. ఆమెకు మాత్రం మనస్సు ఒప్పేది కాదు అల్లా ఉండడానికి.

ఇక కాలేజీ వెలుపలి జీవితం ఇంకా చిత్రంగా కనుపించసాగిందామెకు. ఇక్కడ విద్యార్థినులు, అధ్యాపకులు వింతగా కనిపించేవారు. ఎక్కువ అదుపులో పెట్టబడ్డ ఈ వాతావరణంలో ఎప్పుడూ మగవాళ్ళను గురించే కబుర్లు సాగేవి. ఒకళ్ళనొకళ్ళు ఎత్తిపొడుచుకోవడాలు; ఒక స్త్రీ

మగమిత్రులను గురించిన విమర్శ: ఏ లెక్చరర్‌కు ఎక్కువ ఫోన్ కాల్స్ వస్తాయో; ఎవరు కాలేజీ వదలగానే ఎవరితో షికారుకు బయలుదేరతారో — ఇవీ ఎంతసేపూ. తన విద్యార్థి జీవితం అంతటా సహ విద్య సాగింది. తోటి మగ విద్యార్థులతో కలిసి మెలిసి ఉండడంతో, వాళ్ళను వేరుగా చూడడం గాని, వారిని గురించి ఆలోచించడం గాని జరిగేది కాదు. కలుసుకున్నప్పుడల్లా సరదాగా కబుర్లు చెప్పుకోవటం, మిత్రురాండ్రతో ఎల్లా వ్యవహరిస్తారో మగ విద్యార్థులతోను ఇంచు మించు అల్లాగే ఉండేవి. కాని ఇక్కడ వాతావరణం ఇంకోలా ఉంది సహవిద్యవల్ల శీలం పాడవుతుందేమో ననే భయంతో స్త్రీలకు ప్రత్యేకంగా పెట్టిన ఈ కళాశాలలో ఒక విధమైన బలహీనత కనుపించ సాగింది మనుష్యులలో.

వార్డెన్‌ను గురించి గుసగుసలు, మరో లెక్చరర్‌ను గురించి చెవులు కొరుక్కోవడాలు, వారిసోది వీరి సోదిగా కనబడింది జీవితం.

తాను విద్యార్థినిగా ఉంటూ తోటి విద్యార్థులతో హాస్టల్లో ఉండడానికీ, ఇప్పుడు తాను అధ్యాపికగా వారితో కలిసి ఉండడానికీ కూడా పొత్తు కుదరి లేదు. వారితో ఎక్కువగా కలిసి తిరిగితే లోకువ కావడానికి ఎక్కువ అవకాశాలు కనబడ్డాయి. ఇవి కాక ఇంక అసూయలకు అంతం ఉండేది కాదు.

రెండు నెలలు గడిచేసరికి ఈ వాతావరణం మొహం మొత్తింది. శెలవుకు ఎక్కడ చూసినా ఎక్కువ పనులవి

స్వభావమే కనబడింది. హాయిగా స్వేచ్ఛగా మాట్లాడే స్నేహితులే కరువయ్యారామెకు. అందులోనూ జనార్ధన, విశ్వం, హైమ, నిధిలాంటివారి మధ్య మెలిగిన ఆమె ఈ పరిస్థితుల్లో కృత్రిమంగా గడపలేకపోయింది.

ఊళ్ళో ముప్ఫై రూపాయలకు ఇల్లొకటి తీసుకుని ప్రత్యేకంగా మకాం పెట్టింది.

నాలుగు రోజులు క్యారియర్ భోజనంతో విసుగెత్తి పాత్రలూ అవీ కొని తనే వండుకోవడం ప్రారంభించింది.

పొద్దున్నే లేవడం, కాఫీ పెట్టుకుని తాగడం, వండుకోవడం, పేపరు తిరగేసి, పాఠాలూ అవీ తయారు చేసుకుని, ఫ్లాస్కులో కాఫీనింపి, భోజనం చేసి పది గంటలయ్యేసరికి కాలేజీకి బయలుదేరడం; మధ్యాహ్నం ఇంటర్వెల్‌లో ఆ కాఫీ తాగి సాయంకాలం ఇంటికి చేరడం. మళ్ళీ వంట. భోజనం—చదువు. మొదట్లో బాధ అనిపించినప్పటికీ తరువాత తరువాత ఇదే నయమనిపించింది. ఏ పనీ లేకపోతే ఒంటరితనం మరీ బాధించేది. కాని ఎంత సరిపెట్టుకున్నా లోటుగా కనబడేది. ఎప్పుడూ సరదాగా గడిపే ఆమెకు ఇంచుమించు మౌనమే శరణ్యమయింది. అవసరమైతేనే సహాధ్యాపికలతో మాట్లాడటం, తన పాఠాలేమిటో తన గొడవేమిటో అవే పట్టించుకోవడం- ఈ విధంగా మసలడం ప్రారంభించింది. ఈ ప్రవర్తనతో ఆమెకు తగిన తోడులేక ఒంటరితనం అనుభవించ సాగింది.

పుస్తకాలు తెగ చదవడం; సినిమాలకు వెళ్ళడం— ఇల్లా గడిచేది కాలం. చదువుకునే రోజుల్లో శ్రీవల్లి నేర్పిన తమిళం ఇక్కడ ఎంతో ఉపయోగించిందామెకు. పని మనిషితోను, పాల మనిషితోను ఆమెకు ఈ తమిళమే రాకపోతే నానా యాతనగానూ ఉండి ఉండేది.

ఆనాళ శుక్రవారం. కాలేజీనుంచి వచ్చేదారిలో పుస్తకాల దుకాణానికి వెళ్ళి ఒక పుస్తకం పట్టుకుని ఇంటికి వచ్చింది శైలజ. పుస్తకం పేరు 'కాందిశీకులు'. పెద్ద పెద్దల అభిప్రాయాలన్నీ గొప్పగా ఉన్నాయి. కొత్తగా విడుదల అయింది. తొందర తొందరగా భోజనం ముగించుకుని, పడక కుర్చీలో కూర్చుని పుస్తకం మొదలు పెట్టింది.

గంటలు గడిచిపోతున్నాయ్. శైలజకు ఈ ప్రపంచం ధ్యాసే ఉన్నట్టులేదు. పేజీలకు పేజీలు తిరిగి పోతున్నాయ్. నిద్రాదేవికీ శైలజకూ యుద్ధం జరిగినట్టుంది. శైలజ ముఖంలో రంగులు శతవిధాలుగా మారిపోతున్నాయ్. దుఃఖం, జాలి, కోపం—ఒకటేమిటి?

నాలుగు వందల పేజీల పుస్తకం పూర్తి అయ్యే సరికి రాత్రి రెండున్నర అయింది. ఎడతెగని ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయిందామెకు. ఎంత తెంచుకుందామన్నా తెగని ఆలోచనలు చుట్టు ముట్టేశాయి.

భారత పాకిస్తానులు వేరుపడిన రోజులలో జరిగిన

దురంతాలను ఆధారం చేసుకుని వ్రాసిన పుస్తకమది. ఆ దురంతాలను కళ్ళకు కట్టినట్టు చిత్రించాడు రచయిత.

హిందూ ముస్లిం కుటుంబాలు రెండు ఒక ఊళ్ళో మహా సఖ్యంగా ఉంటాయి. ఈ మతకలహాలవల్ల ఉభయులూ ఆజన్మ శత్రువులై పోతారు. ఇద్దరూ తమ తమ మతాలపట్ల దృఢ విశ్వాసాలు కలవారే. కొట్లాటలలో ఆ రెండు కుటుంబాలూ హతమైపోతాయి. పన్నెండేళ్ళ కుర్రాడు. పదేళ్ళ పిల్లమాత్రం తప్పించుకొని బయట పడతారు. ఆ బాలిక ముస్లిం కూతురు. ఈపిల్లవాడు హిందువు. వాళ్ళిద్దరికీ మతాలను గురించి తెలుసుకొనే ఈడు లేదు. కొట్లాటలు జరుగుతూ ఉండగా ఎక్కడో దాక్కొని పారిపోయి కాందిశీకుల గుంపులో చేరిపోతారు.

మతాల పేరు చెప్పుకుని మానవత్వాన్ని నిరసించే ఈ దుర్మార్గులను చూసి జాలీ క్రోధంకూడా కలుగుతాయి. అంతవరకు ఎంతో అన్యోన్యంగా ఉన్నవాళ్ళు ఒక్కసారిగా ఈ విషయం వచ్చేసరికి ఎంతో విరోధులై పోతారు. ఈ మతాల ప్రసక్తేలేని కుర్రవాళ్లకు ఈ బాధలు లేవు.

ఇదంతా చదివేసరికి శైలజకు మతిపోయింది. అటు నిద్రరాదు. ఇటు ఆలోచనలు చుట్టు ముట్టుతాయి. మతాల ప్రసక్తితోపాటు సరోజిని గుర్తుకు వచ్చింది. అప్రయత్నంగా కన్నీళ్ళు వచ్చాయి శైలజకు. వట్టి పిచ్చిది! వైద్యం మూడోయేడు చదువుతూ ఒక ముస్లిమ్‌ను ప్రేమించింది. తలిదండ్రులకు తెలిసి మందలించారు. ఆడ్డే మొండికేస్తే

చదువు మానిపించేస్తా మన్నారు. అంతే! ఈ లోకంనుంచి నిష్క్రమించింది. పిరికిది! అసలా ప్రేమంటేనే అయోమయంగా కనపడుతుంది తనకు. దానికి తోడు ప్రాణత్యాగం ఒకటా! ఏమయితేనేమి, దాని బలహీనతను దానికే వదిలేస్తే అదంత పని చెయ్యకపోనుగా? తల్చుకున్నప్పుడల్లా ఏడుపు, కోపం, ఏమీ చెయ్యలేకపోయిన అసహాయత తనను అలుముకుంటాయి. ఎంత సన్నిహితంగానో మెలిగారు. తనతో చెప్పుకుని ఏడ్చింది. ధైర్యముంటే పెళ్ళి చేసుకోమని తాను సలహా ఇచ్చింది. తను మాత్రం ఆ పరిస్థితుల్లో చెయ్యగలిగిం దేముంది? ఏమైతేనేమి, మతం పేరుచెప్పి ఒక నిండు ప్రాణం బలి అయిపోయింది. ఈ ఆంక్షలన్నీ లేకపోతే మానవత్వానికి ఇంకా విలువ హెచ్చదూ? ఇంకా ఎక్కువ సహకారం, సంఘీభావం ఉత్పన్నం కావూ? ఉద్రేకాలతో ఒకరి నొకరు పొడుచుకుంటారా?

తనకు తెలియకుండానే ఏ నాలుగున్నరకో కునుకు పట్టింది. తెల్లవారినదే తడవుగా మెలకువ వచ్చేసింది. కళ్ళు బరువెక్కి బద్దకం అనిపించింది. ఇంకా రోజుకు కాలేజీకి సెలవు పెట్టాలని నిశ్చయించుకోవడంతో సంతోషం కలిగి మళ్ళీ పడుకుంది.

తొమ్మిదిన్నరకు లేచి బద్ధకంగా కాలకృత్యాలు కానిచ్చి, తలబరువు తగ్గటానికి అభ్యంగనం ఆచరిద్దామని నిశ్చయించుకుంది. అన్నీ తెముల్చుకుని తిండి తినేవేళకు

పన్నెండు అయింది. రాత్రల్లా నిద్రలేని కారణాన నడుం వాల్చిందే తడవుగా నిద్ర ముంచుకొచ్చింది.

సాయంకాలం నాలుగు గంటలకు మెలకువవచ్చింది. మెలకువతోపాటు ఏకాంతం ఆవరించింది. ఏమీ తోచ లేదు. చదువుదామంటే చదవని పుస్తకాలేమీ కనపడ లేదు.

గంటన్నర అటు తిరిగి ఇటు తిరిగి సినీమాకు బయలు దేరదామనుకుంది.

ఎటు చూసినా తమిళ సినిమాలే! హిందీసినీమాలు ఇటు చప్పున రావు. ఇంక ఇంగ్లీషు సినిమాలంటే పండుగే! శైలజకు తమిళ చిత్రాలంటే ఒకవిధమైన ఏహ్యాభావం ఉంది. సున్నితమైన హాస్యం అనేదానికి ఆ నిర్మాతలకు అర్థం తెలీదని ఆమె భావం మోటుగా ఉంటేతప్ప తమిళ ప్రజానీకం హాస్యాన్ని గ్రహించలేదని వారి భావమేమో!

వెళ్ళడం మానేద్దామా అనుకుంది. కాని అసలే పగలు నిద్రపోయినమీదట రాత్రి ఒకపట్టాన నిద్రరాదు ఇంక గడిచేదెలా? ఈ మూడు నెలలకూ ఈ రోజున బొత్తిగా ఒంటరితనం అనుభవించ సాగిందామె. సహాధ్యాపికల ఇళ్ళకు వెళ్ళడం ఇష్టంలేదు. అదీగాక హాస్టల్ వదిలి పెట్టినప్పటినుంచి వాళ్ళ మాటలలో పాల్గొనక పోవడంతో వారికీ తనకూ దూరం హెచ్చింది. తాను వారి భావాల తోనూ, ప్రవర్తనతోనూ ఏకీభవించలేదు. ఒకళ్ల తప్పు లెంచుతూ తామే తప్పులుచేసే వర్గంతో తాను చేయి

కలపలేదు. వాళ్ళను తలుచుకుంటే తనకు జాలి, కోపం కూడాను. ఏది ఏమైనా తనకుమాత్రం మంచి తోడు కరువైంది. ఎప్పుడూ నలుగురితో కలిసి మెలిసి హాయిగా కాలం గడిపిన తనకు ఈ జీవితం బొత్తిగా నచ్చలేదు. ఉద్యోగం వదిలేస్తే? కాని వదిలేసి చేసేదేముంది? ఇంకో చోట మాత్రం ఇంతకంటే మంచివాళ్ళు దొరుకుతారని ఏమిటి? అప్పుడూ తనకీ మార్గం తప్పదు.

సినీమాకు వెళ్ళడానికే నిశ్చయించుకుని బయలుదేరింది.

థియేటర్ వద్ద రద్దీగానే ఉంది. టికెట్ తీసుకుని వెళ్ళి కూర్చుంది.

చిత్రం నడిచేకొలదీ ఆమెకు కంపరం పుట్టుకురాసాగింది. అర్థంలేని దృశ్యాలు, మోటు హాస్యం, విసుగు పుట్టించే కథాను. మిగిలిన రసజ్ఞ ప్రేక్షకులంతా (అంతా కాదనుకోండి) తెగ ఆనందిస్తున్నారు. నాలుగవ తరగతిలోనుంచి కేకలు, ఈలలు! ఒకటేమిటి! వారికి నచ్చేవి యిటువంటివేనని వేనోళ్ళ చాటుతున్నారు.

ఒక దృశ్యం మరీ కంటగింపుగా ఉంది. "ఛీ! దీని మొహం తగలెయ్య!" అని పైకే అనేసి నాలిక కొరుక్కుంది శైలజ.

"అరె! మీరు తెలుగువారా?" తియ్యని తెలుగు కంఠం వినిపించింది.

శైలజ కర్ణపుటాలలో అమృతధారలు వర్షించాయా

మాటలు. ఎవరిదా కంఠం ? ఎంత మధురంగా ఉంది మాతృభాష! ఇంతమందిలో పరాయిదానిలా ఉన్న తనకా మాటలు ఎంతో ఆనందం కలిగించాయి. ఎన్నాళ్ళయింది ఇతరుల నోటినుంచి ఈ భాష విని ? ఈ ఊళ్ళో తెలుగు వాళ్ళున్నారేమోనని వాకబు చెయ్యాలని కూడా తట్టలేదు తనకు ఇన్నాళ్ళూ. అబ్బ ! ఆనందంతో ఆమె హృదయం పరవళ్లు తొక్కింది.

ఎక్కడినుంచా మాటలు ? తన వెనకనుంచే. తన ధ్యాసలో తానుండి చుట్టుపక్కల ఎవరున్నారో కూడా చూడలేదు తను. కంఠంమాత్రం పురుషునిది. వెనక్కు తిరిగినా చీకటిలో ఒకరి ముఖాలు ఒకరికి కనబడలేను.

"మీరు తెలుగువారా?" మళ్ళీ ప్రశ్నించాడతను.

"అవునండీ!" అంది శైలజ.

పక్కవాళ్ళనుంచి విసుగు సూచించే ధ్వనులు విని అక్కడికి ఆపేశారు సంభాషణ.

ఇంటర్వెల్ ఎప్పుడౌతుందా అని ఎదురు చూడసాగింది శైలజ.

ఎవరై ఉంటారు? ఏ ఊరో ? ఏం చేస్తున్నాడో ? ఈ ప్రశ్నలకు రకరకాల సమాధానాలు ఊహించుకుంటూ గడిపింది శైలజ ఇంటర్వెల్ వరకూ.

పది యుగాల తరువాత ఇంటర్వెల్ ఇచ్చారు.

వెనక్కు తిరిగింది. చిరునవ్వుతో పలకరించాడతను

అంతసేపు తా నితరులతో మాట్లాడకుండా కూర్చో వడంతో తన ఒంటరి తనాన్నతను గ్రహించాడని ఆమె అనుకుంది. ఎంత అనుభవం ఉన్నా సంభాషణ కెలా ఉప క్రమించాలో అర్థం కావటం లేదామెకు.

అతనూ అలాగే బాధపడుతున్నట్టున్నాడు. ఒక నిమిషం ఒకర నొకరు పరిశీలించుకుంటూగడిపారు. ఉన్నత సంస్కారం పొడగట్టిం దతనిలో.

"ఎల్లా ఉంది సినిమా?" చివరకు అతనే నిశ్శబ్దాన్ని భంగపరిచాడు. ఆ కంఠం ఎంతో శ్రావ్యంగా ఉంది. ఎంతో నాగరికత కనబడిం దా తీరులో.

"చూస్తూనే ఉన్నారుగా!" అంది సహజంగా.

"అబ్బ! మహా విసుగుగా ఉంది" అన్నాడతను.

"ఇంకా చెప్పాలా? వినోదంకోసం వస్తే వికారం పుడుతూంది" అంది నవ్వుతూ.

ఇంక సంభాషణ యథేచ్ఛగా సాగిపోయింది.

ఎవరికైనా అంతే. మొదటి రెండు మాటలే అల్లా ఉంటాయి. పరిచయం కాకముందు ఎంత గుంజాటన పడ తారో రెండు మాటలు మాట్లాడేసరికి అదివరకు ఎంతో పరిచయం ఉన్నట్టు సంగతులు ఊరిపోతూ ఉంటాయి. ప్రయాణాల్లో ఈ విషయం అందరికీ అనుభవమే.

"ఏం చేస్తున్నారు మీరు!" అత నడిగాడు.

చెప్పింది.

"పేరు? మీ కభ్యంతరం లేకపోతే?"

"అభ్యంతరం ఎందుకండీ! శైలజ" అంది.

"ఒక్కరే ఉంటున్నారా?"

"అవునండీ. లేకపోతే ఈ పిక్చర్‌కు రావడమెం దుకూ! ఇంతకూ పరిచయం చెప్పలేదు"

"నా పేరు అమీర్‌ఖాన్. ఇక్కడ అసిస్టెంటు ఇంజ నీరుగా ఉంటున్నాను" అన్నాడు.

వేడుకకు చెప్పలేదుకద పేరు? ఎంత స్వచ్ఛమైన తెలుగు మాట్లాడుతున్నాడు? శైలజకు ఆశ్చర్యం వేసింది.

"అరే! అల్లా ఆశ్చర్యపోతారేం?" అడిగాడు ఖాన్.

"మీరు తెలుగు చాలా స్వచ్ఛంగా మాట్లాడ తారు."

"అదేనా మీ ఆశ్చర్యానికి కారణం?"

శైలజ మాట్లాడలేదు.

"మేమూ తెలుగువాళ్ళమే. మేము పుట్టింది పెరి గింది అక్కడే. ఇంచుమించు అదీ మాకు మాతృభాషే. చిన్నప్పటినుంచి హిందువులతోనే నా కెక్కువ సాన్ని హిత్యం ఉండేది. దానితో నాకు తెలుగంటే ఎక్కడలేని అపేక్షా బయలుదేరింది."

"భలేవారు."

"మీ కాలేజీలో ఇంకా తెలుగు వాళ్ళున్నారా?"

"ఎక్కడండీ? ఈ ఊరు వచ్చిన తరువాత తెలుగు వినడం యిదే మొదలు."

"ఈ ఊరు మీకు నచ్చినట్లుంది."

"ఏదో! ఎక్కడైనా ఇంతకంటె మెరుగ్గా ఉంటుం దనేమిటి!"

"ఎందుకో ఆశాభంగం పొందినట్లుగా కనపడు తున్నారు" అన్నాడు ఖాన్.

"మీకు 'థాట్ రీడింగ్' తెలుసా?" అడిగింది శైలజ.

అది తన నింక నోరు మూసుకోమని హెచ్చరికో, లేక సహజంగానే అలా అందో ఖాన్‌కు తెలియలేదు.

ఇంతలో ఆట మళ్ళీ మొదలుపెట్టారు. సంభాష ణకు అడ్డుపడింది.

సినిమా అంతం అయ్యేవరకు శైలజ, అమీర్ ఖాన్ ఒకర్ని గురించి ఒకరు అంచనా వేస్తూనే ఉన్నారు.

ఆట పూర్తి కాగానే బయటకు వచ్చేశారు.

"హాస్టల్లోనా మీ బస?" ఖాన్ అడిగాడు.

"కాదండి! రెండు నెలలకే విసుగెత్తింది."

"అయితే ఎక్కడ ఉంటున్నారు?"

"స్వామినాథన్ వీధిలో."

"అయితే పదండి, మిమ్మల్నక్కడ దించేస్తాను."

"ఎందుకు మీకా శ్రమ?"

"నేనూ అటే వెళ్ళాలి."

"అయితే పదండి."

అతను, అత న్ననుసరించి ఆమె, అతని కారు దగ్గ రికి వెళ్ళారు.

"అయితే మీరు సర్వసంపన్నులు అన్నమాట!" శైలజ వ్యాఖ్యానించింది.

"అంటే?"

"అదే-కారు, గీరు—"

"ఇంకా—" నవ్వాడు ఖాన్.

"క్షమించండి."

"ఎందుకూ?"

"నాకు మాటలు మరీ తొందరగా వస్తున్నాయి."

"పరిచయం అయినతరువాత అనవసరమైన హద్దులు పెట్టుకోవడం మీ కిష్టమా?" ఖాన్ అడిగాడు.

"అర్థం కాలేదు" అంది శైలజ.

"లేకపోతే ఏమిటండీ! మాటలు తూచి తూచి మాట్లాడగలమా?"

"కాని ఎదరివాళ్ళు ఏమనుకుంటారో ఆలోచించాలిగా!"

"మీ రేమీ అనుకోనంటే నే నొక్కటి చెప్తాను. మీ రేమన్నా నేనేమీ అనుకోను. ఎందుకంటే మన పరిచయం ఇదివరకటినుంచి అయినట్టు అనిపిస్తోంది నాకు. మీరంత సహజంగా మాట్లాడతారు. మీరు పొందిన శిక్షణ చాలా గొప్పది.

అచ్చంగా శైలజకూ అల్లాగే అనిపించింది. దానితో ఆమె సహజ ధోరణి విజృంభించింది.

"భట్రాజు పని మీరు బాగా చేస్తారే!" అంటూ తియ్యగా నవ్వింది.

"దాని సంగతి తరువాత ఆలోచిద్దాం. ముందు కారెక్కండి"—

అంటూ స్టీరింగ్ ముందు తను కూర్చుని ఇవతల తలుపు తెరిచాడు శైలజను ఆహ్వానిస్తూ.

ఏమిటీ చొరవ? అనిపించింది శైలజకు. తిరిగి వెళ్ళి పోదామా అనిపించింది. కాని మనసు ఎదురు తిరిగింది. పోనీ వెనక సీట్లో కూర్చుందామా అనుకుంది. కాని ఆ ఊహ ఆమెకే ఎబ్బెట్టుగా తోచింది. ఎందుకో లేని పోని అనుమానాలు. ఇంత చదువుకునీ ఎందుకంత భయం? సినిమాలో పక్క మగవాళ్ళు కూర్చొంటే లేనిది కారులో ఇతని పక్కన కూర్చుంటే నేమి?

"మరోలా అనుకోకండి! మీరు వెనక, నేను ముందు అయితే మౌనంగా గడపవలసి వస్తుంది. లేక మాటలమధ్యలో పొరపాటున మీ వేపు తిరిగితే కారు ఈ లోపుని ఏ స్తంభాన్నైనా పలకరించవచ్చు" నోరారా నవ్వుతూ అన్నాడు.

శైలజకు శరీరమంతా సిగ్గుతో కుంచించుకు పోయింది. అత సన్నమాటవల్ల కాదు. తన అర్థం లేని అనుమానాలవల్ల. అతని మాటకు నవ్వు వచ్చిం దామెకు.

ఈ మూడు నెలలలోను ఈ మాత్రం హాయిగా మాట్లాడే వాళ్ళు తనకు కనపడలేదు. ఇంక మాట్లాడకుండా అతని పక్కన కూర్చుంది వచ్చి.

అతను కారు స్టార్ట్ చేసి ముందుకు పోనిచ్చాడు.

"నాదే తప్పులెండి" అంది శైలజ.

"ఎందులో?"

"మీ పక్కన కూర్చోవడానికి సందేహించడంలో."

"ఏం?"

"అక్కడ థియేటర్లో పక్కన ఎవరో కూర్చోలేదూ? రైల్లో ఇతరుల పక్కన కూర్చోవడం లేదూ?"

"కృతజ్ఞుణ్ణి. మిమ్మల్ని ఇంత సులువుగా అర్థం చేసుకోగల నను కోలేదు. మీరు అలా ఆలోచించారంటే అందులోనూ తప్పు లేదనుకోండి. ఏమయినా మన సామాజిక ప్రవర్తన పరిణతి చెందలేదు."

"అదేనండి, నాకు బాధగా ఉంటుంది. ఇక్కడికి వచ్చేవరకు ఇటువంటి భావాలు లేవు. అక్కడ మా మిత్ర బృందంతో జీవితం గొప్పగా ఉండేదిలెండి. కాని ఇక్కడికి వచ్చిన తరువాత స్త్రీల కళాశాల వాతావరణం, వాళ్ళ సంకుచితత్వం అవీ చూడడంతో నాలోనూ బయల్దేరి నట్టున్నాయి ఇవన్నీ" అంది శైలజ.

"మీ నిష్కపటమైన స్వభావానికి నా ధన్యవాదాలు."

"ఏమిటో లెద్దురూ!"

"మీరెక్కడ చదివారు?"

"ఆంధ్ర యూనివర్సిటీ."

"ఏ ఏడాది?"

"క్రిందటేడు."

"అయితే మీకు రోషనార తెలిసి ఉండాలే?"

"ఆమె ఏ ఏడాది?"

"మీకు రెండేళ్లు సీనియర్."

"ఎవరు — సన్నగా-పొడుగ్గా - ఎర్రగా —".

"అచ్చం అంతే."

"బాగా ఎరగనుగాని ఇప్పుడు గుర్తొచ్చింది. ఆవిడ మీ బంధువా?"

"మా పినతండ్రి కుమార్తె."

"ఈ సుక్క నాకు రెండేళ్ళ ముందర తెలిసి ఉండవలసింది."

"ఉంటే?"

"మీ పరిచయం నాకు ముందే తెలిసి ఉండేది."

"చక్కగా మాట్లాడతారు మీరు." అభినందించాడు ఖాన్.

"ఆ నూటే మెరీనా బీచ్ పొడుగునా అనుకుంటున్నారు" అంది శైలజ నవ్వుతూ.

ఖాన్ కూడా నవ్వాడు.

మరో పది నిమిషాలపాటు నిశ్శబ్దంగా సాగింది ప్రయాణం.

"ఎటు?" మలుపు దగ్గరకొస్తూంటే అడిగాడు ఖాన్.

"ఎడం పక్కకి—అ—స్లో చెయ్యండి - ఇక్కడే."

కారు ఆగడంతో శైలజ దిగింది.

"దిగబెట్టినందుకు కృతజ్ఞురాల్ని" అంది శైలజ.

"ఫరవాలేదు అనమంటారా?"

"ఒద్దులెండి. లోపలికి రండి."

"ఇప్పుడు పొద్దు పోయింది. మరెప్పుడైనా వస్తాను."

"అయితే ఎప్పుడైనా ఎందుకు - రేపు ఆదివారంగా సాయంకాలం 4-30 కి టీకి రండి. మీ శ్రీమతిని కూడా తీసుకుని."

"అది కుదరదు."

"ఏం?"

"మా శ్రీమతి రాదు."

"అంత ఘోషా ఏమిటండీ- మీ రింత చదువుకునీ కూడా-"

"ఇక్కడ లేదు."

"అల్లా చెప్పండి. పుట్టింటికి వెళ్ళినట్టున్నారు."

"తెలియదు."

"అదేమిటండీ!- అంటే - అహహ-" నవ్వు పొర్లుకొచ్చిం దామెకు.

"ఏం అంతల్లా నవ్వు వస్తూంది?"

"మరేం లేదు. పెళ్ళి కాలేదని చెప్పడంలో కూడా ఎంత నాటకం ఆడారు!"

"మీరు ప్రశ్న లడిగారు. నేను జవాబులు చెప్పాను. అంతేగా!"

"నిజమే! మీ రసలు లాయర్ కావలసింది. అబద్ధం చెప్పకుండానే నిజం దాచగలరు."

"మీ అభివందనలకు కృతజ్ఞుణ్ణి" అన్నాడు ఖాన్ నవ్వుతూ.

"రేపు తప్పకుండా రండి."

"ప్రయత్నిస్తాను."

"ప్రయత్నం కాదు. తప్పదు."

"అలాగే. సెలవు!"

"సెలవు!"

కారు కదిలిపోయింది.

గబగబ తాళంతీసి ఇంట్లో ప్రవేశించింది శైలజ.

బట్టలు మార్చుకుని వంటింట్లోకి వెళ్ళింది. పెందరాళే వండెయ్యడంతో అప్పటికే నీళ్ళు కారిపోతూ ఉన్నాయి పదార్థాలు. ఎందుకో ఆ అన్నం తిన బుద్ధిపుట్ట లేదు. మనస్సుకుసంతోషంగా ఉండడంతో కడుపు నిండుగా కనపడింది. విసుక్కుంటూ ఆ అన్నం తిని ఆ సంతోషాన్ని పాడుచెయ్యడం ఇష్టం లేకపోయింది. క్రితం రోజుప కొన్ని పళ్ళు ఉంటే అవి తిని ఇంత పెరుగు తాగేసింది.

మంచంమీద పడుకుని ఆనాటి సంఘటనలను

ఒక్కటొక్కటిగా నెమరువేసుకుంది. ఎంతో విసుగ్గాను, ఎడతెగని ఆలోచనలతోను ఆరంభమైన రోజు ఎంతో సంతోషంగా పరిపూర్తి చెందింది. అన్ని రోజుల ఒంటరితనం ఆవాళతో తీరింది. అమీర్‌ఖాన్ ఆలోచనల్లో తేలిపోతూ ఉండగా ఎప్పుడు నిద్రపట్టిందో ఆమెకే తెలియదు.

మర్నాడు పొద్దున్నే చాలా తొందరగా మెలకువ వచ్చింది. శైలజకు. ఆ మెలకువతో పాటు తానొక వ్యక్తిని ఆవాళ అతిథిగా ఆహ్వానించినట్లుకూడా గుర్తుకువచ్చింది. అతిథి విషయం తలుచుకోగానే ఇంటిని అలంకరించాలని బుద్ధిపుట్టింది.

తనకున్న నాలుగు గదులలోనూ తను ఇంచుమించు రెండు వాడడం లేదని మొదటిసారిగా తెలిసివచ్చింది. తను ఎక్కువ వాడే గదిలోనే సామానంతా సరిచేసింది. ఇతరులతో సంబంధం లేకుండా ఉండాలనే వాంఛవల్ల ఇంత ఇల్లు తీసుకోవలసి వచ్చింది. అన్ని సౌకర్యాలూ ఉన్నవాటిలో ఇదే తనకు నచ్చింది. తనకు ఎక్కువగా అతిథులువచ్చే అలవాటు లేకపోవడం, ఒక్కతే కావడం వల్ల ఇంటి విషయం అంతగా పట్టించుకోలేదు. అయిదేళ్ళ హాస్టల్ జీవితంలో ఈ బద్ధకం, ఏది ఎల్లావున్నా నిర్లిప్తత వహించడం అలవాటయిపోయాయి. మొదటి రోజులలో తనెంతో శ్రద్ధగా సామాన్లు సర్దుకున్నా. తన రూంమేట్లు

ఇష్టంవచ్చినట్లు పడేసేవారు తమ సామాన్లను. వారితో వాదించి లాభం లేకపోయింది. వారి సహకారం లేకపోవడంచేత తనెంత సర్దినా గది ముత్తానికి కంగాళీగానే ఉండేది. 'ఆరునెలలు సావాసచేస్తే వారువీరవుతార'న్నట్టు పోను పోను తనకూ అదే అలవాటయిపోయింది. పరీక్షలకు రాత్రి రెండు మూడింటిదాకా చదవవలసి వచ్చినప్పుడు బద్ధకంగానే పడుకోవడం, బద్ధకంతోనే లేవడం. వీటితో వస్తువులమీద శ్రద్ధ, వాటి అలంకరణ విషయంలో వహించే జాగ్రత్త క్రమంగా సన్నగిల్లాయి. అదే అలవాటుగా పరిణమించి ఇక్కడకూడా ఎక్కడి వక్కడ వదిలెయ్యడం జరిగింది.

కొత్త దృష్టితో చూసేసరికి ఇల్లెంతో అసహ్యంగా కనబడింది. ఇల్లిల్లా అట్టెపెట్టుకుని తనకు ఇతర విషయాలపట్ల ఆసక్తి ఎలా కలిగిందా అని ఆశ్చర్యం వేసింది.

వెంటనే ఇంక ఇతర పనులు కట్టిపెట్టి ఇల్లు సర్దడానికి ఉపక్రమించింది. దండాలమీద బట్టలన్నీ తీసేసి బట్టల బుట్టలోకి చేర్చింది. చిందరవందరగా టేబుల్ మీద ఉన్న పుస్తకాలన్నీ సవరించి పెట్టిపోని టేబుల్ క్లాత్ పరచింది. కిటికీలకని కుట్టించి పెట్టి అడుగున పడేసి వాటిమాటే మరచిపోయిన తెరలు తీసి కిటికీలకు కట్టింది.

విధివిరామం లేకుండా ఎంతో కష్టపడి అన్నీ సర్దేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది. మొదట ఒకలా సర్ది నచ్చక, అటుని ఇటు, ఇటుని అటు మార్చి ఏ వస్తువు

ఎక్కడ ఉంచితే నిండుగా ఉంటుందో ఆలోచించి సవరించింది.

అతిథి వస్తాడనగానే అన్నీ సమస్యలే అయ్యాయామెకు. సాయంకాలం అతనికి సత్కారం ఏం చెయ్యాలి అని. హోటల్ నుంచి తెప్పించడం అనే భావనకు తావే ఇవ్వలేదామె. అదీ ఇదీ చివరకు అన్నీ ఆలోచించి హల్వా చేద్దామని నిశ్చయించింది. విశ్వం ఎంతో మెచ్చుకుంటాడు తను చేసిన హల్వాను. ఇతనికి కూడా అదే చేస్తే సరి. దానికితోడు బజ్జీలు చేసింది.

త్వరత్వరగా పూర్తిచేసి అలంకరణకు కొంత వ్యవధి తీసుకుని తెమిలి అయిందనిపించేసరికి ఆయాసం వచ్చినంత పని జరిగింది. నాలుగయింది.

చక్కగా సర్దిన డ్రాయింగ్ రూంలో కుర్చీలో కూర్చుని ఖాన్ కోసం ఎదురుచూడ సాగింది.

ఇటు నాలుగున్నర కావడం అటు కారు హారన్ మ్రోగడం ఒక్కసారే జరిగాయి. ఇంతసేపూ ఎంత స్వతంత్రంగా ఉన్నా ఒక్కసారి ఉలిక్కి పడింది. గబగబ లేచి వీధిలోకి ఎదురువెళ్ళింది

చిరునవ్వుతో నమస్కరించాడు ఖాన్. ప్రతి నమ నమస్కారం చేసింది శైలజ.

"భలే! సరిగ్గా అన్న క్షణానికి వచ్చారే!" అభినందించింది.

"లేదు, నా టైం ప్రకారం మూడున్నర నిమిషాల

ఆలస్యం. దానికి క్షమార్పణ చెప్పాలి మీకు." చిరునవ్వు నవ్వాడు.

"నిజం చెప్పద్దూ! నే నింకా మీరు రావడం అర గంట పట్టవచ్చు ననుకున్నాను."

"మీ రంతేనా?"

"భారతీయులం కదా!"

"కాని నా కెందుకో చెప్పిన టైముకు రాలేకపోతే బాధపడడం అలవాటు."

"రండి, కూర్చోండి." కుర్చీ చూపించింది.

కుర్చీలో కూర్చుని చుట్టూ చూసి శైలజ కేసిచూసి అలా చూస్తూ ఉండిపోయాడు ఖాన్.

"అదేమిటలా ఆశ్చర్యపోతున్నారు? ఇంత చదువు కున్నా నంటుంది, ఇల్లింత అశుభ్రంగా ఉందేమిటనా!"

"లేదు. ఇల్లు చక్కగా ఉంది. నా కాశ్చర్యం కలి గించిం దదికాదు. ప్రకృతి మీకు చక్కని తెలివిని కూర్చ డంతో ఊరుకోక మరో అమూల్యమైన వస్తువు కూడా ఇచ్చింది. కళను గురించి నాకేమీ తెలియకపోయినా, ఏ చిత్రకారుడైనా మిమ్మల్నివాళ చూస్తే చిత్రించకుండా ఊరుకోలేడని మాత్రం అనిపిస్తూంది."

నిష్కపటంగా ఉన్న ఈ పొగడ్త ఆమెకు సంతో షాన్నే చేకూర్చింది కాని ప్రకృతిసిద్ధంగా ఆమెలోని స్త్రీ లజ్జ ప్రకటించింది. తత్కారణంగా ఆమె చెంపలు ఎరుపె

కాదు. కానీ, ఎంతో కాలంగా పొందిన శిక్షణ, ఎంతో మంది పురుషుల మధ్య స్వేచ్ఛగా మెలగడం తోడుఅయి ఆమె ఇట్టేసిగ్గుని అణుచుకుని సంబాళించుకుని యధాస్థితికి వచ్చేసింది.

అంతటితో ఊరుకోలేదు.

“భట్రాజు పని మాత్రం మీరు వదిలిపెట్టలేరన్న మాట!” అంటూ ఎత్తి పొడిచింది.

“మీరల్లా అనుకుంటే నాకు అభ్యంతరంలేదు. కాని ఉన్నమాట అనెయ్యడం నా ప్రకృతిలో ఉంది. బహుశః అది లోపం కావచ్చు.”

“ఉన్నమాట — ఇతరులను సిగ్గుపరచేదైనా అనేస్తారా?”

“సహజమైన పొగడ్తకు సిగ్గుపడడం అనవసరం. అందమైన వస్తువులను చూస్తే మీరు మెచ్చుకోరా?”

“వస్తువు, మనిషి ఒకటేనా?”

“సౌందర్యానికి సంబంధించినంతవరకు ఒకటే!”

శైలజ చటుక్కున ఆవిషయం వదిలేసి, “రెండు నిమిషాలుండండి. ఇప్పుడే వచ్చేస్తాను”, అనేసి లోపలికి దారి తీసింది.

రెండు ప్లేట్లతో తీపి, కారం పెట్టి, కాఫీపాట్, పాలు అన్నీ ట్రేతో తీసుకువచ్చింది.

“మిమ్మల్ని ఊరికే కూర్చోపెట్టి మాటలలో పడ్డాను.

చూడండి నా తెలివి!" అంటూ ప్లేట్లు అతని ముందుం చుంది.

"ఎందు కివన్నీ తెప్పించారు?" అడిగాడు ఖాన్.

"తెప్పించలేదు."

"అయితే చేశారన్నమాట! మీకు బాగానే పని కల్పించాను."

"మీ యింటికి వచ్చినప్పుడు పెట్టక్కర్లేదు లెండి."

"సహజంగానే మీ కివన్నీ మా యింట్లో సమకూర్చ లేను. ఒకవేళ ఏమైనా పెట్టినా హోటల్ వే."

"ముందివి కానీండి, తరవాత మాట్లాడుకుందాం. అస లింతకూ తినగలరో లేరో!" అంది శైలజ.

"మీమీద మీకు నమ్మకం లేదా? లేక అల్లా అనడం ఫాషన్ అనుకుంటారా?"

"మీ మాటచూస్తే మీ కితరుల మాటమీద నమ్మకం లేనట్టుంది!"

"ఆ మాట నే నొప్పుకోను. ఇతరులు కేవలం నన్ను మోసపుచ్చుదా మనుకుంటే మాత్రం తామే మోస పోతారు. ముందు తిండిపెట్టుకుని పోట్లాడడం నా తత్వం కాదు" అంటూ తినడానికి ఉపక్రమించాడు.

"అయితే చెప్పండి ఎలా ఉన్నాయి?"

"దివ్యంగా ఉన్నాయి. యిందాకటి మాటే మళ్ళీ అన బుద్ధవుతోంది. ముఖస్తుతి అనుకుంటారేమోనని

భయంగా ఉంది. కాని అనకుండా ఉండలేను అన్నిటా ఉన్నారు మీరు. ఇటువంటివి పెడతానంటే రోజూ విధిగా మీ యింట్లో మస్తరు వేయించుకుంటాను."

మస్తరన్నమాట వినగానే శైలజకు నవ్వు ముంచుకొచ్చింది. ఖాన్ విస్తుపోయాడు.

"అదేమిటి అంత నవ్వు పుట్టించే మాట నే నేమన్నాను?"

"అబ్బే! 'అదే - మస్తరంటేను—" నవ్వు తెర మళ్ళీ వచ్చింది శైలజకు.

"ఏం మస్తరంటే?"

"పి. డబ్ల్యు. డి. వాళ్ళ పాట కదూ అది?"

"అదా-!" పొట్ట చెక్కలయ్యేలా నవ్వాడు ఖాన్.

"మా అన్నయ్య చెప్పాడు వాళ్ళ గురించి. ఎంత డబ్బువృధా అయిపోతూందండీ? ఎవ్వడూ అడ్డుపెట్టేవాడు లేక నిరాఘాటంగా సాగిపోతూంది. అందరికీ తెలిసున్న రహస్యమే. ఎందుకు ప్రోత్సహిస్తున్నారో తెలీదు. ఎంత డబ్బు తింటున్నారో కంట్రాక్టర్లు. లంచాలు తిని కళ్ళు మూసుకుపోయి ఎల్లా కడుతున్నా చూస్తూ ఊరుకుంటున్నారు. అఫీసర్లు: ఇవన్నీ చూస్తుంటే ఒళ్ళు మండుకొచ్చి ఏం చెయ్యాలేక మళ్ళీ ఏడుపొస్తుంటుంది నాకు." ఆవేశంగా అంది శైలజ.

"ఎందు కంత ఆవేశపడతారు? చాలీ చాలని జీతా లిస్తే వారుమాత్రం ఏం చేస్తారు?"

"చిన్న జీతాలవాళ్ళమాట వదిలెయ్యండి. పెద్దలనుకునే వాళ్ళ మాట?"

"ఇప్పటి పెద్దలు ఒకనాటి చిన్నళ్ళేకదలండీ! ఒకసారి అలవాటయితే యింక వదల్లేరు. మన తప్పనుకునే దాన్ని ఒక్కసారి ఆచరిస్తే ఇంకది తప్పుగా కనబడడంమానేస్తుంది. మొదట అది వదిలిపెట్టగలగనేగలగాలి కాని ఇంక ఆ తరవాత అది చాలా సహజమైపోతుంది.

"అయితే ఇంకిది సాగిపోవాలంటారా!"

"అది చాలా విషయాలమీద ఆధారపడివుంటుంది. ఉదాహరణకు, క్రింది ఉద్యోగస్థుల హోదా, జీవనప్రమాణం పెరుగుతాయనుకోండి. అప్పుడు తను మంచి అనుకునే దాన్ని విడిచి చెడ్డ మార్గంలోకి పడ్డాలంటే తటపటాయిస్తారు. ఎక్కువ ఆశ చూపించి ప్రలోభపరిస్తే తప్ప లొంగడు. ఆ 'ఎక్కువ' అవతలివాడు యిచ్చుకోగలిగిన దానికంటె హెచ్చు స్థాయిలో ఉన్నప్పుడు ఇవతలివాడు లొంగిపోయే అవకాశాలు సన్నగిల్లిపోతాయి. అంటే కనీస వేతనాల స్థాయి ఎంత పెరిగితే అంత మంచి జరుగుతుం దన్నమాట!"

"అదేవిటండీ! ఆశ అనేదానికి అంతెక్కడుంది?" మొన్న నెక్కడో చదివాను గేయం ఒకటి—

"అసంతృప్తి మానవతకు
మారుపేరు మరేస్మీ—
ఇంతుంటే చాలనుకోలేవ్
ఎంతో లేదనుకుంటావ్!..."

అంటూ మొదలుపెట్టి: పస్తులున్నప్పుడు ఒకపూట తిండి చాలనుకుంటాడనీ: తరవాత దానితోటి తృప్తి చెందలేడనీ —

"అంతస్థులు పెరిగినగొద్దీ
అంతకుమించిన ఆశలు రేగాయ్..."

అంటూ చాలా రాశాడు. నాకూ నిజమేననిపిస్తుంది. చదువుకునే రోజుల్లే నాలుగు రాళ్ళు సంపాదించే రోజొస్తే యింక నా జన్మ తరించినట్టే ననుకున్నాను. కాని యిప్పుడేమీ తృప్తివున్నట్టు కనబడదు. యింక మీరు చెప్పినట్టు చేస్తే మాత్రం ఏం లాభం?" అంది శైలజ.

"మీరు చెప్పింది బాగానే ఉండచ్చు. కాని ఇటుచూడండి.. ఒక గ్రాడ్యుయేటు ఉంటాడు. లోవర్ డివిజన్ గుమాస్తాగా చేరతాడు గతిలేక. ఒక ఏనభై రాళ్లు పడేస్తారు. అది చాలక అష్టకారితో దుక్కుతాడు, ఎక్కువకోసం. ఒకవేళ దానిఫలితంగా ఉద్యోగంపోతే ఆమాత్రం మరెక్కడైనా సంపాదించుకోగలడు, అందుచేత బెంగఉండదు. అదే కాస్త ఎక్కువ హోదాగల ఉద్యోగం — చాలావరకు అవసరాలు తీరి, స్థిరత్వం ఉంటుందనుకోండి, ఆ ఉద్యోగం ఊడిపోతే అనే ప్రశ్న వచ్చినప్పుడు అంత తేలిగ్గా తోసిపారెయ్యలేదు."

"అది వ్యక్తిని బట్టి ఉంటుంది. అందరికీ వర్తింప జెయ్యలేరు మీరు."

"నిజమేలెండి." గబుక్కున ఆపేశాడు ఖాన్.

"అదేమిటి హఠాత్తుగా అల్లా తగ్గిపోయారు ?"

"ఏం లేదు."

"చెప్పండి. నేనేమైనా మొండిగా వాదిస్తున్నానా"

"అల్లా అని ఎవ రన్నారు ?"

"మరి ఆపేశా రేం?"

"ఎందుకంటే — ఎప్పటికీ ఆ వాదనకు అంతు ఉండదు. మీ వాదనను మీరు సమర్థించుకుంటారు. నా వాదనను నేను సమర్థించుకుంటాను. దానివల్ల ప్రయోజనం ఉండదు. ఇంకా ఒక్కవేళ పట్టుదల ఎక్కువ అయితే మాటలు కూడా తెగిపోతాయి" నెమ్మదిగా అన్నాడు ఖాన్.

"అల్లా అనుకుంటే మీరు పొరబడ్డా రన్నమాట! వాదనకోసం మాట్లాడే వాటిని మనస్సుకు పట్టించుకుంటే, ఎలా? అదీకాక వాదన లెలా ఉన్నా అసలు సత్యం అనేది ఒక టుంటుందిగా?"

"ఏమిటా అసలు సత్యం?"

"నలుగురూ ఒప్పుకున్నది."

"అసలు నన్నింకో రహస్యం చెప్పమన్నారా ? ఇద్దరు వాదించుకుంటూ ఉంటే ఆ వాదనల సారాంశం ఆ

ఇద్దరు చెప్పిన వ్యాఖ్యానాలమీద కంటె వారి వ్యక్తిత్వాలమీద ఎక్కువ ఆధారపడి ఉంటుంది."

"మీరు బొత్తిగా కొత్తసంగతులు చెబుతున్నారు."

"కొత్తవేం కాదు, పాతవే."

"వక్తల వ్యాఖ్యానాలకంటే వారివ్యక్తిత్వం ఎక్కువ ప్రాధాన్యం వహిస్తుందంటారేం ఎల్లాగ? ముప్ఫై కోట్ల మంది ఏక కంఠంతో అరిచినా, ఒక గొప్ప వ్యక్తి ఉద్ఘాటించినా అబద్ధం అబద్ధమే."

"మీరు చెప్పినట్టు ఎంత గొప్ప వ్యక్తి చెప్పినా అబద్ధం అబద్ధమే అయి నిజం నిజమే అయితే, ఈ గొప్ప వ్యక్తు లనబడేవారు ఇంతమంది ఉండడం కుదరదు. గొప్ప వాళ్ళనబడే వాళ్లలో ఒకరి కొకరు పరస్పర విరుద్ధభావాలు గలవాళ్ళున్నారు. ఇద్దరికీ చుట్టూ చేరేవాళ్ళుంటారు. ఎంత ఎక్కువమంది ఒక వ్యక్తి చుట్టూ చేరితే ఆ వ్యక్తి వ్యక్తిత్వం అంత గొప్పదన్నమాట. ఇతరులను అంత నమ్మేటట్టు చెయ్యగలదన్నమాట!"

మాటల ధోరణిలో పడిపోయి కాఫీ మాట మరిచి పోయినట్టు శైలజకు హఠాత్తుగా గుర్తుకు వచ్చింది. గబ గబ కప్పుల్లో పాలుపోసి డికాక్షన్ వేసి కలిపి రంగు సరి చూస్తూ ఉండగా ఖాన్ రెంటిలో రెండేసి స్పూన్ల పంచ దారవేసి ముందామె కప్పులోది కలిపి, "చాలా, ఇంకా వెయ్యమంటారా?" అని అడిగాడు.

"చాలు" అంది శైలజ.

మెల్లిగా ఇద్దరూ కాఫీ త్రాగడం మొదలెట్టారు.

"ఇందాకటి విషయం. ఇద్దరు పరస్పర విరుద్ధ భావాలు గల వ్యక్తులున్నారంటే ఇద్దరు చెప్పేదాంట్లోనూ కొంత సత్యం ఉండవచ్చు. అందుకనే వాళ్ళచుట్టూ చేరే వాళ్ళుండవచ్చు. ఆ సత్యాన్ని ఒప్పుకోవద్దా !" అని అడిగింది శైలజ.

"అక్కడే మీరు కప్పదాటు వేస్తున్నారు. సత్య మనేదాని ఉనికిని ముందే ఒప్పుకుని మీరు వాదన మొదలు పెడుతున్నారు. అది తప్పు"

"అంటే!! సత్య మనేదానికి ఉనికే లేదంటున్నారా? వస్తు స్వరూపం చూసుకోండి. అది ప్రత్యక్ష సత్యమేగా?" ఆశ్చర్యంగా అడిగింది శైలజ.

"అని ఎవరన్నారు !"

"అరె! ఈ టేబుల్ ఇక్కడ ఉంది. దానిమీద టేబుల్ క్లాత్ ఉంది. దానిమీద కప్పులు, ట్రే ఉన్నాయి ఇవి వస్తువులు. వాటి స్వరూపం అందరికీ ఒకలాగే కనిపిస్తుంది. మన భావాలలో వైరుధ్యం ఉన్నా ఇది సత్యమేగా ?"

నవ్వి ఊరుకున్నాడు ఖాన్.

"చెప్పండి" అంది శైలజ.

"నా వాదన తోసిపుచ్చేముందు అర్థమం ఆలోచించి చూస్తానని మాటిస్తే చెబుతాను. లేకపోతే ఇక్కడ ఆపెయ్యడం ఉత్తమం."

"తప్పకుండా. అదే నిజమనిపించే పక్షంలో ఒప్పు కుంటాను."

"అది అంత తేలిక కాదు."

"ఎందుచేత?"

"వస్తువు స్వరూపంలోని యథార్థాన్ని ఒప్పుకుంటారు మీరు. ప్రశ్నిస్తాను నేను. నా వాదనను చాలా నిష్పాక్షిక దృష్టితో చూస్తేతప్ప ఒప్పుకోలేరు. మీరు మీవాదనను మరిచిపోయి ఇటు ఆలోచించడానికి ప్రయత్నించి అప్పైన ప్రతిఘటించండి. సరేనా?"

"అలాగే" ఆశ్చర్యంలో మునుగుతూ అంది శైలజ.

"అయితే వినండి. వస్తు స్వరూపం అందరికీ ఒక్క లాగే గోచరించదు. కాని అందరి భావనలలోనూ ఐక మత్యం మాత్రం ఉంది. దీనికి కారణం మనం అంతా అదే తీరుగా ఆలోచించడానికి అలవాటు పడడంలో ఉంది. చిన్నతనంలో అప్పుడప్పుడే మనలో వస్తుజ్ఞానం ఉత్పన్న మౌతున్న రోజులలో ఇతరులనుంచి ఆ జ్ఞానాన్ని అలవరుచు కుందుకు ప్రయత్నిస్తాం. గులాబిపువ్వును చూపించి అది గులాబి అని తెలియజేస్తారు. దాని రంగు ఎరుపు అని చెబుతారు. ఆకుల రంగును ఆకుపచ్చ అంటారు. ఇల్లాగే మిగతావి. ఆ సూచన మనమీద పని చేస్తుంది. మనకు నేర్పినవాటితో ఇతర వస్తువులను పోల్చి వాటికీ వీటికీ తాదాత్మ్యం కనపడితే ఒకే రాశిలో చేరుస్తాం వాటిని.

ఈ సూచనే మనిషిని శాసిస్తుంది. అందరికీ అన్ని వస్తువులూ ఒక్కలాగే కనపడవు. దానికి కారణం వారి వారి శరీర నిర్మాణాలలోని వైవిధ్యమే. చూడడం, వినడం, స్పర్శజ్ఞానం ప్రతిదీ కూడా సాపేక్షం. ప్రతి దానిలోను వ్యక్తిత్వం ప్రాధాన్యం వహిస్తుంది. ఒకేలాగు ఉన్న పది వస్తువులు ఒక్క వ్యక్తికి ఒక్కలాగే కనబడతాయి, మరొకరికి కనబడినట్టు కనబడకపోయినా. అందుచేత ఆ పది వస్తువులూ ఎవరికి చూపించినా పదీ ఒక్కలాగే ఉన్నాయని అంతా ఒప్పుకుంటారు. దానితో పదిమందికీ అవి ఒక్కలాగే కనబడుతున్నాయని మనం భ్రమపడతాం. ఆకుపచ్చరంగు పదిమందికీ పది రూపాలలో కనపడినా పది ఆకుపచ్చరంగు వస్తువులను అందరూ ఒకేలాగు గుర్తిస్తారు. ఇదే ఉదాహరణ అన్నింటికి వర్తింపజెయ్యవచ్చు."

"ఏమిటో అంతా తికమక పెట్టేస్తున్నారు" అంది శైలజ.

"ఇందులో తికమక ఏమీలేదు. శాస్త్రజ్ఞులు నిరూపించిన విషయం యిది. పగలు ఆకుపచ్చ అనుకునే ఆకులు రాత్రి వెన్నెట్లో నల్లగా కనబడతాయి. వస్తుస్వరూపంలో మార్పులేదు. కాని మన దృష్టిలో మార్పు వస్తుంది. తక్కువ వెలుతురులో మన కంటికి రంగుల భేదం గుర్తించే నేర్పులేదు. అందుచేత అల్లా కనబడుతుంది.

పోనీ యింకో ఉదాహరణ యిస్తాను. మన భౌతిక పదార్థాల కన్నిటికీ (కాలపరిమాణంవదిలేస్తే) మూడు కొలతలు-పొడుగు, వెడల్పు, ఎత్తుగాని లోతుగాని - కావాలి. మనకు ఒక మనిషి పది గజాల దూరంలో ఉండి ఆ మనిషికి మరో పది గజాల వెనక ఇంకొకడుంటే, ఆ యిద్దరి మధ్య దూరం, మనకూ యిద్దరూ వివిధ దూరాలలో ఉండడం మనం గుర్తించగలం. అదీ 500 గజాలలోపు దూరాలలో మాత్రమే. అదే సినిమా తెర చూడండి. దానికి రెండు కొలతలే ఉన్నాయి. ఒక పొడుగు, ఒక వెడల్పు, అంటే యిందాక చెప్పిన యిద్దరు వ్యక్తులు ఒకరి వెనక ఒకరుంటే వారి మధ్య దూరం కనబడే అవకాశంలేదు. అయినా మనకు సినిమా సహజంగానే కనబడుతుంది. వారిమధ్య దూరం మనం అర్థం చేసుకుంటూనే ఉంటాం. ఎందుచేతనంటే రెండు కొలతలలో మనం మూడు కొలతలను చూడడానికి అలవాటు పడి ఉన్నాం. 3-డి వచ్చేవరకు అసలా తేడా ఉందనే మనకు తెలియలేదు.''

"మనిషిని సూచన (సజెష్చన్) శాసిస్తుంది. అన్నారే? అదేమిటి?'' అంది శైలజ.

'పైన చెప్పింది దానికో ఉదాహరణే. ఇంకా చెప్తాను కావాలంటే. ఒకడికి అమాంతం తండ్రి చచ్చిపోయినట్టు టెలిగ్రాం వస్తే అందులోని నిజానిజాలను గురించి ఆలోచించగానే ఆ మాట ఆతనిమీద పని చేస్తుంది. నిశ్చేష్టుడైపోతాడు. ఏడుస్తాడు. ఆ టెలిగ్రాం

ఎవరైనా అతన్ని సరదాగా ఏడిపించడానికి యిచ్చినా పరిణామం మాత్రం విధిగా ఉంటుంది. నిద్రపోయినప్పుడు కలల విషయం తీసుకోండి, మన మెదడు పని చేస్తూనే వుంటుంది. వివిధ రూపాలూ కనబడుతూ ఉంటాయి. దృశ్యాలు కనపడుతూ ఉంటాయి. అంతా నిజమే ననిపిస్తుంది మెలుకువ రానంతసేపూ. నెత్తికి తలుపు తగిలినట్టు కల వస్తే మంచానికి తలను ఢీ కొట్టేస్తాం. 'సోమ్నాంబులిజం' ఉన్న మనిషి అయితే నిద్దర్లో షికార్లు కూడా వెళతాడు తెలియకుండానే. నిజానికివన్నీ మిథ్య మాత్రమే అయినా ఎంతో వస్తు స్వరూపం కనిపిస్తుందా కాసేపూ."

"మీరు మరీ చెబుతారు. అయితే యీ శాస్త్రమంతా మిథ్యే నంటారా! ఈ ఆటంబాంబులు, రాకెట్లు ఎల్లా వస్తాయి శాస్త్రం అంతా మిథ్యే అయితే! ఇవన్నీ మీరు వ్యతిరేకిస్తారా?"

"ఇవి రూపొందినంత మాత్రాన శాస్త్రం చెప్పేదంతా నిజమని ఎవరనగలరు? కాంతిప్రసారం విషయం తీసుకోండి. మొదట రేఖా మార్గమన్నారు. తరువాత తరంగాలన్నారు. తరంగాలనుకోగానే పాత సిద్ధాంతాలన్నింటినీ తరంగ సూత్ర ప్రకారం అన్వయించ ప్రయత్నించి పట్టీలు కొట్టారు. అర్థంలేని వాటిని నమ్మి అదే నిజమన్నారు. తరువాత మళ్ళీ తరంగ న్యాయానికి గూడా వ్యతిరేకత సిద్ధించింది. అందుచేత యిప్పుడు రెండూ ఒప్పుకుంటున్నారు. దీన్నిబట్టి తేలిం దేమిటంటే మనకు తెలియనంత కాలం ఒకదాని నమ్ముకుని కూర్చుంటాం."

"కాని ఒక క్రియ జరుగుతూ ఉండడం నిశ్చయమేగా? దానికి కారణం ఉండద్దూ! ఎలక్ట్రిక్ బల్బు వెలగడం తీసుకోండి. స్విచ్ వెయ్యగానే వెలుగుతోంది. ఒప్పుకుంటారా?"

"క్రియ ఒప్పుకుంటాను. కారణం విషయంలోనే నా అనుమానం. ప్రతి క్రియకూ ఒకే కారణం ఉండాలనుకోవడంలోనే తప్పంతా యిమిడి ఉంది. విద్యుత్ప్రవాహం జరిగి బల్బు వెలగడానికి కారణంగా ఒక్క స్విచ్ వెయ్యడం మాత్రమే చెబుతున్నారు. అదే ప్రధానంగా ఎంచుతున్నారు. ఇతరమైనవి వదిలేశారు. అసలా యింటికి 'కనెక్షన్' ఉండాలి. వైరింగంతా బాగుండాలి. ఆ బల్బు బాగుండాలి. ఇవన్నీ జరిగిననాడే స్విచ్ వెయ్యగానే వెలుగుతుంది. కాని మనం స్విచ్ వెయ్యడం మాత్రమే కారణంగా ఎంచుతున్నాం. రేపు ఎవరేనా వచ్చి విద్యుత్తు లేదు, ప్రవాహం లేదు, ఇదంతా మరో సూత్రం మీద ఆధారపడి ఉంది. అంటే— మనలను నమ్మించి ఒప్పించగలిగితే- ఇదే బల్బు వెలగడానికి అది కారణంగా మనం అంగీకరిస్తాం. మన తర్కంమీదే ఎక్కువ ఆధారపడి ఉంటుందంతా" అన్నాడు ఖాన్.

"నిజమేనండీ! నే నెప్పుడూ ఇల్లా ఆలోచించడానికి ప్రయత్నించలేదు. బాగా విడమరిచి చెప్పారు" అంది నమ్మకంతో.

"చూశారా అప్పుడే పప్పులో అడుగేస్తున్నారు. నేను చెప్పినవన్నీ వాదన విషయాలు. పది నిముషాల క్రితం వీటితో ఏకీభవించలేక పోయారు. ఇప్పటికీ నేను చెప్పిందే నిజమని ఏమీ నమ్మకం లేదు. ఇంకా ఆలోచించాలి మీరు. నా వాదన లన్నిటిని ప్రతిఘటించడానికి ప్రయత్నించాలి."

"ప్రతిఘటించడం కంటె మీ దగ్గర విషయాలు నేర్చుకోవడమే మంచిదనిపిస్తోంది. అయితే యివన్నీ యిల్లా ఉండడానికి కారణం ఏమిటంటారు?"

"ఎల్లాగ ?"

"ఒక తప్పుకూడా చాలా కాలం పాటు నిజంగా గ్రహింపబడడం- అదీ ఒక వ్యక్తి చెప్పిన తీరు ఆధారంగా?" అడిగింది శైలజ.

"మళ్ళీ మీరు వెనక్కి పోతున్నారు. ఒక తప్పు చాలాకాలంపాటు నిజంగా గుర్తింపబడడం అని. రెండో వ్యక్తి చెప్పింది కూడా సత్యమని ఏమీ ఆధారం లేదు. కాని కొన్నింటినైనా ప్రమాణాలుగా తీసుకోకపోతే ప్రగతి ఆగిపోతుంది. కొంతవరకు నమ్మి వాటిమీద ప్రయోగాలు సలుపుతున్నప్పుడే కొత్తవి బయట పడుతున్నాయి. కారణం విషయంలో అభిప్రాయ భేదాలు ఉన్నా క్రియలు జరుగు తున్నాయి—"

"నే నడిగేది యీ తాత్కాలిక భ్రమకి కారణం."

"జనాభాలో ఎక్కువమంది స్వతంత్రంగా ఆలోచించ

డానికి ప్రయత్నించరు. దానికి కారణం సహజంగా వారిలో ఉన్న బలహీనతలు, వారు పెరిగిన పరిస్థితులు, వారు నివశించే పరిస్థితులు చాలామందికి ఎన్నో విషయాలు ఆలోచించేందుకు వ్యవధే ఉండదు. వారి కింతకంటె అధిక అవసరం కలిగిన తక్షణ సమస్యలు, వారి బుద్ధి ఉపయోగించ వలసి వచ్చేవి ఉంటాయి. అందుచేత ఎవరైనా ఏదైనా నమ్మదగినట్టు చెప్పితే నమ్మేస్తారు. తమ మార్గంలో ఏది సులువో అది అవలంబిస్తారు. తక్కినవాటి వేపు దృష్టి పోనియ్యరు. వాటి స్థిరత్వాన్ని ప్రశ్నించరు. అందుచేత ఒక గొప్ప వ్యక్తి చెప్పిన సత్యం మరో వ్యక్తి తరిచి చూచి దాని సత్యాన్ని ప్రశ్నించి ఎదురు సమాధానాలు చెప్పగలిగే వరకు మొదటి వ్యక్తి మాటే నిలుస్తోంది."

"చాలా కృతజ్ఞురాలిని. మీ రివాళ నాకెన్నో సంగతులు నేర్పారు."

"నేను నేర్పడం ఏముంది? ఇదివరకు ఇవన్నీ ఎవరో అన్నవే. అయితే మీరింత సులువుగా గ్రహించడంలో మీకున్న హేతుబద్ధమైన దృక్పథం బయటపడింది. అంతా ఇలాగే ఉంటే సమాజం నేడు ఉన్నంత అధోగతిలో ఉండేది కాదు- సరే. చాలా సేపు అయింది వచ్చి. ఇంక సెలవు తీసుకొంటాను" అన్నాడు ఖాన్.

"అరే! ఏమంత ముంచుకుపోయే పనులు ఉన్నాయండీ! అయినా ఎంతో సేపు కాలేదుగా మీరు వచ్చి!"

అప్పుడే వెళ్ళిపోతాడనే భావం ఆమెకు నచ్చలేదు.

"కాదులెండి. మళ్ళీ వస్తాను. వీలు అయితే మీరు కూడా మా యింటికోసారి రండి."

"తప్పకుండా. కాని మరీ తొందర పడుతున్నట్టున్నారు."

"కాదు. మీ రేమీ బాధపడకండి. సెలవు."

'సెలవు' అంటూ కారుదాకా సాగనంపింది శైలజ.

కారు కదలిపోయింది. భారంగా లోపలికి వెళ్ళింది శైలజ.

## 11

చదువుతూ చదువుతూ ఉన్న పుస్తకం విసిరి కొట్టింది అనూరాధ. గుమ్మంలో అప్పుడే అడుగుపెట్టిన హైమ తప్పించుకుని ఉండకపోతే ఆ తాకిడికి నెత్తి బొప్పి కట్టి ఉండేది.

పేపరు చదువుకుంటున్న విశ్వం ఉలిక్కి పడ్డాడు చప్పుడుకు.

"ఎవరిమీద వదినా, అంతకోపం?" అంది హైమ పుస్తకం తీస్తూ.

"రాణీగారి కింత ఆగ్రహం తెప్పించిన వ్యక్తి చాలా గొప్పవాడే ఉండాలి" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"ప్రభువులు క్షమించాలి. నాకు కోపం తెప్పించిన వ్యక్తి అతడు కాదు. ఆమె" అంది కొంత తేరుకుని.

"ఎవరా స్త్రీ రత్నం?" అడిగాడు విశ్వం

"పేరెందుకు లెండి."

"ఇంతకీ ఎందుకమ్మా అంత కోపం ?" అడిగింది హైమ నవ్వుతూ.

"చేతకాని తనాన్ని కప్పిపెట్టుకున్నందుకు, యితరుల నాడిపోసుకున్నందుకు" అంది అనూరాధ.

"అంటే ?"

"అంటే—మనలో ఉన్న లోపాలను మరిచిపోయి, లేని అనుమానాలన్నీ పెట్టుకుని, యివన్నీ ఎవరో కల్పిస్తున్నారనీ, ఆడవాళ్ళు బలహీనులనీ, వాళ్ళని నీచంగా చూస్తున్నారనీ ఊహలు మొలకెత్తించుకుని, వ్యక్తిత్వం పోగొట్టుకుంటున్నందుకు—"

"అసలామె ఏం రాసింది?" విశ్వం అడిగాడు.

"పాతపాటే — మొగాడు ఎన్ని తప్పులు చేసినా సంఘం హర్షిస్తోందనీ, ఆడవాళ్ళకు స్వాతంత్ర్యం లేదనీ, పురుషుడికి స్త్రీ బానిసగా ఉంటోందనీ, వగైరా వగైరా—"

"అవన్నీ నిజమేగా!" విశ్వం అన్నాడు.

"ఆఁ నిజమే అల్లా నిజమని మీరూ అనుకుని ప్రతి విషయంలోనూ స్త్రీకి మరింత రక్షణ యిచ్చి వాళ్ళ బలహీనత మరింత పెరగనిస్తున్నారు. స్త్రీకి సమానస్థానం యివ్వడంకంటె ఉన్నతంగా కూర్చోబెట్టి వాళ్ళ

తీసుకువచ్చారు మగవాళ్లు. అంతవరకు వాళ్ల తప్పు ఒప్పుకున్నాను. కాని మరి వీళ్ళకిచ్చిన అధికారాన్ని గుర్తించక పోవడంతో ఊరుకోక పైగా బానిసలుగా చూస్తున్నారని వాపోవడమేమిటి !"

"అల్లాగంటే ఎల్లా వదినా! ఎన్ని తరాలుగానో స్త్రీ అణగ ద్రొక్కబడి ఉంది. దానివల్లే కదా మనలో యీ నాటికీ వ్యక్తిత్వం కుంటుపడి పోవడం, పురుషులమీద ఆధారపడడం జరుగుతోంది? విద్యలోను, సంఘంలోను అన్నిటా పురుషునిదే పైచేయి అయి, వాళ్లు చెప్పినట్లు మనం నడుచుకోవలసి వస్తోంది కదా? ఇన్నాళ్ళ కిప్పటికి కదా స్త్రీ విద్యకు ప్రోత్సాహం వచ్చింది? వితంతువులు యీనాటికీ జీవితాంతం కష్టాలనుభవించడం లేదూ? పురుషుడికి పునర్వివాహం అంగీకరించిన సంఘం మొన్న మొన్నటిదాకా స్త్రీ పునర్వివాహాన్ని నిషేధించలేదూ? ఈ నాటికీ యింకా వెలివేసేవారు లేరూ? భార్యపోతే నెల తిరగకుండా పెళ్ళికొడుకు అవుతాడే పురుషుడు! అదే స్త్రీ అయితే? ఆ జన్మాంతం అనుభవించ వలసినదేకదా? మరి వీటన్నిటికీ కారణా లేమిటంటావ్?" అంది హైమ. ఎప్పుడూ రెండు ముక్కలు మాట్లాడని ఆమె ఇంత దీర్ఘంగా ఉపన్యసించడం చూసి విశ్వం నవ్వుకున్నాడు.

ఇంతలో నిధి వచ్చాడు.

"ఏదో వేడివేడి చర్చలో వున్నట్టున్నారే?" అడిగాడు చిరునవ్వుతో.

"మీ అక్క యివాళ స్త్రీజాతిని దుయ్యబడుతూంది" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"నాకూ చెప్తే విని ఆనందిస్తాను."

విశ్వం క్లుప్తంగా వివరించాడు.

"వీరి రాకతో నామాట మరిచిపోయావ్. చెప్పు వదినా సమాధానం?" హైమ మళ్ళీ అడిగింది.

"నువ్వింకా సంసారంలో అడుగు పెట్టక పోవడం వల్ల నీకింకా తెలీదమ్మా పురుషుడు స్త్రీ కెంత ఉన్నతి యిస్తున్నాడో! చెమటోడ్చి కష్టపడి సంపాదించి యీ మెగారిని అనుభవించమని కూర్చోబెడుతున్నాడు. ఆడింది ఆట, పాడింది పాటగా సాగిస్తున్నాడు. తనకు మించిన ప్రతిపత్తి యిస్తున్నాడు. గృహలక్ష్మిని చేసి పూజిస్తున్నాడు. ఆమె ఉద్యోగంచేసి తనకు యివ్వలేదని బాధపడడు. స్త్రీలు పురుషులమీద ఆధారపడి ఉంటున్నారంటావ్. ఎందులో? డబ్బు సంపాదనలోనా? అయితే ఆ సంపాదించి తెచ్చిన దానిని జాగ్రత్తగా వాడి, వండిపెట్టి అతనికి సౌకర్యం కూర్చడంలో ఆమె బాధ్యత లేదా? ఈ విషయంలో పురుషుడు స్త్రీమీద ఆధారపడి ఉండడం లేదా ? ఇది సహజీవనం. ఎవళ్ళకు తెలిసిన పని వాళ్ళు చేసి జీవితాన్ని ఆనందమయం చేసుకోవడమే లక్ష్యం. స్త్రీ తాను వండిపెట్టి ఇల్లు దిద్దుకోవడంలో పురుషునికి బానిస అయినట్లు భ్రమపడితే, పురుషుడుకూడా కష్టించి పనచేసి సంసారానికి బానిస అయినటు భావించవలసి

వస్తుంది. కాని వారి హృదయవైశాల్యం వారినల్లా ఆలో చించనియ్యదు. స్త్రీలు చేసే తప్పులెన్నో పురుషుడు సహి స్తాడు; క్షమిస్తాడు. కాని స్త్రీలలోనే ప్రలోభం, మాత్స ర్యం ఎక్కువ. ఇక ఆడది ఉద్యోగంచేసి మొగాడిని ఇంట్లో కూర్చోపెట్టాలనా నీ ఊహ? కావలసినది పని. అందులో ఏ భాగం ఎవరివల్ల నయితే ఆ భాగం వారు చేస్తారు. విజ్ఞాన విషయాలు ఎవరు కనిపెట్టారనే ప్రశ్నకన్న ముఖ్య మైనది వాటివల్ల ఉపయోగం పొందడం. ఒక పని చెయ్య డంలో ఒకడు ఎన్నో ఏళ్లుగా అనుభవం, వాటికి కావల సిన పరికరాలు పొంది ఉన్నాడనుకో. మన కా పని కావ డమే ముఖ్యం అయితే ఆ పనిని అతనిని చెయ్యనిస్తేనే సౌకర్యం. ఇంక స్త్రీ విద్య అంటావా? అంటే డిగ్రీలు పుచ్చుకోవడమా? డిగ్రీలు, ఉద్యోగాలకోసం కాకపోతే తక్కిన విద్యలలో స్త్రీ ఎప్పుడూ వెనుకబడిలేదు—" అంటూ ఆగింది గుక్క తిప్పుకోవడానికి.

ఆమె ధోరణిచూస్తే ఇంకా చెప్పేటట్టుంది. అందుకే ఎవరూ మాట్లాడలేదు. ఆమె మళ్ళీ మొదలెట్టింది.

"పురుషుడికి లేని ఆధిక్యం మరొకటుంది స్త్రీకి. అదే మాతృత్వం. బుద్ధుడంతటివాణ్ణి, 'సుకృతాత్మమైన మహా మాయాదేవి కడుపారగన్న బంగారు తండ్రి' అన్నారు. స్త్రీ తన బిడ్డలకోసం చేసే త్యాగాలతో పురుషుడెన్నటికీ సరితూగలేడు. అందులోగూడ స్త్రీకిఉన్న ప్రత్యేకతే కన బడుతుంది. స్త్రీలు ఉద్యోగాలు చెయ్యాలన్నా అడ్డంవచ్చే

దదే! ప్రకృతికూడా వైరుధ్యమే కల్పించింది కొన్నిపనులు ఒకలా జరగడానికి వీలుగా. దాన్నెదిరించి సాధించేదేమిటి? మొగాడు ఏదిచేసినా హర్షిస్తారంటావు. ఎవరూ? అంతా హర్షించరే? బాలవితంతువులు కష్టాలను భరించవలసి వస్తూందంటావు. అది పురుషుల లోపంవల్ల కాదే! సంఘా న్నెదిరించలేక పోవడం పురుషుల లోపం వల్లనేనా? వితం తువుల తల్లులే అంగీకరించరే పునర్వివాహానికి? ఇంకరెండో వైపున కూడా అంతే. వరుని తల్లి ఒప్పుకోదు, తన కొడుక్కి వితంతువులనిచ్చి వివాహం చెయ్యడానికి. ఇది ఎవరి తప్పు? ఆడవాళ్ళలోనే అసలు అసూయ లెక్కువ. ఈ పుక్కిటి పురాణాలన్నిటికీ ప్రచారం యిచ్చేది ఎవరూ! నీలాంటి రేవులలో సాగే ప్రచారాలేమిటి? పురుషుడు పున ర్వివాహం చేసుకున్నాడంటే ఇచ్చేవా డున్నాడు గనక, చేసుకునే ఆడది ఉందిగనక చేసుకుంటున్నాడు. అంటే ఒకతప్పైనా, అధికారమైనా, ప్రతిపత్తి అయినా స్త్రీ సహకారంతోనే గదా జరుగుతూంట. ఇక సవతితల్లుల అనురాగాన్ని గురించి దుష్ప్రచారానికి అంతు లేదుకదా? అదెవరి లోపం? ఇక స్త్రీమీద పురుషుని అత్యాచార మేమైనా సాగుతూంటే అది స్త్రీ బలహీనతవల్ల. బలహీనుల మీద బలవంతుడు జరిపే అత్యాచారాలకు స్త్రీ పురుష విభేదం లేదు. ఎదుటివాడి నోడించ గలిగిన శక్తిగలవాడి చెయ్యెప్పుడూ పైనే ఉంటుంది. మనకన్నా తెలివిగా ఆలో చించగలవాడి వాక్యాలను మనం ఏనాడూ ఉల్లంఘించ లేము. ఉల్లంఘించినా తప్పే. పురుషులలో నైతిక పతనం

కలిగితే స్త్రీకూడా ఆస్థాయికి దిగిపోయి సమానత్వం పొందా లనుకోవడం ఎంత హాస్యాస్పదం! ఇకపోతే సంసారంలో వస్తున్న అనవసరపు కలతలన్నీ స్త్రీ పురుషుల మధ్య ఒకరి నొకరు అర్థం చేసుకునే గుణం లోపించడంవల్ల. ప్రతి దానికీ అతీతమైనవి ఉంటాయి. అందరిలోనూ మంచీ చెడూ ఉంటుంది. కాని మనకి కావలసిన విషయాలలో మన బలహీనతను కప్పి పెట్టుకుని, పురుషులను నిందించడం తప్పంటాను. ఇంక వచ్చే అనర్థాలన్నీ ఊహించుకోవడం లోని లోపంవల్ల. చీకట్లో నడుస్తూ దెయ్యాలభయం పెట్టు కుంటే ప్రతిచెట్టూ పుట్టా దెయ్యమై కనిపిస్తుంది. ఈ మాత్రందానికి లేనిపోనివన్నీ కల్పించుకుని ఆడది పిల్లల్ని కనే యంత్రంఅయిపోతోందని, పురుషునికి బానిస అయిపో తోందని కుమిలిపోవడంలో అర్థం లేదంటాను."

హైమకు మతిపోయింది.

విశ్వం వదనంలో ఆశ్చర్యం, విషాదం గోచరిం చాయి. ఏదో చెప్పబోయినట్టు పెదవులు కదిపాడు, కాని పైకేమీ అనలేదు.

నిధి మాట్లాడాడు :

"సరిగ్గా నువ్వు చెప్పినట్టే, ఊహించుకోవడంలోనే ఉందనిపిస్తుందంతా. ఈ ఊహ సరిగా లేనప్పుడు ఎదుటి వాడు చేసే ప్రతిపనీ విపరీత దృష్టితోనే చూసి వాణ్ణి తిట్టు కుంటాం. వంకాయ ముచికురుచి రాజుగారికి నచ్చినప్పుడు

అది ఆ కాయకుకిరీటమైంది. ముల్లు గుచ్చుకున్నప్పుడు నెత్తిన కొట్టిన మేకైంది. ఇటువంటి దానిమీదే మా బాల కృష్ణ ఒక కథ వ్రాశాడు.”

“ఏమిటయ్యా, అది చెప్పు వింటాం” అంది అనూరాధ.

నిధి మొదలు పెట్టాడు :

“మాధవి, చక్రపాణి ఎంతో అన్యోన్యానురాగంతో జీవితం వెళ్లబుచ్చుతూంటారు. అన్నిటా ఇద్దరిదీ ఏకాభిప్రాయం. మాధవి సెకండరీ విద్యతో ఆపేస్తుంది. వచ్చే దానితోనే సర్దుకుంటూ లేనిపోని ఆశలకు పోకుండా గడిపేస్తూంటారు జీవితం. కొంటెతనానికి చక్రపాణి భార్యను చీకాకుపరిచి ఆనందిస్తూంటాడు. ఆమె అవునన్నది కాదనడం అతనికో సరదా. ఈ వైరుధ్యాల మధ్య, చిలిపి తగవులు, పరిష్కారాలతో ఎంతో ఆనందంగా దొర్లిపోతుంది కాలం.

“మాధవి చిన్ననాటి సహాధ్యాయిని మల్లిక పెళ్ళి చేసుకోకుండా ఉన్నత విద్య అభ్యసిస్తుంది. విప్లవాత్మకమైన భావాలామెవి. స్త్రీ పురుషునికి బానిసగా కాలం వెళ్లబుచ్చుతూ వ్యక్తిత్వాన్ని చంపుకొని పిల్లల్ని కనే యంత్రంలా తయారౌతూందని, అది మార్పుచెంది స్త్రీకి ఉన్నతి రావాలని, పురుషునితో సమానంగా అన్నిటా సమానత్వం పొందాలనే తత్వం ఆమెది. ఆ ఊహతోనే

ఇతరుల ప్రమేయం లేకుండా ఉద్యోగం చేసుకుంటూ బ్రతుకుతూ ఉంటుందామె ఆమె దృష్టిలో సంసారంచేస్తూ సుఖంగా ఉన్నామనుకునే స్త్రీలు భ్రమపడుతున్నారన్న మాట! కూపస్థ మండూకాలు! ఒకరు చెప్పినట్లు చెయ్యడమే తప్ప భావ స్వాతంత్ర్యం వెల్లడించలేని బలహీనులు.

"ఇటువంటి ఆమె ఒకసారి మాధవి ఇంటికి చుట్టపు చూపుగా వస్తుంది. మాధవి ముఖంలోని ఆనందంచూసి, మంటనిచూసి భ్రమపడి అందులోపడి నశించే కీటకాలతో పోల్చుకొని జాలి పడుతుంది. అరె! అమాయకులు! కత్తుల బోనులో ఉండి సుఖపడుతున్నామనుకుంటారే అని వాపోతుంది.

"మాధవి సంసారాన్ని గురించి అంతా తెలుసుకుంటుంది. చక్రపాణి ప్రవర్తనలోని వ్యంగ్యం, హాస్యం ఆమెకు అధికార గర్వంగాను, అహంభావంగాను కనబడతాయి. సంభాషణల మధ్యలో మాధవికి ఆమె అనుకుంటున్న భర్త మంచితనమంతా అతని అహంభావానికి నిదర్శనమని వాదించి నిరూపిస్తుంది.

"రచయిత మానవత్వాన్ని గురించి రెండుమాటలు చెబుతా డిక్కడ.

"ప్రతి విషయాన్నీ వితర్కించడానికి రెండు దృక్పథాలుంటాయి. ఎవరి దృష్టిలోనుంచి వారు చూస్తుంటే ఎదుటి వాడిదంతా తప్పుగా కనపడుతుంది. నిష్పాక్షికంగా చూసే మూడో వ్యక్తికి ఇద్దరిలోనూ తప్పొప్పులు సమా

నంగా కనబడతాయి. ఎవరు ఇంకొకరి దృష్టిలోంచి చూడగలిగినా వాళ్ళ మధ్య అభిప్రాయభేదమే ఉండదు. ఇంకో విషయం. మనం ఒక వ్యక్తిని గురించి కొన్ని అభిప్రాయాలు పెట్టుకొని ఉన్నప్పుడు ఆ వ్యక్తి చేష్టలు ప్రవర్తన ఒకలా కనబడతాయి. అదే ప్రవర్తనా చేష్టలూ ఆ వ్యక్తిని గురించిన మన అభిప్రాయాలు మారినప్పుడింకో వెలుగులో కనిపిస్తాయి. ప్రతిదీ విరుద్ధంగానే కనబడుతుంది.

"నాలుగురోజులుండి మల్లిక వెళ్ళిపోతూ మాధవి పాత అభిప్రాయాలను, మనశ్శాంతిని కూడా తనతో తీసుకుపోయింది. మాధవి మనస్సు విపరీతంగా కలత చెందింది. తేరుకోలేని ఊహాలామెను చుట్టుముట్టాయి.

"మర్నాడు మామూలుగా చక్రపాణి ఆఫీసుకు వెళ్ళిపోయాడు. మల్లికవల్ల మార్పు చెందిన ఆమె హృదయానికి ఏకాంతంతోడై ఆమె ఊహలు విపరీత మార్గాలలో పరిభ్రమించ నారంభించాయి.

"చక్రపాణి తనపై కనపరిచే ప్రేమంతా కపటనాటకంగా కనబడింది. తనకు స్వాతంత్ర్యం లేదు. అతని చేతిలోని కీలుబొమ్మ తను. ఎటు ఆడిస్తే అటు ఆడవలసిందే. లేకపోతే తనకా ఇంట్లో స్థానమే ఉండదు. బంగారు పంజరంలోని చిలుక తను. ఆ పంజరాన్ని విరగ్గొట్టి పారిపోతే- సాధ్యమా అతను బ్రతికుండగా ?

"హఠాత్తుగా ప్రమాదంలో చక్రపాణి చచ్చి

పోయాను. విపరీతంగా ఏడ్చేసింది తను. ఆ ఏడుపుతో బాటే కొత్త ఊహ ఒకటి వచ్చింది. తానిక స్వతంత్రురాలు. తన నడ్డుపెట్టేవారు లేరు. ఇన్స్యూరెన్సు డబ్బు పదివేలతో తానెంతో అభివృద్ధి పొందవచ్చు. మల్లికకు ఉత్తరం రాసింది.

"మల్లిక అక్షరాలా స్నేహితురాలు. మాధవి కష్టంలో పాలు పంచుకొనేందుకు వెంటనే వచ్చింది. ధైర్యం చెప్పి బేలవు కావద్దన్నది. ఎంతో ముందు జీవితం ఉందన్నది. ఒకలా చూస్తే చెరనుండి విముక్తి పొందినట్టే నన్నది. తను బాధ మరిచిపోక తప్పలేదు. మల్లికతో వెళ్ళిపోయింది, అందరినీ విసర్జించి. మల్లిక తనను కాలేజీలో చేర్పించింది. ఎంతో చక్కని వాతావరణం. తన కిదివరలో తెలీని వెన్నో తెలుస్తున్నాయి. తను స్వతంత్రురాలు. కావలసినప్పుడల్లా బాంక్ లోంచి డబ్బు తీసుకుని ఖర్చు చేస్తుంది. శ్రద్ధగా చదవవలసి వచ్చింది, మల్లిక పట్టుదలవల్ల. ఈ జీవితమూ హాయిగానే ఉంది. ఎప్పుడో జ్ఞాపకం వస్తాడు చక్రపాణి. ఒక్కక్షణం కన్నీళ్ళు వస్తాయి. అంతలో విప్లవాత్మకాభిప్రాయాలు, స్వాతంత్ర్యాభిలాష, భావిలో తాను పొందబోయే సౌఖ్యాలు గుర్తుకొచ్చి అన్నీ మరిచిపోతుంది.

ఏడేళ్ళు గడిచాయి. తానిప్పుడో డాక్టర్. పేరు ప్రతిష్టలతో పాటు ఎంతో ధనం ఆర్జిస్తోంది. కోరితే కొండ

మీాది కోతి దిగివస్తోంది. హాయిగా ఉంది. మల్లిక ఎంత గొప్ప వ్యక్తి! తనకో మహోత్కృష్ట దశ కల్పించింది.

"మరో రెండేళ్ళు గడిచాయి. ఎన్నో మార్పులు వచ్చాయి. డబ్బు రాబడి బాగానే ఉంది. కాని మన శ్శాంతి లేదు. తీరుబడిలేదు. ఏదో నిస్పృహా ఆవరిస్తుంది. ఏకాంతం ఎడతెగని బాధ కల్పిస్తోంది. తనను ప్రేమించే వాళ్ళు లేరు. తను ప్రేమించే వాళ్లు లేరు. ఎందుకీ సంపాదన? ఎందుకీ స్వాతంత్ర్యం? ఎవరికోసం? తన ఒక్క పొట్టఎల్లాగైనా గడిచిపోతుందే! పొందలేని ఆనందమేదో కావాలి. పెళ్ళి చేసుకుంటే— అది వకసారి అయిందేగా? మళ్ళీ ఆ కూపంలోకి—

"చక్రపాణి జ్ఞాపకం వచ్చాడు. నిజంగా అది కూప మేనా? ఒకరోజు తనకు తలనొప్పి వస్తే అతనెంతో సేవ చేశాడు. అదంతా మిథ్యేనా? ఆవేళ తనెందుకో విపరీతంగా మంకుపట్టు పడితే, అతను చెయ్యలేనిపని తను చెపితే ఎంత ఓర్పు, సహనం ప్రదర్శించాడు! రోజులెంత చప్పున దొర్లిపోయేవి! ఎంత ఆనందంగా ఉండేది బ్రతుకు! ఛీ! ఛీ! పాడుఊహలు. తనకేం? ఇల్లుంది; కో అంటే కోటి మంది పలుకుతారు. స్వతంత్ర జీవితం. ఇతరుల సేవకు అంకితమైపోయింది తను. అంతకన్నా ఏం కావాలి?

"మరో ఏడు గడిచింది. ఈ మధ్య తనకు ఖాళీ దొరికినప్పుడల్లా పాతజీవితమే జ్ఞాపకం వస్తోంది. ఆయన— ఎంత మంచివారు! ఎప్పుడూ నవ్వుతూండేవారు. నవ్వించే వారు. ఆ చిలిపి కయ్యాలు—ఇప్పుడో, తనో ఒంటరివ్యక్తి.

బాధపడుతుంటే నాలిక చివరినుంచి అంటారు అయ్యో అమ్మగారూ___అని, అంతే. చచ్చిచెడి పని చెయ్యవలసి వస్తోంది ప్రాక్టీసుకి స్వస్తిచెప్పి ఇంట్లో కూర్చుంటే ? మరీ ఒంటరితనం. ఆ రోజుల్లో ఆయన సంపాదించి తెస్తూంటే ఏదో ఒళ్ళు అలిసిపోకుండా యింత వండి అతనికి పెట్టి తను తినేది. తనకు బాదరబందీ ఉండేది కాదు. ఇన్ని బాధ్యతలు తన్నానాడు వెంటాడలేదు. ఆ పగళ్ళు పనితో, రాత్రిళ్లు అవధులులేని ఆనందంతో గడిచిపోయేవి. ఆ ఆరేళ్ళూ ఎంత చప్పున గడిచిపోయాయి? పాప పుట్టిపోయి నప్పు డాయన ఎంత బాధపడ్డారు !

"అటువంటి అతను పోతే లోకం కోసం ఏడ్చింది తను. తనకు స్వేచ్ఛ లభ్యమైనదని ఒకలా సంతోషించింది. తానెంతో ఉన్నతికి పోవచ్చునని ఊహించింది. తన హృదయం అంత కఠినం ఎల్లా అయిపోయిందో ! ఈ పదేళ్ళూ మాత్రం తన ఊహ లెంత క్రూరంగా పోయాయి ! ఎంత మార్పు తనలో ! గుట్టుగా సాగిపోతున్న సంసారంలో కలతలు తెచ్చిపెట్టిన క్రూరులు ఎవరు? తన నంత ప్రేమించిన భర్తను పోయేముందు లేనిపోని అనుమానాలతో ఎంత వేధించింది తను! అతని ప్రతి చేష్టా విపరీతంగానే విమర్శించి తనెంత బాధపడి అతన్నెంత బాధ పెట్టింది ! ప్రమాదంలో పోకపోతే ఆత్మహత్యకో పలాయనానికో దారితీసే స్థితికి తీసుకువచ్చిందే పరిస్థితి! దీనికంతకీ కారణం మల్లిక. దాని పాత్మ్యాలు తన జీవితంలో చిచ్చు పెట్టింది. స్వాతం

త్ర్యం, సౌఖ్యం అంటూ తనకేవో లేనిపోని ఆశలు చూపి తనొక్క అంధకారంలోకి నెట్టింది. తినిం కష్టపడి పదేళ్ళుగా ఆర్జించిన స్వాతంత్ర్యం ఏమిటి? ఆతనితో గడిపిన జీవితంలో లోపించిందేమిటి? తన బుద్ధిహీనతతో కళ్ళు కప్పుకు పోయాయి లేనివన్నీ ఆపాదించుకుని అఘోరించింది.

"సినిమాకి వెడితే మహా సంతోషం ముఖాలలో తొణికిసలాడుతూ ఆలుమగలు కనిపిస్తారు. అసూయతో తన హృదయం భగ్గుమంటుంది. చక్కని పిల్లల్ని చూస్తే ఆనందం, బాధ, ఆఖరికి అక్కసుతోను, జుగుప్సతోను మండిపోతుంది మనస్సు. ఒకనాడు తానూ అనుభవించింది. తనకూ ఉండేది యీ జీవితం. ఆఖరి రోజులలో భ్రమలో కొట్టుకొని బాధపడి ఇతరులను బాధించింది. దైవం ఆహార విప్పడానికేనేమో తనకీ వైధవ్యం రాసిపెట్టాడు.

"ఆ రోజులు తిరిగివస్తే! గడియారం ముళ్ళు పదేళ్ళు వెనక్కు తిరిగితే! దైవబలం అనేది ఉండి చక్రపాణి తిరిగి వస్తే! తాను సావిత్రి కాగలిగితే!

"మాధవీ! ఎందుకు ఏడుస్తున్నావ్!" అన్న చక్రపాణి ప్రశ్నతో మాధవికి ఈ ప్రపంచపు మనుగడ గుర్తొచ్చింది. సంతతధారగా స్రవిస్తున్నాయి కన్నీళ్ళు. పిచ్చిగా చక్రపాణికేసి చూసింది. ఊహలలోంచి తేరుకునేసరికి కొన్ని క్షణాలు పట్టింది. ఈలోగా ఆమెను దగ్గరకు తీస్కొని కన్నీళ్ళు తుడుస్తున్నాడు చక్రపాణి. ఒక్కసారి

మాధవి దుఃఖం వెల్లుబికింది. చక్రపాణి హృదయానికి తల ఆన్చి వెక్కి వెక్కి ఏడ్చింది. ఎందుకంటే మాట్లాడదు. 'పీడకల' అంది ఆఖరికి.

"ఇందులో ఎక్కడేనా విసుగుగాను, మందంగాను ఉంటే అది నేను చెప్పడంలోని లోపంవల్ల కలిగింది. ఇంతకి పదిరెట్లు బాగుంటుంది రచన" అని ఆగాడు కళానిధి.

హైమా, అనూరాధా శిలాప్రతిమలే ననుకుంటారు, ఆ కన్నీళ్ళే కనబడకపోతే.

"చాలా గొప్పగా ఉంది కథ. ఆమె వ్రాసిన వ్యాసానికిది చక్కని సమాధానమవుతుంది" అంది అనూరాధ చివరకు తేరుకుని.

అప్పటికి రాత్రి ఎనిమిది అయింది. నిధి సెలవు తీసుకుని లేచాడు. హైమకూడా బయలుదేరింది.

"హైమను యింటి దగ్గర దిగబెట్టి మరీ వెళ్ళు తమ్ముడూ!" అంది అనూరాధ.

"నేనేం చిన్నపిల్లనా వదినా! నాకు ఎవరి సాయం అక్కర్లేదు. నేనే వెళ్ళగలను" అంది గారంగా.

"నువ్వు చిన్నపిల్లవని ఎవరనగలరు? మొన్ననేగా షష్టిపూర్తి చేసుకున్నావ్!" అంది అనూరాధ.

"కాక!" అంది హైమ.

అంతా నవ్వారు.

"అంటే నేను కూడా రావడం యిష్టం లేదనేనా?" అన్నాడు నిధి కొంటెతనానికి.

"అక్క వెళ్ళిన తరువాత ఆమె స్థానం మీరాక్రమించినట్టున్నారే!" అంది హైమ వెక్కిరింపుగా.

అనూరాధ, విశ్వం వీధిలోకి సాగనంపా రిద్దరినీ.

హైమ, నిధి నిశ్శబ్దంగా నడుస్తున్నారు.

"బాలకృష్ణ ఎవరండీ!" అడిగింది హైమ.

"మా స్నేహితుడు. చక్కని రచయిత. స్కాలర్‌షిప్ మీద అమెరికా వెళ్ళాడు. అక్కడే ఉన్నాడిప్పుడు."

"మీ పూర్వ ప్రజ్ఞలన్నీ ఆయనకీ తెలుసా!" అంది హైమ నవ్వుతూ.

"అంటే—ఓహో—తెలుసు." అతనూ నవ్వాడు.

"మీరిలా మారతారని ఎవరైనా ఊహించగలిగి ఉందురా!" నిధి కళ్ళలోకి చూస్తూ అంది.

"కష్టమే." అంగీకరించాడు నిధి.

హైమ ఊరుకుంది.

నిధే అందుకున్నాడు :

"అసలు నాకే ఆశ్చర్యంగా ఉంటుంది, ఇంత మార్పెలా వచ్చిందా అని. మానవులు పరిస్థితులకు బానిసలని ఇదివరకు నమ్మలేక పోయేవాడిని. వాతావరణం మారగానే అన్నీ మారిపోతాయి."

"ఈ మార్పుకి కారణం?" తెలీనట్టడిగింది హైమ.

"విశ్వంగారు."

"అరె! వదిన కాదూ ?"

"కాదు. ఆమె తెచ్చిన పరివర్తన వల్ల మాత్రమే అయితే నాకు జీవితం మీద విరక్తి మాత్రమే కలిగిఉండేది. అతనిలోని క్షమాగుణం ఇతరులను క్షమించడంతో ఊరుకోక ఉత్తేజాన్ని మానవత్వంమీద నమ్మకాన్ని అభివృద్ధి పొందిస్తుంది." సాలోచనగా అన్నాడు.

"కాని అతనంటే నాకు భయం. అతనిదగ్గర నేను స్వేచ్ఛగా ఉండలేను. ఎంత అర్థం చేసుకున్నామనుకున్నా మనల్ని ఆశ్చర్య పరిచేటంత కొత్తలోతు కనపడుతూనే ఉంటుంది."

"ఇవాళ వాదనలో ఆయన అసలు పెదిమ కదపక పోవడం నా కాశ్చర్యంగా ఉంది. తన వ్యతిరేకతని మౌనంగానే తెలియజేస్తా డాయన. ఆయన ఉద్దేశ్యం ఏమిటో ?"

"మీతో వాదించడానికవాళ ఎవరూ లేక మీకల్లా అనిపించింది గాని యిదివరకు మాత్రం ఆయన వాదించాడా ? ఆయన తత్వమే అంత" అంది హైమ.

"కాదు. అనూరాధ వాదనలో ఎక్కడో పెద్ద లోపం ఉంది. అది ఆయన గ్రహించి ఆమెను అడ్డగించడం యిష్టంలేక ఊరుకున్నట్టు తోస్తుంది. అడుగడుగునా అనుభవిస్తున్నదాన్ని అర్థం చేసుకోవడంలో లోపం అని సరిపెట్టుకో జూడడం నాకే నచ్చలేదు—"

"పోనిద్దురూ. ఈ వాదనల వల్ల వచ్చేదేముంది? ఒకరి బలహీనతలని క్షమించగల సహనం ఉంటే శత్రువుల మధ్యకూడా స్వేచ్ఛగా ఉండచ్చు. వాదనలవల్లకంటే ఓర్పుతో ఎక్కువ సాధించవచ్చుననుకుంటాను" అంది హైమ.

ఆమె అమాయకత్వానికి అతనికి నవ్వువచ్చింది.

ఇంతలో హైమ ఇల్లు వచ్చింది. సెలవు తీసుకొని లోపలకు నడిచింది హైమ.

నిధి కదిలి, బస్సు ఎక్కి హాస్టల్ చేరుకున్నాడు. హాస్టల్ చేరేసరికి పావు తక్కువ తొమ్మిదయింది. మెస్సు కట్టేసి ఉంటారు. అడుగు మెతుకులే ప్రాప్తి అనుకుంటూ మెస్సులో అడుగుపెట్టాడుగాని మెస్సులన్నీ తెరిచే ఉండడంతో హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది—అది శనివారమనీ, సినీమాల రోజనీను.

తిండి తిని గదికి చేరుకున్నాడు. మర్నాడు ఆదివారమనేమాట తరుచు తరుచు గుర్తుకువచ్చి చదవాలనే బుద్ధిని తొలగించింది. దీపం ఆర్పి మంచంమీద పడుకొన్నాడు. నిద్రవచ్చే సూచనలు కనబడకపోయేసరికి మెదడు ఆలోచనల కుపక్రమించింది.

అనూరాధ తనకు బుద్ధిచెప్పని క్రితం తన జీవితానికీ, తరువాతి జీవితానికీ పోలికేలేదు. అదివరలో తన జీవితంలో ఎన్నో స్త్రీ రూపాలు సినీమా తెరమీద బొమ్మలలా వచ్చి పోయాయి. అదివరలో తనకు స్త్రీని గురించిన

నిర్వచనమే వేరు. అప్పట్లో తన భావంలో స్త్రీ పురుషుని కొరకు ఏర్పడిన విలాస వస్తువు. కవ్వించి, ఉడికించి, రెచ్చగొట్టి ఆనందించేవాడు. అందుచేతే ఆ రోజులలో తనకు తటస్థపడిన స్త్రీలను గురించి ఎన్నడూ ఆలోచించనే లేదు. వారిని తరచిచూసి అర్థం చేసుకునేందుకు ప్రయత్నించనే లేదు. మరీ స్వచ్ఛంగా ఉండి తన దూషణ భూషణ తిరస్కారాలకు చలించని వారి జోలికి తనెన్నడూ పోయేవాడు కాడు. సరదాకు తనను రెచ్చగొట్టి, వారిలో కూడా అణిగి ఉన్న చిలిపితనాన్ని బయట పెట్టినవాళ్ళే తనతో పేచీ పడ్డారు. వాళ్ళను ఏడిపించి ఆనందించాలనే కాంక్షే తప్ప వాళ్ళను గురించి ఆలోచించేవాడు కాదు తను.

ఇప్పుడు తనకు కనపడేవారు ముగ్గురు. వీరితో తనకు త్రెంచరాని సంబంధం ఉంది. ముగ్గురివి మూడు విభిన్న ప్రకృతులు. ముగ్గురూ మూడు రకాల వ్యక్తులు. భావాలలో కూడా ముగ్గురివీ మూడు తీరులు. కాని ముగ్గురూ ఎంతో అన్యోన్యంగా ఉంటారు. మామూలు సంభాషణలలోను, నడవడిలోను ముగ్గురూ ఒక్కటే. మూర్తీభవించిన మంచితనం ముగ్గురిలోనూ ఉంది.

శైలజ అంటే తనకు భయం. చనువు. ఆమెతో మాట్లాడేటప్పుడు మామూలు విషయాలలో హద్దులు పెట్టుకో నక్కరలేదు. కాని మనస్సులో కృత్రిమం పెట్టుకుని పైకి ఇంకోలా మాట్లాడితే చెప్పాపుచ్చుకోని కొట్టడాని కామె వెనుతియ్యదు. ఎవరికీ ఫిర్యాదుచేసే తత్వం

ఆమెలో లేదు. ఆమె అందరితోనూ స్వేచ్ఛగానే మెలగు తుంది. చిన్నచిన్న పరిహాసాలకు చక్కగా సమాధానం చెప్పి ఎదుటివాళ్ళ నోరు మూయిస్తుంది. ఎదుటి వాళ్ల బలహీనతను ఆమె క్షమించ గలదు. కాని ఆ బలహీనతను అణిచేటంత కటువైన మాటలు ఉప యోగిస్తుంది. తను చెప్పదలచుకున్నది చెప్పడానికి భయ పడదు. తను అనుకున్నది ఆచరించడానికి వెనుదియ్యదు. ఇన్నిఉన్నా ఆమెకు ఆదర్శాల పిచ్చిపోలేదు. ఆమె ఆదర్శా లేమిటో ఆమెకే అర్థంకావు. ఇటువంటి ఆమె సహచర్యం తనకెంతో నచ్చుతుంది. శైలజ నిజంగా సరదా అయిన మనిషి. అయితే ఆమె జీవిత భాగస్వామినిగా ఉండడం_ ఆ ఆలోచన అంటేనే తనకు తేళ్లు జెర్రులు పాకుతాయి జీవితంలో ఆమె అనుకున్న ఆదర్శాలు విఫలమైతే ఆమె ఎట్లా తట్టుకుంటుందో చూడాలని ఉంటుంది. ఒత్తిడి తీసుకు వచ్చి ఆమెను ఏవిధంగానూ ఎవరూ సాధించలేరు. అస లామె పెళ్లాడుతుందా? ఆడితే ఎవర్ని? ప్రేమను గురించి ఆమెకు ఉన్న అభిప్రాయాలు? కాని ఆమెతో మాట్లాడు తుంటే యుగాలు క్షణాల్లా గడిచి పోతాయి. మెదడుకు మేత దొరుకుతుంది.

అనూరాధ ఆమె తన కే క్షణంనుంచి అక్క అయిందో ఆ క్షణంనుంచీ ఆమెను గురించి తలుచుకున్న ప్పుడల్లా తన మనసు ఆర్ద్రం అవుతుంది. ఆమెకు అనుభవం తక్కువ. తనకున్న మంచితనం అందరూ అర్థం చేసుకో గలరనుకుంటుంది. భారత నారీలోకపు ఆదర్శ వనిత.

మాటలెన్ని చెప్పగలిగినా పాత సంస్కారాలు జీర్ణించుకు పోయి, వాటినే నమ్ముతుంది. ప్రేమ, సంసారం, సంఘం అనేవాటిమీద ఆమె అభిప్రాయాలు నిశ్చితాలు. వాటిని నమ్మడమే, వాటికోసం బలి కావడమే ఆమె ఆదర్శమేమో నని తనకప్పుడప్పు డనుమానం కలుగుతుంది. ఆమె అందర్నీ సహించగలదు. అందర్నీ ఎదిరించ గలదు. ఇతరులను మంచి మార్గంలోకి తీసుకురావాలనే తాపత్రయం, పట్టుదల ఎక్కువ. అయితే అందుకు ఆమె అవలంబించే పద్ధతులకూ శైలజ పద్ధతులకూ సంబంధం ఉండదు. మానవునిలోని చైతన్యం ఆమెను కదిలిస్తుంది. ఆమె వివిధ రసాల కల యిక. అన్నీ సమపాళ్ళల్లో ఉన్నాయి. కాని ఆమెలో ఒకదోషం కనపడుతుంది తనకు. విన్నవి అన్నీ విని ఒప్పు కుంటుంది కాని ఆచరణలోకి వస్తే మాత్రం పాత పద్ధతు లనే అవలంబిస్తుంది. ఆమెతోడి పరిచయంలో వివిధ సంఘ టనల మధ్య ఆమెనుగురించి తను తెలుసుకున్నవివి. శైలజ ప్రేమను గురించి అంత నిష్కర్షగా చెప్పినప్పుడు ఆమె చెప్పిన వాదనలనన్నీ అంగీకరించినా ఆచరణలో మాత్రం మామూలుగానే ఉండేతత్వం అనూరాధది. శైలజ ఎంతటి సంబంధాన్నయినా త్రుటిలో తెంచెయ్యగలదేమోననీ తన అభిప్రాయం. కాని అనూరాధ మాత్రం జన్మలో అలా చెయ్యలేదని తన నమ్మకం. కాని అనూరాధలాంటి స్త్రీ నకు భార్య కావాలంటే — ఎందుకో తనకు ఆ భావం సహించదు. ఆమె అక్కగా ఉండడమే తనకు కావలసి

నది. కొన్ని కొన్ని విషయాలలో ఆమె దీ సడలని పట్టు దలే.

ఇక హైమ. ప్రపంచంలోని మంచితనాన్ని, అమాయికత్వాన్ని, ముగ్ధత్వాన్ని ముద్దచేస్తే ఆమె అవుతుంది. కాలేజీ రోజుల్లో తనామె జోలికి పోలేదు అసలు పోలేదని కాదు. ఎవరేమన్నా ఆమె తలవంచుకొని తనదారిని తాను పోతుంది. అంతా మంచివాళ్లే అని అపోహపడుతుంది. ఆమెకు స్వతంత్ర భావాలంటూ లేవు. అన్నిటిలోని మంచి తనాన్నే పరిగ్రహించడానికి ప్రయత్నిస్తుంది. ఎవరూ ఆమెను నిరసించలేరు. అందరూ అభిమానిస్తారు. తన చదువేదో, తనగోడవేదో తనది. స్నేహానికి ప్రాణం ఇస్తుంది. నలుగురు మంచివాళ్ళ మధ్య ఎంతో సంతోషంగా మెలగగలదు. ఈ లోకపు కృత్రిమాలు ఆమెకు తెలియవు. అన్నిటినీ సహించడమే తప్ప, ఎదిరించే నేర్పు, ఉద్దేశ్యమూ కూడా ఆమెకు లేవు. ఆమెను అర్థంచేసుకోగల భర్తఉంటే ఆమె జీవితం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా ఉంటుంది. లేకపోతే సాధారణంగా ఉంటుంది. కాని ఆమె హృదయం దెబ్బ తింటుంది. చదువుకున్నదీ, అందమైనదీను. ఆమెను గృహిణిగా పొందడానికి అర్హతలు మంచితనం, ఆమెను అర్థంచేసుకోగలిగిన తెలివి, ఆమె మంచితనాన్ని లోకువగా తీసుకోకుండా ఉండగల హృదయ వైశాల్యం. ఆమె తన గృహిణి అయితే !...నాకి నవ్వు వచ్చింది.

టవర్ క్లాక్ పన్నెండు కొట్టింది. అంతా నిశ్శబ్దంగా ఉంది.

ఉలిక్కిపడ్డాడు నిధి ఊపిరి ఉగ్గ పట్టుకుని వరండాలో ఎవరో పరుగెత్తారు. నిద్రలో పరుగెత్తే నారాయణే అనుకున్నాడు నిధి. కాని తన పక్కగది తలుపు తపతప బాదాడు ఆ వ్యక్తి. అతను గబుక్కున లేచి తన గది తలుపు తెరిచాడు. ఆ క్షణానే ఆ గది తలుపుకూడా తెరచుకుంది.

"ఎవర్రా అది!" నిద్రమత్తు గొంతుకతో అన్నాడు పక్కగది అతను. నిధికూడా వెళ్ళాడు.

ఆ పరుగెత్తిన వ్యక్తి ఇంకా వగరుస్తూనే ఉన్నాడు. భయంతో ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు. వరండా అవతలి కొసకేసి చూపించి సంజ్ఞ చేశాడు.

*  *  *

ఆ మరునాడు ఆదివారం. హైమ, విశ్వం అనూరాధ పేకాడుకుంటున్నారు. ఆటలలో మైమరచిపోయి ఉన్నవారికి కళానిధి వచ్చినట్లే తెలియలేదు. అతనుకూడా మాట్లాడకుండా కూర్చున్నాడు. చటుక్కున ఇటుతిరిగి కళానిధిని చూచిన అనూరాధ ముఖం వికసించింది. కాని అంతలో అతని ముఖంలో ద్యోతకమౌతున్న బాధ, గాంభీర్యం చూడడంతోనే మతిపోయి ముక్కలు క్రింద పారేసింది.

శ్రీమంతుల బిడ్డడు. ఎంతో ఆనందంగా చిరునవ్వు నవ్వుతూ ఉండేవాడు. ఇంతవరకూ అతని ముఖం అంత దీనంగా ఎన్నడూ లేదు. ఏం కష్టం వచ్చిందో అని కంగారు పడింది అనూరాధ.

"ఏం, తమ్ముడూ, ఎల్లా ఉన్నావ్? అంతా కులాసాయేనా?" అంటూ ఆదుర్దా ప్రకటించింది.

హేమా, విశ్వంకూడా విస్తుపోయారు నిధిని చూసి. కలకలలాడుతూ కొంటెగా కనపడే చిరునవ్వుతో వెలుగుతూండే అతని ముఖం మసిపూసినట్టు తయారైంది.

"ఏం జరిగింది నిధీ?" నిధి భుజంమీద చెయ్యివేసి అడిగాడు విశ్వం.

ఏడ్చేశాడు నిధి.

కొంతసేపటికి తమాయించుకొని, "ఇంక చదువు ఆపేస్తే మంచిదేమోననిపిస్తోంది బావగారూ" అన్నాడు.

"ఏం?"

"ఉన్నత విద్య మానవత్వాన్ని పెంపొందించ లేకపోయిన తరువాత దాని ప్రయోజనం ఏమిటి? పామరులకీ సంస్కారులకీ తేడా ఏమిటి? ఇంత చదువుకున్న మనం ఎంత సహనం కలిగి ఉండాలి? అది లేకపోయిన తరువాత యీ చదువు వ్యర్థం. అందుకనే మానేస్తే నయమేమో!"

"మీలో మీరే అల్లా బాధపడకపోతే చెప్పరాదా? కొంత ఉపశమనమైనా కలుగుతుంది" అంది హేమ.

"చెప్పడానికి నోరు రావడంలేదు హైమా. ఇవాళ హాస్టల్లో ఒక రాక్షసకృత్యం జరిగిపోయింది. నిర్దాక్షిణ్యంగా ఒక అమాయకుణ్ణి చంపేశాము. అందులో నాకూ పాలుంది. మధ్యాహ్నం ఆ అభాగ్యుడు హాస్పిటల్లో ప్రాణాలు విడిచి నప్పటినుంచీ నా కడుపు కుళ్ళిపోతోంది దుఃఖంతో. పశ్చాత్తాపం నా హృదయాన్ని దహించేస్తోంది. కాని యివన్నీ ఆ పోయిన వ్యక్తిని తీసుకురాలేవు. మా రాక్షసత్వాన్ని క్షాళన చేయలేవు" — బొంగురు కంఠంతో అన్నాడు నిధి.

నిశ్చేష్టు లయ్యారంతా.

"వివరించి చెప్పుబాబూ" అన్నాడు విశ్వం ఆర్ద్ర కంఠంతో.

"నిన్నరాత్రి పన్నెండింటికి మా బ్లాక్‌లో ఒక విద్యార్థి దొడ్డికి వెళ్ళాడు. అక్కడ ఒక మనిషిని చూసి కంగారుపడి పరుగెత్తాడు. నలుగురైదుగురం పోగయ్యాం. ఆ మనిషి అక్కడే నిలబడ్డాడు. ఊలకడు. పలకడు. చింపిరి జుట్టు, చిరిగిన బట్టలు, మాసినగడ్డం అన్నింటితోను, భయంకరంగా ఉన్నాడు. దొంగతనానికి వచ్చి ఉంటాడని ఇవతలకు లాగి నాలుగు కొట్టారు. ప్రశ్నలు కురిపించి నిందించారు. అయినా అతను మాట్లాడలేదు. దానితో అందరికీ సహనం నశించింది. మొండిగా తప్పించుకుందామని ప్రయత్నిస్తున్నాడని అపోహపడ్డాం. బయటకు తీసుకువచ్చి స్తంభానికి కట్టి నిర్దయగా బాదడం ప్రారంభించాం."

"ఇంతలో ఒకడు పోలీస్ రిపోర్టు ఇచ్చాడు. దెబ్బల మూలంగా అతనికి స్పృహ తప్పిపోయింది. అన్నిదెబ్బలూ పడ్డాడేకాని ఎదిరించలేదు. అన్నింటికీ బాధగా మూలిగాడు. ఇవి చూసైనా మా రాక్షస బుద్ధి సడలవలసి ఉంది. కాని మా కళ్ళు కప్పుకుపోయాయి."

"పోలీసులు వచ్చారు. మమ్మల్ని నానా తిట్లూ తిట్టారు. అతన్ని ఆస్పత్రికి తీసుకు వెళ్ళారు. ఇంతకూ విచారిస్తే అతను మతి స్థిరంలేని మనిషిఅనీ, పిచ్చి ఆస్పత్రి నుంచి తప్పించుకు వచ్చాడనీ తెలిసింది. అతనికి గుండె జబ్బుకూడా ఉంది. మధ్యాహ్నం రెండు గంటలకు ఆస్పత్రిలో ఆఖరి ఊపిరి పీల్చాడు"

"ఇన్ని కబుర్లు చెప్పే మేమే ఎంత అఘాయిత్యం చేశాము! ఎంత రాక్షసత్వం ప్రదర్శించాం! అందరూ తలో దెబ్బవేస్తే అతను సహించలేడని ఊహించనుకూడా ఊహించలేదే? అసలు అతను దొంగ అయితే మాత్రం కొట్టే అధికారం మాకెక్కడిది? అతను ఊరుకున్నకొద్దీ రెచ్చిపోయిన మా మూర్ఖత్వానికి శిక్ష ఏమిటి? ఇంత నీచత్వానికి ఎందుకు దిగిపోయాం? ఎంత ఆలోచించినా అర్థం కావడం లేదు. ఆదర్శాలంటూ ఒళ్ళు విరుచుకుని తిరిగే మేమేనా యీ పనిచేస్త? బావగారూ, మా పాపానికి నిష్కృతి లేదు" అంటూ విలపించాడు.

ఎవరేం చెప్పగలరు? లోకంలో ఇలాంటివి రోజు

కెన్ని జరుగుతున్నాయి ? మానవత్వం చావలేదు గనక విలపిస్తున్నాడు నిధి. పశ్చాత్తాప పడుతున్నాడు. కాసీ కావాలనే ప్రాణాలు తీసేవారెంతమంది శిక్షింప బడు తున్నారు ?

అర్ధరాత్రి స్మశానంలోని పెను నిశ్శబ్దం ఆవరించింది ఆ ఇంట్లో. చేష్టలు దక్కి కూర్చున్నారంతా.

నిధి హాస్టల్‌కు వెళ్ళిపోయాడు ... ఉండిపొమ్మన్న విశ్వం బలవంతాన్ని అంగీకరించలేదు. మళ్ళీ మర్నాడు తప్పకుండా రమ్మని విశ్వం నొక్కి చెప్పాడు.

మర్నాడు వస్తానన్న నిధి మర్నాడు, ఆ మర్నాడు కూడా రాలేదు. అనూరాధ కంగారు పడింది.

"చూడండి. మొన్న వచ్చినప్పుడే ఎంతో దీనంగా కనిపించాడు. యీ రెండు రోజులూ రాలేదు. కొంపదీసి ఏ జ్వరమేనా వచ్చిందేమో కనుక్కొండురూ. పుణ్యం ఉంటుంది. మొన్నటి అతని వాలకం తలుచుకుంటే భయం వేస్తూంది" అంది విశ్వంతో.

"నిజమేస్మీ! సాయంత్రం వెళ్ళివస్తాను."

సాయంత్రం విశ్వం వెళ్ళేవేళకు నిధి గదిలో లేడు. రూంమేట్ నడిగితే డిస్పెన్సరీలో చేరాడని తెలిసింది. విశ్వానికి బాధ కలిగింది.

డిస్పెన్సరీలో పడుకుని ఉన్నాడు నిధి. విశ్వం వచ్చిన అలికిడికి లేచాడు. ఎంతో బాధాపూరితంగా ఉన్న అతని

ముఖంలో ప్రశ్నాన్ని చూచేసరికి ఒక చిన్న దరహాసం వచ్చింది. నీరసంగాను, విషాద భరితంగాను ఉందా చిరునవ్వు. విశ్వం, నిధి చెయ్యి పట్టుకుని చూశాడు. జ్వరం ఇంకా ఉంది. మనిషి రెండు రోజులకే నీరసించిపోయాడు. విశ్వానికి కన్నీళ్లు తిరిగాయి.

"సఖీ, మేం లేమనుకున్నావా, ఇక్కడ చేరావ్?" అన్నాడు.

"బావగారూ, క్షమించండి. ఆవాళ సాయంత్రం అక్కడినుంచి వస్తూనే రాత్రికి జ్వరం వచ్చేసింది. నిన్న ప్రొద్దున్న ఇక్కడికి వస్తే డిస్పెన్సరీలో చేరి పొమ్మన్నాడు డాక్టర్. అదీకాక మీకు కష్టం కలిగించడం తప్ప ఏముంది చెప్పండి!" నీరసంగా నవ్వుతూ అన్నాడు నిధి.

"నువ్వలా మాట్లాడడం నాకు బాగుండలేదు. మీ అక్క కంగారుపడి నన్నిక్కడికి పంపడానికీ నీకు జ్వరం రావడానికీ సరిపోయింది. నువ్వీనీళ్ళు తాగుతూ యిక్కడ ఉండక్కర్లేదు. బండి తీసుకు వస్తాను, పద. మళ్ళీ పథ్యం ఆ హోటలు మెతుకులతో ఆరంభిస్తావా?"

"బావగారూ, నా మాట వినండి. ఇక్కడ వీళ్ళకు యిది విధి. వేరే ఏమీ కష్టపడరు. ఇంక యింటికివస్తే మీరు నిద్రాహారాలు మానుకుని కూర్చుంటారు" అన్న నిధి కంఠం కృతజ్ఞతతో బరువెక్కింది.

"ఇన్నాళ్ళయినా ఇంకా నీ ధోరణి మారకపోవడం

బాగులేదు. రేపొక వేళ మాయింట్లో నీ సహాయం అవసర మైతే యిన్ని ఆలోచించాలంటావా ? బాబూ, నువ్వు కుర్రాడివి. అనుభవం తక్కువ. ఇది పరస్పర సహాయం. ఇది లేకుండా బతకలేం. మేం ఉన్నామని ఎందుకూ! నువ్వు నవ్వుతూ తుళ్ళుతున్నప్పుడు ఆనందించి, నీకు జ్వరంవస్తే ఆ చాయలకేనా రాకుండా ఉండడానికా ?"

నిధి మాట్లాడలేదు. అతని మనస్సంతా ఆనందంతో నిండిపోయింది. రెండు రోజులయి పొందిన నిస్పృహ కొంత వరకు వదిలిపోయింది.

ఎవరైనా అంతే. కష్టంలో ఉన్నప్పుడు ఆత్మీయు లుంటూ ఉన్నారని, తమ కోసం వ్యధ చెందేవారున్నారని అనిపిస్తే మనస్సుకు ఎంతో తృప్తి ఉంటుంది. నైరాశ్యం తొలగిపోతుంది. బతుకు విలువ తెలిసి వస్తుంది ఇతరులను ఆనంద పరచడంతో స్వార్థాన్ని గడిచి ఒకమెట్టు పైకివెళ్ళి నిష్పాక్షపత్య దృష్టితో చూడగలిగి ఉన్నత స్థాయిలో ఆలోచిస్తారు. తమ ఉనికికి ఒక కారణం కనబడి దాని అవస రాన్ని గుర్తెరుగుతారు.

ఇంక ఆట్టే బెట్టుచెయ్యకుండా నిధి విశ్వంతో ప్రయాణమయ్యాడు.

నీరసంగా ఉన్న నిధిని చూసి అనూరాధ నొచ్చు కుంది.

"అయితే అనుకున్నంతా అయిందన్నమాట! మేం ఉన్నామనే మరిచిపోయావా!" అంది.

"రాధ నీకు స్వయానా తోబుట్టువే అయితే యిలా చెయ్యగలవా?" అంది శాంతమ్మగారు.

నిధికి మరో ప్రపంచంలో అడుగిడినట్లయింది. తలుచుకుంటే నిజమే ననిపించింది. వాళ్ళెంత సన్నిహితులుగా ఉన్నా, తనలో తనే ఏదో ఆత్మన్యూనతతో వాళ్ళ దగ్గరగా ఉండలేకపోయాడు. అందుకు తననే తానే నిందించుకున్నాడు.

విశ్వం వెళ్ళి డాక్టర్‌ను తీసుకు వచ్చాడు. మనస్సులోని ఆందోళన ఉద్రిక్తతలవల్ల వచ్చిన జ్వరమేననీ, వెంటనే తగ్గిపోతుందనీ చెప్పాడు డాక్టర్.

శాంతమ్మగారు కన్నకొడుకులాగా ఆదరించి సేవ చేసింది. అతని పక్కనే కూర్చుని ఉత్సాహ పూరిత వదనాలతో ఊరడించింది. అనూరాధ కాలేజీకి సెలవు పెట్టింది రెండు రోజులు. హైమ రోజూ వచ్చేది.

నాలుగు రోజులకు జ్వరం తగ్గి పథ్యం పెట్టారు. ఆ వేళ నిధి బలవంతంవల్ల అనూరాధ కాలేజీకి వెళ్ళింది. విశ్వం స్కూలుకు వెళ్ళాడు.

పథ్యం తినగానే ఆ నీరసంమీద నిధికి నిద్ర ముంచుకు వచ్చింది రెప్పలు మూతపడిపోతున్నాయి, రెప్పకొక ఏనుగును కట్టినట్టనిపించింది. నిద్రపోతే జ్వరం మళ్ళీ వస్తుందని భయం. శాంతమ్మగారు కబుర్లుచెప్తూ కూర్చుంది, అతని నిద్ర తొలగించడానికి. ఆమెతో తీరుబడిగా మాట్లాడడానికి అవకాశం చిక్కడంచేత నిధి ఆమెను గురించి తెలుసుకుందుకు ప్రయత్నించాడు. తమకున్న తరం వెనక

పుట్టిన ఆమెలో అంత సంస్కారం పెంపొందడానికి కారణం తెలుసుకోవాలని కుతూహలపడ్డాడు. ఆమె ఓపికగా తన చిన్ననాటి అనుభవాలన్నీ కథలుగా చెప్పింది. అవి విని ముగ్ధుడైపోయాడు నిధి. ఆమె విజ్ఞానానికి అబ్బురపడ్డాడు.

సంస్కారం సంస్కారం అని నిధి పదస్సార్లంటే ఇల్లా చెప్పిందామె :

"బాబూ, మానవులలో ఉండవలసిన మానవత్వాన్ని, విశాల హృదయాన్ని మీరు సంస్కారమంటారేమో నాకు తెలీదు. మీకన్న తరం వెనుక గదా నాలో యింత సంస్కారం ఎక్కడనుంచి వచ్చిందని నువ్వడుగుతున్నావు. కాని మా ముందు తరంలో కథ చెప్పమంటావా ? మా మామగారి చెల్లెల్ని భర్త కొన్నాళ్ళపాటు విడిచి పెట్టేశాడు. ఆమె పుట్టింటే ఉండేది, నేను కాపరానికి వెళ్ళిన కొత్తలో. మానవులలో ఉండే సహజ బలహీనతలు విజృంభించటం వల్ల ఆమె గర్భం ధరించింది. ఇంచుమించు నలభై ఏళ్ళ కితం రోజులెల్లా ఉండేవో ఆలోచించు. తలిదండ్రులే మూఢ విశ్వాసాలు పెట్టుకొని స్వంత పిల్లల్ని హతమార్చేంతగా ఉండేవారు. ఇటువంటివి బయటకు తెలిస్తే ఆ కుటుంబపు భవితవ్యమే సంశయాస్పదంగా ఉంటుంది. వాళ్ళను వెలివేస్తారు. కాని నిజానికి మానవత్వం దృష్ట్యా చూస్తే ఆమెను నిందించడానికి ఆస్కారం

లేదు. మా పినమామగారు ఎంత అఖండమైన తెలివి తేటలు గలవాడో అంత మెత్తని మనస్సు. ఈ విషయం ఆయనకు తెలిసింది. ఇంట్లో ఎవ్వరూ ఆమెను కించబరచకుండా జాగ్రత్త తీసుకున్నాడు మొదట. తరువాత రెండు నెల్లకి యాత్రలు తీసుకువెడతానని తీసుకువెళ్ళి అయిదారు నెల్లపాటు తమ ఉనికిని ఎవ్వరికీ తెలియకుండా చూచుకొని పట్నంలో క్షేమంగా పురుడుపోయించాడు. మంచితనమైతే ఉందిగాని సంఘాన్నెదిరించగల శక్తి లేకపోవడంచేత ఆ బిడ్డని ఎవరికో పెంచుకుందుకు ఇచ్చేశారు. మా పినమామగారిలో అంత హృదయ వైశాల్యం ఉంది. మీ లెక్క ప్రకారం ఆయన సంస్కారం ఎంతది?" అంది శాంతమ్మగారు శాంతంగా.

ఆ ప్రశ్నమీదకంటే మిగత కథమీద ఎక్కువ కుతూహలం కలిగింది నిధికి.

"తర్వాత?" అన్నాడు.

"తరవాత కేముంది? కొన్నాళ్ళకి భర్త తన తప్పు తెలిసి బుద్ధి తెచ్చుకొని ఆమెను తిరిగి తీసుకువెళ్ళాడు. ఆమె మిగతా జీవితమంతా నిశ్చింతగా గడిచిపోయింది. పిల్లా జల్లాతో సుఖంగా సాగింది. నిజానికి ఆమెకూడా పొరపాటున కాలుజారింది గాని మహాజ్ఞాని, ఆమెను చూస్తే ఎవ్వరూ నమ్మలేరు యీ విషయాన్ని. ఆ ఒక్క పొరపాటు ఆధారంగా ఆమెను హింసించి నీచపరిస్తే పర్యవసానం ఎల్లా ఉండి ఉండేదంటావ్?"

నిధికి మతిపోయింది.

ఆలోచనలకు తావిస్తే ఆనాటి సంఘటనలను తలుచుకుని రోగానికి ఎక్కడ ప్రోద్బలం ఇస్తాడోనని ఒక్కరు విడిచి ఒకరు అతన్ని కనిపెట్టుకొని ఉండేవారా కుటుంబం అంతాను. రెండో పథ్యం హాస్టల్లో జరిపించుకుందామని నిధి ప్రయత్నించాడు గాని అంతా వారించడంచేత మరి నాలుగు రోజు లుండిపోవలసి వచ్చింది.

నాలుగు పథ్యాలు వంటపట్టిన అనంతరం హాస్టల్‌కు ప్రయాణం కట్టాడు నిధి. తనకు ఆ కుటుంబం చేసిన సహాయానికి కృతజ్ఞత తెల్పడంకూడా చేతకాలే దతనికి. ఆ ముక్కే అన్నాడు.

"తమ్ముడూ, నువ్వలా మాట్లాడితేనే నా కోపం వస్తుంది. ఎరుగున్న వాళ్ళంటూ ఉండి ఎందుకూ అక్కరకు రాకపోతే ? చిన్నప్పుడు సుమతీ శతకం చదవలా ?" అంది సన్నగా చీవాట్లతో అనూరాధ.

ఎంతైనా నిధి ఆనాటి సంఘటనను మరిచి పోలేక పోయాడు.

"కాని, బావగారూ, అవాళటి మా పశుప్రవృత్తి తలుచుకుంటే మాత్రం నన్ను నేను క్షమించుకోలేనండీ" అన్నాడు.

"బాబూ, జరిగిందేదో జరిగిపోయింది. ఆ సంఘటనకు నీ చర్య నిమిత్తమాత్రమే అయినా నీలోని మానవత్వం నిన్నింత పశ్చాత్తాపానికి గురిచేసింది. నువ్వు పడ్డ

బాధ నీ తప్పులని ప్రక్షాళన చేసింది. ఇంక అనవసరంగా బాధపడి మనస్సు పాడుచేసుకోకు. నువ్వెంత బాధపడినా ఆ వ్యక్తిని వెనక్కి తీసుకురాలేవు. కాలప్రవాహానికి ఎదురీదినా లేవు పొరపాటు జరగడం సహజం. ఆపొరపాట్లలో ఎంతో పెద్ద ఎత్తు గూడా జరుగుతూ ఉంటాయి. అతన్ని కొట్టడంలో మీరు మితిమీరి ప్రవర్తించకపోతే యింత పెద్ద అపరాధం జరిగి వుండేదికాదు మీ చర్యల ఫలితం పొరపాటునైనా యిటువంటిదానికి దారితీస్తుందని తెలిస్తే మీరల్లా చేసివుండేవారే కాదు. క్షమించరాని పొరపాట్లెన్నో చేస్తూంటాం. చేసిన పొరపాట్లను గురించి బాధపడేకంటే ఇకముందటువంటివి జరగకుండా చూడడం, బుద్ధితో వ్యవహరించడం మాత్రమే మనం ఇంక చెయ్యగలిగిందీ, చెయ్యవలసిందీను. అందుచేత యీ సంఘటనని మరిచిపోయి మనస్సు గట్టిచేసుకోవాలి నువ్వు. ఇంతకన్న ఏం చెప్పగలను?" అన్నాడు విశ్వం.

"అల్లాగే బావగారూ."

"నిధీ, ఇంకోటి చెప్పడం మరిచిపోయాను. ఇటువంటి సంఘటనలు కొన్ని మనస్సులో గట్టిగా నాటుకుపోతాయి. తేలిగ్గా మరిచిపోలేం. అందుకే అవి ఆలోచించడానికి వ్యవధి యివ్వకూడదు. మన జీవితాలలో నిజంగా ప్రమాదకరమైన ఘడియలు మనకేమీ పనిలేక మెదడు ఖాళీగా ఉన్నప్పుడే మన ఊహలు విచిత్ర మార్గాలలో పరిభ్రమించి మనస్సు నెంతో కలత పెడతాయి. అందుకే

నువ్వు చెయ్యవలసినదేమిటంటే—క్లాసు లైపోగానే ఏదో విధంగా నీ ఆలోచనలకు వీలులేని ప్రదేశంలో ఆటలతోనో నీకు నచ్చిన పుస్తకాలతోనో గడిపెయ్యి. నిద్రపోయేవరకు నిన్ను నీ ఆలోచనల నుంచి వేరుచెయ్యగల పనిలో లీనమైపోవాలి. ఇదిసూత్రం బాగా గుర్తుంచుకో."

"తప్పకుండా బావగారూ."

"ఏమో, ఏం తప్పకుండానో! నీ వాలకం చూస్తే నాకు భయం వేస్తోంది. మళ్ళీ హాస్టలుకు వెళ్ళి యిదే ఆలోచించడం మొదలు పెడతావేమోనని" అంది అనూరాధ.

"ఎంత చదువుకుంటున్నా అబలవనిపించావక్కా—నీ భయాలతో" అన్నాడు కొంతవరకు మామూలు ధోరణిలో పడ్డ నిధి నవ్వుతూ.

"అందుకేగా, నాయనా, నాకీ చదువొద్దో మొర్రో అంటే వినకుండా మీ బావగారు తన చెయ్యే పైదనిపించారు!" అంది సాగదీసుకుంటూ అనూరాధ.

"అయితే తమరు నాకు బానిసలన్నమాట!" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"చిత్తం. అంతే మరి!" అంది అనూరాధ.

"అబ్బ! బావగారూ, ఎంత అదృష్టం అండీ నాది, మీలాంటి వ్యక్తుల పరిచయం కావడానికి!" నిండు హృదయంతో అన్నాడు నిధి.

"చూడు నిధీ, శైలజ చెప్పినట్లు నువ్వీ భర్త్రాజుపని చెయ్యడం బాగులేదు. వెర్రివాడా, ఎంత సంస్కారం నీలో లేకపోతే నువ్వు ఇతరుల మంచితనాన్ని అర్థం చేసుకోగలవు!" అన్నాడు విశ్వం.

# 12

గంభీరంగా ఆఫీసు కాగితాలు చూసుకుంటున్నాడు ఖాన్. గుమాస్తాల గదిలోంచి వచ్చే రణగొణ ధ్వనిగాని, ఫాన్ తిరిగే చప్పుడుగాని అతని నిశ్చలత్వానికి భంగం కలిగించడం లేదు.

ప్యూన్ వచ్చి ట్రేతో టపాలు తీసుకువచ్చి పక్కన పెట్టాడు. ఆ అలికిడికి ఖాన్ తల పైకెత్తాడు. కలం స్టాండ్ మీద పెట్టి టపాలు తీశాడు. పైన పర్సనల్ ఉత్తరం కనబడింది.

• తీసుకుని విప్పాడు. రోమనారా దగ్గిరనుంచి. తనకు సెలవు దొరికినట్లు, రెండు మూడు రోజులలో తాను ఖానున్న ఊరికి రాబోతున్నట్లు రాసింది. ఉత్తరాలద్వారా అయిన పరిచయం పురస్కరించుకుని శైలజను అడిగినట్లు చెప్పమంది. ఎడతెగని కాంపులతో సతమతమౌతూ ఇంచుమించు ఒక నెలగా శైలజను చూడనట్టు ఒక్కసారి జ్ఞప్తికొచ్చి నాలిక కొరుక్కున్నాడు.

వెంటనే కాలేజీకి ఫోన్ చేశాడు.

"యారుసార్ ?" అవతలినుంచి ప్యూన్ కంఠం విని పించింది.

"శైలజ ఇరికాగా?" అడిగాడు ఖాన్.

"పాతిట్టు వరేంసార్. ఇరుంగో" అంటు అవతల రిసీవర్ బల్లమీాద పెట్టి వెళ్ళాడు.

తన రిసీవర్‌లోంచి ఖాన్‌కు కాలేజీ ఆఫీసులోని గొడవంతా అస్పష్టంగా వినబడుతూంది.

అయిదు నిమిషాల అనంతరం అవతల రిసీవర్ లోంచి ___

"ఇన్నికి వరిల్లై సార్ — లీవ్‌లో ఇరికార్" అన్న ప్యూన్ కంఠం వినబడింది.

"సరి" అని రిసీవర్ క్రేడిల్లో పెట్టేశాడు ఖాన్.

తక్కిన టపాలు కూడా విప్పి డిస్పోజ్ చేసి ప్యూన్‌ను పిలిచి అవి పంపించేసి బయటికి వచ్చి కారు ఎక్కాడు.

శైలజ ఇంటికి చేరేసరికి పదినిమిషాలు పట్టింది.

వీధి తలుపు వేసిఉంది.

ప్రాకారం దాటి లోపలకు వెళ్ళి తలుపు తట్టాడు.

తలుపు తీసినది అపరిచిత వ్యక్తి. ఇరవై వసంతాల లోపు పడుచు.

"యారు వేణుం ?" అంది.

శైలజ ఇల్లు మారలేదు కదా అని అనుమానం

వేసింది ఖాన్‌కు. తమిళం మాట్లాడే ఈ తరుణి శైలజ ఇంట్లో ఎందుకుందా అన్న ప్రశ్నకు సమాధానం దొరకలేదు.

"శైలజ ఇగికారా?" అని అడిగాడు.

"ఇరికార్. ఉళ్ళ వాంగో" అంటూ ముందు దారి తీసిందా యువతి.

లోపల మంచంమీద పడుకుని ఉంది శైలజ. అలజడికి అప్పుడే మెలకువ వచ్చినట్టుంది. ద్వారంకేసి దృష్టి సారించింది. ముందా యువతి, తరువాత ఖాన్ కనబడ్డారామెకు. ఖాన్ దర్శనంతో ఆమె ముఖంమీదకు చిరునవ్వు వచ్చింది. లేచే ప్రయత్నం చేస్తుంటే ఆ యువతి వచ్చి పట్టుకుంది.

ఆమె పరిస్థితి చూసి ఖిన్నుడయ్యాడు ఖాన్. శైలజ శరీరం కృశించి ఉంది. నిరంతరం స్వచ్ఛ దరహాసంతో వెలిగే ఆమె ముఖంలో ఈనాటి చిరునవ్వు పేలవంగా ఉంది.

"కూర్చోండి" అంటూ కుర్చీ చూపింది.

"ఎప్పటినుంచి?" కూర్చుంటూ అడిగాడు ఖాన్.

"నాలుగు రోజులనుంచి. హఠాత్తుగా ఒళ్లు తిరగడంతో ఆరంభమై మంచం ఎక్కించింది."

"నాకు కబురు చెయ్యలేదేం?"

"కంగారేం లేదు కదండి. మామూలు జ్వరమే. మిమ్మల్ని అనవసరంగా బాధ పెట్టడం తప్పించి ఏం లాభం?"

"అంతా లాభ నష్టాల పట్టిక దృష్ట్యేనా ఆలోచించేది? ఉన్న డాక్టరుకదా? మందూ మాకూ చూసే వారైనా లేరాయె. మీరు తప్పకుండా కబురు పంపి ఉండ వలసింది."

"ఎవరూ లేకపోతే ఎల్లాగా తప్పేది కాదు. పక్కింటి పాటీ వచ్చి చూసిపోతోంది పాపం. సుశీల— మా ఫైనల్ స్టూడెంట్ —ఈమె—వద్దన్నా వినకుండా ఇక్కడ ఉండి చూస్తూంది, కాలేజీకి సెలవు పెట్టి. అందు చేత మీకు కూడా మనశ్శాంతి లేకుండా చెయ్యడం ఇష్టం లేక ఊరుకున్నాను. అదికాక మీరు కాంపులో ఉంటూ రాయె" అంటూ ఆగింది.

"కారణాల కేంలెండి. డాక్టరేమన్నాడు?"

"ఎల్లుండి పథ్యానికి వస్తుందన్నాడు. మరిచి పోయాను. సుశీలా, వీరు అమీర్‌ఖాన్ అని నా స్నేహితులు" అంటూ పరిచయం చేసింది.

సుశీల నమస్కరించింది. ఖాన్ ప్రత్యభివాదం చేశాడు.

"ఖాన్‌గారికి కొంచెం కాఫీ పట్రా అమ్మా" అంది సుశీలతో అరవంలో శైలజ.

"అల్లాగే" అంటూ లోపలకు పోబోయింది సుశీల.

"ఆగండి. అనవసరంగా ఆమె నెందుకు శ్రమ పెడతారు?" అన్నాడు ఖాన్.

"శ్రమ ఏముందండి ! ప్లాస్కులోదే" అంది సుశీల ఆగి.

"అయినా వద్దు. నే నిప్పుడే తాగాను. అనారోగ్యంగా కూడా మీ రీ మర్యాదలను ఇంతగా పట్టుకు దేడతారేం ? ఉంచండి. ఆ కాఫీ మీకు పనికి వస్తుంది."

"రోజుకు ఆరుసార్లు తాగితాగి డోకొస్తూంది అది చూస్తే. ఇంక తాగలేను. మీరు ఊరికే కూర్చుంటే నా మనస్సుకు తృప్తి ఉండదు" అని సుశీలతో "ఆయనమాట కేం? పట్టా అమ్మా" అంది తమిళంలో.

సుశీల లోపలి కెళ్ళింది.

"ఎల్లాగయినా మీ పట్టుదల మీదే." నవ్వాడు ఖాన్.

నవ్వి ఊరుకుంది శైలజ.

సుశీల వచ్చి కాఫీ ఖాన్‌కు అందించింది.

"ఇవాళింత హఠాత్తుగా మామీద దయ కలిగిందేం?" సహజ ధోరణిలో అడిగింది శైలజ.

"నెల్లాళ్ళనుంచి కాంపుల రద్దీలో మీమాటే మరిచి పోయాను, నాలుగు రోజులయి వచ్చినా మా ఘనత వహించిన గుమాస్తాలు ఊపిరి సలపనంత పని కల్పించారు. నేను కాంపుకి వెళ్ళడం తరవాయి. వాళ్ళు రెస్టు తీసుకోవడం మొదలు పెడతారు. మళ్ళీ నేను వచ్చి గొంతుక చించుకుంటేనే ఇంకా కాయితం కదిలేది ! వచ్చిన దగ్గర

నుంచి వాళ్లను లాలించి, బెదిరించి పని చేయించవలసి వస్తోంది. అసలు మీరు జ్ఞాపకం వచ్చిన కారణం వేరు. మా రోషనారా ఉత్తరం రాసింది. ఎల్లుండి వస్తోందిట. మిమ్మల్ని అడిగానని చెప్పమంది. దానితో మీరు జ్ఞాపకానికి వచ్చారు. కాలేజీకి ఫోన్ చేశాను. సెలవు పెట్టారని తెలిసింది. ఇటు కొట్టుకొచ్చాను."

ఖాన్ మాటల ధోరణికి నవ్వు వచ్చింది శైలజకు. ఈ నాలుగు రోజుల జ్వరంలోనూ ఎంతో పరితాపం చెందిన ఆమె హృదయానికి ఈ మాటలెంతో హాయిని కలిగించాయి. ఎంతో తేలిక పడింది మనస్సు.

"చాలా థాంక్స్" అంది.

"వ్యంగ్యంగా అంటున్నారా?"

"లేదు. మీ రాక ఎంతో ఆనందం కలిగించింది."

"చూడండి! నే నేదేనా అంటే భట్రాజు పని మానమని మీద పడిపోయిన మీరే ఇల్లా మాట్లాడడం ఉంది చూశారూ—ఏది—బొత్తిగా బాగులేదు."

"మీ చెల్లెలు ఎప్పుడు వస్తుంది?" ప్రసంగం తప్పిస్తూ ప్రశ్నించింది.

"ఎల్లుండి."

"సరాసరి ఇక్కడికే తీసుకు వచ్చెయ్యండి. రాగలిగితే నేనూ వస్తాను స్టేషన్‌కి."

"ఏం అతిథికే పని చెబుదామనా?"

"తప్పా?" ఎదురడిగింది శైలజ.

"తప్పు కాదనుకోండి. కాని ఆమె ఏమైనా అనుకుంటుందేమో ?"

"అనుకునే వాళ్ళు మన స్నేహితులే కాదు."

"నిజమే లెండి."

"అయితే తప్పక తీసుకు వస్తారు కదూ ?"

"ముందు మీకు తగ్గనీండి."

"రేపే అన్నం పెట్టెయ్యమంటాను డాక్టర్ని."

"డాక్టర్నే!!"

"ఆయన్ని నండి పెట్టుమని కాదులెండి—" నవ్వింది శైలజ.

"ఏమోలెండి. ఎంతకైనా తగుదురు మీరు." ఖాన్ కూడా నవ్వాడు.

భాష అర్థం కాకపోయినా భావాల సారం గ్రహించిన సుశీల కూడా నవ్వింది.

అప్పుడు శైలజకు, ఖాన్‌కు కూడా ఒక్కసారే స్ఫురించింది—మరొక వ్యక్తి ఉనికినే తాము మరిచినట్టు.

క్షమార్పణ చెప్పి తరువాతి సంభాషణ అంతా తమిళంతో ఇంగ్లీషు మిళాయించి సాగించారు.

"ఏం తీసుకుంటున్నారు?" ఖాన్ అడిగాడు.

"రొట్టె, కాఫీ." సుశీల చెప్పింది.

"అబ్బ! వెధవది తాగితాగి నోరు చచ్చిపోయింది" విసుగ్గా అంది శైలజ.

"ఇడ్లీ, మిళహాపొడి తినాలని ఉందా ?" నవ్వుతూ అడిగాడు ఖాన్.

"నిజంగా! ఈ రొట్టె మానేసి అది తినమన కూడదూ?" నోరూరింది శైలజకు.

"అదేమిటి మేడం!" సుశీల నవ్వింది.

"మీరు మరీ పసిపిల్లలామాట్లాడతారప్పుడప్పుడు" ఖాన్ అన్నాడు.

"కానా!" కళ్ళింత చేసుకుంది శైలజ.

"మీరు అల్లాగే అనుకోవచ్చు. కాని ఇతరులల్లా అనుకోకపోవచ్చు."

"వాళ్ళ కర్మ!"

"అప్పుడప్పుడది మీ కర్మగానూ పరిణమించవచ్చు."

"వచ్చును." ఒప్పుకుంది శైలజ.

"అప్పుడు?" ఖాన్ ప్రశ్నించాడు.

"అప్పటి మాట తరవాత ఆలోచిద్దాంగాని—నాకో చిన్న ఉపకారం చేసిపెడతారా?"

"ఏమిటి?"

"చేస్తారా?"

"చెప్పకుండా బేరం అడిగితే ఎల్లా?"

"తరవాత కాదంటే"

"అది మీ రాలోచించవలసిన విషయం"

"అంటే చెయ్యరన్నమాట!"

"తెలియకుండా మాటివ్వడం, చదవకుండా సంతకం పెట్టడం నా నిఘంటువులో లేవు."

"ఆహాం! అందుకే అన్నాను. వృత్తి స్వీకరించడంలో మీరు పొరబడ్డారని. మీరు అసలు లాయర్ కావలసింది."

"థాంక్స్."

"అయినా అవసరం నాదయినప్పుడీ బెట్టు ఎందుకులెండి-" ఒకమెట్టు దిగింది శైలజ.

"అట్లా అన్నారు బాగుంది. ఇంక చెప్పండి_"

"నాకు నాలుగు ఇడ్లీలు తెప్పించి పెట్టండి." అతి అమాయికంగా అడిగింది శైలజ.

"ఏమిటీ!!!" సుశీలా, ఖాన్ ఒక్కసారే అన్నారు.

శైలజ మాట్లాడలేదు.

"మెత్తానికి విశాఖపట్నం గాలి ఊరికేపోలేదు." ఖాన్ నవ్వుతూ వ్యాఖ్యానించాడు.

"అంటే ఏమిటి మీ ఉద్దేశ్యం?" కోపంగా అడిగింది శైలజ.

"అబ్బే! నేనేం అనందే!" భయం నటించాడు ఖాన్.

"అల్లా వీల్లేదు. చెప్పి తీరాలి." రెట్టించింది.

"అదే-యూనివర్సిటీ దగ్గరలోనేగా పిచ్చి ఆస్పత్రి ఉంది!"

"అంటే-నాకు కూడా కాస్త వేపకాయంత ఉందంటారు? కానివ్వండి. నా రోజు రాకపోదు."

"లేకపోతే ఏమిటండీ? వేళాకోళానికి ముందంటే

బాగుంది. నవ్వు తెప్పించింది. నవ్వాం. కాని - నిజంగా తిందామనే?"

"అయినా మీతో చెప్పడ మేమిటి నాకు బుద్ధి లేకగాని___"

"చాటుగా తెప్పించుకు తినక!-ఏమంటారు?" ఆమె వాక్యాన్ని పూర్తిచేస్తూ అన్నాడు ఖాన్.

"మరే నంటాను!" సాగదీసింది శైలజ.

"చాలా బాగుంది. ఆ పనే చెయ్యండి. ఆ పైన ఏదైనా వస్తే___ జనాభాలో ఒకరు తగ్గినా తగ్గడమే." సాఫీగా అన్నాడు ఖాన్.

సుశీల నవ్వు అణుచుకో లేకపోయింది.

"నాకంత చప్పన చావాలని లేదు" ఉడికిపోతూ అంది శైలజ

"అటువంటప్పుడు జాగ్రత్తగా మెగాలలి!" అన్నాడు ఖాన్.

"జాగ్రత్తగా ఉంటే ఏమీ రావని హామీ ఉందా?" సంశయానికి తావుంటే వదిలిపెట్టని ఆమె ప్రకృతి పురి గొల్పింది.

"ఉండదు. అజాగ్రత్తగా ఉంటేమాత్రం ప్రమాదం"

"అదీ చెప్పలేం."

"అవును. కాని మానవులలో ఒక బలహీనత ఉంది. తగిలిన దెబ్బలు మాత్రమే లెక్కపెట్టుకోవడం"

"అంటే!" సుశీల అడిగింది.

"కలల విషయం తీసుకోండి. మనకు కొన్ని మూఢ

నమ్మకా లున్నాయి—కొన్ని కలలు వస్తే చెడుగు జరుగుతుందని. ఒకమాటు అటువంటి దుస్స్వప్నం వచ్చి, చెడుగు జరిగితే ఇంక 99 మాట్లు అటువంటి కలలే వచ్చి ఏమీ జరగకపోయినా ఆ జరిగినా ఒక్కదానివల్లే మన విశ్వాసం గట్టిపడుతుంది. జరిగిన ఒక్క సంఘటనా తక్కిన 99 సార్లు జరిగిన అబద్ధాన్ని రద్దు చేసేస్తూంది. అల్లాగే ఫలాని పదార్థం తింటే జబ్బు చేస్తుందని తెలిసి, చాలాసార్లు దానివల్ల ప్రమాదం జరగకపోయినా, జరిగిన ఒక్కదానికే ప్రాధాన్యం ఇస్తారు. ఇటువంటి భావాలు మానసికంగా ఎక్కువ బాధిస్తాయి గనక వాటి విషయంలో శ్రద్ధ వహించడం మంచిదంటాను."

"చాలా బాగా చెప్పారు" అంది సుశీల.

"నన్నిడ్లీ తినకుండా చెయ్యడానికింత గ్రంథం వల్లె వేశారు. అల్లా భయపెట్టి ఎవర్నైనా ఎంతకాలం లొంగదియ్యగలరు!" అడిగింది శైలజ.

"అక్కడే పప్పులో అడుగేస్తున్నారు. తరతరాలుగా ఇటువంటి భయాలకు లోనయ్యే ఎన్నో ఆచారాల్నీ, నమ్మకాల్నీ ఇష్టం ఉన్నా లేకపోయినా ఆచరిస్తున్నాం. దేవుడంటే ఉండే భక్తికంటె దూషిస్తే శిక్షిస్తాడనే భయమే ఎక్కువ పనిచేసి దేవుడంటే ఉండే నమ్మకాన్ని నిలబెడుతూంది" అన్నాడు శాన్.

ఆ మాటలు సుశీల కెందుకో నచ్చలేదు. ఇల్లా అంది :

"కేవలం భయంవల్లనే నమ్మకం నిలబడుతూందంటే నేనొప్పుకోను. మహానిర్లిప్తత మనల్ని ఆవరించి, లోకం అంధకార బంధురంగా కనిపించి ఏ దిక్కూ తోచక అల్లాడుతూ, జీవితంమీద విరక్తి జనించినప్పుడు, ఏమానవుడూ మనలని ఉద్ధరించలేడని అనిపించినప్పుడు, ఆశ నిలబెట్టుకోవాలంటే, మనశ్శాంతి కావాలంటే ఒక మానవాతీత శక్తిని ఊహించుకోవడం అవసరం. ఆ మానవాతీత శక్తికి అసాధ్యమయింది లేదు. ఎటువంటి కష్టాలనుండైనా కాపాడగలదు. అటువంటి సమయాలలో ఆ శక్తినే భగవంతుడుగా అనుకోకూడదా?" అడిగింది తమిళంలో.

"అల్లా అని అనుకుని ఊరుకుంటే బాధలేదు. కాని అంతతో తృప్తి చెందరు. వాటికి రూపం కల్పిస్తారు. కథల్లుతారు. వాటి పేరిట నానా అన్యాయాలూ చేస్తారు. భయపెడతారు. ఎంత భయం లేకపోతే దేవుడికింత ధనం చేరుతూంది? భయమే లేకపోతే కావలసినప్పుడుపకారం పొంది ఆ పైన మరిచిపోయినా ప్రమాదం లేదుగా? అల్లా అనుకోరు. అనుకోనిస్తే ఈ నమ్మకం ఏనాడో పోయి ఉండును. సాధారణంగానే, సహజంగానే ఏదైనా చెడు సంభవిస్తే దైవాన్ని ఉపేక్షించిన కారణంగానే అది జరిగిందని భయపెడతారు."

దీనికి సమాధానం ఇవ్వడానికి సుశీలకు ఏమీ తోచలేదు. శైలజకు వాదనమీద ఆసక్తిగాని, అందుకు తగిన

ఓపికగాని లేకపోయాయి, అందుకని ఆ వాదన అక్కడే నిలిచిపోయింది. ఖాన్ కూడా ఊరుకున్నాడు.

"ఇప్పుడు మీ చెల్లెలు ఎక్కడా ఉంటూంట ?" మాట మార్చి ప్రశ్నించింది శైలజ.

"ఢిల్లీ సెక్రటేరియట్ లో."

"అదృష్టవంతురాలు. నాకన్నా నయం. ఈ వెధవ ఉద్యోగం నానా యాతనగానూ ఉంది" ఉదాసీనంగా అంది శైలజ.

"అదే చిత్రం. ఆమె కా ఉద్యోగం నచ్చలేదు. ఇంకా మాటకొస్తే నా ఉద్యోగం నాకసలు నచ్చలేదు. ఇది ప్రకృతిలోనే ఉంది" నవ్వుతూ అన్నాడు ఖాన్.

"ఇక్కడ బొత్తిగా బాగుండలేదు."

"ఆర్నెల్లు కాలేదు అప్పుడే ఇంత అసహ్యం పుట్టిందే ?"

"ఏమిటో!"

"నేనింక సెలవు తీసుకుంటాను వెళ్ళి మాప్యూన్ను పంపుతాను. ఈనాలుగు రోజులూ ఇక్కడ ఉండనియ్యండి. కాస్త ఆసరాగా ఉంటాడు."

"ఎందుకండీ మళ్ళీ వాణ్ణి శ్రమ పెట్టడం ? అక్కర్లేదు. అదీకాక సుశీల ఉండనే ఉంది."

"వాడక్కడ ఉండి వెలగబెట్టేది మాత్రమేముంది లెండి. ఎక్కడున్నా ఒకటే. నేను చెప్తుకలుస్తాను."

"మళ్ళీ ఆ శ్రమ మీకెందుకు? ఎల్లుండి ఆవిణ్ణి తీసుకురండి" అంది శైలజ.

"శ్రమ కేముంది లెండి. వస్తాను" అంటూ కదిలాడు.

కారుదాకా సాగనంపడం సుశీలవంతు అయింది.

ఖాన్ వెళ్ళిన తరవాత ఇద్దరూ అతన్ని గురించే ఆలోచించ మొదలుపెట్టారు.

మర్నాడు శైలజ జ్వరం నార్మల్‌కు వచ్చేసింది. మూడో రోజున పథ్యం తీసుకుంది. అయినా ఇంకా బలహీనంగా ఉండడంవల్ల సెలవు నాలుగు రోజులు పొడిగించింది. పక్కింటి సుశీలను బలవంతపెట్టి కాలేజీకి పంపించింది. పక్కింటి ముసలమ్మ రెండు రోజులపాటు పథ్యం తన ఇంట్లోంచి పంపింది.

వస్తానన్న రోషనారా ఆకస్మికంగా కార్యక్రమం రద్దు చేసుకొన్నట్లు వైర్ ఇచ్చింది.

ఈ జ్వరం పడి లేచినప్పటినుంచీ శైలజకు నిర్లిప్తత హెచ్చు అయింది. మళ్ళీ మామూలు కాలేజి వాతావరణం సిద్ధం అయింది.

ఎందుకో సుశీలకు తనంటే అంత ఆపేక్ష? వెర్రి పిల్ల! కాలేజికి సెలవుపెట్టి తనకు ఉపచారాలు, చాకిరీ చేసింది. ఆమె లేకపోతే తనేమయ్యేది? చచ్చిపోదునని కాదు గాని ఎంతో అవస్థ అయిఉండును.

అసలా జ్వరం వింతగా వచ్చినట్టనిపించింది తనకు. ఉండి ఉండి ఇంటర్వెల్‌లో కొద్దిగా తలనొప్పి వికారం కలిగాయి. మధ్యాహ్నం సెలవు పెడదామనుకుంటూనే మళ్ళీ ఒక్క క్లాసేగదా అని ఫైనలియర్ క్లాస్‌కు వెళ్ళింది. పాఠం చెప్పడం ఎంతో కష్టం అనిపించింది. కూర్చునే లెక్చర్ కానిచ్చింది. క్లాస్ అయిపోయింది. స్టేజిమీద నుంచి దిగబోతూండగా తూలిపోబోయింది. నలుగురు విద్యార్థినులు చూసి గబగబ పట్టుకుని స్టాఫ్‌రూమ్‌కు ఇంచుమించు మోసుకుపోయారు. తరువాత ఇంటికెల్లా వచ్చిందో తనకే తెలియదు. సుశీల తనను వదిలి వెళ్ళలేకపోయింది. మర్నాడు పొద్దున్న తనకు కాస్త ఒళ్ళు తెలిసింది. ఈలోపున డాక్టర్ రావడం, మందివ్వడం అన్నీ జరిగాయి. అన్నం తినేవరకు తనను కనిపెట్టుకుని ఉంది. అంతమందిలో ఒక్కళ్ళకూ లేని శ్రమ ఆమెకెందుకో? క్లాసులో విడవకుండా చదివే పదిమందిలోనూ ఉంటుంది సుశీల. నెమ్మదైనది. సహజంగా క్లాసులో ఉన్న విద్యార్థినులందరిలోనూ ఆమె అంటే తన కెక్కువ అభిమానం. బాగా చదివే విద్యార్థులంటే ఏ అధ్యాపకుడికి ఉండదు అనురాగం? తను ఎంత జాగ్రత్త తీసుకున్నా తన బలహీనత బయటపడిపోతూనే ఉంటుంది. అది చదవనివాళ్ళకు కాస్త అసూయ పుట్టించినా తనేమీ చెయ్యలేకపోయేది. బాగా చదివే వాళ్ళలో కాస్త తలబిరుసుతనం ఉంది. సుశీలకు వినయ విధేయతలు ఎక్కువ. కాని పాఠాల విషయంలో

తనను నిష్కర్షగా నిలబెట్టేస్తుంది. సందేహంవస్తే తననింక మాట్లాడనివ్వదు. ఒక్కొక్కప్పుడు తన అసహాయ స్థితిని అంగీకరించి తరువాత చెబుతాననే స్థితికి తీసుకువస్తుంది. ఆ ధైర్యం, పట్టుదల తనకెంతో నచ్చుతాయి. అసలు సుశీలంటే ప్రత్యేకాభిమానానికి కారణం అదే. అందరూ అల్లా ఉంటే బాగుండు ననిపిస్తుంది తనకు. అల్లా ఉండమనే ప్రబోధిస్తుంది.

మర్నాడు అనూరాధ దగ్గరినుంచి ఉత్తరంవచ్చింది.

"శైలూ,

నువ్వు, నేను ఉత్తరం అంటే నాలుగు ముక్కలు గాలికెయ్యడం మాత్రమే అనుకుంటానని ఫిర్యాదు చేస్తు న్నావు. తీరుబాటు లేదంటే నమ్మవు. ఈ మాటు ఈ ఉత్తరం చదివిన తరువాత ఆ మాట అనగల ధైర్య ఉంటుందనుకోను. కబుర్లు చెప్పడం తేలికే. అసలు నువ్వి ఉత్తరం పూర్తిగా చదువుతావనే నమ్మకం నాకులేదు ఎందుకు రాస్తున్నానంటే నా బాధ్యత తీర్చుకుందుకు. ఇది పూర్తిగా చదవగలిగితే ఇంక మళ్ళీ జన్మలో నన్ను పెద్ద ఉత్తరాలు రాయమని చంపవు. అదే ఇంత పెద్ద ఉత్తర రాయడానికి ఇంకో కారణం. ఉత్తరం రాయడం ఒక కళ నాకూ దానికీ బొత్తిగా పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది నీలా రాయలేను నేను. ఒట్టి పొడిముక్కలే దొర్లుతాయి నాకు ఓపిక ఉంటే చదువు. కాని ఇకముందు నీనుం ఫిర్యాదువస్తే మాత్రం ఊరుకునేది లేదు.

ఆడపడుచుననే గర్వంతో నామీదైతే నిష్ఠూరంగా నువ్వు అనెయ్యగలిగావు గాని ఇక్కడ నువ్వు సంజాయిషీ చెప్పుకోవలసిన వాళ్ళు చాలామందిఉన్నారు. కోర్టుకు ఒక పదిహేను రోజులపాటు విధి విరామంలేకుండా పని కలుగుతుంది. ఈ ఫిర్యాదులు ఇతర స్నేహితుల దగ్గరి నుంచి కాక ముఖ్యంగా నిధి, హైమలనుంచి. హైమ పది ఉత్తరాలు రాస్తే నువ్వు అసలు సమాధానం ఇవ్వలేదుట! నిధికి అంతేనుట !

నువ్వు కాన్వొకేషన్‌కు వచ్చినప్పుడు ఏం లంచం ఇచ్చి వాళ్ళను శాంతింప జేస్తావో కాని లేకపోతే నీతో మాట్లాడరుట! అయినా నీ కిదేం రోగం—వాళ్ళ కెందుకు రాయవు? చెల్లీ, చెల్లీ అంటూ ఇక్కడున్నంత సేపే గాని అక్కడికి కెడితే మతిమరుపే! మా తమ్ముడు లోకువగదా అని ఇక్కడ అతన్ని యిష్టంవచ్చినట్టు అని అక్కడికి వెళ్ళి మరిచిపోతావూ? దీనికి నీ కేం శిక్ష విధించాలి? మీ అన్నగారికేమో ఎంత పక్షపాతమో తెలీదు. 'పాపం! ఆమెకు తీరుబడి ఉండదు. దూరాన ఒక్కతీ ఉంది ఎందుకు కోప్పడతారు !' అంటారు. నిజం చెప్పద్దూ ! నేను మాత్రం ఊరుకోలేను. 'అవును పాపం! మీ చెల్లెలి కింకా మాటలు రావు! చంటిపిల్ల కదూ?' అనేస్తాను. అది నాకు రెండు విధాలా లాభం. ఒకటి: మీ అన్నయ్యకు మాటకు మాట అందివ్వడం. నిన్ను నోరారా తిట్టడం. రెండోది : నా అనగానే హైమ, నిధి నా పక్షం అయిపోతారు.

దానితో పాపం, మీ అన్నయ్య ఒక్కరూ అయిపోయి ఊరుకుంటారు. అప్పుడు ముగ్గురం కలిసి ఆయన్ను మరింత రెచ్చగొట్టడానికి నిర్ణయించుకుంటాం. అప్పుడిక్కడ నువ్వుండాలిట !

మొన్న ఇక్కడ నిధి బలే హడావిడి చేశాడు. హాస్టల్లో ఎవరో పిచ్చివాణ్ణి దొంగ అనుకుని క్రూరంగా హింసించారు. అమానుషంగా ప్రవర్తించారు. తత్ఫలితంగా ఆ వ్యక్తి కన్నుమూశాడు. ఆ సంఘటనలో ఇతని పాలు తక్కువే. అయినా ఎంతో కుమిలిపోయాడు. అతన్నంత దీనస్థితిలో ఎప్పుడూ చూడలేదు. ఆ సంఘటన గురించి విన్నప్పటికంటె అతన్ని చూస్తే నేను ఏడుపు ఆపుకోలేకపోయాను. ఆ రాత్రి మళ్ళీ హాస్టల్‌కి వెళ్ళిపోయాడు. నేననుమానపడ్డట్టే విపరీతమైన జ్వరం వచ్చేసింది. ఇలా అయిపోయాడు పుడకలా. ఇతనికి మతి భ్రమిస్తుందేమో నన్నంత భయం వేసింది నాకు. అంత సుతిమెత్తని మనసు! ఇల్లాంటివాడు ఒకప్పుడు దుష్టుడుగా పరిగణింపబడేవాడు! ఎంత చిత్రం! ఇప్పుడిప్పుడే కోలుకొంటున్నాడు.

కాలేజీ అల్లాగే సాగిపోతూంది సుదర్శనంగారు — మీ ముందు బాచ్ ఫస్ట్ — స్కాలర్‌షిప్‌మీద లండన్ వెడుతున్నాడు. మీ నర్మదకు పెళ్ళయిపోయింది. అతన్నే చేసుకుంది. నీకూ ఆహ్వానం వచ్చే ఉంటుందనుకుంటాను. నన్ను అడ్రెస్ అడిగింది. ఇచ్చాను. ఇక్కడ రు. 75 ల

స్కాలర్‌షిప్‌తో రీసెర్చి చేస్తోంది. అతను సెంట్రల్ గవర్న మెంట్ స్కాలర్‌షిప్ మీద పని చేస్తున్నాడు. వాళ్ళ పని బాగానే ఉంది. రెండేళ్ళనుంచి ఎటూ తెగని సమస్య మొన్నటికి పరిష్కారమైంది. నర్మద తలిదండ్రులు ఒప్పుకో కేగా ఇంత ఆలస్యమైంది!

నీ ఉత్తరాలలో నిర్లిప్తత, నిరుత్సాహం ఎక్కువ కనబడుతున్నాయి. ఎందుకనీ? పరిస్థితుల కనుగుణంగా అడు గడుగునా అవరోధాలే కనపడతాయి. ఏ మొండకు ఆ గొడుగు పట్టే తత్వం నీదికాదని నాకు తెలుసు. బహుశా నీ కింత ఉదాసీనత ఏర్పడడానికి అదే కారణం అనుకుం టాను. ఇన్ని చెప్తావే నువ్వు ఎవరి బలహీనతలను వారికి వదిలేసి వారితో కలిసి ఎందుకుండవు? అందరికీ నీ అంత హృదయ వైశాల్యం ఉండాలని ఎందుకు కోరతావు? నీ ధోరణినిబట్టి చూస్తే మీ అమీర్‌ఖాన్‌గారు చాలా విచిత్రమైన వ్యక్తిలా కనపడుతున్నాడు. నీకు మంచి తోడు దొరకడం నాకెంతో సంతోషంగా ఉంది.

మీ అన్నయ్యకూడా గమ్మత్తులుచెయ్యడం నేర్చు కున్నారు. మొన్నటి వింతకు నవ్వలేక చచ్చాం. అసలు జరిగిందిది: వారు ఒకరోజున బజార్లోంచి వస్తూంటే 'ఒరే విశ్వం!' అన్నపిలుపు వినబడిందిట! వెనక్కి తిరిగిచూస్తే వారి స్కూల్లో పిల్లవాడేనుట! నాలుగువ ఫారంవాడుట! ఏదో ఏడిపిద్దామని పిల్చినట్టున్నాడు. ఈయనకు ఆశ్చర్యం వేసింది. తన్ని ఒరే అన్నందుకుకంటే, ఆ భావమే ఆ కుర్రా

డిలో వృద్ధిపొంది ఇతరులను చులకనచేసే స్వభావం అల వడుతుందేమోననే ఆలోచనే ఆయనను ఎక్కువ బాధిం చింది. అతనికి ఎల్లా తెలియజెప్పాలా అని ఆలోచించారు. పిలిచి తిట్టినా, నచ్చచెప్ప ప్రయత్నించినా విరుద్ధంగా పని చేస్తుందేమోనని అనిపించి అతనిచేతే తప్పు తెలుసు కునేటు చేద్దామని ఒక ఉపాయం పన్నారు. మర్నాడు క్లాసుకు వెళ్ళేటప్పుడు రెండు బత్తాయిపళ్ళు పట్టుకుని ఆ కుర్రవాడు క్లాసులో ఉండగా వెళ్ళారు. ఆ కుర్రవాడు హడలిపోయాడు ఈయన ఏంచి చేస్తారోనని. అతని దగ్గరకు ఈయన వెళ్ళి అతని చేతిలో ఆ పళ్ళుంచి 'బాబూ, మా నాన్న చచ్చిపోయిన తరువాత ఇంత అప్యాయంగా ఎవ్వరూ పిలవలేదు. నిజంగా నీ పిలుపు విని ఆయన జ్ఞాప కానికి వచ్చారు. ఇవి తీసుకుని నన్ను సంతోషపెట్టు' అన్నారట! దానితో ఆ క్లాసులో మేస్టరు, తక్కినపిల్లలు నిశ్చేష్టులైపోయారుట. కుర్రవాడు ఏడుపు మొదలుపెట్టాడు. తన కసలా ఉద్దేశ్యమే లేదన్నాడు. ఎవరో అనమంటే అన్నాడుట. ఇంక జన్మలో అటువంటిపని చెయ్యననీ, క్షమించమనీ బతిమాలాడుట. తన తలిదండ్రులకు తెలిస్తే చంపేస్తారని ఏడ్చాడుట! మీ అన్నయ్య ఆ క్లాసులో మాస్టారితో అత న్నింకేమీ అనవద్దని చెప్పి ఇవతలకి వచ్చేశారట! ఆ కుర్రాడిచేత ఇవన్నీ చేయించి ఈయన కోపం ప్రకటిస్తే సరదాగా ఉంటుందనుకున్న వాళ్ళ కథ

అడ్డం తిరిగింది. ఎంతో బాధపడ్డారు. వర్షించని మేఘాలే ఎక్కువ భయపెడతాయి. ఎల్లా ఉంది కథ!

నువ్విక్కడ లేని లోటు రోజూ కనపడుతూనే ఉంది. నిధికి మరీను. తనతో వాదించేవాళ్ళే కనపడడంలేదతనికి. ఇంక మీ చెల్లి! ఆ ముద్దరాలికి నీ స్మరణలేని క్షణమే లేదు. అత్తయ్య నిన్ను చూడాలని తహ తహ లాడి పోతున్నారు. ఇక ఎటొచ్చీ పైకి తేలనిది మీ అన్నగారే! ఆయన మనస్సులో ఏముందో తెలియడానికి ఆ బ్రహ్మ దిగిరావాలి అసలంటూ ఉంటే! బ్రహ్మ నిజంగా ఉన్నాడంటే నన్ను తినెయ్యవూ?

ఇంక ఇరవైరోజులుంది కాన్వొకేషన్. రాకపోయావో—ఇంక నీకిదే ఆఖరి ఉత్తరం.

జవాబుగా నువ్వేరావాలి. ఇక్కడంతా క్షేమం. అంతా అడిగారని రాయడం అవసరమా!

ఇట్లు

నీ వదిన

అనూరాధ."

ఉత్తరం పూర్తి చేసేసరికి శైలజ కళ్ళు చెమరించాయి పట్టరాని సంతోషంతో.

ఆ వాళ్ళనుంచి ఇంకెప్పుడు బయల్దేరడమా అనే ఆత్రుత ఎక్కువైపోయిందామెకు. వాళ్ళమధ్యకు వెళ్ళి

ఎప్పుడు పడదామా అనే ఉత్కంఠతో రోజు గడవడమే కష్టమైపోసాగింది.

మూడో రోజున శైలజ కాలేజీకి వెళ్ళింది. సహాధ్యాపకురాండ్రు అంతా వచ్చి ఆమె అనారోగ్యానికి సంతాపం వెలిబుచ్చారు. నిజానికి వాళ్ళలో చాలామందికి తనకింకా రోగం ముదిరిఉంటే బాగుండుననే తత్వం ఉందని తెలిసీకూడా అన్నీ సహించి వారి ఔదార్యానికి ధన్యవాదా లర్పించింది శైలజ.

సహాధ్యాపకురాండ్రు అందరిలోనూ శకుంతల కాస్త మెరుగు. హిస్టరీ లెక్చరర్ ఆమె. శైలజ అసలంటూ కాస్త పూసుకు తిరిగితే ఆమెతోనే. ఆమె వచ్చి పలకరించింది.

"వద్దామని ఎంతో ప్రయత్నించాను. రాలేక పోయాను. దేవుడి దయవల్ల తగ్గింది. నయం!" అంది సానుభూతిగా.

"రాలేకపోయినందుకు బాధ పడకండి. ఎన్నో అనుకుంటాం. అన్నీ చెయ్యగలమా!" సర్దిచెప్పింది శైలజ.

"పాపం, ఒక్కరూ నానా అవస్థ పడినట్టున్నారు."

"లేదులెండి. సుశీల పుణ్యమా అని ఆ బాధ తప్పింది" అంది శైలజ కాస్త వ్యంగ్యంగా.

"ఎవరూ? సుశీలా!"

"మా ఫైనలియర్ స్టూడెంట్."

"ఓహ్! ఆమే!" పరిహాసపూరితంగా కనబడిందామె నవ్వు.

శైలజ ఒళ్ళుమండింది ఆమె దరహాసం చూసేసరికి. వారం రోజులునానా అవస్థ పడుతూంటే చూసిన పాపాన పోలేదు గాని పైగా సుశీల మంచితనానికి తనకోసం పాటు పడితే ఆమెను పరిహసించడమా?

"ఆమేనండి! ఆమే లేకపోతే నాపని ఏమయ్యేదో?" సాధ్యమైనంత అసహ్యంతో అంది శైలజ.

"ఆమె దేనికైనా సమర్థురాలేలెండి" అంది శకుంతల.

"అంటే—మీ ఉద్దేశ్యం?" గంభీరంగా అడిగింది శైలజ.

"అరె! చిత్రంగా ఉందే, మీకు తెలీదా? కాలేజీ అందరికీ తెలుసు—సుశీల ప్రవర్తన మంచిది కాదని."

ఆ మాటతో శైలజ ముఖం వివర్ణమైంది. శకుంతల ఆశించింది కూడా అదే కావచ్చు. అందుకే ఆమె ముఖం సంతోషంతో వికసించింది.

అందరిలోకీ మంచిది అనుకున్న శకుంతలే ఇల్లా ప్రవరిస్తూండేసరికి శైలజకు కష్టం తోచింది. ఇక అక్కడ నిలువలేకపోయింది. ఎల్లాగో ఆలోచనల నరికట్టి సాయంకాలం కాలేజీ వదిలేదాకా నిగ్రహించుకుంది. కాని ఇంటికి వచ్చినతరువాత ఆ పని సాధ్యం కాలేదు.

ఇంతమంచిది, అమాయకురాలు అనుకున్న సుశీల ఇంతదా? తన అంచనా అంత తప్పిపోయిందా? ఆ మంచి తనం, తెలివి చాటునఉన్న ప్రవర్తన అంత నీచమైనదా? ఏమీ తెలియని దానిలా ఉంటుంది. తెలివైనది కదా అని తను చేరదీసి మెచ్చుకుంది. ఆమె అంటే ఎంతో అభి మానం ప్రకటించింది. ఇంత నిగ్రహం లేనివ్యక్తి అని ముందే తెలిసిఉంటే అసలామెను తను చేరదీసి ఉండేదే కాదు. ఇంతమందితో మెలిగిన తన అనుభవం ఆమెను గ్రహించడంలో పొరబడింది. తనామెను అసలు శంకించ నేనాలేదు. కాని కాలేజీ అంతా తెలుసునుట! సుశీలను అంతా తప్పించుకు తిరగడం తను చూసింది గాని అసూయ వల్ల అల్లా చేస్తున్నారని అనుకుంది తను. దానికి కారణం ఇదా?

స్త్రీకి ఉన్నత విద్యను ప్రోత్సహిస్తే పరిణామాలు ఇల్లాగే ఉంటాయా! అవినీతి ప్రబలడానికే ఎక్కువ ఆస్కారం ఉందా? పూర్వులు గర్హించారే—అందులోనే సబబు ఉందా? ఇంత బలహీనలైపోతారా? ఈ ప్రశ్నలతో ఉక్కిరి బిక్కిరి అయిపోయింది శైలజ. అల్లా ఎందుకౌ తుంది? చదువుకున్నవాళ్ళంతా ఇల్లాగే ప్రవర్తిస్తున్నారా? నాలుగు గోడల మధ్య బంధింపబడినవారంతా సత్ప్రవర్త నులే అవుతున్నారా? బహుశా అది వ్యక్తిత్వంమీద ధారపడి ఉంటుంది. కాని అంత నిర్మలంగా కనబడే శీల ఇల్లా ప్రవర్తిస్తుందా? ఇది వట్టి పుకారు మాత్ర ునా?

అవును. పుకారే అయిఉంటుంది. కాస్త నలుగురితో స్వేచ్ఛగా మెలుగుతూంటే అనుమానించడం లోకపుతీరు. ఎవరిదాకానో ఎందుకు? తననే ఎంతమందో సూటీపోటీ మాటలంటూంటారు. కాని తను లెక్కచెయ్యదు, తనయందు తప్పులేదని తెలియడంవల్ల. ప్రతివారినీ అనుమాన దృక్కులతోనే చూడడం సహజంగా జరుగుతూండేదే. ఆ మాటకొస్తే పక్కింటి ముసలమ్మ, అడిగింది, అమీర్‌ఖాన్ ఎవరని. తను చెప్పితే ఇంచుమించు మూర్ఛపోయింది. తనమాటలు నమ్మలేకపోయింది. తన్ను హెచ్చరించింది. పెళ్ళికానిదానివి నీకు మొగ స్నేహితులేమిటి? మీ కులం కాదు. జాతి కాదు, చెడిపోతావ్ జాగ్రత్త అని మందలించింది. తనకు ఒళ్లు మండుకొచ్చింది. కాని ఆమెతో వాదనెందుకని మిన్నకుంది తను. దానితో తన తిక్క కుదిరిందని ఊహించిన ముసలమ్మకు ఖాన్ పునరాగమనం వెర్రెత్తించింది. ఏమమందో, ఏం పురెక్కించిందో మర్నాడు ఇంటాయన వచ్చి ఇల్లు ఖాళీ చెయ్యమన్నాడు. ఎంత అడిగినా కారణం చెప్పలేదు మొదట్లో. అద్దె యెక్కువ ఆశించాడేమోనని అటు కదిపి చూసింది కాని అది కాదని తేలిపోయింది. యెంతో అడిగినమీదట శైలజ ఇంటికి అందరూ వస్తూ పోతూ ఉండడం పక్కవాళ్ళకు నచ్చడంలేదనీ, వాళ్ళుఫిర్యాదు చేస్తున్నారనీ చివరకు చెప్పాడు. దానితో తనకు నిగానే కోపం తారాపథం అంటింది. కాని వచ్చిన ఇ
ఖాళీచేస్తే మళ్ళీ ఇంతమంచిది దొరక్కపోవచ్చు. ఆ

కని నిగ్రహించుకుని ఆయనకు నచ్చచెప్ప పూనుకుంది. ఆయన వచ్చిన సమయం రాత్రివేళ తనతో మాట్లాడుతూ ఒకగంట కూర్చున్నాడు. అంతమాత్రానికే తమ నిద్దరిని ఎవరైనా అనుమానిస్తే ఎల్లా ఉంటుందని సూటిగా అడిగిందాయనను. దానితో అయన తల తిరిగింది. తన (ఆయన) ఊహ ఎంత అర్థం లేనిదో గ్రహించాడు. చెప్పితే తెలుసుకోగలిగి, అర్థంచేసుకోగల తత్వం వాడవడంవల్ల వెంటనే సమాధానపడి క్షమార్పణ కోరాడు.

ఇంతలో ఉంటుంది వ్యక్తుల అనుమానం!

సుశీల విషయంలోనూ ఇంతే జరిగి ఉండవచ్చు. ఎంత వెర్రిదైంది తను! ఇలా ఆలోచించి ఆలోచించి సమాధాన పడింది శైలజ.

మర్నాడు ప్రయాణమనగా బ్యాంక్‌నుంచి డబ్బు తెచ్చుకుని షాపింగ్‌కు బయలుదేరింది శైలజ. ముందు బట్టలషాపులలోకివెళ్ళి దక్షిణాది జరీచీరలు రెండుతీసుకుంది అనూరాధకూ, హైమకూ. శాంతమ్మగారికి మంచిగంధం చెక్కమీద చెక్కిన రాధాకృష్ణుల మూర్తులు, విశ్వానికి దంతంతో చేసిన బుద్ధవిగ్రహం, నిధికి పెయింటింగ్ ట్యూబులు, అల్బమ్ కొంది.

శైలజను స్టేషన్‌కు వచ్చి రైలెక్కించాడు ఖాన్.

రైలు కదులుతూండగా అడిగాడు, "చేరగానే ఉత్తరం తప్పకుండా వ్రాస్తారుగదూ?" అని.

"తప్పకుండా" అంది శైలజ.

మర్నాడు పొద్దున్న 6 గంటలకు ఎగ్మూర్ స్టేషన్‌లో ఆగింది రైలు. రాజేశ్వరి వచ్చింది స్టేషన్‌కు.

"బాగున్నావుటే?" శైలజ చేతులు తనచేతులలోకి తీసుకుంటూ అడిగింది రాజేశ్వరి.

"కనబట్టంలేదూ? నీకుమాత్రం 'మెడిసిన్' బాగా పనిచేసినట్టుంది."

"ఒకపూట తిండి మానేస్తున్నా ఇల్లా తయారౌతూంటే ఏం 'చెయ్యనే!" తియ్యగా నవ్వుతూ అంది రాజేశ్వరి.

"మీ రోగాలు మీరే కుదుర్చుకోలేరు. ఇంక మీ ఇతర్ల రోగాలు కుదిర్చే దేమిటే!"

"పెరటిచెట్టు మందుకు రాదే" అంటూ అటు తిరిగి 'పోర్టర్' అని కేకేసింది.

సామాన్లు పట్టించుకుని ఇవతల పడ్డారు.

హాస్టలు చేరుకునేసరికి మరో అరగంట పట్టింది.

కాలకృత్యాలు తీర్చుకుని, స్నానాలు అయ్యాయని పించేటప్పటికి 8-30 అయింది. మెస్సుకువెళ్ళి భోజనం చేసి వచ్చారు.

రాజేశ్వరి క్లాసుకు ప్రయాణమౌతూ అంది:

"రాత్రల్లా నిద్దర లేనట్టుంది—కళ్లు జ్యోతుల్లా ఉన్నాయి. కాసేపు నడుము వాల్చు. ఒంటిగంటకు నేమా వచ్చేస్తాను. మధ్యాహ్నం లీవు పెడతాలే. పొద్దున్న మానడానికి వీలులేదు. పాఠికల్ పోతాయి.

"బతికించావు. నీతో కాలేజీకి రమ్మని చంపుతా వేమోనని హడిలిపోయాను. మధ్యాహ్నం కూడా సెల వక్కర్లేదు. ఏకంగా సాయంకాలం నువ్వు వచ్చేటప్పటికి గాని లేవను."

"తెలివి తేగలు తిన్నట్టే ఉండిగాని నోరుముయ్యి."

"కాదు నిజంగా నేనే! ఇప్పుడు పడుకుంటే ఏనుగులు తొక్కినా మెలుకువ రాదు నాలుగింటిదాకా."

"ఏనుగులు తొక్కితే మెలకువ రాక పోవచ్చు కాని నాదగ్గరా నీ ఆటలు! మరి పోయిరానా ?"

"శుభమస్తు" అంది వేళాకోళంగా శైలజ.

రాజేశ్వరి, శైలజ నాలుగవ ఫారంనుంచి ఇంటర్ అయిపోయేవరకు కలిసి చదువుకొన్నారు. ఇంటర్ కాగానే శైలజ ఆనర్సుకు అటు విశాఖపట్నం, రాజేశ్వరి ఇటు మద్రాస్ మెడిసిన్‌కు రావడంతో విడిపోయారు. ఆ తరువాత కలుసుకోవడం పడలేదు దానితో స్నేహబంధం కొంచెం సడలింది. శైలజ ఆనర్సు అయిపోయి ఉద్యోగంలో చేరినట్టు తెలిసిన రాజేశ్వరి పెద్ద ఉత్తరంలో అభినందిస్తూ ఈ మూడేళ్ళుగా ఉత్తరాలు ఆపేసినందుకు నాలుగు అక్షింతలు వేస్తూ తిరుగు ప్రయాణంలో మద్రాసులో దిగకపోతే మాట దక్కదని రాసింది. ఆ ఉత్తరం చూసి సిగ్గు పడింది. అన్నేళ్ళు అంత సన్నిహితంగా ఉండి ఒక్క మూడేళ్ళ ఎడబాటుతో ఎంత మార్పు వచ్చిందా అని బాధపడింది. క్షమార్పణకోరుతూ

రాజేశ్వరికి జవాబు రాసింది. అదీకాక అటు వచ్చే ప్రయాణంలో గాని, ఇటు వెళ్ళే ప్రయాణంలోగాని మద్రాసులో ఆగితేనే సుఖంగా ఉంటుంది. అటు రైళ్ళకు రద్దీ ఎక్కువ. పొద్దున్నే దిగి వెంటనే ఏ జి. టి. కో బయలుదేరినా మర్నాడు 12 గంటలకుగాని విశాఖ చేరదు. సాయంత్రం మెయిలుకు బయలుదేరినా నాలుగు గంటలకు చేరుకో వచ్చు. ఇక్కడ దిగి ఒక పన్నెండు గంటలు విశ్రాంతి తీసుకున్నట్టూ అవుతుంది. ప్రయాణం సుఖంగానూ ఉంటుంది. మొదటిసారి వెళ్ళేటప్పు డీ సులువు తెలియక నానా ప్రయాసా పడి కొత్త ఊళ్ళో రాత్రి దిగవలసి వచ్చింది.

క్రితం రాత్రి పడిన ప్రయాణపు బడలికవల్ల వెంటనే నిద్ర పట్టింది శైలజకు.

ఒంటి గంటకు గది చేరుకున్న రాజేశ్వరి నిశ్చింతగా నిద్రపోతున్న శైలజను లేపలేకపోయింది. ఆమె మంచం మీందే తటపటాయిస్తూ కూర్చుంది. ఇంటర్‌లో తన సహాధ్యాయిని శైలజకూ, ఈమెకూ పోలికే లేదు. అమాయికత ఉట్టిపడే రోజులవి. ఇంటర్ అయ్యేసరికి తమకు పదహారు నిండాయేమో. చిలిపి తగువులు, తిట్టుకోవడం మధ్య గడిచి పోయా యారోజులు. ఉన్నత విద్యతో మానసికంగా ఎంత మార్పువస్తుంది? తమ ముఖాలలో ఇదివరకటి అమాయికత లేదు. అనుభవం నేర్పిన పాఠాలు ప్రతి కదలికలోనూ మార్పు తెచ్చాయి. ఇటువంటి ఊహాలలో మునిగిపోయింది రాజేశ్వరి.

నిద్ర విడిపోయేముందు బద్ధకంగా ఇటు తిరిగిన శైలజకు రాజేశ్వరి స్పర్శ తగిలింది. ఉలిక్కిపడి లేచింది.

"ఎంత సేపైందే వచ్చి!" శైలజ అడిగింది నిద్రతో బరువెక్కిన కంఠంతో. బద్ధకంగా అవలించి చేతులు విదిలించింది.

ఆ ప్రశ్నతో ఊహాలోకం నుంచి ఊడిపడిన రాజేశ్వరి "ఇప్పుడే. పది నిమిషాలయింది" అంది.

"మరి నన్నెందుకు లేపలేదు?"

"ఇప్పుడు లేచావుగా? బడలికతో ఒళ్ళు తెలియకుండా పడుకున్నావ్. లేపడానికి చేతులు రాలేదు."

"ఎంత గొప్పదానివే! రైల్లో నిన్ను నమ్ముకుని పడుకోవాలిట! దిగవలసిన స్టేషన్ దాటిన రెండు గంటల …నాకా ఎల్లా లేపనా అని ఆలోచిస్తూనే ఉంటావు. తరు…త లేచిన ఆ మనిషికి మతిపోతుంది. ఇంతకీ టైమెంత…ది?"

"…ంగారు పడకు. ఒకటింపావు అయింది. అయినా …రేపుగా?"

"…ద్దేవ్? పోనీ గదా అని దిగితే ఇదా వరస! …పోదును."

"…వ్? మానేసి ఉద్ధరిద్దువు. … సాయంత్రం

"ఇల్లా ఏడుస్తావనే అసలు దిగడం ఇష్టం ఉండదు నాకు. మళ్ళీ దిగకపోతే నిష్ఠూరం. ఎల్లా చావను ?"

"చావాలంటే చాలా మార్గాలే ఉన్నాయి. ఒక్క చిటికెడు స్త్రైనెడ్ చాలు. చావమని ఎవడేడ్చాడు?ఏమైనా నువ్వివాళ కదిలేదానివి! వెళ్లేదు."

శైలజ ఇంక బతిమాలే ధోరణిలో పడింది. "మా రాజీ చాలా మంచిదిట! ఎంత మంచిదో! నన్నివాళ అడ్డు పెట్టదుట!" అంది లాలనగా.

"అవునుట! మా శైలుగూడా గొప్పదిట! మంచీ మర్యాదా గలదిట !" అని వెక్కిరింపుగా శైలజ ననుకరిస్తూ అని "దౌర్భాగ్యురాలా! ఇవాళ వెళ్ళు. మళ్ళీ నా పేరెత్తు" అని శైలజ నెత్తిన ఒక్క మొట్టికాయ వేసింది.

"శని! ఆ మోటు సరసమేమిటే! ఏమైనా స... నేనివాళ వెళ్ళితీరాలి."

"నామీద ఒట్టే."

"ఆడదా న్ననిపించుకున్నావే దద్దమ్మ..."

"మొగరాయుడువి నువ్వు బయల్దేరావు... గొడవ-వచ్చినప్పటినుంచీ పోతానో పో... గోలతప్ప మంచీ చెడ్డా మాట్లాడా..."

"నువ్వు మాట్లాడని కే... తుర్రుమనావు. వస..."

"శ్యాం కులాసాగా ఉన్నాడా? ఏం చేస్తున్నాడు? పెళ్ళయిందా? పిల్లలా? పిల్లలకి అన్నప్రాశన చేశారా? బళ్ళో వేశారా?—" అంటూంటే శైలజకే నవ్వు వచ్చేసింది.

రాజేశ్వరి నవ్వుతో గది దద్దరిల్లింది.

నవ్వాపుకుంచి తేరుకున్న తరవాత శైలజ అంతా చెప్పింది.

"అదృష్టం! నీతో వచ్చాడన్నమాట! అతనంతతో ఆపేశాడేం?"

"బియ్యే రెండుసార్లు పోవడం నీకు తెలుసుగా? దానితో పై చదువు ఆశ వదిలేశాడు. మళ్ళీ ఎంత తెలుసో లెక్కలేదు. నా క్లాసుకు అతనే కారణం. తను రాయలేదు. నేననుకోవడం: ఒక్క ప్రశ్నకు రాసేటప్పటికే అతనికి వ్యాసం సరిపోదనుకుంటాను. ఎక్కువ వచ్చినా ప్రమాదమే. అయినా తను సరిపెట్టుకో లేదు. ఫలితం అంటే లెక్కలేద

"కష్టపడలేక పాసయ్యాడు. అతనిది అదోతత్వం. ఏమైనా నువ్వొళ్ళేది తనే సాటి."

"బావుంటే అనూరాధకూడా అంతదన్నమాట!"

ఇలా అయితే దృష్టాలు, పూర్వజన్మ సుకృతాలు అంటే

"మ స్వార్థం లేకపోయినా వాళ్ళిద్దర్నీ తలుచుకుంటే వధవ్యేషా అవే గుర్తుకొస్తాయి. వాళ్ళొకళ్ళకోసం ఒకళ్ళు మళ్ళీ బంధుకుంటాను. ఒక్కసారి ఆమెతో మాట్లాడితేచాలు, గానిగర్భశత్రువు కూడా మారిపోతాడు."

"నువ్వే అంత పొగుడుతూంటే—" రాజేశ్వరి అనుభవంలో శైలజ ఇతరులను ఎప్పుడూ పొగడదు. ఒకవేళ ఆమె పొగిడితే చాలా గొప్ప విషయమే అయి ఉండాలి.

"ఒక్కసారి వైజాగ్ వెళ్ళు. తరవాత మాట్లాడు."

"నిజంగానే వెళ్ళాలనిపిస్తోంది."

"వెళ్ళమనే చెప్తూంట! నీతో బుట్టువులు కూడా అంత దగ్గరగా ఉండరు."

"విశ్వం మాటా ఆశ్చర్యంగానే ఉంది. పైకి అసలు అల్లా కనబడేవాడు కాదు."

"చిత్ర మేమిటంటే యివాళా అల్లాగే ఉంటాడు. నా జీవితంలో యింతవరకు ఎవరికైనా భయపడినా, మహా గౌరవం యిచ్చినా అతనికే. ఇంతకీ మా అమ్మలో ఉంది అంతాను."

"ఎవరూ? శాంతమ్మగారా?" రాజేశ్వరి విస్తుపోయింది.

విశ్వాన్ని శైలజ అన్నయ్యా అంటుందనీ, విశ్వం ప్రసక్తితోపాటు అమ్మఅని శైలజ అంటే శాంతమ్మగార్ని ఉద్దేశించేననీ రాజేశ్వరికి తెలుసు. ఇరుగు పొరుగులవారు వరసను పెట్టుకుని పిల్చుకోవడం, అన్యోన్యంగా ఉండడం సహజమనీ, ఈ రీతిగానే శైలజ విశ్వానికి చెల్లెలైనట్లు రాజేశ్వరి ఆదినుంచే ఎరుగును. కాని ఈ అంతరంగిక విషయాలామెకు తెలియవు. ఆ రోజుల్లో తెలుసుకునే

యీాడుకూడా లేదు. ఈ రోజున ఇవన్నీ వింట్లూంటే ఆశ్చర్యం ఆమెను ముంచెత్తింది.

"ఏమిటే, అంతలా అయిపోతున్నావ్! మా అమ్మ అంటే ఏమనుకున్నావ్! వెనకటి తరంలో పుట్టిందా! మన లెక్క ప్రకారం చదువుకున్నది కాదా? అయినా ఆమెలో ఉన్న సంస్కారం ఇప్పటికీ మన కలవడదు. ఆమె ఎంత ఉన్నతి పొందఃపోతే కోడలికి ఉన్నత విద్య ప్రోత్సహిస్తుందంటావ్! ఆమెకు ఆమె సాటి స్వర్గం అనేది ఎక్కడైనా ఉంటే అది వాళ్ళింట్లోనే ఉంది. మళ్ళీ లోపల ఇంత గాంభీర్యంగల వ్యక్తులా ఒక్కొక్కళ్లూ—మాటల్లో ఏమీ తేలరు. ప్రతి ఒక్కరూ మాటకి మాట అందిస్తారు' దెప్పుతారు. సాధిస్తారు. వేళాకోళాలాడుకుంటారు—" విశ్వం వాళ్ళను గురించిన ఊహలతో సాగిపోాగింది శైలజ.

కథ వింటున్నట్టనిపించింది రాజేశ్వరికి. ఇటువంటి వాళ్లుంటారా అనుకుందామె. శైలజ చెప్పినది అతిశయోక్తి ఏమో అనిపించింది. కాని ఆమె మాటలు హృదయం లోతులనుంచి వచ్చినట్టుండడంచేత సంశయానికి తావు ఇవ్వలేక పోయింది.

నాలుగు నిమిషాల నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ రాజేశ్వరే అంది మళ్ళీ :

"పాపం సరోజిని విషయమే పెద్ద ట్రాజెడీ అయిపోయింది"

"ఆ నిర్భాగ్యురాలి పేరెత్తకు." మాటలలోనే గాని

ఉచ్చారణలో లేకపోయింది కర్కశత్వం. అలాఅంటూంటే శైలజ గొంతులో తడికూడా ధ్వనించింది.

"పిచ్చిది. చేజేతులా గొంతుక కోసుకుంది. చచ్చి ఏం సాధించింది!" జాలిగా అంది రాజేశ్వరి ఊరుకోలేక.

"నోరు మూసుకోమంటే నీ క్కాదుటే! బలహీనుల మీాద నాకు సానుభూతి లేదు. ఆ విషయం వదిలెయ్యి. నీ కథేమిటి ?"

"నా కథ కేముంది ?" ఆశ్చర్యం, కొద్దిగా భయం ధ్వనిస్తూ అంది రాజేశ్వరి.

"అదేనే. ఇక్కడి జీవితం, స్నేహితులు, అదీను"

"ఓహ్—అదా!" అమ్మయ్య అన్నట్లు ధ్వనించింది రాజేశ్వరి కంఠంలో.

దానితో శైలజకు నిజంగానే అనుమానం వేసింది, ఏదో కథ ఉందని.

"అంత గాబరా పడుతున్నావ్ అసలు సంగతేమిటే" అడిగింది.

"అబ్బె ఏం లేదు." తొందరగా అంది రాజేశ్వరి, ఆ ప్రసంగం ఆగిపోతే బాగుండునని కోరుతూ.

"నాతో చెప్పడాని కేమిటే ?"

"నీతో చెప్పడాని కేం—"

"ఏమో ఏదేనా ప్రేమాగటా—" మధురంగా నవ్వుతూ అడిగింది శైలజ.

రాజేశ్వరి సిగ్గుపడింది.

"ముందీ రెండేళ్లూ గడచి బయటపడితే అదే పది వేలు!" మాట మారుస్తూ అంది.

"ఇష్టం లేకపోతే చెప్పద్దులే." నిర్లక్ష్యంగా అంది శైలజ.

ఈ మాట రాజేశ్వరిమీద బాగా పని చేసింది. చాలామంది అంతే. బతిమాలి వాళ్లచేత ఏమీ చెప్పించడం సాధ్యంకాదు. సిగ్గుపడో అభిమానపడో పైకిచెప్పరు. నిర్లక్ష్యంగా ఉండి వాళ్ళచేత ఏమైనా చెప్పించవచ్చు. ఇక వద్దన్నా చెబుతారు.

రాజేశ్వరి చెప్పిన కథ ఇది:

ఒక రోజున ఒక సినిమాకు వెళ్ళి వచ్చిన రాజేశ్వరికి తెగని ఊహాలు పట్టుకున్నాయి. చిత్ర విచిత్రంగా సాగిపోయాయి ఆలోచనలు. వాటిని కాగితంమీద ఎక్కిస్తే ఎలా ఉంటుందో అని ప్రయత్నించింది. ఒక కథ తయారైంది. చదివి చూసుకుంటే ఎంతో బాగున్నట్టనిపించింది. సాధారణంగా పత్రికలలో వెలువడుతున్న వాటికంటే ఏమీ తీసిపోయినట్టనిపించలేదు. చాలా మార్పులు చేసి కొత్తవి కొన్ని కలిపి సావధానంగా కాపీచేసి 'శిలీముఖి' పత్రికకు పంపింది. ఆ ఉద్వేగం తగ్గగానే ఆ మాటే మరిచిపోయింది. ఒక పక్షం తరువాత ఆ రచన క్షేమంగా తిరిగి రావడంతో ఎంతో నిరుత్సాహపడిపోయి సంపాదకవర్గాన్ని

కసితీర తిట్టుకుంది. ఎంతో ఉక్రోషం వచ్చింది. కాని ఏం చెయ్యగలదు? బాధ పడింది. మర్నాడు టపాలో ఆమె కొక ఉత్తరం వచ్చింది. అది ఆ పత్రిక సంపాదకుని తరపున వచ్చింది. ఆమె రచనలోని లోపాలను ఎత్తి చూపించాడు. రచనలో వైశిష్ట్యం కనపడటంచేత ఈ సూచనలు చేశాడనీ, తిప్పిపంపినందుకు బాధపడవద్దనీ ఉందందులో. ఆ విమర్శ దృష్ట్యా చూస్తే తన రచన ఎంత లోపభూయిష్టంగా ఉందో తెలిసి వచ్చింది. అనవసరంగా ఆడిపోసుకున్నానే అని బాధపడింది. మళ్ళీ ఉత్తరం చదివింది. చివరికంటా చదివితే ఆఖరిని మరో అంశం మొదటిసారి చదివిన తొందరలో మరిచిపోయినట్టు తెలిసింది. ఆ ఊరేగాబట్టి వీలైతే పత్రిక కార్యాలయంలో ఒకసారి కలుసుకోమని ఉంది. ముక్కు మొగం ఎరగని తనపట్ల అంత శ్రద్ధ కనబరిచిన ఆ సంపాదకుడికి నమస్సులర్పించింది మనస్సులోనే. ఊపిరి సలుపుకునేందుకు తీరని పనులలో తీరిక చేసుకుని తన రచనమీద విమర్శ పంపిన ఆ సంపాదకుడంటే ఎంతో అభిమానం అంకురించింది ఆమెలో. రచన ప్రచురింపబడలేదనే విచారంకంటె అతను చేసిన సూచనల దృష్ట్యా దాన్ని సంస్కరించాలనే కాంక్ష బయలుదేరింది. నిస్పృహపొందే బదులు ఆశ నిండింది హృదయంలో.

ఒక శనివారం తీరుబాటు చేసుకుని ఆ ఉత్తరం పట్టుకుని పత్రిక ఆఫీసుకు వెళ్ళింది. ఉత్తరం లోపలకు పంపిన పావుగంటకు బంట్రోతు తనను ఒక గదిలోకి తీసు

కెళ్ళాడు. గుమ్మానికి 'సబ్ ఎడిటర్' అని బోర్డు అతికించి ఉంది.

కుర్చీలో కూర్చున్నవాడొక పాతికేళ్ళ యువకుడు. టేబుల్ ఇవతలపక్క ఉన్న కుర్చీ చూపించి కూర్చోమన్నాడు. ఒకర్నొకరు కొంతసేపు పరిశీలించుకున్న తరువాత సంభాషణలోకి దిగారు. గంట తరువాత బయట పడిన ఆమె, రచన సంగతి మరిచిపోయి మరో సంగతి ఆలోచించడం మొదలుపెట్టింది. అది మొదలు పరిచయం వృద్ధి పొందింది. అతనిపేరు సుధాకరం.

"ఇంతకీ అతన్ని ప్రేమించావంటావ్ !" అంది శైలజ చిరునవ్వుతో రాజేశ్వరి కథనం పూర్తయిం తరువాత.

రాజేశ్వరి మౌనమే వహించింది. ఆ స్మృతులతో ఆమె దేహం పులకించింది.

"ఆయనేమంటాడు?" మళ్ళీ శైలజ అడిగింది.

"ఏమీ అనడు. అసలు చిత్రమేమిటంటే యిన్ని సార్లు కలుసుకున్నా ఏవో పుస్తకాలను గురించీ, నా చదువులను గురించి ఆయనా, ఆయన పనిని గురించి నేనూ-యివే మాట్లాడుకుంటాం" అంది రాజేశ్వరి.

"మాటల్లో చెప్పలేకపోతే ఉందిగా ఉపాయం— ప్రణయ లేఖ రాయి" అంది శైలజ.

"శైలూ, నువ్విలా వేళాకోళం చేస్తావనే నేను చెప్పనన్నాను" అంది రాజేశ్వరి కోపగించుకుని.

"క్షమించుకోకే రాజీ! నా కర్థంకాని దేమిటంటే ఈ బలహీనత ఇంతమందిలో ఎందుకుంటుందోననే ప్రశ్న. రాజీ, నువ్వు పసిదానివి కావు. తెలివితక్కువ దానివి అంతకంటే కాదు. అతను నీకు ఏ విధంగా తగినవాడు? స్కూలుఫైనల్ పాసయ్యాడు. వంద రూపాయలు తెచ్చుకుంటున్నాడు. అతన్ని చేసుకుని ఏం సుఖపడదామని? నువ్వింత తెలివి తక్కువగా ఎల్లా మాట్లాడుతున్నావ్? అసలు నువ్వనే ప్రేమంటేనే నా కర్థంకాదు—"

"నీదాకా వస్తేనే గాని నీకర్థంకాదు. అతన్ని చేసుకుని ఏం సుఖపడతావని అడిగావు. ఎవర్ని చేసుకుని మాత్రం ఏం సుఖపడతాం? నా చదువు అయిపోతే కనీసం మూడొందలు వస్తాయా? అది మాకు సరిపోదూ? ఆయన చేసే పనిలోకంటె ఎవరుచేసే పనిలో మాత్రం ఎక్కువ గౌరవం ఉంది? నలుగురు పెట్టుకున్న యీ ఆంక్షలే అర్థం లేనివిగా కనబడుతున్నాయి నాకు."

"మీ అమ్మా, నాన్నా ఒప్పుకుంటారా?"

"ఒప్పుకోరు."

"మరి?"

"అందుకే చదువైపోయేదాకా వాయిదావేస్తాను."

"అందు కతను అంగీకరించకపోతే?"

"అల్లా జరగదు. ఒకవేళ జరిగినా అది నా దురదృష్టం అనుకుని ఊరుకుంటాను."

"అతను కేవలం నీ సంపాదనమీదే మోజు పడు తున్నాడేమో ఆలోచించావా?"

"నా సంపాదనమీద ఆయన మోజు పడకూడదని నేననుకోను. నాకు విలువ యిస్తాడా, యివ్వడా అనేదే నేనాలోచించి తేల్చుకున్నాను."

"ఏం తేలింది?"

"నన్ను వ్యక్తిగా గౌరవించగల విశాల హృదయం అతని కుందని."

"అతని ఉద్దేశ్యం మారదనేముంది?"

"శైలూ! నీ భావాలలో విప్లవం మరీ ఎక్కువై పోయి మొగాళ్ళమీద నీకు నమ్మకం తగ్గినట్టుంది." నవ్వింది రాజేశ్వరి.

వ్యవహారం చాలా ముదిరిందనీ, ఇంక వాదిస్తే ప్రయోజనం లేదనీ శైలజ గ్రహించింది. ఆ ప్రసంగం ఆపేసింది.

మర్నాడు సాయంత్రందాకా హాయిగా గడిపేశారు.

మెయిల్‌లో బయలుదేరింది శైలజ.

కాన్వొకేషన్ రెండు రోజులుండనగా విశాఖపట్నం చేరుకుంది శైలజ. ఉత్తరం రాయక పోవడంచేత స్టేషన్‌కు ఎవరూ రాలేదు. విశ్వం యింటి దగ్గర బండి దిగిన శైలజకు అనూరాధ ఎదురుపడింది గుమ్మంలో.

"ఉత్తరంముక్క అయినా రాయలేదేమమ్మా!" అంది అనూరాధ.

"నువ్వు రాయద్దన్నావు గదమ్మా!" ఉత్తరంలోని సంగతి జ్ఞాపకం పెట్టుకుని అందిచ్చింది శైలజ.

అనూరాధ నోరు మూత పడింది.

శైలజను చూచి శాంతమ్మగారు నుుచ్చట పడింది.

"అదేమిటే సగమై పోయావు! ఆ ఊరు నీళ్లు పడ లేదా?" అంది సహజ మమకారంతో. దూరంనుంచి వచ్చిన మనుషులంతా చిక్కిపోయినట్లే కనపడతా రామెకు.

"నేను నీకు చిక్కినట్లు కనబడని దెప్పుడమ్మా?" నవ్వుతూ అంది శైలజ.

"లేదు. మాటవరసకి కాదు. నిజంగానే చిక్కావు" అంది అనూరాధ.

"ఈ మధ్య నాలుగు లంఖణాలు పడ్డానులే." శైలజ సమాధానం చెప్పింది.

"అల్లా చెప్పు! మాకు త్తరమైనా రాశావు కాదేం?" అడిగింది అనూరాధ.

"రాసేం ప్రయోజనం, మీ మనస్సులు కష్టపెట్టడం తప్పించి? అన్నయ్యేడి?"

"బజారు కెళ్ళాడు. వచ్చే వేళయింది. పద స్నానం చేసి నాలుగు మెతుకులు తిందువుగాని. మధ్యాహ్నం తిన్నావో లేదో." అనూరాధ తొందర పెట్టింది.

"ఏవమ్మోయ్ ముందే చెప్తున్నాను—ఇటువంటి మర్యాదలకి పూనుకుంటే ఒక్క క్షణం ఉండలేను."

"నీ పుట్టింట్లో నీకు మర్యాదేమిటి !" శాంతమ్మ గారంది.

ఇంతట్లో విశ్వం వచ్చాడు.

"ఎప్పుడమ్మా వస్త?" శైలజను చూసి అడిగాడు.

"ఇప్పుడే అన్నయ్యా. కులాసాగా ఉంటున్నదా?"

"ఆఁ!—" అని "అరె! అంత చిక్కిపోయావేం ?" అన్నాడు మళ్ళీ.

"నువ్వు మూడో వాడవు ఆ ముక్క అనడానికి-"

"తరవాత కబుర్లు చెబుదురుగాని. ఆమెను ముందు కొంచెం తడవ నివ్వండి" అంది అనూరాధ విశ్వంతో.

"ఆజ్ఞ !" అన్నాడు విశ్వం తలవంచి.

అంతా నవ్వారు.

మర్నాడు పొద్దున్న శైలజ, విశ్వం హాల్లో కూర్చొని మాట్లాడుతూండగా హైమ వచ్చింది.

శైలజను చూసిన ఆమె ముఖం వికసించింది. అయినా పక్కకు తిప్పుకుని లోపలికి వెళ్ళి పోయింది అనూ రాధ దగ్గరకు.

హైమకు అలిగిందని తెలుసుకుని శైలజ వెనకాలే వెళ్లి పలకరించింది. హైమ వెక్కిరించేసింది.

అది లెక్కచెయ్యకుండా "చెల్లీ! చిట్టిచెల్లీ!"అంటూ ఆదరంగా పిలుస్తూ దగ్గరకెళ్ళి హైమ భుజంమీద చెయ్యి వేసింది.

"పో! నాతో మాట్లాడకు! పది ఉత్తరాలకు సమా ధానమేనా లేదు. మళ్ళీ చెల్లీ పిల్లీ అంటావు. వచ్చి

పోయావ్గా, మళ్ళా నీ కెందుకు ?" శైలజ చెయ్యి తోసేస్తూ బుంగమూతి పెట్టి అంది హైమ.

"నా తల్లికదూ ? బంగారువల్లి కదూ ! మొగలి పువ్వంటి మొగుణ్ణి తెస్తాగా! అలక మాను చెల్లీ" అంటూ హైమ గెడ్డం పట్టుకుని తనవైపు తిప్పుకుంది శైలజ.

"మొగలి పువ్వంటి మొగుడైతే ప్రమాద మండోయ్!" అప్పుడే వస్తూన్న నిధి, ఆఖరి మాటలు విని అన్నాడు.

అందరూ అటు తిరిగారు.

"ఓహో తమరా!" అంది శైలజ.

"చిత్తం. మేం జ్ఞాపకమున్నామా తమకి."

"అయ్యో! జ్ఞాపకం లేకేం నాయనా !" సాగదీస్తూ అంది శైలజ.

"ఏమోలెండి ఉత్తరాలు లేకపోతేనూ—"

"మేం రాశామండి. అందలేదేమో—"

"ఎంతకేనా తగుదువే నువ్వు. ఎంత సునాయాసంగా ఆడేస్తున్నావు అబద్ధాలు. రాస్తే అందకెక్కడికిపోతాయే" అంది శాంతమ్మగారు.

"ఏం చెప్పను తల్లీ అల్లా నిలవేస్తే !" ఉస్సురంది శైలజ.

నిధి మామూలు ధోరణిలోపడి, "చదువుకున్న ఆడ వాళ్ళకు కళ్ళు నెత్తికి వస్తాయనిగాని, సహజత్వం పోయి కృత్రిమాలకు లోబడతారని గాని అనే వాళ్ళకు మిమ్మ

ల్నొక్కసారి చూపిస్తే మళ్ళీ నోరెత్తరు" అన్నాడు శైలజతో.

"కాని, తమ్ముడూ, పొగరుమోత్తనం తప్పకుండా బలుస్తుందనడానికీ యీమెనే ఉదాహరణగా చూపెట్ట వచ్చును" అంది అనూరాధ.

"చూశావా అన్నయ్యా! ఎంత ఓర్చలేని తనమో! కాస్త నన్నెవరేనా మెచ్చుకుంటేచాలు కళ్ళల్లో నిప్పు లోసుకుంటుందీవిడ."

"ఎంత మృదువుగా మాట్లాడతావక్కా నువ్వు." హైమ నవ్వుతూ అంది.

"చెల్లీ, నీకంటే అక్కయ్యగదా, అని సానుభూతిగాని యీవిడ మాత్రం మొగుడి సంపాదనంతా తినేస్తున్నానని బాధపడక మానదు. అసపసుచుని. మొగుడి తరవాత మొగుడంతటిదాన్ని నన్నెంతమాట పడితే అంతమాటం టుందా? అంటుందా అంట—అంటే ఊరుకోమంటావా నువ్వు—" అహంభావం ఉట్టిపడుతూ అంది.

"మొగుడి తరవాతేమిటి తల్లీ! ముందే నువ్వు. నీ పేరు చెప్తేచాలు నాకాళ్ళు చల్లబడతాయి" అంది అనూరాధ భయం నటిస్తూ.

"నిజమే అక్కా! ఈవిడ చేత ఏపని చేయించా లన్నా నీకు త్తరం రాస్తామని బెదిరిస్తే చాలు ఉత్తర క్షణంలో జరిగిపోతుంది పని."

"అయితే ఫరవాలేదు. ఆ మాత్రం భయం ఉండాల్సిందే. మా అన్నను వెర్రివాణ్ణిచేసి ఆడిస్తూంది.

"అయ్యబాబోయ్! మిమ్మల్నీ, మీ అన్నగార్నీ వెర్రివాళ్ళను చెయ్యడం మాకెల్లా చేతవుతుందండీ. చేతైతే అసలు మిమ్మల్నిలా మాట్లాడ నిస్తామా!" అన్నాడు నిధి.

"బాగా చెప్పావోయ్. ఎక్కడేనా దొరికితే ఒక వరహా ఇవ్వొచ్చు." చిలిపిగా నవ్వుతూ అంది శైలజ.

మధ్యాహ్నం తను తెచ్చినవన్నీ పెట్టెలోంచి తీసి అందరికీ పంచింది శైలజ.

"'పడుచుకాపురం చితుకులమంటా' అని ఏమిటే ఈ అనవసరపు ఖర్చు—అడ్డుపెట్టేవాళ్ళు లేకగాని" అని మందలించింది శాంతమ్మగారు.

"ఎందుకమ్మా ఇంత డబ్బుపెట్టి ఇవన్నీను?" అన్నాడు విశ్వం.

"నా సంతోషంకొద్దీ ఇచ్చినప్పుడు కాదనకు అన్నయ్యా!" అని అదివరలో విశ్వం అన్నమాట అతనికి అందించి, "దగ్గర ఉంటే జీతం అంతా అందుకోవలసిన మాట. కానీపమ్మా!" అని శాంతమ్మగారి గొంతుక అనుకరించి ఆమె మాటలు అప్పజెప్పింది శైలజ.

"ఔరా! నా మాట నాకే అప్పజెబుతున్నావుటే! కలికాలం. చిన్నా పెద్దా లేదు." నోరు నొక్కుకుంది శాంతమ్మగారు.

అందరికీ సంతోషంతో గొంతుకలు నిండు కొచ్చాయి.

"మీ అమీర్ ఖాన్ గారు ఏమంటున్నారు?" అంది అనూరాధ మాటల సందర్భంలో.

అమీర్ ఖాన్ పేరు వినేప్పటికి శైలజ ముఖం ఆనందంతో మెరిసింది.

స్వచ్ఛమైన స్నేహంలో ఉండే అందమే అది. స్నేహితుల మాట వచ్చినా, వారు కనబడినా ఒక అనిర్వచనీయమైన ఆనందం ఉత్పన్నమౌతుంది.

"ఆయన మాటే మరిచిపోయాను. రాగానే ఉత్తరం రాస్తానన్నాను కూడాను. రాయనే లేదు. భలేవారులే! ఆయనుండబట్టి కాస్త తోడు దొరికింది ఆ అడివిలో" అంటూ అక్కడి విషయాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పింది శైలజ.

"నిజంగా చాలా అదృష్టవంతులండీ మీరు! ఎక్కడికెళ్ళినా మంచి స్నేహితులు దొరుకుతారు మీకు" అన్నాడు నిధి.

"ఈ విషయంలో మాత్రం నీతో పూర్తిగా ఏకీభవిస్తానోయ్! ఇది మాత్రం ఇక ఎన్ని అదృష్టాలకూ సాటిరానిది. ఒక్కత్తిని మాట్లాడేవాళ్ళు లేక ఎంత అవస్థపడ్డానని మొదట్లో?" అంది శైలజ ఆరోజులు తలుచుకుంటూ.

మర్నాడు కాన్వొకేషన్ దుస్తులు వేసుకుందుకు శైలజ పేచీ పెట్టింది.

"జన్మకోసారి వెళ్ళబోయేది గదా! ఆ అందం మళ్ళీ వస్తుందా? వేసుకుంటే నీ సొమ్మేం పోయింది?" అంది అనూరాధ.

"అబ్బ ఉండవమ్మా! బూచిలా తయారౌతారా దుస్తుల్లో. నాకో మేనల్లుణ్ణివ్వలేదు గాని నువ్వు, ఇచ్చి ఉంటే ఆ వేషం చూసి జడుసుకుని నా దగ్గరకు కూడా రాకపోను వాడు" అంది శైలజ.

"ఛీ! సిగ్గులేదు అల్లా మాట్లాడడానికి." సిగ్గు పడింది నూరాధ.

"సిగ్గెందుకమ్మా!" శైలజ కళ్ళు పెద్దవి చేసింది.

"సరే కాని ఒక ఫోటో తీయించుకోవడం అవ వద్దూ?"

"కాన్వొకేషన్ ఫోటో ఎప్పుడు తీయించుకుంటే వద్దంది?"

"అంటే?"

"నే చెప్పను."

మొత్తాని కెలాగయితేనేం అనూరాధ పట్టుదలవల్ల శైలజ ఆ దుస్తులు వేసుకుందుకు అంగీకరించింది.

ఏడాదికోసారి విశ్వవిద్యాలయంలో జరిగే కాన్వొకేషన్ నాలుగు రోజులపాటు పట్టణానికి చైతన్యం కలిగిస్తుంది.

హాస్టళ్ళన్నీ అతిథులతో నిండిపోతాయి.

ఊరు జనాభా ఇంచుమించు మూడు వేలు పెరుగుతుంది. ఎక్కడ చూసినా హడావిడే. రైళ్ళరద్దీ. దుస్తులు అద్దెకిచ్చేచోట రద్దీ. ఫోటో స్టూడియోలలోను, సినిమా హాళ్ళలోను, హోటళ్ళలోను ఎక్కడ చూసినా ఒకటే రద్దీ.

విశ్వవిద్యాలయంలో చదివి డిగ్రీలు పొందేవారికి కాన్వొకేషన్ మామూలుగానే ఉంటుంది. గవర్నర్ కరచాలనం ఇచ్చేవాళ్లు తప్ప మిగతా వాళ్ళు దుస్తులు విషయం అట్టే పట్టించుకోరు.

కాని పై ఊళ్ళనుంచి వచ్చినవాళ్ళకు నిజంగా ఇది పండగే. జీవితంలో మొట్టమొదటిసారిగా పట్టభద్రులు కావడం, నియమితమైన దుస్తులు తొడుక్కునే అర్హత పొందడం, పేరుకో తోక తగలడం ఇత్యాదులు. నిజంగా వాళ్ల జీవితాలలో మరుపురాని రోజది.

ఇక అమలాపురంలాంటి సరుదిగ్గల బంధితమైన లంకలో చదివే వాళ్ళలో కొందరికి (ఇప్పుడు కాలేజీ కూడా వచ్చిందేమో) రైలెక్కడానికి, చూడడానికిగూడా అదే మొదటి అవకాశం. అటువంటి వాళ్ళ ఆనందానికి హద్దు ఉండదు. జీవితంలో మొదటిమెట్టు. దీనికివారెంతో ఆడంబరంగా వస్తారు. కొందరు భార్యా సమేతంగా కూడా వస్తారన్నా ఆశ్చర్యం లేదు.

గవర్నర్ చేత కరచాలనం పొందేవాళ్ళలో కొందరు

ముందుగానే ఫోటోగ్రాఫర్ని కుదుర్చుకొని, ఆ పాణిగ్రహణ మహోత్సవాన్ని సెల్యులాయిడ్ మీదికి ఎక్కించి బంగారు ఫ్రేముకూడా కట్టించుకుంటారు.

ఇది వేళాకోళం చెయ్యతగ్గదని కాదు. జీవితంలో పది పన్నెండేళ్ళపాటు అధిక వ్యయ ప్రయాసలకు లోనై ఆర్జించిన ప్రతిపత్తిని జీవితపథంలో మైలురాయిగా అనుకుని పండగ జరుపుకున్నారంటే తప్పులేదు. బహుమతులు పుచ్చుకుంటున్నప్పుడు ఆ ముఖాలలో వెలిసే స్నిగ్ధత, ఆనందం వర్ణనకు అతీతమయినవి. ఆ క్షణంలో ఆ సమీపంలో ఉన్న సమూహంలో వారెందరి అసూయలకో గురి అయ్యే మధుర తరుణం అది.

ఆ గంట ముందుగానే స్నాతకులంతా వచ్చి కూర్చోవాలని నియమం ఉందిగాని సిండికేట్ సభ్యుల ఊరేగింపు వచ్చేవరకు అభ్యర్థులు వస్తూనే ఉంటారు. ఈ వింత చూడడానికి వచ్చే ప్రేక్షకులు వేనవేలు. చిత్రమైన దుస్తుల్లో సిండికేట్ సభ్యులు అందరూ ఒకే వరుసలో వేదికమీదకు వెళ్తారు. అభ్యర్థి సమూహం అంతా విచిత్ర వర్ణ సంకీర్ణంగా ఉంటుంది. కాన్వొకేషన్ దుస్తులవారు, మామూలు సూట్లవారు మొదలు ధోవతి, చొక్కా, శాలువా, పిలకలతో ప్రత్యక్షమయ్యే వాళ్ళవరకు ఉంటారు వ్యక్తులు.

ఇక ఈ అభ్యర్థులను పరిచయం చేస్తూ ఒక్కొక్క ఫాకల్టీకి ఒక్కొక్కరు చొప్పున నియమిత వ్యక్తులు వచ్చి గవర్నర్‌గారిని ఆ అభ్యర్థులను పట్టభద్రులుగా చెయ్యమని

కోరతారు. ఒకొక్క ఫాకల్టీని గురించి చదివినప్పుడల్లా ఆ కళకు సంబంధించిన అభ్యర్థులంతా లేచి నించుంటారు. గవర్నరుగారు కూడా ఒకొక్కసారి లేచి బహుమతులు, కరచాలనం ఇవ్వవలసిన వారికి అవి ఇచ్చి ఇంక మిగతా వాళ్లందరినీ మూకఉమ్మడిగా పట్టభద్రులను చేసేస్తారు. గవర్నర్ గారు అంటే విశ్వవిద్యాలయం అధ్యక్షులు అన్న మాట !

కాని ఇంతకూ డిగ్రీ కాగితాల పంపకం, ముందే స్వచ్ఛంద సేవకుల ద్వారా జరిగిపోతుంది.

కొందరు రాకుండానే కార్డులు స్నేహితులకుపంపించి డిగ్రీలు తెప్పించుకుని విశ్వవిద్యాలయాన్ని మోసం చేస్తూ ఉంటారు.

ఈ తతంగం అంతా అయ్యేసరికి 5-30 గంటల సాయంత్రం అవుతుంది. ఇంక జనం స్వచ్ఛంద సేవకుల కళ్ళు కప్పి బయటకు జారుకోవడం మొదలుపెడతారు. సినిమాలకు వేళైపోతూందని కొందరూ, రైలుకు వేళౌతూందని కొందరూ, వేరే ఏదో కారణాలుండి కొందరూను.

తదనంతరం, ఆ రోజుకు ఆహ్వానించబడ్డ వ్యక్తి వచ్చి స్నాతకోపన్యాసం ఇస్తాడు. ఇంకా జరగవలసిన లాంఛనాలు, తంతులు అయిన తరువాత స్నాతకోత్స వానికి భరతవాక్యంగా పలికి జాతీయగీతంతో సభ ముగిస్తారు.

కాన్వొకేషన్ అయిన రెండు రోజులవరకు ఉండి బయలుదేరింది శైలజ. ఉండమని అంతా బలవంత పెట్టినా ఇంటికెళ్ళి తలిదండ్రులను కూడా చూసి వెళ్లాలనీ, ఆ గేందుకు వీల్లేదనీ నచ్చజెప్పి బయలుదేరింది.



13

దెబ్బ తగలడం ఒక ఎత్తు. మానుతున్న గాయం మళ్ళి రేగడం మరో ఎత్తు. దెబ్బ తగలడంవల్ల ఎంతో బాధ కలుగుతుంది. అదివరలో దెబ్బలు తిని ఉండకపోతే మరింత తీవ్రంగా అనిపిస్తుంది నొప్పి. కాని దెబ్బ తగిలినప్పుడున్న బాధ మరెంతసేపటికి ఉండదు. దీనికి రెండు కారణాలు ఉంటాయి. ఒకటి, బాధ ఉపశమనం పొందడం, రెండోది బాధకు అలవాటు పడడం. అలవాటైతే ఏదైనా అంత బాధించదు. కష్టాలు పడడం అలవరుచుకుంటే అవి అంత బాధించవు. బ్రతికి చెడ్డ మానవుడు 'ఎక్స్పెప్టు' కాకపోతే చచ్చిపోడు. బ్రతుకుతూనే ఉంటాడు. బాధలకు అలవాటుపడడానికి ప్రయత్నిస్తాడు. సాధారణంగా సాఫల్యం పొందుతాడు. కాని కష్టాలనుంచి తేరుకుని అదృష్ట వశాత్తు అందలం ఎక్కి మళ్ళీ విధి వశాత్తు పతనం పొందితే అతని బాధ వర్ణనాతీతమౌతుంది మానుతున్న గాయం మళ్ళీ రేగినా అంతే.

అనూరాధ, విశ్వం, హైమ, నిధిలాంటి వాళ్ళ మధ్య మెలిగిన శైలజకు ఇక్కడి వాతావరణం మొదట్లో నిస్పృహ కలిగించింది. కాలం గడిచే కొలది అలవాటయి పోయింది. కాని కాన్వొకేషన్ పేరు చెప్పి నాలుగు రోజులు వారిమధ్య గడిపి తిరిగి వచ్చేసరికి ఈ జీవితం మరింత నిస్సారంగా కనబడ సాగింది.

తను తిరిగి వచ్చిన రోజున స్టేషన్‌లో తనకు స్వాగతం ఇవ్వడానికి వచ్చిన ఖాన్ కాంపుల హడావిడిలో మళ్ళీ కనబడలేదు. తోటి అధ్యాపకు రాండ్రతో తన కెక్కువ సన్నిహితత్వం కలగలేదు. కారణంఏమిటంటే కుండ బద్దలు కొట్టినట్టు మాట్లాడే తన తత్వం వారికెప్పుడూ కంటగింపు గానే ఉండేది.

ఒకరోజు కాలేజీకి ఆ ఊళ్లో ప్రాక్టీసు చేస్తున్న మాధురి అనే డాక్టర్ వచ్చింది. ఆ ఊరి మహిళా మండలికి ఆమె అధ్యక్షురాలు. కొత్తవారిని ప్రోత్సహించి చేర్పించాలనే ఉద్దేశ్యంతో కాలేజీకి వచ్చింది. కొత్తగా ఎన్నికైన ఆమె తన ప్రతిభ చూపి మండలిని ఉద్ధరించడానికి చేసిన ప్రయత్నాలలో తొలి ఘట్టం అది.

సమితి ఆశయాలు బ్రహ్మాండంగా ఉన్నాయి. స్త్రీలను సాంస్కృతికంగాను, వైజ్ఞానికంగాను అభివృద్ధిలోకి తీసుకురావడం, చందాలు వసూలుచేసి అసహాయులైన అబలలకు ఉపాధి కల్పించడం, దైనిక జీవితంలో ప్రతి స్త్రీకి

ఉపయోగించే కుట్లు, అల్లికలు మొదలైనవి నేర్పడం వగైరాలన్నీ ఏకరువు పెట్టింది మాధురి.

మాధురిలో మంచి ఆకర్షణ ఉంది. ఎంతో శ్రావ్యంగా ఉంది ఆమె కంఠం. ఆమె తీరులో ఎంతో మంచితనం కనబడింది. కనకనే నెల తిరిగేటప్పటికి ఏడెని మిది వందలు చులాగ్గా సంపాదిస్తూంది. శైలజకు మాధురి నచ్చింది.

తక్కిన ఉపాధ్యాయినులంతా ఏదోవంక పెట్టి తమకు పనులున్నాయని తప్పించుకున్నారు. శకుంతల, శైలజ సభ్యుల పట్టీలోకి ఎక్కారు. చదువు సంస్కృతి కలిగిన ఇటువంటి సభ్యురాండ్రవల్ల తమ మండలి ఎంతో ఉన్నత స్థాయికి పోగలదని తనకు నమ్మకం కుదిరిందని హృదయ పూర్వకంగా అభినందించి ప్రతిరోజూ క్లబ్బుకు వచ్చి తోడ్పడమని మరీ మరీ కోరి సెలవు తీసుకుంది మాధురి.

ఆవేళ రాత్రి శైలజ మెదడంతా మహిళా మండ లిని గురించిన ఆలోచనలతోనే నిండింది. స్త్రీలు అణిగి ఉండడం, వారికి స్వాతంత్ర్యం లేకపోవడం మొదటినుంచీ తాను గ్రహిస్తూనే వచ్చింది. తన చిన్నతనంలో తన అను భవాలలో స్త్రీ బానిసగా ఎంచబడడం చూసి తరువాత ఆలోచించే కొలదీ అవి ఎంత దారుణంగా ఉన్నాయో తెలుసుకొంది. తను థర్డ్ ఫారం చదువుకొనే రోజుల్లో తమ ఇంటిపక్క ఒక రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ ఉండేవాడు. ఆయన, భార్య, ఇద్దరు పిల్లలూ. ఆవిడ పేరు సుగుణ.

చక్కని చుక్క. మహా తెలివైనది. వాళ్ళ దొడ్లో పువ్వుల కోసం వెళ్ళేది తను. ఆమె (సుగుణ) తనేకోసి దండగుచ్చి తన జడలో పెట్టి పంపించేది. అలా కలిగిన పరిచయంతో తను అక్కయ్యంటూ ఆమె వెంట పడేది. ఆమె కూడా తన్నెంతో ముద్దు చేసేది. పిల్లలిద్దరూ ముద్దొస్తూండేవారు. వాళ్ళను ఏడిపించడం, ఆడించడం తనకు కాలక్షేపానికి పనికివచ్చేవా రోజుల్లో. ఆ కాలంలో ధరలు అంత విపరీతంగా లేకపోవడంవల్ల వారికొచ్చేది వారికి బాగానే సరిపోయేది. దేనికీ లోటు లేకపోయినా రోజూ ఎందుకో ఒకందుకు కీచులాడుకునేవారు. ఆయనకు పల్లెటూళ్ళకు క్యాంపుల కెళ్ళడంతో అక్కడ కొంచెం తాగుడు అలవాటయింది. దాని ప్రభావం ఆయనమీద బాగా ఉండేది. ఏ పేచీ వచ్చినా ఆమెను స్పృహ తప్పేటట్లు కొట్టేవాడు. ఆవిడ పల్లెత్తు మాట అనేదికాదు. అన్నీ సహించేది. కాని ఎంత కుమిలిపోయేదో! రెండుమూడుసార్లు ఆత్మహత్యకు ఉపక్రమించి విఫలురాలయింది. తరువాత వాళ్ళేదో ఊరు బదిలీఅయి వెళ్ళిపోయారు. వారి సంగతులు ఇంకేమీ తెలియలేదు. కాని జన్మలో శైలజ ఆ విషయాలు మరిచిపోలేదు. సుగుణ ఎంతో తెలివైనది. చక్కగా సంభాషించేది. కుట్లు, అల్లికలు, ముగ్గులు. వాటిలో మిన్నగా ఉండేది. చుట్టుపక్కలవారికి ఏ సాయం కావలసివచ్చినా ఒళ్ళు దాచుకోకుండా వారికి సాయపడేది. అందుచేత ఆమె అంటే అందరికీ ఆదరాభిమానా లుండేవి. కాని ఎన్ని ఉన్నా ఆమె జీవితం అధ్వాన్నంగా ఉండేది. కలతలు

లేకుండా హాయిగా సాగవలసిన సంసారంలో అకారణంగా తగువులు రేగి రోజూ పొంపొచ్చాలే. ఆమె అసహాయస్థితి కారణంగాను, ధర్మశాస్త్రాలలోని అర్థంలేని ఆంక్షలవల్లా ఆమె తెలివితేటలు వృథా అయిపోయేవి. ఆ చిన్నతనపు ఉద్రేకంలో తనకు సుగుణ మొగుడంటే పీకెలదాకా ఉండేది. రాక్షసుడంటే అతనే అనుకునేది తను పెరిగి పెద్దదై సుగుణక్కను తనదగ్గర ఉంచుకోవాలనీ ఆమె భర్తను నాలుగు వాయించాలనీ ఉండేది. ఆమెకే స్వతంత్రంగా బ్రతికే అవకాశం ఉంటే అన్నీ సహిస్తూ ఆత్మవంచన చేసుకుంటూ అల్లానే పడి ఉండేదా! ఇల్లా ఇంకా ఎందరు అగచాట్లకు లోనవుతున్నారో! చిన్నతనంలో జరిగిన ఈ సంఘటనలు ఆమె పసి మనస్సుమీద ముద్రవేసి పోయాయి. దీనికితోడు తన అక్కగారి వివాహం-కట్నాల తగువులు-బావగారి కోపతాపాలు వీటన్నింటితో వయసుతో పాటు ఆమెలో తీవ్రమైన అశాంతి పుంజుకొచ్చింది. తత్ఫలితంగా ఇతరుల మాట లక్ష్యపెట్టి తమ జీవితాలను బలి చేయడమంటే గిట్టని తత్వం ఏర్పడింది. మంచో చెడో తనంతట తానే తేల్చుకుంటే మంచిదనేభావం అలపడింది. ఆ కారణంచేతనే తండ్రితో నిష్కర్షగా చెప్పి పెళ్ళికి అంగీకరించలేదు. కట్నంగా ఇవ్వబోయే డబ్బుపెట్టి తన్ను చదివించమంది. ఆయన మొదట్లో ఒప్పుకోకపోతే ముష్టెత్తి అయినా చదువుకుంటాను కాని పెళ్ళిమాత్రం చేసుకోనని పట్టుపట్టింది. ఆమె పట్టుదల చూసేసరికి ఆయనకు మతి

పోయి సరే నన్నాడు. మొదటినుంచీ క్లాసులో తన ఉనికి గుర్తింపబడేలా ఉండే దామె.

చిన్నప్పటినుంచీ శైలజలో ఇటువంటి భావాలే మొలకెత్తి వృద్ధి పొందడంతో ఆమె నడవడి నలుగురికీ భిన్నంగా ఉండేది. ఆమె అభిప్రాయాలు, భావాలు, విప్లవాత్మకంగా కనిపించేవి ఇతరులకు. ఇతరులను లక్ష్యపెట్టక పోవడం (తన ఇష్టాన్ని వ్యతిరేకించేవారిపై మాత్రమే), తన ఇష్టాల కనుగుణంగా వ్యవహరించడం అలవాటయ్యాయి. ఇదికాక తను మసలిన ప్రతిచోటా నలుగురిలో తిరిగి తన ఉనికి గుర్తింపబడే తాపత్రయంతోనే బతికింది. ఈ మండలి తన భావాలను అమలులో పెట్టడానికి ఎంతో ఉపకరిస్తుందని తన శక్తులన్నీ కేంద్రీకరించి స్త్రీ జనోద్ధరణకు పాటు పడవచ్చుననే ఊహ ఆమెకు ఆనందాన్ని కలిగించింది.

మర్నాడు సాయంకాలం కాలేజీ వదలగానే మహిళా మండలికి వెళ్ళింది శైలజ. మండలి వసతి గృహమంతా జనంతో కిటకిటలాడుతూంది. డాక్టరమ్మ ఎదురువచ్చి స్వాగతం చెప్పింది. కూడా తీసుకువెళ్ళి సభ్యురాండ్రను పరిచయం చేసింది. వివిధరకాల, విభిన్న వయస్సుల గృహిణులు ఉన్నారక్కడ. అంతా ఎంతో సందడిగాను, మండలి పట్ల ఆసక్తితోను ఉన్నారు.

ఒకచోట నాలుగు కుట్టు యంత్రాలు ఉన్నాయి. అక్కడ కత్తిరింపులు, కుట్టడం నేర్పుతున్నారు. మరోచోట హిందీ శిక్షణ సాగుతూంది. పెరట్లో రెండు బాడ్మింటన్

కోర్టుల దగ్గర పదిమంది వనితలు బాడ్మింటన్ ఆడుకుంటున్నారు. ఒక గదిలో గ్రంథాలయం ఉంది. రెండు బీరువాల నిండా పుస్తకాలు; బల్లలమీద దైనిక, వార, పక్ష, మాసపత్రికలు ఉన్నాయి. ఇదికాక చదరంగం, పచ్చీసు పాళీ అవీ ఉన్నాయి. పిల్లల పెంపకాన్ని గురించీ, సంతాన నిరోధం ఆవశ్యకతను గురించీ విపులీకరిస్తూ పటాలు అమర్చారు గోడలకు. సంసారంలో స్త్రీ బాధ్యతను వివరిస్తూ, ఆదాయ వ్యయాలకు ప్రణాళికలు తయారుచేసుకుని స్త్రీ సంసారాన్ని ఎంత ఆనందమయం చేసుకోవచ్చో వివరంగా వ్రాసి బోర్డులు తగిలించి ఉంచారు. ఈ ఉత్సాహాలన్నీ చూస్తూంటే శైలజ శరీరం రెట్టింపై పోయింది సంతోషంతో. మాధురి మధువు లొలికిస్తూ ఆ మండలి భవిష్యత్తును గురించిన పథకాలను వినిపిస్తూంటే, 'స్వర్గమన్న వేరే కలదా!' అనిపించింది.

సభ్యురాండ్రందరిలోనూ ఇంచుమించు తన ఈడుదే అయిన రమణి తన్నెంతో సన్నిహితంగా పలకరించడంతో శైలజకు ఆమెతో మాట్లాడ బుద్ధయింది.

ఒక్క అరగంట పరిచయంతో రమణి తన చరిత్రంతా ఏకరువు పెట్టింది. ఆమె భర్తపేరు రామన్. బాంక్‌లో అకౌంటెంట్. ఎమ్. కామ్. పాసైనాడు. కొద్దిరోజుల్లో ఏజెంటుగా ప్రమోషన్ రాబోతూంది. రమణికి రెండేళ్ళ కొడుకు. పేరు మణి.

తన సంగతంతా పూర్తిగా చెప్పి శైలజను గురించి

అడిగింది రమణి. శైలజ చెప్పింది. శైలజను గురించి విన్న రమణికి ఆమెమీద అసూయా సమ్మిళితమైన గౌరవం కలిగింది. కళ్ళింత చేసుకుని ఆపాదమస్తకం శైలజను మరొక్కసారి పరిశీలించి ఆమెతోడి పరిచయానికి సంతోషం వెలిబుచ్చింది.

మండలి కార్యదర్శిని మ్యునిసిపల్ చెయిర్మన్‌గారి సతీమణి. ఆరున్నరకు సభ్యురాండ్రంతా సభకు సమావేశమైనారు. రెండు రోజులలో రాబోతున్న మండలి వార్షికోత్సవం ఏర్పాట్లను గురించినది ప్రధానాంశం. మాధురి అనర్గళంగా ఉపన్యసించింది. ఇంకా నలుగు రైదుగురు మాట్లాడారు. మాధురి శైలజను కూడా మాట్లాడమంది. శైలజ తనకు తోచిన నాలుగు ముక్కలేవో చెప్పింది.

ఏడున్నరకు సభ ముగిసింది. రోజూ విధిగా సభ్యురాండ్రందరినీ రమ్మని కోరింది అధ్యక్షురాలు. అంతా అంగీకరించారు.

దారిలో ఉన్న తమ ఇంటికి రమ్మని శైలజను ఆహ్వానించింది రమణి.

రామన్ కొడుకును ఆడిస్తున్నాడు. భార్యను చిరునవ్వుతో పలకరించి శైలజకేసి ప్రశ్నార్థకంగా చూశాడు. రమణి శైలజను పరిచయం చేసింది. పరస్పరం అభివాదాలు చెప్పుకున్నా రిద్దరూ. రమణి కొడుకును శైలజకు అందించింది. పిల్లవాడు దుంపలా బాగున్నాడు. కొత్తలేకుండా తన దగ్గరికి రావడంతో శైలజకు ముచ్చటయింది. మాటలు

ఇంకా సరిగా రానివాడికి తల్లి శైలజను అత్తగా పరిచయం చేసింది.

రామన్ చాలా కలుపుగోలు మనిషి. ఇట్టే చనువుగా మాట్లాడడానికి ఉపక్రమించాడు సంకోచం లేకుండా. ఉన్నత సంస్కారం ఉట్టి పడిందతని మాటల్లో.

అరగంట ఉండి కాఫీ తీసుకుని వెళ్ళిపోయిన శైలజకు ఈ కొత్త పరిచయం ఆహ్లాదాన్ని కలిగించింది.

రెండు రోజుల అనంతరం ఆ ప్రాంతపు లోక్‌సభ సభ్యుని అధ్యక్షత క్రింద మహిళా మండలి వార్షికోత్సవం జరిగింది. ఆయన వచ్చి మండలిని సందర్శించి మెచ్చుకున్నారు. ఊళ్ళో పెద్దలందరూ మొత్తం రెండువందల మందివరకు వచ్చారు. నాలుగు వందల రూపాయల చిల్లర ఖర్చుతో విందు ఏర్పాటు చేశారు. అధ్యక్షోపన్యాసంలో పార్లమెంట్ సభ్యుడు మండలిని ఎంతో ప్రశంసించాడు. ఇటువంటివే స్త్రీ జనాభ్యున్నతికి ఎంతో తోడ్పడతాయన్నాడు. డాక్టర్ మాధురీదేవి నిస్వార్థకృషిని అభినందించి ఇటువంటివి ఊరూరా వెలిస్తే భారతావని ఎంతో ముందుకు వస్తుందన్నాడు. డాక్టర్ మాధురి సమాధానంగా క్రమంగా అందరూ ప్రోత్సహిస్తే దీన్నింకా అభివృద్ధిలోకి తీసుకురావాలని తనకు ఉందనీ, కుటీర పరిశ్రమలలో తర్ఫీదు ఇవ్వడంకూడా ఇందులో భాగంచేసి నిస్సహాయులైన స్త్రీలకు ఉపాధి కల్పించాలని తనకు ఉందని చెప్పి

అందరి సహాయమూ అర్థిస్తూ వెనుకబడిన స్త్రీజాతి దుస్థితిని గురించి మరొక్కసారి నొక్కి వక్కాణించింది.

పరస్పర అభినందనలతో సభ ముగిసింది, పార్లమెంటు సభ్యుడు, శక్తివంచన లేకుండా కృషిచేసి ప్రభుత్వంతో చెప్పి గ్రాంటు వచ్చే ఏర్పాటు చేయిస్తానన్నాడు.

రోజూ సాయంకాలం కాలేజీనుంచి ఇంటికివచ్చి బట్టలు మార్చుకుని రమణి ఇంటికి వెళ్ళి అక్కడినుంచి ఇద్దరూ మహిళామండలికి వెళ్ళడం శైలజ కార్యక్రమంలో భాగం అయింది. రోజూ వెళ్ళడంతో మణి చనువయ్యాడు శైలజ దగ్గర. రామన్ ఎంతో సరదాగా ఉండేవాడు. వీటితో శైలజకూ, రమణి ఇంటికీ త్రెంచరాని సంబంధం ఏర్పడింది.

వార్షికోత్సవం అయిన రెండురోజులనుంచే సభ్యుల సంఖ్య సన్నగిల్లింది. ఉత్సాహం హడావిడితగ్గి, ఇంటిదగ్గర పను లున్నాయంటూ ఎవరిమట్టుకు వాళ్లు రావడం తగ్గించుకున్నారు. పిల్లల్ని చూసుకోవడం, వంట వార్పుకోవడం, ఇల్లు దిద్దుకోవడం వీటితోనే తీరటం లేదని చెప్పేవారు సభ్యురాండ్రు. మాధురే వచ్చేదికాదు రోజూ. ఎడతెరిపి లేని ప్రాక్టీసువల్ల, రెండు మూడు రోజుల కొకసారి వచ్చి ముఖం చూపించి వెళ్ళిపోయేది.

ఇవికాక సభ్యురాండ్ర దగ్గరినుంచీ ఒక రకం ఫిర్యాదులు వచ్చేవి. మోజుకోసం కీర్తికోసం మాత్రమే వచ్చే

రకంవారు కొందరు ఉండేవారు. స్త్రీల అభ్యున్నతికోసం పెట్టిన ఈ మండలి సభ్యురాండ్రే తమతమ భర్తల పదవుల హోదాలనుబట్టి చిన్నచిన్న ముఠాలలాంటివి ఏర్పాటుచేసుకుని ఆ కాన్సెప్టూ కూడా విడిగా వుండడానికే ప్రయత్నించేవారు. ఉన్నతోద్యోగుల ఇల్లాండ్రు అంతా ఒకచోట గుమిగూడడం, చిన్న ఉద్యోగస్థుల భార్యలతో కలిసిమెలిసి తిరక్కపోవడం, చదువుకున్న వాళ్ళంతా ఒకచోటచేరి ఇతరులతో సంబంధం లేకుండా ఉండడం-ఇవీ ఫిర్యాదులు.

శైలజ మొదట్లో ఇవి నమ్మలేకపోయింది. ఆమెతో అంతా బాగానే మాట్లాడినట్టుండేవారు, పూసుకుని తిరక్కపోయినా.

కాని ఒక రోజున అనుభవంలోకి వచ్చింది అది కూడా.

ఇద్దరు గెజిటెడ్ ఆఫీసర్ల భార్యలు ఒక పార్టీగాను, ఒక ఎన్. జీ. ఓ. భార్య, శైలజ ఒక పార్టీగాను బాడ్మింటన్ డబుల్స్ ఆడుతున్నారు. శైలజ, ఆ ఎన్. జీ.ఓ భార్య బాడ్మింటన్ బాగానే ఆడుతుందని, కనీసం తమ ప్రతిపక్షంవారికంటే తమకే ఆట బాగా వచ్చునని, తాము నెగ్గడం తథ్యమని అనుకుంది.

మొదటిగేము ఎదుటివారికి ఆరుపాయింట్లు ఇచ్చి శైలజపార్టీ గెలిచింది. దానితో ఎదుటివారి ముఖాలు కోపంతో జేవురించాయి. మిగతా రెండుగేములూ శైలజ ఎంతగా ఆడినా ఎన్. జీ. ఓ భార్య పాడుచెయ్యడం వల్ల ఓడిపోయారు

శైలజకు కోపం భగ్గుమంది. తనతోటి ఆటకత్తె కావాలనే పాడుచేసినట్టనిపించిం దామెకు. తదుపరి నిల దీసినమీదట తను అధికారుల భార్యలకు పోటీగా నెగ్గడం తమ భవిష్యత్తుకు అంత మంచిది కాదనే భావం ఆ ఎన్. జీ ఓ భార్య వెలిబుచ్చింది.

శైలజకు ఆమెమీద జాలి కలిగింది. ఆఫీసర్ల భార్యలు గుమాస్తాల భార్యలమీద అధికారం చెలాయించటం నమ్మ లేకపోయిన ఆమెకు కనువిప్పు కలిగింది. దానితో పాటే ఈ కట్టుబాట్లంటే జుగుప్స జనించిం దామెలో. ఈ మాత్రం దానికీ మండలిలో చేరడం ఎందుకా అనుకుంది. అంతా కలిసి ఏదో సాధిద్దామని ఇక్కడికి వచ్చి, మళ్ళీ ఎవరి వంట వారు, ఎవరి విస్తరి వారుగా వేరైపోతే ఇంక సమితి ఎందుకు? ఏడవనా! వ్యక్తిత్వంకంటే వారికి ఇతరులవల్ల ఆపాదించబడిన ఘనత ఆధారంగా ఉండడం జరుగుతూం దిక్కడ. తన తెలివితేటలవల్ల కాక కేవలం ఒక వ్యక్తి భార్యననే హోదాతో ఏదో తమంతవారు లేరనుకుని ఊరు కోక ఇతరులను నిరసన దృక్కుల్తో చూడడం, వారితో కలిసి తిరిగితే తమ అంతస్థుకేదో భంగం వాటిల్లుతుం దను కోవడం వంటివి చూస్తూంటే శైలజకు ఒంటిమీద తేళ్ళు జెర్రులు పాకినట్టనిపించింది.

మానవ జీవితంలో కాలానికుండే పాత్ర అనిర్వచ నీయమైనది. నిశ్చింతగా సాగుతున్న జీవిత పథంలో ఒక్క క్షణంలో అనుకోని మార్పులెన్నో వస్తాయి. భవిష్యత్తును

గురించి కలలు కంటూ ఎంతో ఉన్నతి కాంక్షిస్తున్న వ్యక్తి హఠాత్తుగా ఏ కారు క్రింద్నో ప్రమాదవశాత్తూ పడి మరణించిన నిమిషంలో పరిస్థితులు తలక్రిందులు కావచ్చు. ఎన్నో ఆదర్శాలు సృష్టించుకున్న మనిషికి కాలప్రభావం వల్ల భావాలు తారుమారు కావచ్చు. తెగని ఎన్నో సమస్యలను కాలం సులువుగా పరిష్కరిస్తుంది. ఈ మార్పులు అలవాటు లేనివారినీ, అనుభవం లేనివారినీ, నిశ్చేష్టులను చేసేఅంతగా ఉంటాయి.

వార్షికోత్సవం జరిగిన నెల్లాళ్ళలోగానే మాధురి ఒక రోజున శైలజకు కబురు పంపింది, ఒకసారి రమ్మని. శైలజను సాదరంగా ఆహ్వానించి కాఫీ ఫలహారాలతో సత్కరించి డాక్టరమ్మ ఒక కోరిక కోరింది శైలజను. అయిదారు రోజులలో ఆ ఊరికి ఆర్థిక శాఖామాత్యుడు రాబోతున్నాడనీ, ఆయనను మండలికి ఆహ్వానించి సన్మానం జరిపి ఆ అదను చూసుకుని మండలికి గ్రాంటు సంపాదించాలనీ తెలియపరిచి, తనకు బొత్తిగా తీరుబడి లేకపోవడం, ఆరోగ్యం బాగు లేకపోవడం కారణాలుగా చూపి శైలజను కొంచెం పొగిడి, కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగే ఏర్పాట్లు చేయమంది. డబ్బు, ఎకౌంట్లు కార్యదర్శిని దగ్గర ఉంటాయనీ, పెద్ద లందర్నీ పిలిచి వార్షికోత్సవానికి లాగానే విందు ఏర్పాట్లు జరగాలనీ నిర్దేశించింది

పనికి జంకని శైలజ వెంటనే ఒప్పుకుంది.

మర్నాడు మండలికి వెళ్ళి కార్యదర్శినితో ఆ విష

యం ప్రస్తావించింది. పని తప్పినందుకు సంతోషిస్తూ ఆ లెక్కల పుస్తకాలన్నీ అప్పగించింది ఛెయిర్మన్‌గారి సతీ మణి

ఆ ఎకౌంట్లు చూస్తే శైలజకు మతిపోయింది.

వార్షికోత్సవం పేరుచెప్పి చందాలు ముందేవసూలు చేశారు. మొత్తం పన్నెడు వందల రూపాయలు విరాళా లతోసహా వసూలయింది, మండలి సక్రమంగా జరగడానికి సాలుకు పన్నెండు వందల రూపాయలపైన కావాలి. ఉపా ధ్యాయినులకు జీతాలూ, ఆటలకూ పత్రికలకూను. వార్షి కోత్సవానికి నాలుగు వందల పాతిక రూపాయల ఎనిమి దణాలన్నర, మొదటి నెల ఖర్చు నూట ఆరుంబావలా, లెక్క తెలియని ఖర్చు పాతిక. మిగిలింది ఆరువందల నలభై మూడు రూపాయల మూడణాలన్నర! ఇందులో వార్షి కోత్సవానికి లాగే నాలుగు వందల చిల్లరఖర్చు చేస్తే ఇంక మిగిలేది రెండువందలు. దీనితో ఇంకా పదకొండు నెలలు గడవాలి! ఏ భరోసా చూసుకుని డాక్టరమ్మ ఈ సన్మానం ఏర్పాటు చెయ్యదలుచుకుందో శైలజకు తెలియలేదు. ప్రజల సొమ్ము ఈ విధంగా ఇష్టం వచ్చినట్టు దుర్వ్యయం చేసే అధికారం వారి కెవరిచ్చారో! సమాజాన్ని ఉద్ధరిస్తా మనే ఈ ఘనులు చేసే ఇటువంటి పనులు చూస్తూంటే ఆమెకు ముచ్చెమటలు పోశాయి ఆశ్చర్యంతో. కోపంతో ముఖం జేవురించి కనుబొమలు ముడిపడ్డాయి.

పుస్తకాలు తీసుకుని మాధురి ఇంటికి వెళ్ళింది శైలజ.

అప్పుడే ఇఖరి రోగిని చూసి విశ్రాంతి తీసుకో జూచిన మాధురి శైలజ రాక గమనించి ముఖం చిట్లించు కుంది మనస్సులోనే. కాని మంత్రిగారి సన్మానం ఏర్పాట్లమెకు అప్పగించడం జ్ఞప్తికివచ్చి సంతోషం వెలి బుచ్చింది.

"భలే! అంతా మీా అంత శ్రద్ధ కనబరచ గలిగితే మన మండలి ఎంతో ముందుకొస్తుంది" మందస్మితంతో ఆమె నభినందించి కుర్చీ చూపించింది.

శైలజకు లౌక్యం తెలియదు. లోపలి ఉన్న భావాలను కప్పిపెట్టి ముఖంమీాద మందహాసం తొణికించలేదు. ఆమె మనస్సులో ఏముందో ముఖంచూస్తే అద్దంలో అన్నీ కనిపిస్తాయి. మాధురి పొగడ్తకు శైలజ పొంగిపోలేదు. ఆమె మెదడులో మండలి ఎక్కౌంట్లు మెదులు తున్నాయి. అందుకే ఆమె పెదవులమీాదకు చిరునవ్వు కూడా రాలేదు. ముఖం గంభీరంగా ఉంది. మౌనమే ప్రదర్శించి కుర్చీలో కూర్చుంది.

వివిధ తత్వాల రోగులతోడి పరిచయం మాధురికి ఎంతో అనుభవం చేకూర్చింది. ఆమె ఇట్టే ముఖాలలోని భావాలను చదివెయ్యగలదు, అందుచేతే శైలజప్రసన్నంగా లేదనీ, ఏదో ఫిర్యాదుతో వచ్చిందనీ గ్రహించింది. అందుకే శైలజ ప్రవర్తన ఆమెకు చేదు మాత్రలా అని పించింది.

శైలజ చూస్తే మాట్లాడేటట్టు లేదు. తనకేం మాట్లాడాలో పాలుపోలేదు మాధురికి. కాని సంభాషణ ఆరంభించడానికి వ్యాపార సరళిలో కొన్ని చిట్కాలు ఉన్నాయి.

"నావల్ల కాగలిగినది ఏమైనా ఉందా" అంది మాధురి.

"ఈ సన్మానం ఉపసంహరించుకోవడం మంచి దని పిస్తోంది" అంది శైలజ క్లుప్తంగా.

హఠాత్తుగా శరీరంమీద మంచుముక్క పడితే కలిగే అనుభూతి పొందింది మాధురి.

"అరే! అదేమిటలా అంటున్నారు!" తేలిగ్గా నవ్వెయ్యడానికి విఫల ప్రయత్నం చేసింది మాధురి.

శైలజ మరేమీ మాట్లాడకుండా ఎకౌంటు పుస్తకం అందించింది మాధురికి. మాధురి చూసింది.

"మొన్న నాలుగు వందలేగా అన్నది! ఆరువందలు నిల్వలో ఉన్నాయి. సన్మానం నిలుపుచెయ్యడం ఎందుకు?" శైలజ భయానికి అర్థం కనబడలేదామెకు.

"ఇప్పుడు మరో నాలుగు వందలు ఖర్చుచేస్తే యింకీ వివాదంతా ఎలా గడుస్తుంది!" శైలజ అడిగింది.

"ఓహో! అదా మీ భయం!" అని నవ్వి, "అసలు యీ సన్మానం ఎందుకో మీరు మరిచిపోతున్నట్టున్నారు. మంత్రిగారిని మంచి చేసుకుంటే ఏ నాలుగువేలో గ్రాంటు తెప్పించుకోవచ్చు. అప్పుడప్పుడ మన మండలిని ఎంతో అభివృద్ధి పరచవచ్చు మన మండలిని నలుగురికి

దృష్టిలో పడవేస్తే ఎంత లాభమో ముందు ముందు మీకే తెలుస్తుంది. ఈ మాత్రం ఖర్చుచెయ్యకపోతే గ్రాంటు లెలా వస్తాయండీ! మండలికి పేరు ప్రతిష్ఠలు మనం ఆర్జించి పెడితే ధనం ప్రభుత్వమే యిస్తుంది. నేనంత తెలివితక్కువ దాన్ననుకున్నారా?" అని అడిగింది మాధురి.

"గ్రాంటు రాకపోతే సంవత్సరం గడిచేదెలా?" అను మానం వెలిబుచ్చింది శైలజ.

"గ్రాంటు రాకపోవడం అంటూ ఉండదండీ! ఛెయిర్మన్ గారు, ఎం. పి. గారు అంతా మనకు సహాయం చేస్తారు."

"చిన్న చేపను ఎరవేసి పెద్దచేపను పట్టాలని చూస్తే చిన్న చేపతోసహా ఉచ్చు కొరికి పారిపోయిందట పెద్దచేప! అల్లా ఉంది మన మండలి పద్ధతి. ఏదో వస్తుందన్న నమ్మకంతో ఉన్నది వదులుకుంటే ఉభయ భ్రష్టత్వం కాక తప్పదు. గ్రాంటు రాకపోతే మండలి కుసుకు తీస్తుంది. అసలు యిప్పటికే అనవసరపు ఖర్చులు జరిగాయి. అందుచేత ఆ వచ్చేదేదో వచ్చినతరువాత యిటువంటివి తల పెట్టుకోవచ్చు" అంది శైలజ తొణక్కుండా.

గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించి నట్టనిపించింది శైలజ ధోరణి మాధురికి. చాలా కోపం వచ్చిందామెకు. అయినా అనుభవం ఇచ్చిన శిక్షణవల్ల దాని నరికట్టి —

"అంటే, మీ ఉద్దేశ్యం?" అని శాంతంగా అడిగిందావిడ.

"నేను దీన్ని వ్యతిరేకిస్తున్నాను" అంది శైలజ పట్టుదలగా.

కంట్లో మిరపకాయ పెట్టినట్టయింది ఈ మాటలు విన్న డాక్టరమ్మకు. తన అనుభవంలో తనతో ఇంత నిష్కర్షగా ఎవరూ మాట్లాడలేదు. తన్నింత కొట్టిపారేసినట్టు మాట్లాడిన దింతవరకు ఈమే. కాని శైలజ పట్టుదల చూస్తే మాధురికి బెరుకు కలిగింది. అంతేకాదు. ఏమూలో శైలజ చెప్పినదే సమంజసంగా ఉన్నట్టు మాధురికీ అనిపించింది. అందుకే ఆవేశం తగ్గించుకుని అనునయించే ధోరణిలో ఇలా అంది :

"చూడండి శైలజగారూ ! మీ కింకా యిలాంటి వాటిలో అనుభవం తక్కువ కావడంవల్ల యిల్లామాట్లాడుతున్నారు. సంస్థల నుద్ధరించాలంటే పట్టుకొమ్మలని పట్టుకోవడం అవసరం. ఏటికి కొంత ఖర్చు తప్పదు. దానికి వెనుకంజవేసి ప్రయోజనం ఉండదు. అదీకాక యిప్పుడున్న సొమ్ము మాత్రం యీ ఏటి కంతా సరిపోతుందా ? మరికొంత ఏదో విధంగా సమకూర్చాలి. అటువంటప్పుడు ఇటువంటి సదవకాశాన్ని జారవిడుచుకుంటేఎలా చెప్పండి" నవ్వింది మాధురి.

శైలజకు ఆమె మాటలు రుచించలేదు. చొక్కా కొనుక్కోవడానికి డబ్బులేదని ఉన్నలాగు చింపేసుకుంటామన్నట్టనిపించాయి మాధురిమాటలామెకు. అంచుచేతే

కేవలం మండలి భవిష్యత్తు కోసమే ఈ సన్మానం తల పెట్టిందని నమ్మలేకపోయింది. గ్రాంటు రాకపోవడానికే ఎక్కువ అవకాశాలున్నాయి. మాటల సందర్భంలో మంత్రులెన్నో వాగ్దానాలు చెయ్యడం, అవి తీరా ఆచరణ సాధ్యం కాకపోవడం తాను ఎరిగి ఉన్నదే. అనుభవజ్ఞురాలయిన మాధురి కీ విషయం అవగతం అయ్యే ఉండాలి. అటువంటప్పుడు తాను మండలి నడపడానికి ఈ సన్మానం అడ్డువస్తుందని చెప్పినా మాధురి పట్టుపడుతూంటే-ఇంతా చేసి మంత్రిగారి దృష్టిలో తానాధిక్యం సంపాదించాలని పన్నిన పన్నుగడ కాదుగదా అని అనుమానం వేసింది. మాధురి స్వార్థంకోసం మండలి భవిష్యత్తును బలి చేస్తున్నట్టు భావించింది శైలజ.

"నిజంగా మండలి అభివృద్ధికే యీ కార్యక్రమం తలపెట్టారా!" అనేసింది తనకు మాధురితో గల పరిచయం తక్కువే అయినా. తననుకున్నది నిర్మొహమాటంగా అనెయ్యడం ఆమెకు ఉగ్గుపాలతో అలవాటయింది.

"లేకపోతే నా కోసం అనుకున్నారా!" హేళనగా అంది మాధురి.

శైలజ మాట్లాడలేదు. అవుననలేదు. కాదనలేదు.

ఆమె మౌనం మాధురిని బాధించింది. ముఖం వివర్ణమయింది. శైలజ తత్వం ఆమె ప్రతి మాటలోనూ ప్రకటితమౌతూనే ఉన్నా ఇంత నిశ్చితంగా తన అభిప్రాయాలను వ్యక్తం చెయ్యగలదని గాని, తన ముఖాన్నే

తన స్వార్థాన్ని ప్రశ్నించగలదని గాని ఊహించలేక పోయింది. కాని సహనం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య.

"మీరింత నిరుత్సాహమోటంగా మాట్లాడడం నాకు బాగులేదు. కాని మీరింత నిరుత్సాహమోటంగా ఉండడంతో నాకూ అలా ఉండాలనే అనిపిస్తోంది. నిజంగా నేను చేసేదంతా మండలి అభివృద్ధికేనా అని అడిగారు. కాదు. ప్రతి మనిషికీ తాను నలుగురిలో గుర్తింపబడాలని కోరిక ఉన్నట్టే నాకూ ఉంది. అది నేనూ చంపుకోలేను. అందుకే యీ అధ్యక్ష పదవి స్వీకరించాను అధ్యక్ష పదవి స్వీకరించింది అనామకంగా ఉండిపోవడానికి కాదు. నలుగురిలో పేరుకోసం. ఇవాళ మంత్రిగారిని సన్మానిస్తే ఆ సభలో మండలి అధ్యక్షురాలిగా పరిచయం చెయ్యబడి గౌరవం పొందడం నాకెంతో ఆనందం యిస్తుంది. అందుకోసమే యీ ఏర్పాటు చేస్తున్నాను. నిజం చెప్పాలంటే యీ మండలి అంటే నాకు సదభిప్రాయం లేదు. అక్కడికివచ్చే వారంతా నాకంటే స్వార్థమూర్తులే, ఏ ఒక్కరో తప్ప. నామటుకు నాకు యీ మండలికి వెచ్చించే కాలం నా ప్రాక్టీసుకు ఉపయోగిస్తే మరో రెండువందలు వస్తాయి. అయినా దీనికి అంగీకరించాను. అందుకు ప్రతిఫలం ఆశించనంత త్యాగమూర్తిని కాను నేను. కాని నావల్ల మండలికి ప్రమాదం ఉండదు. మండలి డబ్బులో దమ్మిడీ నాకక్కర లేదు. దానికీ ఆశించే వారుంటారని మీకు తెలియదనుకుంటా. అదృష్టం కలిసివచ్చి ఏనాలుగువేలో గ్రాంటువ

నిజంగా మనం అనుకున్నవన్నీ ఆచరించవచ్చు. లేదంటే ఎలాగో కష్టపడి మళ్ళీ విరాళాలకు బయలుదేరి డబ్బు మూలుగుతున్న వాళ్ళని కొల్లగొట్టవచ్చు. మీకింకా అనుభవం తక్కువ. అందుకే ప్రతి చిన్న విషయానికీ బాధపడుతున్నారు. నిజంగా నిస్వార్థంగా పనిచేసేవారికి కూడా ఉండదు, పేరూ ఉండదు. మీరు కావాలంటే మిమ్మల్ని కార్యదర్శిని చేస్తాను. వీలైనంతవరకు మంచికే పాటుపడదాం" అంది మాధురి.

శైలజ విస్మితురాలైంది. మాధురి మాటలు సహా ఆశ్చర్యంగా కనబడ్డాయామెకు. కాని ఆమె అంత బాహాటంగా ఒప్పుకున్నందుకు మనస్సులోనే అభినందించింది మాధురిని. అయినా మాధురి చివర అన్నమాటలు కంటగింపుగా ఉన్నాయి. తనకేదో పదవి ఇచ్చి తననోరు మూయించాలని మాధురి ప్రయత్నించడం ఆమెకు అరికాలి మంట నెత్తికెక్కించింది.

"నాకేదో పదవి చూపించి నన్ను లొంగ తియ్యగలననుకుంటే మీరు చాలా పొరపడ్డారు" అంది ఖచ్చితంగా.

"నేనలా అనుకోలేదు. కేవలం ఒక సూచనమాత్రం చేశాను. మీరు ఒప్పుకోరనీ నాకు తెలుసు. సరే ఆ విషయం వదిలేద్దాం. ఇంతకీ మీ రనేదేమిటి?"

"ఈ సన్మానం జరగడానికి నే నెంతమాత్రం అంగీకరించను." మొండిగా అంది శైలజ.

"మీ ఒక్కరూ వ్యతిరేకిస్తే ఏం ప్రయోజనం ?" అయ్యో వెర్రి పిల్లా అనుకుంది మాధురి.

"రేపు సభ్యురాండ్రందరికీ యీ విషయం చెప్పేస్తాను."

"నన్ను బెదిరిస్తున్నారా ?"

"లేదు మీరు ఉన్నది ఒప్పుకున్నందుకు నేనుకూడా ముందేమి చెయ్యబోయేదీ మీతో చెప్పేస్తున్నాను."

"సరే ప్రయత్నించండి. కాని ప్రయోజనం ఉండదని మాత్రం ముందే హెచ్చరిస్తున్నాను. నన్ను కాదని ఎదిరించి మీరేమీ సాధించలేరు. ఆ విషయం మీరే స్వయంగా గ్రహిస్తారు. కాని మీకు నాదో చిన్నసలహా. మీరంత నిష్కర్షగా అందరితోనూ మాట్లాడడం మీ భవిష్యత్తుకు ప్రమాదకరం. అందరూ నా అంత సులభంగా తీసుకోలేరన్న విషయాలూ" అంది మాధురి.

"నేనుకూడా ఒకందుకు మిమ్మల్ని అభినందించకుండా ఉండలేను. కాని మీరింత చదువుకున్నా, యింత మంచివారై యుండీ కూడా యిల్లా ప్రవర్తించడమే నాకు బాధగా ఉంది" అంది శైలజ.

"క్రమంగా మీకే అనుభవం అవుతుంది."

సెలవు తీసుకుని వెళ్ళిపోయింది శైలజ.

అరగంటవరకు శైలజను గురించి ఆలోచిస్తూ ఉంది మాధురి. శైలజమీద ఆమెకు జాలి కలిగింది.

కాని మాధురికూడా మానవమాత్రురాలే. మంత్రి గారి పక్కన కుర్చీలో కూర్చుని దండలు వేయించుకున్న ప్పటి ఫొటోలు పత్రిక లన్నిటిలోనూ పడాలనే ఆకాంక్షను మాత్రం ఆమె త్యాగం చెయ్యలేకపోయింది.

మర్నాడు శైలజ తన వాగ్దానం నిలబెట్టుకుంది. సభ్యురాం డందరికీ ఆ విషయాలు ఎరుకపరిచింది. కొంత మంది శైలజను సమర్థించారు. కొంతమంది డాక్టరమ్మ పక్షం అయ్యారు.

డాక్టరమ్మ వచ్చి అత్యవసర సమావేశం ఏర్పాటు చేసి మంత్రిగారిరాకను ఎరుకపరిచి కుండలి తరఫున సన్మా నించాలని తెలియజేసింది. శైలజ అంకులోని ఇక్కట్టు లన్నీ తెలియపరిచింది. ఇంకా నలుగురైదుగురు కొంద రిటూ కొందరటూ మాట్లాడారు.

మాధురి మళ్ళీ ఉపన్యసించింది శైలజకు సమా ధానంగా. కుండలి పురోభివృద్ధికి మంత్రిగారి సన్మానం ఎంత దోహదం ఇస్తుందో తియ్యని మాటలతో ఉదహ రించింది అరచేతిలో వైకుంఠం చూపించింది.

తరువాత ఆ విషయం ఓటింగుకు పెట్టబడింది.

శైలజ పక్షం వీగిపోయింది.

శైలజను సమర్థించినవారు కూడా మాధురికే ఓటు వేశారు.

దానికి చాలా కారణాలున్నాయి.

మాధురి ప్రతిభగల డాక్టర్. ఎవరికి అవసరం చ్చినా ఆమె దగ్గరకు పరుగెత్తుకు రాక తప్పదు. ఆపరే

షను చెయ్యడంలో ఆమె ప్రతిభ చుట్టుపక్కల ఊళ్ళలో కూడా వ్యాపించింది. దీనికి తోడు తియ్యని మాటలు చెప్ప డంలో ఆమె దిట్ట. కొన్ని లక్షల పేర్లలోంచి ఎంచి ఎంతో అనువైన పేరు కూర్చారు బారసాలనాడామెకు.

వీటన్నిటి దృష్ట్యా ఆమెను కాదని కోపం తెప్పించ డానికి ఎవరూ సాహసించలేకపోయారు. అదే కాక డాక్టరమ్మ తలుచుకుంటే ఆమే స్వయంగా స్వంత ఖర్చుతో మండలి నడపగల సమర్థురాలు. అందుచేత అంతా ఆమెనే బల పరిచారు.

తను నెగ్గినా శైలజ వాదనలో సబబు కనబడడం వల్ల మాధురి మనస్సు పీకుతూనే ఉంది. అందుకే శైలజను సభ్యత్వానికి రాజీనామా ఇవ్వవద్దని కోరింది. ఇచ్చి చేసే దేముందనీ, కనీసం కాలక్షేపానికైనా పనికి వస్తుందనీ సరే నంది శైలజ.

మంత్రిగారికి సన్మానం ఘనంగా జరిగింది. మండలినీ మాధురినీ ఆకాశాని కెత్తేశారాయన. అయితే బడ్జెట్ అప్పటికే తయారై పోవడంవల్ల ఈ ఏడాదికి గ్రాంటు వలనుపడదనీ, మీాదటికి తప్పకుండా వచ్చే ఏర్పాటు చేయి స్తామనీ అన్నారు.

తను చెప్పినట్టే జరిగిందని చెప్పుకుందుకు శైలజ ప్రయత్నించలేదు. దానివల్ల ప్రయోజనం ఉండదనేది సర్వసాధారణాంశం. ఎదురుగా ఎవరూ ఈ విషయం మాధురిని

అడగలేదు. ఆమెకూడా ప్రస్తావించలేదు. పరోక్షంగా జరిగే వాటిని మాధురి లక్ష్యపెట్టేది కాదు.

మండలి విషయంలోనే కాక రమణి విషయంలో కూడా తాను పూర్తిగా పొరపడినట్టు శైలజకు తెలిసి వచ్చింది మరో నెల గడిచేసరికి.

ఒక రోజున అలవాటు ప్రకారం రమణి ఇంటికి వెళ్ళింది శైలజ. రమణి ఇంట్లో లేదు. రామన్ సాదరంగా ఆహ్వానించాడు. తొందరగానే రమణి వచ్చేస్తుందనీ, కూర్చొమనీ కోరాడు.

ఇద్దరూ కబుర్ల పోగులవడంవల్ల రామన్, శైలజ కబుర్లలోకి దిగారు.

మాటల సందర్భంలో రామన్ ఒక చక్రసిహాస్యం విసిరేసరికి కడుపుబ్బ నవ్వు వచ్చింది శైలజకు. రామన్ కూడా శ్రుతి కలిపాడు.

అదే సమయానికి మణి నెత్తుకుని ఇంట్లో అడుగిడిన రమణి ఈ దృశ్యం చూసి ముఖం ముడుచుకుని, ముక్తసరిగా శైలజను పలకరించి, శైలజమీద దూకబోతున్న మణిని అణిచిపట్టి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

అది చూసిన శైలజ అప్రతిభురాలై రామన్ కేసి చూసింది. అతనికీ అర్థం కాలేదీ గొడవ.

శైలజ లోపలికెళ్ళి రమణిని మండలి కెళ్ళడానికి రమ్మంది. తనకు ఆపూట తల నొప్పిగా ఉందనీ, క్షమించమనీ చెప్పి తప్పించుకుంది రమణి.

శైలజ వెళ్ళిపోయింది.

రెండురోజులు ఏవో పన్లుండి సమితికి వెళ్ళడం ఎగ గొట్టిన శైలజ మూడోరోజున దారిలో రమణి ఇంటికి వెళ్ళింది. ఇల్లు తాళంపెట్టి ఉంది. పక్కవాళ్ళ నడిగితే ఖాళీ చేశారని తెలిసింది. బదిలీ అయిందా అంటే లేదన్నారు.

మాట మాత్రమైన తనతో చెప్పకుండా ఇల్లెందుకు ఖాళీ చేశారో శైలజకు అర్థంకాలేదు. ఇంక ఆమె మండలికి వెళ్ళ బుద్ధికాలేదు. అసలు అక్కడ తన కెలాగూ ఇతరులతో అంత సన్నిహితత్వం లేదు. మాటా మాటా అనుకున్నా డాక్టరమ్మ తనంటే అభిమానం, గౌరవం చూపుతుంది. దానికితోడు డబ్బు అయిపోయినందువల్ల హిందీశిక్షణ,కుట్లు, అల్లికల ఉపాధ్యాయినులను మానిపించవలసి వచ్చింది. దానితో మండలికి వచ్చేవారి సంఖ్య మరీ పలచబడి పోయింది. ఏదీ తోచక అక్కడికి వెళ్ళడం తప్ప ఏమీ కనబడలేదు. కాని రోజూ రమణిని కలుసుకోవడం, మణితో ఆడుకోవడం, రామన్‌తో కబుర్లు చెప్పడం అలవాటయిపోయి ఇటు వచ్చేది శైలజ. ఈ నాటితో దానికీ స్వస్తి కావడంతో గృహాభిముఖురాలై వెనక్కు మళ్ళింది

రమణి తన్నింత ఒక్క క్షణంలో దూరం చెయ్యడానికిగల కారణం కనబడలేదు శైలజకు. ఆమెను పిచ్చెత్తి

పోయింది రమణి ప్రవర్తనవల్ల. కనీసం తనతో ఒకకారణం చెప్పి తనతో పరిచయం వృద్ధి చేసుకోవడం తనకు (రమణికి) ఇష్టంలేదని స్పష్టంగా రమణి చెప్పిఉంటే శైలజ ఏమీ అనుకుని ఉండేదికాదు. హఠాత్తుగా ఇలా చెప్పా చెయ్యకుండా ఇల్లు ఖాళీచేసి తనను బహిష్కరించడం శైలజను బాధించింది.

అదే పనిగా ఆలోచిస్తూంటే చటుక్కున ఒకభావం స్ఫురించి శైలజ ముఖం సిగ్గుతో ఎర్రబడిపోయింది. కోపం అసహాయత చుట్టుముట్టాయి. రమణి అంత నీచంగా ఊహించి ఉంటుందని ఆమె నమ్మలేకపోయినా అంతకంటే సరిఅయిన కారణం కనబడలేదు.

రామన్ మూర్ఖుడులా కనిపించా డామెకొక క్షణం. ఎంత చదువుకుంటే ఏం లాభం? అనుకుంది. కాని ఊహించినకొద్దీ అతనిమీద సానుభూతి కలిగింది. చిన్న విషయం ఆధారంగా అతను భార్యతో పోట్లాడాలని తాను కోరడం తనకే సిగ్గనిపించింది. ఆమె మొండిపట్టు పడితే తానూ పంతానికిపోయి పచ్చని సంసారం పాడుచేసు కోకుండా భార్య మాటకే విలువ ఇచ్చిన రామన్ తెలివి కలవాడిలాగే కనిపించాడు. రెండుచేతులూ చరిస్తేనే చప్పు డవుతుంది. చప్పుడు సహించలేని బుద్ధిమంతుల లక్షణం తమ చేతిని కలపకపోవడంలోనే ఉంది.

ఎంత సమాధానపరుచుకుందా మనుకున్నా బాధ వ్యధ తప్పలేదు. స్త్రీ పురుషుల నిక్కరిని ఎంతసేపూ శంకా

క్రోత్తమైన దృష్టితోనే ఎందుకు వీక్షిస్తారో! సుశీల విషయంలో తాను విన్నవాదులు ఎంత హాస్యాస్పదమైనవి కావచ్చో మరొక్కసారి తేటపడింది శైలజకు.

ఖాన్ కలిసినప్పుడల్లా ఇవన్నీ అతనికి నివేదించడం, అతను లోకపు తీరే అంత అని ఆమెను సానుభూతితో అనునయించడం జరిగేవి.

రమణి ఇల్లు మారి వెళ్ళిపోయిన తరువాత శైలజ మండలికి వెళ్ళడం మానుకుంది. దానితో ఎప్పటి ఒంటరితనం ఆవహించింది.

ఆవేళ ఆదివారం. ఖాన్ గత సాయంకాలంవచ్చి ఆనాడు సినీమాకు రమ్మని ఆహ్వానించాడు. సరేనంది శైలజ. సాయంకాలం నాలుగు గంటలలోపునే వంటా అదీ కానిచ్చి దుస్తులు మార్చుకుని ఇంకా గంట చిల్లర వ్యవధి ఉండడంచేత స్లిప్ టెస్ట్ పేపర్లు దిద్దడానికి పూనుకుంది. రెండు నెలలలోపున ఉన్నాయి పెద్ద పరీక్షలు. ఇప్పటికీ పేపర్లలో విద్యార్థినులకు సున్నలు వస్తున్నాయి. ఇంక వీళ్లెలా పాసవుతారా అనుకుంది శైలజ.

బయట అలికిడి అయితే దిద్దుతున్న పేపర్ మీద నుంచి తల పైకెత్తిన శైలజకు వాకిట్లో నిలబడి ఉన్న సుశీల కనిపించింది.

సాదరంగా ఆహ్వానించి కుర్చీ చూపించింది శైలజ.

చలాకీగా ఉండే సుశీల ఖిన్నవదనంతో మౌనంగా కూర్చుంది. పరీక్షల బెంగచేతనేమో అనుకుంది శైలజ.

తన పరీక్ష రోజులలో అద్దంలో తన ముఖం కనబడిన విధానాన్ని గుర్తుకు తెచ్చుకుంటూ. అది తలుచుకుంటే తనకు ఇప్పుడు చిరునవ్వు వచ్చింది.

"పరీక్షలని గురించి బెంగ పెట్టుకున్నావా ?" సుశీల నుద్దేశించి అడిగింది.

సుశీల అప్పటికీ మాట్లాడలేదు. అతి ప్రయత్నం మీద కన్నీరు ఆపుకుంటూందా అనిపించింది శైలజకు.

సుశీల ఆరోగ్యం బాగులేదో, లేక ఇంట్లో ఎవరికైనా బాగులేదో, మరే కారణమో తెలియలేదు.

కుర్చీలోంచి లేచి సుశీల దగ్గరికెళ్ళి భుజంమీద చెయ్యివేసి

"ఏం సుశీ! ఒంట్లో బాగుండలేదా ? నా దగ్గర నీ కెందుకు మొహమాటం ?" అంటూ ఆప్యాయంగా అడిగింది.

ఆ సానుభూతీ, ప్రేమా సుశీలమీద వ్యతిరేకంగా పనిచేశాయి. ఉగ్గ పట్టుకుని ఉన్నదుఃఖం ఒక్కసారి పెల్లుబికింది. ఆపుకోలేక ఏడ్చేసింది సుశీల.

శైలజ కంగారు పడింది ఇంటిదగ్గరినుండి దుర్వార్త ఏదైనా వచ్చిందేమోనని శంకించింది.

"చెప్పు సుశీ!" అంటూ బుజ్జగించింది.

సుశీల చెప్పినదాని సారాంశం ఇది :

హిస్టరీ లెక్చరర్ శకుంతల,సుశీలను గురించి లోగడ లజతో చెప్పినవన్నీ అక్షరాల నిజం. పదినెలల క్రితం

సుశీలకు ఒక విద్యార్థితో పరిచయం అయింది. అది క్రమంగా అనురాగంగా మారింది. అతను సుశీలకు ఎన్నో ఆశలు చూపించాడు. పెళ్ళి చేసుకుంటానన్నాడు. సుశీల అవన్నీ నమ్మి తన సర్వస్వం అర్పించింది. కొన్నాళ్ళు స్వర్గం అంటే ఇదే అనిపించింది. తత్ఫలితంగా మాతృత్వం వహించిందామె. ఆ విషయం అతనికి తెలిసేసరికి నీరుకారి పోయాడు. చూపించిన ఆశలు, నటించిన ప్రేమ, చేసిన ప్రమాణాలు అన్నీ మరిచిపోయాడు. రెక్కలుకట్టి ఆకాశానికి ఎగురవేసిన ఆమె ఆశావిహంగాన్ని శరాఘాతంతో అధఃపతితం చేశాడు. నలుగురిలాగే ఆమెను విసర్జించాడు. ఆమెకు నీతి లేదన్నాడు. పెళ్ళికాకముందే తనతో తిరిగిన ఆమెను నమ్మడం అసాధ్యమన్నాడు. కావలిస్తే డబ్బిస్తాను. పొమ్మన్నాడు. నానా మాటలూ అడి ఆమెను అవమానించాడు. ఎంతో నమ్మకంతో సుశీల నిర్మించుకున్న ఆశాసౌధాలు పునాది మట్టంగా కూలిపోయాయి. ఆమె హృదయం వ్రక్కలయింది. భవిష్యత్తంతా అంధకార బంధురంగా కనిపించింది. తలిదండ్రులకు తెలిస్తే సహించరు. వారు ఛాందసులు. ఈ విషయాలు ప్రిన్సిపాల్‌కు తెలిసి కాలేజీకి రావడానికి వీలులేదని చెప్పింది.

ఈ కథ విన్న శైలజకు అరికాలి మంట నెత్తికెక్కింది. యౌవనోద్రేకంలో కళ్ళు కప్పుకుని ప్రవర్తిస్తే ఫలితాలు ఇలాగే ఉంటాయి. ప్రేమా గీమా అంటూ ఏవో లేనిపోని పదాలతో ఆత్మవంచన చేసుకుని పప్పులో

కాలువేసి తీసుకోవడం అసాధ్యమై ఇటువంటివే జరుగుతాయి. శైలజలో ఇంకా పురాతన సంస్కారాలు జీర్ణించే ఉన్నాయి. ఆమె అవినీతి సహించలేదు. నిగ్రహం లేకుండా క్షణాలో ఆవేశానికి లొంగిపోయి తమను తాము మరిచిపోయి ప్రవర్తించేవారిపట్ల ఆమెకు సానుభూతి లేదు. కళ్ళు తెరవని పసిపిల్ల అనుకున్న సుశీల ఎంతది! శైలజ కూడా ఎంత మందితోనో స్వేచ్ఛగా మెలిగేది. తనకూ ఎన్నోసార్లు ఉద్రేకం వచ్చింది. కాని అంతమాత్రాన దానికి లొంగిపోవడమేనా? ఆమాత్రం అదుపు ఉండద్దూ మనస్సుమీద? శీలం కోల్పోతే ఇంక మిగిలేదేమిటి? ప్రాణం ఒడ్డిఅయినా కాపాడుకోవలసిన మానాన్ని కోల్పోయినవారిని క్షమించడం ఎల్లా?

పై విధంగా ఆలోచించిన శైలజకు సుశీలమీద అసహ్యం వేసింది. సుశీల విషయంలో తన అంచనా తప్పడం ఆమె సహించలేకపోయింది. సుశీలను ఛడా మడా తిట్టింది. ఒళ్ళు తెలియకుండా కళ్ళు మూసుకుని ప్రవర్తించినందుకు అనుభవించమని ఆమెను విసిరికొట్టింది.

సుశీల క్రుంగిపోయింది.

శైలజ చదువుకున్నదనీ, తనంటే సానుభూతిగల వ్యక్తిఅనీ, తనకు ధైర్యం చెప్పి సలహా ఇస్తుందనీ ఇటు వచ్చింది సుశీల. శైలజ విశాల హృదయంతో ఆదరించి దారి చూపిస్తుందని ఆశించింది. సాటి స్త్రీని అర్థం చేసుకుంటుందనుకుంది. కాని శైలజ కూడా సామాన్యులందరి

లాగే ప్రవర్తించింది. దానితో ఆమెకు విరక్తి కలిగి సెలవు తీసుకొని వెళ్ళిపోయింది.

సుశీల వెళ్ళిపోయిన తరువాత శైలజ మనస్సు క్షోభపడడం మొదలు పెట్టింది. నిర్దయగా ఆమెను వెళ్ళ గొట్టానే అని బాధపడింది. తనకేం అవసరం అని సుశీల తనను (శైలజను) జ్వరంలో కంటికి రెప్పలా కాపాడి సేవ చేసింది! కాలేజికూడా మానుకుంది. ఎంతో నెమ్మదైనది. తెలివైనది. ఒకళ్ళతప్పులను క్షమించి, సానుభూతి చూపలేని తన చదువెందుకు? వాదనలలో నిధితో తనన్ని చెప్పేది? ఇతరుల బలహీనతలను క్షమించలేని వాళ్ళను తనెంత అసహ్యించుకునేది? అవన్నీ ఇప్పుడేమయ్యాయి? చదువుకుని సంస్కారం పెంపొందించుకున్నాననుకున్న తన సంస్కృతి ఏ గంగలో కలిసింది? పామరులకూ, తనకూ తేడా ఏమిటి? సరోజని తన ముస్లిం సహాధ్యాయిని ప్రేమించి విఫలురాలై ఆత్మహత్య చేసుకున్నప్పుడు తనేమనుకుంది? దాని బలహీనత దానికి వదిలేస్తే బాగుండుననికదూ? మరి సుశీల విషయంలో ఆమె బలహీనతను ఆమెకే వదిలెయ్యడానికి తనెందుకు సమ్మతించలేకపోయింది? సుశీల అవినీతిపని చేసింది. తప్పు చేసింది. దానికి శిక్ష అనుభవించి తీరాలి. కాని ఆమె తప్పుచేస్తే మాత్రం ఆమెను నిందించి న్యాయపరిచే హక్కు తన కెవరిచ్చారు? ఆమె ఎదురు తిడితే తనేమయ్యేది? తన చదువు, సంస్కారం చూసి ఆదరిస్తుందని

తన దగ్గరకు కొండంత ఆశ పెట్టుకుని వచ్చిన వెర్రిపిల్లను తను విసిరి కొట్టింది. అనుభవం తక్కువై సుశీల అల్లా ప్రవర్తించినంతమాత్రాన ఆమెను అసహ్యించుకోవడమేనా తన విధి? నిజంగా తప్పని తెలిస్తే సుశీల అల్లా ప్రవర్తించి ఉండేది కాదేమో? కాక, ఆమె పరిస్థితిలో ఎవరున్నా అల్లాగే ప్రవర్తించేవారేమో?

తనెంతో సంకుచిత హృదయం ప్రదర్శించింది. స్త్రీలకు శోభ అయిన సహనాన్ని ప్రదర్శించలేకపోయింది. అతి సామాన్యులకన్న హీనంగా ప్రవర్తించింది.

ఈ ఊహలతో ఆమె మనస్సు విచలితమైపోయింది. కాని ఎంతని సమాధాన పరుచుకుందామనుకున్నా తనలోని ఛాందస భావాలవల్ల సుశీల తప్పు చేయలేదనీ, అదీ మానవులలో ఉండే సహజ బలహీనతేననీ అంగీకరించలేకపోయింది. కాని తన క్షమారహిత ప్రవర్తనకూడా ఆమెకు గర్హణీయమే అయింది. ఎంత నచ్చచెప్పుకున్నా తను చేసింది మంచిపనే అని సమర్థించుకోలేకపోయింది.

తెంచుకోలేని ఈ ఊహలతో శైలజ సతమతమౌతూండగా వీధిలో ఖాన్ కారు హారన్ మ్రోగింది. అదివిన్న శైలజ సిగ్గుతో కుంచించుకు పోయింది. ఖాన్‌కు ఎల్లా ముఖం చూపాలా అనుకుంది. ఇదంతా అతనినుంచి తాను దాచలేదు. చెప్తే బహుశా అతని దృష్టిలో తాను చులకన కావచ్చుననే ఊహ ఆమెను బాధించింది. అయినా అతనేదో చటుక్కున తేల్చి చెప్పగలవాడు. అందుచేత

ధైర్యం వచ్చింది. అప్పటికీ అతనికి ఎదురేగి స్వాగతం మాత్రం చెప్పలేకపోయింది.

ఖాన్ లోపలకు వచ్చి చిన్నబోయిన ఆమె వదనాన్ని చూసి కొద్దిగా కలవరపడ్డాడు. ఎప్పుడూ చిరునవ్వుతోను, వెలుగుతోను ప్రకాశించే ఆమె ముఖం ఎంతో దీనంగా కొడిగట్టిన దీపంలా ఉంది. ఆ మాత్రపు కలతలను ఆమె ఆట్టే పట్టించుకోదని తెలిసిన ఖాన్‌కు ఏదో జరిగిందని అనుమానం వేసింది.

"అదేమి టలా ఉన్నారు? మళ్ళీ ఏ జ్వరమైనా వచ్చిందా?" అడిగాడు ఖాన్.

"శారీరకంగా బాగానే ఉన్నాను. మనస్సే అదోలా ఉంది."

"ఏం, మళ్ళా క్లబ్బులో తగువేదైనా వచ్చిందా?" అందరితోనూ కుండ బద్దలుకొట్టినట్టు మాట్లాడి తగువులు తెచ్చుకోవడం ఖాన్ ఎరిగినదే.

"లేదు. మండలికి వెళ్ళడం మానుకుని చాలా రోజులైంది."

"మరి?"

"ఇవాళ సుశీల వచ్చింది. ఆమె తల్లి చావబోతూందిట! నాతో చెప్పుకుని ఏడ్చింది. నేను క్షమించలేకపోయాను. ఆమెను నిందించాను. ఆమె నిరాశతో వెళ్ళిపోయింది. ఆలోచించినకొద్దీ మనస్సు కలత పడుతూంది" అంటూ పూసగుచ్చినట్టు అంతా చెప్పింది శైలజ.

"మీరు చాలా పొరపాటు చేశారు" అన్నాడు ఖాన్.

"అనే నాకూ అనిపిస్తూంది. అయినా అవినీతిని ప్రోత్సహించలేక పోతున్నాను. తప్పుకు శిక్ష అనుభవించడం తప్పదు. తెలిసి చేసినా తెలియక చేసినా ఫలితం ఒక్కటే. నిప్పులో వేలు పెడితే కాలకుండా మానదు, నిప్పు కాలుతుందని తెలియకపోయినా."

"అయితే చేయి కాల్చుకున్నవాడికి మందువేసి కట్టుకట్టడం మానేసి కాల్చుకున్నందుకు నిందిస్తారన్న మాట! ఇదా మీరు చెయ్యవలసినది!" అన్నాడు ఖాన్.

ఈ తర్కం శైలజకు ఇదివరలో తట్టలేదు. అంచు చేతే అది వినగానే తనెంత మూర్ఖంగా ప్రవర్తించిందో తెలిసివచ్చింది. దానితో ఆమెకు మాట పెగలలేదు.

ఖాన్ మళ్ళీ అన్నాడు;

"ఇంతకీ అసలామె చేసింది తప్పేనా ? సూక్ష్మంగా పరిశీలిస్తే అసలు తప్పే కాదేమో ? తనను అన్నివిధాలా ఆదరించి పెళ్ళి చేసుకుంటానని అన్న పెద్దమనిషిని నమ్మడం తప్పెలా అవుతుంది? అతను మాట నిలుపుకోలేకపోతే ఈమె తప్పేమిటి? వివాహ ముద్రవేస్తేనేనా అనుబంధం? ఆ ముద్ర వేసిన ఆలు బిడ్డలను వదిలేసిన ఘనులు లేరూ? అలాంటి భార్య పరిస్థితికీ ఈమె స్థితికీ తేడా ఏమిటి ? ఆమెకు లోకం సానుభూతి చూపిస్తుంది, దారి చూపకపోయినా. ఆ భర్తను తిడుతుంది. కాని ఈమె విషయం ?

ఈమె కులట! నీచ స్త్రీ! ఎందుకీ తేడా? ఒక మనిషి ఎన్ను కోవడంలో పొరపాటు చట్టబద్ధమైతే మంచీ, కాకపోతే చెడ్డదీనా? పొరపాటుకు ఫలితం ఒక నియమాన్ని అనుస రించి ఉన్నా లేకపోయినా ఒకటే. అటువంటప్పుడు పొర పాటుపడ్డ వ్యక్తికి సానుభూతిచూపి ఆదరించడం కర్తవ్యం కాని నిందించడమా మీరు చెయ్యవలసినది? అసహాయ స్థితిలో వచ్చిన పాటి స్త్రీని ఆదరించలేక పోయారు. చదువుకున్న మీరే ఈమాత్రం గ్రహించలేకపోతే ఇతరు లామె నెలా గ్రహించగలరు? ఆమెకు దిక్కెవరు? ఏ అఘా యిత్యానికయినా పాల్పడితే ఆ బాధ్యత ఎవరిది? చదువు కుంటున్న దామె. ఆమెపొట్ట ఆమె పోసుకోగలదు. మీరు కాస్త ఆమెను అర్థం చేసుకోగలిగి ఉంటే ఎంతబాగుణ్ను!" అన్నాడు ఖాన్.

ఖాన్ మాటలు విన్న శైలజకు నోటమాట రాలేదు. ఆమె ఊహ లస లింత దూరం పోనేలేదు. నిజంగా నే సుశీల ఏ అఘాయిత్యానికయినా పాల్పడితే ఆ బాధ్యత నిశ్చయంగా తనదే. మానవత్వంలోని బలహీనత ఒకటి చిత్రంగా ఉంటుంది. ఒక వ్యక్తి దగ్గరకు ఏదో చెప్పుకో డానికి వెడితే, ఆ వ్యక్తి తిడితే పరిణామం రెండు పరస్పర విరుద్ధమైన బాటలలో ఉంటుంది. ఆ వ్యక్తి తిడతాడనే ఊహతోనే వెడితే అంతగా బాధపడరు. ఇక ఆ వ్యక్తి ఎంతో ఆదరిస్తాడని, ఎంతో ధైర్యం చెప్తాడని ఆశించివెళ్ళి, ఆ కథ అడ్డం తిరిగితే కలిగే బాధ వర్ణనాతీతం. సుశీలను

ఇతరులు తిట్టినా ఆమె అంతగా బాధపడకపోవడానికి కారణం ఆమె వారినుంచి అంతకంటె ఎక్కువ ఆశించక పోవడమే. కాని తననుంచి ఎంతో ఆశించివస్తే తానామెను కించపరిచింది. అక్కడ ఆమె దెబ్బతింది. దానికి తట్టుకోలేక ఏ ఆత్మహత్యకో పాల్పడితే! ఈ ఊహ శైలజకు ఆపాదమస్తకం వణికించింది.

"ఒక్క ఫూల్ లా ప్రవర్తించాను!" వాపోయింది శైలజ కింకర్తవ్యతా విమూఢ అయి.

"ఇప్పటికైనా మించిపోయింది లేదు. పదండి. ముందామెను వెతుకుదాం. మీకు ధైర్యం ఉంటే ఆమెను మీ ఇంటిలో ఆదరించండి. ఆమెకు అభ్యంతరం లేకపోతే మా ఇంట్లో నేను చోటిస్తాను" అన్నాడు ఖాన్.

"పదండి" అంటూ శైలజ ఖాన్‌ను అనుసరించింది కారు దగ్గరకు.

ఇద్దరూ కారెక్కారు.

"ఆమె బస ఎక్కడ?" ఖాన్ అడిగాడు.

"రంగముదలీ స్ట్రీట్ అని గుర్తు" అంది శైలజ.

సుశీల నివాసం పట్టుకునేసరికి బ్రహ్మాండం తలక్రిందులైంది.

తలుపులు బిగించి వున్నాయి.

శైలజ తట్టింది. లోపల మనుషులు మసులుతున్న అలికిడి అయిందిగాని తలుపులు మాత్రం తెరవలేదు.

"సుశీ తలుపు తియ్యి" ఆత్రంగా పిలిచింది శైలజ.

తలుపు తీసిన సుశీల ముఖం శోకంతో వాడిపోయి ఉంది. కళ్ళు ఎర్రబడ్డాయి. జుట్టు చిందరవందరగా ఉంది. సామానంతా ఒకచోట పోగువేసి ఉంది. పెట్టెలోకి బట్టలూ అవీ సర్ది ఉన్నాయి. సుశీల మొత్తానికి ప్రయాణసన్నాహం చేసింది. ఎక్కడికి వెడదామనో!

ఖాన్, శైలజ కలిసి సుశీలను ఎంతో ఊరడించారు. భవిష్యత్తులో ఆశలు చూపించి ఆమె నిర్లిప్తత పోగొట్ట ప్రయత్నించారు. శైలజ తాను ప్రిన్సిపాల్‌కు రికమెండ్ చేసి సుశీలను కనీసం పరీక్షకు కూర్చోనిచ్చే ఏర్పాటు చేస్తానంది. డిగ్రీ తీసుకుంటే ఏదో విధంగా పొట్టపోసుకోవడం కష్టం కాదని నచ్చజెప్పింది సుశీలకు. ఖాన్, ఆమె చేసిన పని మరేమంత ఘోరమైన అపరాధం కాదనీ, పొరపాటు పడడం మానవ సహజమనీ చెప్పాడు. కష్టాలను ఎదుర్కోవడంలోనే ఆనందం ఉందనీ, పిరికితనం ప్రదర్శించి అఘాయిత్యాలకు పాల్పడడం అవివేకమనీ హెచ్చరించాడు.

ఎంతో ప్రయత్నంమీద సుశీల నిస్పృహ వదిలించగలిగారు ఇద్దరూ. కాని సుశీలను శైలజ ఇంటికి రావడానికి ఒప్పించేసరికి మాత్రం వారి ప్రాణం కడంటింది.

మర్నాడు శైలజ కాలేజికి వెళ్ళి ప్రిన్సిపాల్‌ను కలుసుకుని సుశీల విషయం చెప్పింది.

"అవినీతి పరులకు నా కాలేజీలో స్థానంలేదు. ఇటు

వంటి వాళ్ళను దూరం చెయ్యకపోతే ఇతర విద్యార్థినులు కూడా చెడిపోతారు. వారిని ఈమెనుండి వేరు చెయ్యడానికే ఆమెను కాలేజీలో ప్రవేశించే అర్హత తొలిగించాను" అంది ప్రిన్సిపాల్.

"మీరు పెద్దవారు అనుభవజ్ఞులు. మీకు నే నెక్కువ చెప్పక్కర్లేదు. పొరపాట్లనేవి సహజం అని మీరూ ఒప్పుకుంటూ రనుకుంటాను. మానవత్వం దృష్ట్యా చూసినా ఇంక నెల నెలన్నర పదిహేను రోజులలో ఒక తీరానికి చేరబోతున్న ఆమెను ముంచెయ్యడం ధర్మంకాదు. బాధ్యత తెలియక ఆమె అలా ప్రవర్తించింది. ఈ మాత్రం జాలి చూపించలేరా?"

ఆ మాటలు ప్రిన్సిపాల్ మీద బాగా పనిచేశాయి. ఆమెకూ ఉన్నారు సుశీ అంతంత కూతుళ్ళు. పెళ్ళికాని వాళ్ళే. ఏ కాలాని కేం వస్తుందో? అయినా సుశీలను కాలేజీకి రానివ్వడం తనపదవికే భంగం తెస్తుందేమోననే అనుమానంవల్ల సుశీలను పరీక్షలకు రానివ్వడానికి మాత్రం ఒప్పుకుంది. అంతకంటే తానేమీ చెయ్యలేనంది.

పోనీ అదే పడ్డిలో మెల్ల అని సంతోషించింది శైలజ. ఇంచుమించు కోర్సులు అయిపోనే అయిపోయాయి. పోతే అటెండెన్స్‌కు ఎగ్జెంప్షన్‌కు డబ్బుకడితే సరిపోతుంది. సుశీల తెలివైనది. తన సహాయం ఉంటే ఫస్ట్‌క్లాస్‌లో పాస్ అవడానికి ఢోకాలేదు. తరువాత తన దారేదో తానే చూసుకుంటుంది, సుశీల. తేలికపడిన మనస్సుతో ఈ వార్త

సుశీలకు అందించింది శైలజ. నిరుత్సాహపడి అస్తమానం అదే ఆలోచించి మనస్సు పాడుచేసుకోవద్దని హెచ్చరించింది.

వద్దన్నా ప్రతి పనిలోనూ తనకు సహాయపడే సుశీల ఉనికి శైలజకు సంతోషాన్ని చేకూర్చింది ఇంట్లో కలిసి మెలిసి ఉంటున్న సుశీల తనను 'మేడం' అని పిలవడం ఎబ్బెట్టుగా తోచి 'అక్కా!' అని పిలవమంది శైలజ ఆ పిలుపులోని తీయదనం వారిద్దరినీ మరింత సన్నిహితులను చేసింది. రాత్రి సుశీలకు పాఠాలు చెప్పడంతోను, పగలు కాలేజీతోను సరిపోవడంతో శాంతి కనబడింది శైలజకు. ఇద్దరూ కలిసి ఉండడంతో ఉబుసుపోక సులువైన ఒంటరితనం బాధ తగ్గిపోయింది శైలజకు. సుఖంగా గడుస్తున్న ఈ వాతావరణంలో పదిహేను రోజులు ఇట్టే వెళ్ళిపోయాయి. సుఖమూ శాంతీ నెలకొన్నాయి శైలజలో. సుశీల గొడవ ఎవరూ ఎత్తకపోవడంతో ఇంక ఆ ప్రకరణం పూర్తి అయిపోయినట్లే అనుకుంది శైలజ.

కాని ఒకనాడు హఠాత్తుగా తెలిసివచ్చింది శైలజకు. స్త్రీలకు స్త్రీలమీద ఉండే అసహనానికి అంతులేదని.

మధ్యాహ్నం స్టాఫ్ రూమ్‌లో కూర్చుని పుస్తకం చదువుకుంటున్న శైలజను రమ్మని కబురు పంపింది ప్రిన్సిపాల్.

శైలజను చూసి కూర్చోమనైనా అనకుండా, మరే ఉపోద్ఘాతమూ లేకుండా, "సుశీల మీ ఇంట్లో ఉంటోందా" అని అడిగింది గంభీరంగా.

"అవును" అంది శైలజ ముక్తసరిగా. ఆమె మెదడులో ఎన్నో ఆలోచనలు రేకెత్తాయి ఆక్షణంలో. ఇంకా ప్రిన్సిపాలు ఏ ప్రశ్నలు వేస్తుందో, అసలివన్నీ ఈమెకు చేరవేసి రెచ్చగొడుతున్న దెవరో, ఇంకా ఎన్నో.

"ఆమె మీ ఇంటిలోఉంటే చూసేవాళ్ళకు బాగుండదు" అంది ప్రిన్సిపాల్ శైలజను నిశితంగా పరిశీలిస్తూ.

"నిస్సహాయ స్థితిలో ఉందామె. ఎవరో ఒకరు ఆదుకోకపోతే ఆమె గతి ఏమవుతుంది? ఈ చదువు కాస్తా గట్టెక్కితే ఆమెదారి ఆమే చూసుకుంటుంది" అంది శైలజ సమాధానపరిచే ధోరణిలో. మాధురి పరిచయం ఆమెకు సాధ్యమైనంతవరకు సహనం ప్రదర్శించడం నేర్పింది.

"ఉపాధ్యాయినులే ఇల్లా అవినీతి ప్రోత్సహించడం, అవినీతిపరులకి ఆశ్రయం ఇవ్వడం చేస్తే ఇంక విద్యార్థిను లెల్లా తయారౌతారు? క్రమశిక్షణ పేరిట మిమ్మల్ని, సుశీలని పంపించి వెయ్యవలసిందిగా ఆజ్ఞాపిస్తున్నాను" అంది ప్రిన్సిపాల్ అధికార పురస్సరంగా.

ఆ అధికారం, దర్పం చూసి వెర్రెత్తిపోయింది శైలజ. సహనం నశించింది. బలవంతపెట్టి ఒత్తిడి తెచ్చి తనను సాధిద్దామనుకున్న వాళ్ళంతా విఫలురయ్యారు. అదీకాక కాలేజికి ప్రిన్సిపాల్ అయినంత మాత్రాన తన స్వవిషయంలో జోక్యం చేసుకోవడం శైలజకు సుతరామూ ఇష్టంలేక పోయింది.

"అది నా స్వవిషయం. అందులో మీ జోక్యం నేను సహించను. కాలేజీలో నా విధి నిర్వహణలో లోపం ఉంటే మీరేమన్నా సహిస్తాను. నేను కాలేజీలో ఉండడం మీ కిష్టంలేదంటే చెప్పండి. రాజీనామా ఇస్తాను" అంది శైలజ స్థిరంగా. తనకన్న ఒకతరం ముందు వ్యక్తి అయిన ప్రిన్సిపాల్‌కు విడమర్చి చెప్పి ఒప్పించడానికి ఆమెకు ఇష్టం కాని, తీరికగాని లేకపోయాయి.

అంత కఠినంగా శైలజ మాట్లాడుతుందని ప్రిన్సిపాల్ అనుకోలేదు. గబుక్కున తనుకూడ తొందరపడితే ప్రమాదం. శైలజ అంటే విద్యార్థులంతా ఎక్కువ గౌరవం ఇస్తారు. పదేళ్ళనుంచి పాతుకుపోయి ఉన్నవారికంటె ఆమె ఎక్కువ బాగా పాఠాలు చెప్తుందని పేరు తెచ్చుకుంది చీటికీ మాటికీ ఫిర్యాదుచేసే తత్వంకాదు శైలజది. ఇన్నాళ్ళలో ఆమె ఏ విద్యార్థిమీదా ఫిర్యాదు చెయ్యలేదు. శైలజమీద విద్యార్థినులు ఫిర్యాదు చెయ్యలేదు. ఇతరుల విషయంలో పరస్పరం ఫిర్యాదులు చేసుకునేవారు విద్యార్థులూ, ఉపాధ్యాయినులు. పాఠాలు చెప్పడంలేదని ఒకరూ, వినకుండా అల్లరి చేస్తున్నారని మరొకరూను. నిర్లిప్తతకొద్దీ శైలజ ఊరుకుంటుందేమోనని ప్రిన్సిపాల్ రెండు మూడుసార్లు కనిపెట్ట ప్రయత్నించి ఆమె క్లాసు పక్కగా వెళ్ళేది. నిశ్శబ్దంగా ఉన్న క్లాసులో కంచులా మ్రోగేది శైలజ కంఠం. పరీక్షలు ఇంక నెల దరిదాపులో

ఉన్నాయి. ఇటువంటి పరిస్థితులలో శైలం నిర్మష్కమణం ప్రిన్సిపాల్‌కు ఇష్టంలేదు,

అందుకే "మీరింక వెళ్ళొచ్చు" అంది ప్రిన్సిపాల్, ఇంక ఆ ప్రసంగం సాడిగించకుండా.

కాని శైలజ, సహ ఉపాధ్యాయినుల ప్రవర్తన తలుచుకుంటే మాత్రం కోపంతో మండిపోయేది. తామెంతో ఘనులు, నీతిమంతులు అయినట్టు వీరంతా సుశీలను దుయ్యబట్టి, తాము ఆశ్రయం ఇచ్చి ఆదరించక పోవడంతో ఊరుకోక తనమీద ప్రిన్సిపాల్‌కు చెప్పడంతో ఆమె కోపం భగ్గుమంది. విద్యాధికులనుకున్న వీళ్ళే ఇలా ప్రవర్తించడం ఆమెకు కంటగింపుగా తోచింది. ఆ అక్కసుతో స్టాఫ్‌రూమ్‌లో అందర్నీ ఏకేసింది శైలజ.

ఆ ఉద్రేకంలో ఒక్క విషయం మరిచిపోయింది శైలజ. అది, శైలజ ప్రవర్తనకూడా వారికి నచ్చలేదని. ఖాన్‌తోడి ఆమె పరిచయానికి అపార్థం కల్పించి శైలజకూ సుశీలకూ సామ్యం ఏర్పరిచి సుశీలయెడ శైలజకుగల సానుభూతికి కారణం ఇద్దరూ ఒకే వర్గంలో చేరిన వారవడమే నని, ముఖంమీదే అనేశారు.

ఇంత చదువుకునీ, తామూ మగ స్నేహితులను కలిగి ఉన్న ఈ అధ్యాపికలు కూడా తన ప్రవర్తనను అపార్థం చేసుకుంటారని ఊహించని శైలజ నిశ్చేతను రాలైంది.

సాయంకాలం ఇంటికి వచ్చేవేళకు ఆమె ముఖం కళావిహీనంగా తయారైంది. సుశీలను ఆదరించి పుణ్యానికి పోయి పాపం అంటగట్టుకున్నానే అనుకుంది. సుశీలను చేరదీయబట్టి కదా తనకింత వాదు వచ్చింది ? ఆమెను వెళ్ళిపొమ్మంటే !

వివర్ణంగా ఉన్న శైలజ ముఖం చూసిన సుశీల భయపడింది.

"ఏం, అక్కా, అల్లా ఉన్నావ్?" అంది శైలజతో.

శైలజ మాట్లాడలేదు.

సుశీల రెట్టించింది.

"సుశీ! నన్ను విసిగించకు!" తీవ్రంగా అంది శైలజ.

సుశీల ముఖం భయంతో పాలిపోయింది. శైలజ అంత కఠినంగా ఎప్పుడూ మాట్లాడలేదు. కళ్లల్లో నీళ్లు తిరిగాయి సుశీలకు.

తలెత్తిన శైలజ సుశీల ముఖం చూసి కరిగి పోయింది. తన తీవ్రస్వరం ఆమెను గాయపరిచిందని తెలుసుకుని సిగ్గుపడ్డది. నిజంగా ఈ వెర్రిపిల్లే తన చెల్లెలయితే తనిల్లా ఊహించ గలదా? ఈమెనా ఇంటినించి వెళ్ళగొట్టడం? ఛీ! ఏది ఏమైనాసరే అటువంటి తలపుకు తావివ్వ కూడదు.

"నొచ్చుకోకు సుశీ! ఏదో విసుగుమీద అనేశాను" అని అనునయించింది సుశీలను.

"ఏం జరిగింది అక్కా?" అంది కొంత తేరుకున్న సుశీల.

"కొంప మునుచుకుపోయేదేమీ జరగలేదు. కాని కాస్సేపు నన్నొంటరిగా ఉండనీ" అంది శైలజ.

సుశీల ఇంక మాట్లాడలేదు.

ఆ రాత్రి శైలజకు ఎంతకూ నిద్రపట్టలేదు. ఎంత వదిలించుకుందామన్నా మధ్యాహ్నం విషయాలను ఆమె మరిచిపోలేకపోయింది. ఎడతెగని నిస్పృహ, బాధ ఆవరించాయామెను. విపరీతమైన వేదన ఆవహించింది. ఎక్కడికైనా మనుషులు కనబడనిచోటుకు పారిపోదామా అనిపించిందామెకు. 'ఈ వెధవ ఉద్యోగం వదిలేస్తే' అనుకుంది. ఇంత సుఖంలేని ఈ ఉద్యోగం ఎందుకు ? ఇంతదానికే పిరికితనం ప్రదర్శించి తాను సాధించేదేమిటి? తనేదో తప్పు చేసినట్టు పారిపోవడం ఏం కర్మ ! సుశీలకు సుద్దులు చెప్పి తాను బేల అయిపోతే ఎల్లా ? తను ఉద్యోగం వదిలేసి వెళ్ళిపోతే తనమీద ఇతరులు తెచ్చిన అభియోగాలు ఒప్పుకున్నట్టవుతుంది. సుశీల గతిఏమిటి? ఆమెకెన్నో ఆశలు చూపించి మళ్ళీ వదిలెయ్యడమా ? కాని చెయ్యని తప్పుకు శిక్ష అనుభవించడం ఎంత కష్టం.

చదువుకోనివారు, విజ్ఞాన విహీనులు, పామరులు, సంస్కారం లేనివారు, నలుగురిలో స్వేచ్ఛగా మెలగనివారు, స్త్రీ పురుషుల నిద్దరిని శంకాన్విత దృష్టితో చూస్తే వారిని చూసి జాలిపడవచ్చు. వారిని లెక్కచెయ్యకుండా ప్రవర్తించవచ్చు. పక్కింటి పాటి తనకు ఈ మగ స్నేహితులతో ప్రమేయమేమిటని తన్నడిగినప్పుడు శైలజ అందుకే

పట్టించుకోలేదు. ఆమెతో వాదించి ఆమెను ఒప్పించ డానికి ప్రయత్నించనూ లేదు. ఇంటి యజమాని అడిగితే ఏదో సమాధానం చెప్పింది. ఆయన అర్థం చేసుకోగలగ డంతో తనకు ఊరట కలిగింది. ఒకవేళ ఆయన అర్థం చేసుకోలేకపోయి ఇల్లు ఖాళీ చెయ్యమన్నా తను నిశ్చిం తగా ఖాళీచేసేసి ఆ విషయం మరెప్పుడూ ఆలోచించి ఉండేది కాదు. కారణం ఏమిటంటే వారు ఒకతరం వెనక వారు. సహజంగా వారి ఊహాలు ఒకతరం వెనకబడి ఉంటాయి. వాళ్ళకు ఇవన్నీ అనుభవంలో ఉండీ ఉండక పోవచ్చు. అందుచేత స్త్రీ పురుషులిద్దరు స్వేచ్ఛగా మెలగు తుంటే వారి సంబంధం పవిత్రం కాదని వారు అనుమా నించినా తా నర్థం చేసుకోగలదు. కాని తనలాంటి ఉపా ధ్యాయినులు, చదువుకున్నవారు తామూ పురుషులతో కలిసి విడిగా తిరిగేవారు ఇటువంటివి అనుభవంలో ఉన్న వారుకూడా పాతకాలపు వారిలాగే సంభాషించడం తాను సహించలేకపోయింది.

ప్రమదల జీవితం వాడికత్తిమీద నడకలాంటిది. ఏమాత్రం ప్రమత్తతతో ప్రవర్తించినా ప్రమాదానికి గురికాక తప్పదు. ఒక్కసారి తప్పటడుగు వేస్తేచాలు బ్రతుకు బండలై పోతుంది. సుశీల అమాయికంగా అతన్ని నమ్మినందుకు ఆమె జీవితం అగచాట్ల పాలయింది. ఖాన్ చెప్పినట్లు భర్తృ విసర్జిత అయిన వివాహితకూ, నమ్మి కున్నవాడు వదిలేసిన అవివాహితకూ చట్టం సంగతి వది

లేకపోతే మార్పేమిటి (పరిస్థితులలో)? కాని, నూటికి తొంభయి తొమ్మిది మంది ఈ సత్యాన్ని ఒప్పుకోలేరు. ఎవరిదాకానో ఎందుకు? ఖాన్ విప్పి చెప్పేదాకా తానే ఒప్పుకోలేకపోయింది. ఆడదానికి మగవాడే రక్ష. భర్తలేని స్త్రీకి సభ్య సమాజంలో విలువలేదు. వారి శీలం అశంకితంగా ఉండదు. నిజంగానే నానా అగచాట్లూ పడి వాంఛల నరికట్టి పవిత్రంగానే ఉన్నా వారి కాకీర్తికూడా దక్కదు. మండలికి తాను వెళ్ళే రోజులలో కూడా తనకెంత వ్యక్తిత్వపు హోదా అన్నా అక్షరం ముక్కరాని ఆఫీసర్ల భార్యలకే ఎక్కువ విలువ ఉండేది. వారే ఎక్కువ గౌరవం పొందగలిగి, నలుగురిమీద అధికారం చెలాయించగలిగే వారు.

తానుమాత్రం మానవాతీతురాలా? తనకు మాత్రం కోరికలూ, ఉద్దేశాలూ, వాంఛలూ లేవూ? తనుకూడా ఏ విధి వశాన అయినా వాంఛకు లొంగిపోతే నుక్కిలకు పట్టినగతే పడుతుంది. ఎవరూ ఆదరించరు, క్షమించరు. అందరూ నిరసిస్తారు. బంధువులు, తల్లిదండ్రులు, ఆఖరికి స్నేహితులూ కూడా విసర్జిస్తారు. కుక్కకంటె హీనమయిపోతుంది బతుకు. ఈ ఊహ వచ్చేసరికి శైలజ గుండె ఝులుమంది.

మానవులు సంఘ జీవులు. నలుగురితో చెప్పుకుని తప్ప వినోదంగాని విషాదంగాని అనుభవించలేరు. ఇతరుల మీద ఏదో విధంగా ఆధారపడక తప్పదు. సంఘంలో

ఇతరులమీద ఆధారపడాలంటే వారి కట్టుబాట్లకు, నీతి నియమాలకు, యితర సాంఘికాచారాలకు కట్టుబడాలి. వాటినుంచి తప్పుకుందుకు ప్రయత్నించి లాభంలేదు. కనీసం మరొకరి అండలేకుండా అపని చెయ్య ప్రయత్నించడం అపాయం. మగనాలికి మొగుడి అండ ఉంటుంది. లోకంలోని కొన్ని ఆచారాలను ప్రతిఘటించినా కనీసం పెళ్ళి అనేది ఎవర్నో ఒకర్ని చేసుకుంటే, ఆ చేసుకున్న వాడి ఆధారంతో ఎంతైనా సాధించవచ్చు.

సంఘంలో సౌఖ్యంగా బతకాలంటే పెళ్ళాడి తీరాలి.

ఎవర్ని చేసుకోవడం? ఎటువంటివాడిని చేసుకోవడం?

ధర్మశాస్త్రాల ప్రకారం అయితే తలిదండ్రులు కుదిర్చిన ఒక ముక్కు మొగం ఎరుగనివాణ్ణి చేసుకుని, వాడి కోసం తన స్వతంత్ర భావాలకు స్వస్తిచెప్పి వాడు సంతోషిస్తే తనూ సంతోషించినా సంతోషించకపోయినా సంతసమే నటించి, వాడేడిస్తే తన కేడుపు రాకపోయినా ఏడుపు నటించి, వాడి సంసారానికీ సంతానానికీ బానిస అయిపోవడం. తను నలుగురితో స్వేచ్ఛగా మెలిగినా చనువుగా పలకరించినా వాడు పడ్చి అంతు పెట్టడం, వాడూ తనూ పోట్లాడుకోవడం, ఆపైన బతుకంతా నరకం కావడం. వా డెటువంటివాడో, వాడి భావా

దండ్రులు చెప్పారు కదా' అని పుస్తె కట్టించుకుని తన స్వాతంత్ర్యాన్ని త్యజించదు.

తన కులంవాడే అయి, తలిదండ్రులకు నచ్చి తనకు నచ్చకపోవచ్చు. ఒకవేళ అన్నీ కుదిరినా దానికోసం పెద్ద ప్రయత్నం జరపడం తనకు కిట్టదు. కులమత భేదాలు తన కెప్పుడూ నచ్చలేదు. చిన్నప్పటినుంచి తన మిత్రులు, మిత్రురాండ్ర మధ్య ఈ ప్రశ్నరాలేదు. తను అటువంటి అడ్డులు పెట్టుకుని మెలగలేదు. కులమతాలకు అతీతంగా ఉండి మానవత్వాన్నే ప్రధానంగా ఎంచడం తన అభిమతం. సరోజినికి తనిచ్చిన సలహాకూడా అంతే—ధైర్యం ఉంటే పెళ్ళి చేసుకోమని. పిచ్చిదానికి ధైర్యం లేకపోయింది. ధైర్యంచేసి చేసుకుంటే తీరా కన్నవారు కాదంటారా? అవినీతి ప్రవర్తన గర్హించవచ్చుకాని చట్టబద్ధంగా ఎవర్నో ఒకర్ని కట్టుకున్నప్పుడు వాళ్ళకూ అంతబాధ ఉండదు. ఒకవేళ మొదట్లో ఉన్నా రానురాను తగ్గిపోతుంది.

కాని సరోజిని ప్రేమ ప్రేమంటూ ప్రేలాడింది. తనకు ప్రేమ తత్వమే అర్థంకాదు. ఇన్నాళ్ళ అనుభవంలో తానెంత మంది పురుషుల మధ్యనో మెలిగింది. ఒకరిద్దరు అతి సన్నిహితంగా కూడా వచ్చారు. కాని వారిని తాను (నలుగురు అనే ప్రేమ) ప్రేమించానని చెప్పలేను. ఫలానా వాడిని పెళ్ళి చేసుకోకపోతే చచ్చిపోవాలని తన కెప్పుడూ

కాని తను పెళ్ళిచేసుకొంటే. తనను పూర్తిగా అర్థం చేసుకొని తన భావాలతో ఏకీభవించి తనబలహీన తలను క్షమించగలవాడిని మాత్రమే చేసుకోగలదు. విశాల హృదయం కలిగినవాడై ఉండాలి.

ఇవన్నీ కలవాడుగా తనకు కనిపించేవాడు ఖాన్ ఒక్కడే !

ఎవరితోనైతే తనకు సంబంధం ఉంటుందని ప్రజలు ఊహిస్తున్నారో ఆ వ్యక్తే !

ఎంత విశాల హృదయుడు కాకపోతే సుశీల పరిస్థితిని అర్థం చేసుకోగలుగుతాడు ! ఎంత విజ్ఞానం ఉంది అతనిలో. అంతమాత్రాన అతను మానవతీతుడా ? కాడు. ఆమాటకు వస్తే తనలోనే ఎన్నో బలహీనతలు ఉన్నాయి.

తాను రాజేశ్వరిని అడిగింది—సుధాకరం మారడనేమిటి అని. ఖాన్ మారడనేమిటి ?

తనదాకా రాగానే తట్టింది శైలజకు సమాధానం. ఎవరికైనా అంతే. ఇతరులను గురించి మాట్లాడేటప్పుడు ఉండే ఆలోచనలకూ తమకై ఆలోచించేటప్పుడు ఉండే ఆలోచనలకూ సంబంధం ఉండదు. ఒకడు బ్యాంకులో వందరూపాయలు ఉంచుకుని ఎవరైనా అప్పడిగితే లేదంటే అతను స్వార్థమూర్తిలా కనబడుతాడు. కాని అదే పరిస్థితిలో ఇతరులు ఉంటే సవాలక్ష కారణాలు చెప్పగలడు—సమంజసంగా ఉన్నా లేకపోయినా.

భావిలో ఎలా ఉంటుందో అనే ఊహించుకుంటూ కూర్చుంటే ఎలా సాగుతుంది ? మార్పులకు తట్టుకుని తదనుగుణంగా మెలగాలిగాని, మార్పే లేకపోతే జీవితం విసుగెత్తిపోదూ ? ప్రపంచం ముందుకు సాగగలదా ? ఖాన్‌తో పరిచయానికి ముందుకన్నా ఆ తరువాతనే తనలోనే ఎన్నిమార్పులో వచ్చాయి. చదుకునే రోజులకూ ఇప్పటికీ తన భావాలెంతగానో మారిపోయాయి. అంత దాకా ఎందుకు ? మొన్నటికీ, నిన్నటికీ యోజనాల వ్యత్యాసం ఉంది. ఇంత అనిశ్చితమైన వాటికి స్థిరత్వం ఊహించడం ఏమిటి ?

ఖాన్‌లాంటి విశాలహృదయునితో ఒకవేళ నిజంగానే తగువు వచ్చినా సర్దుకుపోవచ్చు. లేదా ముఖాముఖి నిష్కర్షగా తేల్చేసుకుని స్నేహితులుగానైనా విడిపోవచ్చు.

మర్నాటికికూడా శైలజ మామూలు మనిషి కాలేకపోయింది. ఆవాళ కాలేజీకి సెలవు పెట్టింది. సాయంత్రం ఖాన్‌కు అన్ని సంగతులూ చెప్పి అతన్ని సూటిగా ప్రశ్నించాలని నిశ్చయించుకుంది. 'అతను కాదంటే !' అనే ఆలోచన ఆమెకు తట్టలేదు.

సాయంకాలం ఖాన్ ఇంటికి వెళ్ళింది శైలజ. చక్కని ఆవరణలో చిన్న బంగాళా ప్రత్యేకంగా తీసుకున్నాడు ఖాన్. పూల మొక్కలూ పాటితో కనువిందుగా ఉంది ఆవరణ. ఖాన్‌కు మంచి అభిరుచి ఉంది.

మెట్లు ఎక్కుతున్న శైలజకు అపూర్వమైన వీణా

గానం వినిపించి స్తంభితురాలైంది. ఎవరింత గొప్పగా వీణ వాయిస్తుంట! సాయంకాలం ఈపాటప్పుడు రేడియోలో ఇటువంటి కార్యక్రమాలు ఉండవే? తనను చూసిన నౌకరు నమస్కరించి అయ్యగారితో చెపుతానని లోపలికి వెళ్ళిపోబోతుంటే ఆపి, వీణ వాయించే దెవరని అడిగింది అయ్యగారు సాధన చేసుకుంటున్నా రన్నాడు. శైలజకు మతిపోయింది. ఇన్నాళ్ళ పరిచయంలో ఖానింత అమోఘమైన వైణికుడని తనకు తెలియలేదు. అలలమీద తేల్చేస్తూంది ఆ ధ్వని.

వీధిలో జోళ్ళు విడిచేసి అడుగుల సవ్వడి వినబడకుండా తేల్చి తేల్చి అడుగులు వేస్తూ ఖాన్ ఉన్నగదిలోకి వెళ్ళింది.

అనిర్వచనీయమైన తన్మయతతో కళ్ళు మూసుకుని వీణ మీటుతున్నాడు ఖాన్. హృదయాన్ని సమ్మోహితం చేసే మోహనరాగం ఆలాపిస్తున్నాడు. ఆ రాగ మాధుర్యంతో ఆ గదంతా ప్రతిధ్వనిస్తూంది.

శైలజ రాకను ఖాన్ గుర్తించలేదు. ఆమెకూడా పలకరించకుండా, అతనికి కనబడకుండా ఉండేలాగ అతనికి వెనకవేపు కిటికీ దగ్గర ఉన్న కుర్చీలో కూర్చుంది. అది వింటూంటే ఆమె బాధలు మరచిపోయింది. మనస్సెంతో చల్లగా అనిపించింది.

అయిదు నిమిషాల అనంతరం ఆ రాగం పూర్తి చేసి ఇంకేం వాయిద్దామా అని ఆలోచిస్తున్న ఖాన్‌కు ఆ

గదిలో ఎవరో ఉన్నట్టు అయి నలుమూలలనా పరికించాడు. శైలజ కనిపించింది. పాట ఆగిపోవడంతో ఆమె కూడా ఉలిక్కిపడి ఇటు తిరిగింది. ఆమెను చూసి ఖాన్ పట్టుబడి పోయిన వాడిలా అయ్యాడు.

"మీరింత వైణికులని నాతో ఎన్నడూ చెప్పలేదే!" ఎందుకు చెప్పలేదూ అని నిష్ఠూరం ఆడినట్లు అంది శైలజ.

"ఏమీ రానివాణ్ణి ఏమని గొప్ప చెప్పుకోను?" ఇంతకీ ఎంతసేపైంది వచ్చి?" చిరునవ్వుతో అడిగాడు ఖాన్. అరగంటనుంచి అతనికి ఈ ప్రపంచపు ఉనికే గుర్తు లేదు. ఈ లోపునే గుట్టు చప్పుడు కాకుండా ఇల్లు దోచుకోగల దొంగ ఎవరైనా నిక్షేపంలా ఆ పని చేసినా ఖాన్‌కు తెలిసి ఉండదు. అతిథిని ఎక్కువసేపు ఊరికే కూర్చోపెట్టానా అని బాధ పడ్డాడు ఖాన్.

"ఇప్పుడేలెండి వస్త. నే నెప్పుడూ అంటుంటాను వినయం, సద్గుణమే అయినా అతివినయం మాత్రం ధూర్త లక్షణం అని" పెదిమలు బిగపట్టి నవ్వుతూ రెండవ ప్రశ్నకు మొదటా, మొదటి విషయానికి తరువాతా సమాధానం చెప్పింది శైలజ.

"అయితే నేను ధూర్తుడ నంటారు ఎంత ధైర్యం!"

"ఆ మాట అనందే నేను?" భయంతో వణికి పోయింది శైలజ.

"అవును. ఆ మాట మాత్రం అనలేదు" అని ఖాన్ శైలజకేసి పరిశీలనగా చూశాడు. పదిహేను రోజుల క్రితం

చూడడమే. మళ్ళీ తాను ఆమెను చూడలేదు. అప్పటికీ, ఇప్పటికీ ఎంతో తగ్గిపోయినట్లనిపించిందామె. సుశీల సంఘటన ప్రభావం ఇంకా వదల్లేదు గాబోలనుకున్నాడు ఖాన్.

శైలజ మామూలుగానే ఉండాలని ప్రయత్నించింది. కాని అత్యంత మనోవేదన ఆమె ముఖంలో ముద్రవేసుకునే ఉంది. మానసికంగా బాగా క్షీణించినట్టే కనిపిస్తూందామె.

"క్రితం చూచినప్పటికీ, ఇప్పటికీ మీలో ఇంత మార్పెందుకు వచ్చింది? సుశీల విషయమే అదేపనిగా ఆలోచిస్తున్నారా? లేక మళ్ళీ గొడవలేమైనా వచ్చాయా?"

"పెద్ద గొడవలేం లేవుగాని మీతో ఒక ముఖ్య విషయం చర్చించాలని వచ్చాను" ప్రశ్నార్థకంగా ఖాన్ ముఖంలోకి చూస్తూ అంది శైలజ.

"కానివ్వండి" అన్నాడు ఖాన్, తాను వినడానికి సిద్ధంగా ఉన్నట్లు సూచిస్తూ.

శైలజ వివరించి చెప్పింది.

ఖాన్ ముఖం మలినమైంది.

"లోకపు తీరే అంత! మీరు పట్టించుకోకూడదు. కాని నా మూలంగా మీరు నిందలపాలయ్యారని నాకు బాధగా ఉంది" అన్నాడు ఖాన్. బాధ సానుభూతి వ్యక్తం చేస్తూ.

రెండు నిమిషాలు మౌనంగా గడిచాయి వారి మధ్య.

శైలజ పని ఇరకాటకంగా తయారైంది. ఖాన్‌ను ఎల్లా ప్రశ్నించడమా అన్నది తెగని సమస్యగా తోచింది. కాని అట్లో ముక్కో తేల్చుకోకుండా తాను త్రిశంకు స్వర్గంలో ఉండలేదు. అందుకే చప్పున భావాలను అదుపు లోకి తెచ్చుకుని తన్ను తాను సంబాళించుకుంది.

"నేను ఒక ప్రశ్న అడుగుతాను. సూటిగా సమాధానం చెప్తారా ?" పరీక్షగా ఖాన్ వదనంకేసి చూస్తూ అడిగింది.

"నిశ్చయంగా" అన్నాడు ఖాన్ నిదానంగా.

"అన్యథా భావించరు కదా ?" అనుమానిస్తూ అడిగింది.

ఆ ప్రశ్న ఖాన్‌కు నవ్వు తెప్పించింది. అసలు చెప్ప కుండానే ఏమీ అనుకోవద్దంటే ఎలా ?

"అనుకునేదీ, అనుకోనిదీ ముందే ఎల్లా చెప్పగలను? మీ ప్రశ్న నామీద ఏదో ఒక ప్రభావం చూపిస్తుందిగా? పోతే, మీమీద కోపగించుకోవడం మాత్రం ఉండదు, అదే మీ భావమైతే" నవ్వుతూ అన్నాడు ఖాన్.

అతనంత నిస్సంకోచంగా ఉండడం శైలజకు ధైర్యం ఇచ్చింది.

"నన్ను మీరు పెళ్ళిచేసుకుంటారా ?"నిర్వికారంగా అడుగుదామనుకున్నా అణుచుకోలేని సిగ్గు ముంచెత్తడం వల్ల ఆమె ముఖం అరుణిమ దాల్చింది.

ఆ ప్రశ్న అతను ఊహించినది కాకపోవడంవల్ల అత నెంతో ఆశ్చర్యపోతాడని అనుకున్న శైలజకు అతను ప్రదర్శించిన స్థైర్యం ఆశ్చర్యం గొల్పింది.

"ఆలోచించిగాని చెప్పలేను" అన్నాడు ఖాన్. అతని గొంతుకలోగాని, ముఖంలోగాని మార్పు లేదు.

"ఆలోచించే చెప్పండి. నేనూ మా విశ్వం అన్నయ్యకి రాసి అతని అనుమతి పొందిగాని నిశ్చయానికి రాలేను" అంది శైలజ.

తర్వాత ఇంటికి సంఘటన జరగనట్లే ఇద్దరూ ఇతర విషయాలు ప్రస్తావించడంలో నిమగ్నులయ్యారు.

ఖాన్ ప్రదర్శించిన నిశ్చలతకు ముగ్ధురాలైంది శైలజ. వెంటనే మాటివ్వకపోవడం ఒక చెంపను బాధించినా, అతని ప్రవర్తన అలా ఉండడమే తనకు నచ్చింది. నిజంగానే అతను వెంటనే ఒప్పుకుని ఉన్నట్లయితే అతను ఇంతకాలమూ దానికై మాత్రమే ఎదురు చూస్తున్నాడా కొంపదీసి అని తనే అనుమానించి ఉండును. తనకన్న సావధానంగా ఆలోచించగలిగినవాడూ, స్థిరత్వంకలిగిన వాడూ, తన నర్థం చేసుకోగలిగినవాడూ అత నొక్కడే.

అర్థరాత్రి టేబుల్ లైటు వెలిగింది. రైటింగ్ పాడ్, పెన్నుతీసి విశ్వానికి ఒక పెద్ద ఉత్తరం వ్రాసింది శైలజ. సుశీల కథ మొదలు, నాటివరకు జరిగిన సంగతు

లన్నిటితో బాటు తన ఆత్మ సంఘర్షణ కూడా ఇరికించింది ఉత్తరంలో.

*                *                *

"సార్ పోస్ట్ !" అనే కేకతో కవ రొకటి పడవేసి వెళ్ళిపోయాడు పోస్ట్‌మన్.

గబుక్కున లేచివెళ్ళి బరువుగా ఉన్న కవరొకటి క్రిందనుంచి తీసింది అనూరాధ. శైలు దగ్గరినుంచి! విశ్వం పేర ఉంది. పేపరు చదువుతున్న విశ్వానికి అందించి మౌనంగా కుర్చీ వెనకాల నిలబడింది అనూరాధ.

శైలజ దస్తూరీ చూడగానే పేపరు అవతల పడవేసి గబగబ ఉత్తరం చింపాడు విశ్వం. అంత బరువుగా ఉన్న కవరు అతని ఆతృతను ఇనుమడింపజేసింది.

మొదటి నాలుగు వాక్యాలే అతని మనసును పూర్తిగా ఆకట్టుకున్నాయి.

ఉత్తరం పూర్తిచేసేవేళకు అతని భుజం మీదకు వంగి తను కూడా ఉత్తరం చదువుతున్న అనూరాధ బిగ పట్టిన ఊపిరి ఒక్కసారి విడిచింది.

అంతసేపూ ఆమె ఉనికినే గుర్తించని విశ్వం ఉలిక్కిపడి ఆమె దిక్కు తిరిగాడు. భావశూన్యంగా కన బడిన ఆమె ముఖం వెనుక మనస్సులో ఏముందో గ్రహించ లేక తికమక పడ్డాడు.

"నువ్వు వచ్చినట్టే తెలియదే!" ఆశ్చర్యపడ్డాడు విశ్వం.

"తెలీదా! మరిచిపోయుంటారు. నేనేగా ఉత్తరం మీ కందిస్తే!"

"నిజం?"

"భలే! నే నడగవలసిన ప్రశ్న మీరు వేస్తున్నారు."

"కాదు రాధా! నిజంగా నువ్విప్పు డంటుంటే తెలుస్తోంది. కాని ఇంత సేపూ నే నేదో సమాధిలో ఉన్నట్టుంది. ముందు జరిగిన విషయాలేవీ గుర్తు లేవు. అయితే అంతా చదివావా?"

"ఆ!"

"ఏమి రాయమంటావ్! కాని ఎన్నిమాటలు నేర్చింది!"

"మీకు తెలియాలి ఏం రాయాలో. మీరు, మీ చెల్లెలు. నాకేం తెలుస్తుంది?"

"నీ కిష్టం లేనట్టుందే చూస్తే?"

"నా ఇష్టానికేంగాని మీ ఇష్టం చెబుదురూ."

"అంత తేలిగ్గా చెప్పగల బుద్ధి భగవంతుడు నాకు ప్రసాదించలేదు" అన్నాడు విశ్వం నవ్వుతూ.

దానితో వాతావరణం కొంచెం మార్పు చెందింది. గంభీరంగా ఉన్న అనూరాధ ముఖంలో కూడా మంద హాసం తొణికింది.

"ఇప్పటికి లోకం మరమ్మతుతో తనకు కలిగిన

అనుభవాలు చాలకనా ఈ కొత్తది! కష్టాలు కోరి తెచ్చు కుంటుందేం ఖర్మ!" నిట్టూర్చింది అనూరాధ.

"కష్టా లనుభవించడంలోనే ఉన్నతి ఉందనీ, ఇతరుల కోసం గాని, తను నమ్మిన సత్యాలను ఆచరించడం కోసం గాని. కష్టాలను లెక్క చెయ్యకూడదని గాని కొందరనుకుంటారు. దానికి నాకేం బాధలేదు గాని ఈ సమస్య పరిష్కారానికి నా మాట గీటురాయిగా పెట్టుకోవడంతో నాకో సమస్య తెచ్చిపెట్టింది. నల్లంచు తెల్లచీర కొనుక్కోనా. పచ్చంచు ఎర్రచీర కొనుక్కోనా అంటే చెప్పవచ్చు తేలిగ్గా ఏదో ఒకటి. కారణం దానివల్ల ఏమీ ప్రమాదం జరక్కపోవడమే. కాని ఈవిషయం వేరు."

"అయితే మీకూ ఇష్టం లేదన్నమాట!"

"అంటే ఆ 'మీకూ'లో నువ్వూ ఉన్నావన్నమాట!"

"పరిహాసాల కేంగాని నా మన స్సెందుకో అంగీకరించడంలేదు. తా ననుకున్నది తీరా ఆమె సాధించలేక పోతే మన మతంలోంచి వెలి అయి చుట్టాలకు దూరం కావడం తప్ప కలిగే ప్రయోజనమేమిటి ?"

"అంతా అలా అని ముడుచుక్కూచుంటే సమాజానికి పురోభివృద్ధి ఎక్కడినుంచి వస్తుంది? ఇటువంటివి జరగవలసిందే. మతాంతర వివాహాలు, వర్ణాంతర వివాహాలు ప్రోత్సహించదగినవే. వాటిలోని కష్టాలను ఎదుర్కోవడంలోనే ఆనందముంది. కాని నా ఊహాలు అటు పోలేదు.

ఆమె ఏ ఆదర్శంకోసం అయితే ఈ వివాహం తలపెట్టిందో అది మతాంతర వర్ణాంతర సమస్యకాదు. తన భావాలతో ఏకీభవించి, తనవల్ల సుఖంపొంది, తన్ను సుఖపెట్టగల వ్యక్తిని ఎన్నుకోవడం. ఆ పని అంత తేలిక కాదు. అందులోనూ ఆచార వ్యవహారాలలోను, మత విషయాలలోనూ పురాతన సంస్కారాలు ఇంకా పూర్తిగా వదలని మనలో మరీ కష్టం. అంతేకాక ఖాన్‌తో ఆమెకు గల పరిచయం కొద్ది. ఇంతలోకే ఒక నిశ్చయానికి వచ్చిందంటే నాకు బాధగా ఉంది. ఎన్నో ఏళ్ళు కలిసిమెలిసి తిరిగిన వారిలోనే ఏకీభావం కుదరకు చీలికలు వస్తుంటాయి. అటువంటిది దైనిక వ్యవహారాలలోను, ఆహారాది కృత్యాలలోను వైరుధ్యం కలిగిన వ్యక్తిలో ఏకీభావం కావాలనడం వింతగా ఉంది ఇట్టువంటి పరిస్థితులలో బాధ్యత అంతా నామీదకునెట్టి "నీ మాటమీద ఆధారపడి ఉంది అంతా" అంటే నా గుండెలు బరువెక్కుతున్నాయి.

"అదే కాదు. తామిద్దరిలోను అభిప్రాయ భేదాలు వస్తే స్నేహితులుగానే విడిపోదలుచుకున్నట్టు రాసిందే, అంత మూడునాళ్ళ ముచ్చటకు ఈ తిప్పలన్నీ ఎందుకంట! కష్టాలు వస్తే సానుభూతి ఆశించడం మానవ లక్షణం. అందుకనే మనం సమాజమో అని గోలపెడతాం. కాని ఈమె పరిస్థితులలో సానుభూతి చూపించడానికి బదులు శాస్తి జరిగిందని సంతోషిస్తారంతా. ఎంత ధైర్యం ఉన్నా అప్పుడు నిలదొక్కుకోవడం ఎంతకష్టం! మన చాటున

గుసగుసలు పోగుతున్నాయని తెలిస్తే ఎంత బాధ పడతాం. సుశీల విషయంలోనే తనంత బాధ పడిందని రాసిందే అటు వంటివి అంతకంటె పెద్ద సమస్యలు తన్నెదుర్కొంటే ఆద రించి ధైర్యం చెప్పేవారు లేక ఎంత అవస్థపడి అధైర్యం పాలవుతుంది ?"

"మీ మీద పెట్టిన బాధ్యతను మీరు ఆలోచించి నిర్వహించండి. ప్రియవాక్కు కోసం హిత వాక్యాన్ని వది లెయ్యకండి. గట్టిగా రాయండి" అన్న అనూరాధ మాట లలో ఆందోళన వ్యక్తం అయింది.

"ఆ మాట రాయడం అంత తేలిక కాదు రాధా!"

"ఏం ?"

"నువ్వూ అందరిలాగే ఆలోచిస్తున్నావు"

"అంటే ?"

"తనకు నచ్చిన ఆదర్శాలను తను నమ్మిన వ్యక్తి బలపరచాలని ఉంటుంది ప్రతి వ్యక్తికీ. నువ్వే కొన్ని అద ర్శాలను దృష్టిలో ఉంచుకుని ఒక కథ రాసి నా దగ్గరకు తీసుకువచ్చా వనుకో. అంతేకాక నీతో నే నేకీభవిస్తానని, నిన్నభినందిస్తానని పూర్తిగా నమ్మావనుకో. ఆ కథలో నాకు నచ్చని భావాలను నీవు సకారణంగా విశదీకరించి నా చేత ఒప్పించాలని చూస్తావు. అది మనుష్యుల ప్రకృతి. అప్పటికీ నాకు నచ్చకపోతే నేను మొండిగా వాదిస్తున్నా ననుకుంటావు గాని, నాతో ఏకీభవించలేవు. అంతేకాక నీకు నామీద కోపంగూడా వస్తుంది. అప్పటికీ నీవు నమ్మిన

ఆదర్శాలు అందంగాను, అనుభవ పూర్వకంగానే కనబడతాయి. నిన్ను వ్యతిరేకించి నీతో పేచీ తెచ్చుకోవడం కంటె నిన్ను బలపరచడమే మంచిది."

"అందుకని ఆత్మవంచన చేసుకుంటారా ? అంతకంటె ఎక్కువది చూస్తూ చెల్లెల్ని మునిగిపోనిస్తారా ? ఇదేనా మీ గొప్పతనం ?"

"చూశావా రాధా! అప్పుడే నీకు కోపం వచ్చింది, నీతో ఏకీభవించలేక పోయానని!"

"మీ రక్కడే పొరబడుతున్నారు. నా కోప తాపాలకు గాని, నా తర్కానికి గాని మీరు విలువ ఇవ్వాలని కాదు నే ననేది. ఆవేశంలో ఆదర్శాలంటూ ఏదో అనాలోచితంగా చేసి అనుభవంలోకి వచ్చినతర్వాత చేతులు కాల్చుకున్నాక ఆకులు పట్టుకున్నట్టవు తుంది. ఇంతకు ముందే అవి ఊహించిన మీరు చూస్తూ ఊరుకుంటారా ?"

"అంతకన్న ఏమీ చెయ్యలేం రాధా ! తప్పుచేసి అనుభవంలోకి వచ్చిన తరువాతే అవి తప్పని తెలుస్తుంది. తరువాత నిగ్రహించుకో గలగడంలోనే ఉంది ఉన్నతి అంతా. తప్పులు చెయ్యకుండా ఉండడానికి మనం మానవాతీతులం కాదు. ఒకరి తప్పులు ఎంచడానికి మనం ఎంతవాళ్ళం? తప్పుచేసి అనుభవించి ఆ భ్రమ వీడిపోయే వరకు దానికి స్థిరత్వం, మాధుర్యం ఉంటూనే ఉంటాయి. తరువాతే తెలుస్తుంది అదంతా మిథ్యేనని. కాని ఆ కాలానికి స్థిరత్వం ఎక్కడికి పోతుంది? శైలు తన ఉత్తరంలో

నా సమ్మతి తనకి వేదవాక్కనీ. ఇష్టం లేకపోతే నిశ్చయంగా వ్యక్తం చెయ్యమనీ రాసింది. అంతమాత్రాన ఆమె ఆశించేది నా దగ్గరనుండి నా అసమ్మతి కాదు. తను నమ్మిన భావాలకు నా సమర్థన. ఎన్ని చక్కని వ్యాఖ్యానాలు చెప్పింది! అవన్నీ ఎంత యదార్థాలుగా కనబడుతున్నాయి! అందులో ఒక్కటి మనం పూర్వపక్షం చెయ్యగలమా? అంతేకాదు ఆమె నమ్మిన వాటిని పెకలించి నా నమ్మకాలను (వాటికి మాత్రం స్థిరత్వం ఏదీ?) ఆమెమీద రుద్దడం నా కిష్టంలేదు. తను ఎంతో తర్కంతో నిర్మించుకున్న భావాలు పునాదితోపాటు కూలిపోతే ఎంత స్థైర్యం గల మానవుడైనా తట్టుకోలేడు."

"అందుకని అంగీకరిస్తారా? భ్రమ తొలగిపోతే సాక్షాత్కరించేది మనకి నచ్చినా, నచ్చకపోయినా ఒక్కటే అది ఫలితం...."

"అంతమాత్రాన రాత్రికి మిగిలేది చీకటేనని పగలంతా నిరాశగా గడుపుతావా? వచ్చే చీకటి ఎటూ రాక మానదు. మొదటినుంచీ దాన్నిగురించే ఆలోచిస్తూ ఉంటే నిరాశ మాత్రమే మిగులుతుంది. అసలు జీవితమే క్షణికం. అందులో ఘట్టాలంటావా? క్షణంలో సహస్రాంశాలు."

"అయితే అంగీకారం పంపిస్తారన్నమాట!"

"తప్పదు రాధా! అనవసరంగా మనస్సు పాడుచేసుకోకు. ఇంతకీ మనం కాదన్న మాత్రాన ఆగిపోవాలా ఆమె? అలా అనుకోవడం ఎంత తప్పు? కాదని రాసివేసి

చేతులు దులుపుకుని కూర్చుంటామా ? ఒకవేళ ఆమె మన మాట వినక తరువాత ఫలితం విపరీతంగా ఉంటే అప్పుడు, "నేను ముందే చెపితే విన్నావా ?" అనడానికా మనం ఉన్నది? కాని నేను కర్తవ్యం అని అనుకునే పని ఒక్కటి మాత్రం చేస్తాను. అవసరం అయితే ఇంత సులభంగానూ విడిపోగల ధైర్యం ఉంటేనే ఈ పనికి ఒప్పుకో మంటాను."

"మీతో వాదించి ఎవడు నెగ్గాడు లెండి! ఇంతకూ ఆమె రాసినట్టు ఆమె కివన్నీ నేర్పింది మీరేగా ?"

"మొత్తానికి నేనే సంటావు అన్నింటికీ కారణం?"

"దానికేంగాని అత్తయ్య కేమని చెప్తారు ? ఆవిడ ఎంత బాధపడతారో!"

"చూస్తావుగా?"

అనూరాధ, విశ్వం లోపలికి వెళ్ళారు.

వంట వండుతున్న శాంతమ్మగారితో విశ్వం అన్నాడు-"అమ్మా, శైలు ఉత్తరం రాసింది" అని.

"ఏమని రాసింది ?" అడిగింది శాంతమ్మ గారు ముఖంలో దీప్తితో.

"కూతురు కూడని పని చేస్తూందని నువ్వంటావో లేదో కనుక్కోమంది" అనూరాధకు కనుసైగ చేస్తూ అన్నాడు విశ్వం, తల్లితో.

"ఇంతకీ ఏం చేసిందని?"

"ఇంకా చెయ్యలేదు. చెయ్యబోతున్నది."

"చెప్పరా చంపక!" విసుక్కుంది శాంతమ్మగారు.

"ఖాన్ని పెళ్ళి చేసుకుంటుందట!"

"ఎవర్ని!" సందిగ్ధంగా అడిగింది.

"అప్పుడు చెప్పలేదూ ? అమీర్ ఖాన్ అనీ. ఆయన్ని" అన్నాడు విశ్వం.

"ఆఁ !" అన్న శాంతమ్మగారి ముఖంలో రంగు రవ్వంత తగ్గింది. వెంటనే తేరుకుని, "అయినా ఈ చదువు కున్న పిల్లల కేం చెప్పగలం ? ఏది ఏమయినా అది నా కూతురు కాకపోయిందీ!" అంది శాంతమ్మగారు.

విశ్వం నవ్వాడు.

తేరుకోలేక ప్రమాన్పడిపోయినది అనూరాధ ఒక్కతే. అత్తగారి సంస్కారం మరోక్కసారి తన్ను వేలెత్తి చూపి నట్టయింది.

*          *          *

ప్రిన్సిపాలుతోను, తక్కిన సహ ఉపాధ్యాయినుల తోను తగాదాపడి మరునాడు సెలవు పెట్టిన శైలజ ఆ పట్టు పట్టు పది రోజులు సెలవు పొడిగించింది.

ఆనాటి సంఘటన శైలజను కదిపిందనీ, అందు కే సెలవు పెట్టిందనీ, బహుశా ఇంక శైలజ రాజీనామా ఇస్తుందనీ సంతోషించారు వారంతా. ఏళ్ళనుండి పాతుకు పోయిన తమకు లేని గౌరవం, ఆధిక్యం పది నెలల క్రితం వచ్చిన శైలజ పొందడం వారికి కొన్నమూ సచ్చలేదు. ఇది

కాక శైలజ సంశయం లేకుండా ఎంతమాటైనా, ఎవరైనా నిలబెట్టే అడిగేస్తుంది. అది వారికి మరింత కంటగింపుగా ఉండేది. అందుచేత శైలజ నిష్క్రమించవచ్చనే భావం వారికి సంతోషాన్నే చేకూర్చింది.

విశ్వానికి ఉత్తరం వ్రాసిన మరునాటినుంచే ఏ రోజు కారోజు జవాబుకోసం ఎదురుచూడసాగింది శైలజ. ఏదో ఒకటి తేల్చుకోకుండా ఆమె కాలేజి ముఖం చూడ దలచుకోకే ఆమె సెలవు పొడిగించింది.

విశ్వం దగ్గరనుండి సమాధానం వచ్చింది. అనూ రాధతో చెప్పినట్టే - "తలుచుకుంటే తేలిగ్గా విడిపోగల ధైర్యం ఉంటేనే ఇందుకు అంగీకరించ" మని వ్రాశాడు విశ్వం.

శైలజ ఆ ఉత్తరానికి అర్థం అంగీకారంగానే తీసు కుంది. అందులోని ప్రశ్నలకు ఆమె ప్రాధాన్యం ఇవ్వలేదు. దాని వెనుకనున్న అర్థాలను వెతకడానికామె ప్రయత్నిం చనూ లేదు.

మానవులలోని బలహీనతగాని, దౌర్బల్యం గాని అక్కడే ఉంది. ఒక పని చెయ్యదలచుకుని వాటి మంచి చెడ్డలను గురించి ఒకరి సలహా అపేక్షిస్తే, ఆ సలహాలో అంగీకారం, తమ భావాలతో సమైక్యం సూచనప్రాయంగా ఉన్నాసరే పూర్ణాంగీకారంగానే స్వీకరిస్తారు. దానిలోని అర్థాలను వెతకడానికిగాని, తర్కించడానికి గాని మనస్సు ఒప్పదు.

అన్న ప్రకారం ఖాన్ రెండు రోజులలోనే తన నిశ్చయాన్ని తెలియజేశాడు శైలజకు.

శైలజ ఆనందం అవధులు దాటింది.

ఈ వార్త విన్న తనతోటి అధ్యాపకురాండ్ర ముఖాలు ఎలా ఉంటాయో అని మహా ఉబలాట పడుతూ కాలేజీకి వెళ్ళింది.

శైలజ నిష్క్రమించ వచ్చుననే ఊహ కల్పించిన సంతోషాన్ని భగ్నం చెయ్యడమే కాకుండా మరింత ఆశ్చర్యంతో ముంచెత్తింది ఈ వార్త విన్నవారందరినీ. విధి లేక అభినందనలు తెలిపారు.

## 14

వేసవి సెలవులు ముగిశాయి. కాలేజీ తెరిచారు. ఎండలు విపరీతంగా కాసికాసి పగలంతా మ్రగ్గిపోయి, నానా అవస్థపడి వర్షపు చుక్క ఎప్పుడు పడుతుందా అని ఎదురు చూసినంత సేపు పట్టలేదు, వానలతో విసుగెత్తి పోవడానికి.

అనుకోదల్చుకుంటే ఎన్నయినా ఉంటాయి. ఏ కాలానికి ఆ కాలమే అల్లా అనిపిస్తుంది. నాలుగు రోజులు వర్షం కురిసేసరికి ఊరంతా బాడీ బురదలతోను, దోమల తోను నిండిపోయి, ఇంట్లోనుంచి అడుగు బయట పెట్టడానికి

కాలం, అనిపిస్తుంది. వళ్ళూ ఊళ్ళూ ఏకమై వరదలు ముంచుకు వచ్చి, గాలీ వానా వస్తేనూ అసలు చెప్పేదే ముందీ! వార్తాప్రసరణలూ, రైళ్ళ రాకపోకలూ కూడా ఆగిపోతాయి.

ఇది గడిచి చలికాలం వచ్చేసరికి, పొద్దున్నే చలికి జడిసి లేవలేకపోవడం, ముఖాలన్నీ బూడిద కొట్టుకుపోవడం! సాయంకాలం అయిదు గంటలకే చీకటి పడిపోవడం, ఇదెప్పుడు పోతుందా అనిపిస్తుంది.

మొత్తానికి ఎలా అయితేనేం చలివెనుకపట్టి ఎండలు కాయడం మొదలెట్టేసరికి అదీ భరించలేం. పైన నెత్తి, కింద కాళ్ళు మాడుతూ చెమటలు కక్కుకుంటూ వడ దెబ్బకు తాళలేకపోతే, అసలు ఎప్పటి కయినా ఈ కాలం మారడం అంటూ ఉంటుందా అనిపిస్తుంది.

ఇదీ మానవ ప్రకృతి.

జూలై గడిచి ఆగస్టులో పడేసరికి పరీక్షల వేడి అందుకుంది అనూరాధ, హైమలకు. వేళ్ళ మీద లెక్క పెడితే సరిగా ఆరునెలలు. గడిచిన రెండేళ్ళ కోర్సే ఎంత చదివినా తరగటంలేదు.

ఆనర్సు పరీక్షలలో ఒక ప్రత్యేకత ఉంది. జీవితం అంతలోను పరీక్షకు పూర్తిగా ఒక్కసారే కూర్చోవచ్చును దాని ఫలితంమీదే జీవితపు బాట ఆధారపడి ఉంటుంది. తప్పితే ఆ మూడేళ్ళ చదువూ వృథాయే. 'థర్డుక్లాస్' వచ్చినా నామ మాత్రమే తప్ప ప్రయోజనం ఉండదు ఎక్కువ. పోతే మానుకోవడానికి ఒక్క అవకాశం. ఒక

సారి పూనుకొని విధి వైపరీత్యంవల్ల రెండోమాటు పరీక్షకు వెళ్ళేవేళకు ఏజ్వరమో వచ్చినా ఈచదువంతా వృథాయే. ఇక విషయాలు చూస్తే అందులో ఆరోభాగంలో ప్రవేశం ఉందని నొక్కి చెప్పడానికి కనీసం ఆరేళ్ళు పడుతుంది. ఇటువంటి చదువుకు విద్యార్థులు సామాన్యంగా పూర్తిగా తమ శ్రద్ధ తాము తీసుకోవాలి గాని లెక్చెరర్లవల్ల కాదు.

ఇంత చదువులో విద్యార్థి మేధకంటె విసుగు విరామం లేకుండా చదువగలగడం ప్రాధాన్యం వహిస్తుంది. ఎంతబాగా బట్టీ బట్టగల సామర్థ్యముంటే, డిగ్రీ సంపాదించడంలో అంత ఉపయోగం ఉంటుంది. దీనికితోడు అదృష్టం కొంత. ఎంత చదివినా కొంత వదిలివెయ్యక తప్పదు. లేక అథమం పరీక్షలలో వస్తాయనుకునే భాగానికి ఇచ్చిన ప్రాముఖ్యం రావనుకునే వాటికి ఇవ్వడం కుదరదు. అదృష్టవశాత్తు ఏవో కొన్ని మాత్రమే చదువుకొనివెళ్ళి అందులోనివే పరీక్షలలో వస్తే అవి బాగా వ్రాసి, ఏటిపొడుగునా అంతా చదివి నానా తంటాలూ పడ్డవారికంటె పైస్థాయిలో ఉత్తీర్ణులు కావడానికి కూడా ఎక్కువ వీలే ఉంటుంది. బ్రతుకు నిర్ణయించేవి ఇటువంటి పరీక్షలు !

ఇక విద్యార్థుల దశ ఎల్లా ఉంటుందో చూడండి !!

ఒక ప్రశ్నపత్రం కర్మవశాత్తు పాడుచేస్తే దాని ప్రభావం అన్నిటిమీదా ప్రతిబింబిస్తుంది. పరీక్ష ఏమౌతుందోననే బెంగ, ఎంత చదివినా తరగని పుస్తకాలు, తనకెంత వచ్చినా ఏ తలనొప్పో వచ్చి ఆ మూడు గంటల

లోను బాగా రాయలేకపోతే ఆ మూడు గంటలే తన జీవితంలో కంచుగంటలా మ్రోగి జీవితాంతం జ్ఞప్తికి తెస్తుందనే ఒకచింతా, ఒకసారి తప్పితే బ్రతుకు గంగపాలౌతుందనే భయం, అన్నీకలసి ఆఖరు సంవత్సరం విద్యార్థులను వారి జీవితంలో ఒక ఏడాదిపాటు నీడను చూసి జడుసుకునేటంత పిరికివారిగా తయారు చేస్తాయి. మూడవసంవత్సరంలో చేరినప్పుడు అప్పుడప్పుడే మామూలు కళాశాలలు వదిలి విశ్వవిద్యాలయంలో అడుగిడిన గర్వం పీడిస్తుంది. అది పోను పోను తగ్గి ఆఖరు సంవత్సరంలో, "తెలివి యొకింత లేని యెడ దృప్తుడనై కరిభంగి సర్వమున్ తెలిసితి నంచు గర్వితమతిన్ విహరించితి తొల్లి" అనే సుభాషితాన్ని గుర్తుకు తెస్తుంది. రాత్రంతా చదవడం, నిద్రపోయిన నాలుగు గంటలలోను పరీక్ష రాస్తున్నట్టో, తప్పినట్టు ఫలితాలు వచ్చినట్టో, 'ఫస్ట్‌క్లాస్' వస్తుందనుకున్న వాడికి 'థర్డ్‌క్లాస్' వచ్చినట్టో ఇలాంటి తలాతోకా లేని కలలతో కొట్టుకుని ఉలిక్కిపడడం జరుగుతుంటాయి. నిద్ర ఆపుకోలేక సిగరెట్లకూ, టీకీ అలవాటుపడి ఆరోగ్యం చెడగొట్టుకోవడం కూడా సాధారణమే కొందరి విషయాలలో. జీవితంలో ఒక యుగంలా గడిచే సంవత్సరం ఇది. ఎంత చదివినా పరీక్షలు పూర్తయ్యేవరకు ఏమీ చెప్పలేరు ఎవరైనా. ఏ రోజు కారోజు ఇల్లా చదువుదామని కార్యక్రమం వేసుకోవడం, వృథా కావడం, విసిగి వేసారడం నిత్య సంఘటనలు. వీటికి కుటుంబవ్యథలు, ఆర్థిక బాధలు

తోడయ్యేవాళ్ళకు ఆ దేవుడు కూడా 'కాంట్ హెల్ప్' అనేస్తాడు. అంతకన్న నరకం ఇంకోటి లేదు.

ఇది ఈ చదువుల నిజస్వరూపం !

అనూరాధ, హైమ కలిసి చదవ నారంభించారు. పిల్లలకు చెప్పడంకోసం తయారుకావడంలో నైతేనేమి, వాళ్ళకు బోధిస్తూ కూర్చోవడంలో నైతేనేమి విశ్రాంతికి కావలసినంత పనికలిగేది. ఒక గంట వ్యవధి దొరికితే కులాసాగా గడిపే బదులు చదువులలో మునిగిపోయేవారు.

బాత్తిగా చదువులతో విసుగెత్తిపోతే ఏదో 'హస్కు' మొదలు పెట్టేవారు కాని వాళ్ళ మనస్సులమీద పరీక్షల భయం ఎంతగా నాటుకు పోయిందంటే- ఆ బాతాఖానీలో కూడా చదువులు గురించో, పరీక్షలను గురించో మాత్రమే ప్రతిబింబించేది.

మనస్సులమీద ఏదైతే తీవ్రంగా పనిచేస్తూ ఉంటుందో ఆ విషయం అంత సులభంగా ఆలోచించడం మానలేరు. స్వప్నావస్థలో కూడా తెలియకుండానే వాటిని గురించి ఆలోచన చేస్తూంటారు. అవే నిద్రలో కూడా కలల రూపంలో సాక్షాత్కరిస్తాయి.

కాలక్షేపానికి మొదలుపెట్టి చదువుల మీదికి తిరిగే వారి సంభాషణలు ఇల్లా ఉండేవి:

"నీపనే బాగుంది వదినా! పరీక్షలంటే ఏమీ బెంగలేనట్టు కనబడుతున్నావు. నాకు 'పానీయంబులు

(త్రావుచున్' పద్యంలోలాగ ప్రతి అవస్థలోను అవే మెదులుతున్నాయి మనస్సులో. ఈ నెలలు గడిచి ఎప్పటికి బయటపడతామో. ఫలితాన్ని గురించి ఆలోచించడానికే భయం వేస్తున్నది. ఎంత చదివినా నాకేమిటో విశ్వాసం రావడంలేదు." హైమ అనేది.

"బాగుందమ్మా! నా మనస్సులో లేదని నీకెల్లా తెలుస్తుంది?" నా పరీక్ష ఫలితం నా ఒక్కదానిమీదే కాకుండా ఆయనమీద, అత్తగారి మీద కూడా ప్రతిఫలిస్తుంది. చదవవలసింది చూస్తే హిందూమహాసముద్రం అంతుంది. ఇందులో ఎంత వదలగలమో తెలీదు. మనం చదివినదానిలో అర్థమం కొన్నయినా పరీక్షలలో వస్తాయని నమ్మకం కూడా లేకుండా పోతోంది. ఏం పరీక్షలో ఏమో!" అనేది అనూరాధ.

"ఇంత చదివినా మనకెంత వచ్చినా ఆ మూడు గంటలలోను ఎంత రాయగలిగితే దానిమీదే ఉంటుంది విలువంతా. ఆలోచిస్తే అంతా వచ్చినట్టే ఉంటుంది. పేపరుమీద పెట్టబోతే బొచ్చెడన్ని అనుమానాలు. ఎల్లా గట్టెక్కుతానో ఏమో బాబూ! నామీద కొండంత ఆశ పెట్టుకున్నారు అమ్మా నాన్నాను." దిగులుగా అనేది హైమ.

"ఒక్క ప్రశ్నపత్రం పాసుచేస్తే చాలు—మన బతు [illegible]

"అబ్బ! జ్ఞాపకం చెయ్యకమ్మా, పుణ్యం ఉంటుంది! తల్చుకుంటేనే వళ్ళు జల్లుమంటుంది. ఇంత చదువు చదివి పోనీ రేపేదో క్లాసు తెచ్చుకున్నామే అనుకో. దానివల్ల సాధించబోయేదేమిటో కనబడటంలేదు అక్క చెప్పినట్లు ఆలోచనకే గాని ఆచరణకు పనికిరానివై పోయాయి మన చదువులు. అక్కేం చేస్తున్నది? మళ్ళీ పంతులమ్మ అయింది. మనం ఇంత అర్థశాస్త్రం (ఎకనామిక్స్) చదువుతున్నాముగదా. ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థని గురించి 30 పేజీల వ్యాసం వ్రాస్తాం గదా. మన తాతల్లాంటి ఎకనామిస్టు లందరూ సిద్ధపరుస్తున్న బడ్జెటు ఒక్కటీ సరిగ్గా ఉండదేం? అర్థశాస్త్రం అంటే అర్థం తెలియని ముసలమ్మలంతా వచ్చేది జాగ్రత్త పెట్టుకుని కూడిక చెయ్యగలుగుతున్నారే! మరి ఈ విషయం చదివి ప్రయోజనం? ఆ ఫిజిక్స్ ఆనర్స్ వాణి లేదూ—అదీ ఇల్లాగే అంటుంది. ఫిజిక్సులో పెద్ద పట్టా తీసుకుంటారా, రేడియో పెట్టడం నిశ్చయంగా వాళ్ళకి తెలియాలనిలేదుట! రేడియో సరిగా పెట్టగలిగితే అది అదనపు తెలివి అన్నమాట! ఫిజిక్స్ ఆనర్స్ చదువంటే — అర్థం తెలియకపోయినా మేథమేటికల్ ఈక్వేషన్సు బట్టీపట్టి వప్పగించ గలగడమేనంటుంది. ఎందుకీ చదువులు? మనకే తెలియకుండా చదివేస్తున్నాం" అంటుంది హైమ.

"అదేకాదు హైమా! వచ్చిన బాధ ఇంకోటేమి టంటే సిలబస్సులు ఆ ప్రశ్నపత్రాలు. అందులో ఇచ్చిన

ఆరు ప్రశ్నలు రాస్తే పండితుడైనట్టే. ఆ నాలుగూ రాక పోతే వాడికింకేమీ రానట్టే. అనుకున్న కొద్దీ అన్నీ ఇలా అనిపిస్తూనే ఉంటాయి.''

"ఇంత చదువుకునీ కూడా స్వతంత్రంగా ఒక్క విషయాన్ని గురించి ఉన్నత స్థాయిలో ఆలోచించే మార్గమేనా పట్టుబడదు కదా! దైనందిన జీవిత సమస్యా పరిష్కారాలకి మళ్ళీ పాతపుంతలే తొక్కాలిగదా!''

"ఆ పేద్దా పుణ్యం ఉంటుంది. అస్తమానంగోడపశైలు దగ్గరినించి ఉత్తరమే లేదు. నిధి రావటం లేదీమధ్య. మన్ని విఘ్నం చెయ్యడం ఇష్టంలేక గాబోలు. అతను వచ్చినా బాగుండును. కాస్త కాలక్షేపం అవును. కాలేజీలో కనబడితే చెప్పాలి.''

"వాళ్ళపనే నయం. ఆడుతూపాడుతూ చదివేస్తారు. ప్రొఫెసర్‌తో కాస్త జాగ్రత్తగా ఉంటే చాలు.

"ప్రొఫెసరంటే గుర్తుకు వచ్చింది. మన చదువులు తెచ్చే కష్టాలు చాలక ఈ కోపతాపాలు, అభిమానాలు కొన్ని మన ప్రాణానికి. తనకి నచ్చిన మాటొక్కటి చెప్పి, తను నమ్మిన వాటిని నొక్కి పలకగల దమ్ముందీ ఎవడికైనా, ప్రొఫెసరు ముందు ? ఏం చేస్తాడోనని భయమేనాయె! క్లాసులో వాళ్ళేంచెప్పినా పాములవాడి బూరాకి పాము తలాడించినట్టు తలలు తిప్పేస్తాం. ఒకవేళ ఆయన తప్పు చెప్పినా మంచివాడైతే తప్ప నోరు మూసుకోవలసిందేకదా?'' అనేది అనూరాధ.

"మానేద్దాం అనుకున్నవాళ్ళం మళ్ళీ అందులోకే వచ్చాం చిత్రం! ఈ ఏడంతా ఇంతే గాబోలు !" అనేది హైమ.

ఇంతలో విశ్వం వచ్చేవాడు.

"ఏమిటి, వదినా మరదళ్ళిద్దరూ ఏదో పిచ్చాపాటీలో పడ్డట్టున్నారు?" ప్రశ్నించేవాడు.

"మాకు పట్టిన పిచ్చి అల్లా ఒక్కటే! పరీక్షలపిచ్చి! అనే అనుకుంటున్నాం" అనేది హైమ సమాధానంగా.

"అబ్బబ్బ ! మీకు చెప్పలేక నానోరు పడిపోతున్నది. అస్తమానూ అదే గొడవా ? చదువుకున్నంత సేపూ తప్ప మిగిలినపుడవి ఆలోచించవద్దని చెప్పలేదూ ? ఇల్లా మతులు పోగొట్టుకుంటే రేపు అన్నీ తెలిసి సున్నలు పెట్టి వస్తారు. శైలు మీలాగే ఉండేదా?" అంటూ విసుక్కునేవాడు విశ్వం.

"అందరూ తల్చుకుంటే మాత్రం ఆమెలా ఉండగలగవద్దూ!" వెటకారంగా అనేది అనూరాధ.

"ఇప్పటికివి ఇలా ఆపి అలా వీధిలోకి బయలుదేరండి. మళ్ళీ ఇంటికి వచ్చేలోగా పరీక్షల విషయం ఒక్క ముక్క వచ్చిందా ఇవాళిటికి మీతో ఇంక మాట్లాడను." బెదిరించేవాడు విశ్వం.

"ఆ పనిమాత్రం చెయ్యకు అన్నయ్యా! కట్టిపెట్టేస్తాంలే. పదమ్మా!" అనేది హైమ.

అంతా వాహ్యాళికి బయలుదేరేవారు.

సెప్టెంబరు నెల వచ్చేసింది. ఊళ్ళో అన్నిచోట్లా కలరా ప్రబలి నానా భీభత్సం చేస్తున్నది. ఎటుచూసినా ప్రతి ఇంటిలోను భయంతో అట్టుడికిపోతున్నారు జనం. రోజురోజుకూ మరణ వార్తల సంఖ్య తెగ పెరిగిపోతున్నది. గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకుని బతుకుతున్నారు ప్రజ.

ఉన్నట్టుండి ఒకరోజున శాంతమ్మగారికి విరోచనాలు పట్టుకున్నాయి. వికారం, వాంతులు, విశ్వం, అనూరాధ వణికిపోయారు భయంతో. వెంటనే డాక్టర్ వచ్చాడు. ఇంజక్షన్ ఇచ్చి జాగ్రత్తగా చూడమని అదోలా చూసి వెళ్ళిపోయాడు. అనూరాధ మనస్సు విచలితమై పోయింది.

సాయంకాలం అయ్యేసరికి శాంతమ్మగారి స్థితి మరింత దిగజారింది. ఆహారం ఏమీ ఇమడటం లేదు. అతికష్టంమీద గూడా లేవలేనంత నీరసం వచ్చిందామెకు. నిధి, హైమ అలవాటు ప్రకారంవచ్చి, శాంతమ్మగారి పరిస్థితి చూసి నిర్ఘాంతపోయి అక్కడే ఉండిపోయారు. అనూరాధ అత్తగారి దగ్గర కూర్చుని పాదాలు ఒత్తుతూ గంట గంటకూ మందిస్తున్నది.

విశ్వం ఉన్న అలికిడి లేదు. అనూరాధ, విశ్వం కోసం చూసి కనబడక తనతో చెప్పి వెళ్ళలేదే అనుకుని పడక గదిలోకివచ్చి లైటువేసి పక్కమీద ఉన్న విశ్వాన్ని చూసి ఆశ్చర్యపోయింది. బోర్లాపడుకుని ఉన్నాడు విశ్వం. అనూరాధ దగ్గరకు వెళ్ళి తట్టింది. ఇటు తిరిగిన విశ్వం ముఖంలో కళ లేదు. కన్నీళ్ళు కాల్వలు కడుతున్నాయి. అనూరాధను భయం ఆవరించింది

అతని తల తన చేతులలోకి తీసుకుని. "ఏడుస్తున్నారా!" అంది.

"లేదు" అన్నాడేగాని దుఃఖాన్ని అణిచి పట్టడం అతనికి చేతకాలేదు.

"ఏమండీ! ఎందుకలా ఏడుస్తారు? డాక్టరు ప్రమాదంగా ఉందన్నాడా?" ఆర్ద్రంగా ఉందామె కంఠం.

"ఎందుకో నాకు దుఃఖం ఆగడంలేదు రాధా! నా మనస్సుకి ఏదో ఆపద ముంచుకుంం దనిపిస్తున్నది. అమ్మకేదేనా జరిగితే? రాధా! నా మనస్సు నిలవడంలేదు. రాధా! అమ్మ దగ్గరకు వస్తే పట్టుబడిపోతానని రావటం లేదు. చిన్నప్పటినుంచి పువ్వులలో పెట్టి పెంచింది. నాన్నగారు పోతే ఆలోటే లేకుండా చూసింది. నన్ను మనిషిగా తయారు చేసింది. రాధా-అమ్మ లేకపోతే-" కంఠం పూడి పోయింది విశ్వానికి.

అనూరాధకు గూడా దుఃఖం పొర్లుకు వచ్చింది. తనుకూడా బలహీనత ప్రకటిస్తే అతను ఇంకా బేలపడి పోతాడు. మాట మాట్లాడితే అతనికి అనుమానం తగులుతుంది. అందుకే మౌనమే ప్రదర్శించింది.

"నే నేదంటే అదేగా జరిపింది. నేను తనకిష్టం లేని పని చెయ్యదలిస్తే నా ఆత్మవిశ్వాసం చెడకుండా ఉండే రీతిని నచ్చజెప్పి మాన్పించేది." మాట పెగలలేదు విశ్వానికి.

అతి కష్టంమీద అనూరాధ నిగ్రహించుకుంది.

"ఛీ! మీరే చంటిపిల్లలై పోతే ఎల్లా! చెప్పొద్దన

అత్తయ్యా లేచి తిరుగుతారు. ఊరికే బెంగ పెట్టుకోకండి. నామీద ఒట్టు. ఇప్పుడే వస్తానుండండి!" ఎల్లాగో ఉగ్గ పట్టుకుని ఈ మాటలని ఇవతలకు వచ్చి గోడనానుకుని ఏడ్చేసింది.

తన కి కొద్దికాలంలోనే ఇంత సన్నిహితమైందే! ఇంక అతనిమాట!

కళ్ళు తుడుచుకుని అత్తగారి దగ్గరకు వెళ్ళింది.

బల్లిలా పక్క నంటిపెట్టుకుని ఉంది శాంతమ్మ గారు.

"అబ్బాయేడీ! కంగారు పడిపోవడం లేదు గదా! నువ్వు వాడిదగ్గరకు వెళ్ళి కూర్చో తల్లీ!" మూలిగింది శాంతమ్మగారు అనూరాధను చూసి.

"మీరు ఇదయిపోకండ త్తయ్యా!" అన్న అనూరాధకు ఏడుపు ఆగింది కాదు.

తను నానాయాతనా పడుతున్నా కూడా కొడుకు కంగారు పడతాడేమోనని అతన్ని అనునయించమనే ఆమె అనూరాధకు చెప్పింది. వీళ్లు ఏ కోవలో మనుష్యులో! అటువంటి ఊహ అనూరాధ దుఃఖాన్ని ఇనుమడింప జేసింది.

గబగబ నిధి దగ్గరకు పరిగెత్తుకుని వెళ్ళింది.

"చూడు తమ్ముడూ! గదిలో మీ బావగారు ఏడుస్తూ కూర్చున్నారు. ఆయన్నెలాగయినా వీధిలోకి తీసుకువెళ్ళి ఓదారుద్దూ. నేనేమైనా మాట్లాడబోతే నాకే

ఏడుపు ఆగడంలేదు. ఇంక నేనేం ఓదార్చగలను ఆయన్ని?'' అంది నిధితో.

"అల్లాగే అక్కా!'' అన్నాడు నిధి.

విశ్వం దగ్గరకు వెళ్ళి బలవంతంగా వీధిలోకి తీసుకు వెళ్ళాడు.

ఎప్పుడు కలుసుకున్నా మహా ఆనందంగా గడిపే అనూరాధ, హైమలు మూగనోము పట్టినట్టు కూర్చున్నారు. ఏం మాట్లాడితే పట్టుబడిపోతామో అన్నట్టున్నారు. వారిద్దరికీ శాంతమ్మగారి యెడగల భక్తి విశ్వాసాలు అసమానమైనవి.

బంధుత్వమేమీ లేకపోయినా రెండేళ్ళ అనుబంధం హైమను శాంతమ్మగారికి సన్నిహితురాలిగా చేసింది. నిర్మలమైన హృదయాలు రెండిటి కలయికకు కాలంతో పనేముంది? శాంతమ్మగారిని తల్లితో సమానంగా గౌరవించి, చిలిపి కయ్యాలు పెట్టుకుని చీవాట్లు తింటూ ఆనందించే హైమ ఈ పరిస్థితి భరించలేక పోయింది.

అనుకున్నవన్నీ అనుకున్నట్టు జరిగితే ఈ లోకంలో వైరుధ్యానికి తావే ఉండేది కాదు.

శాంతమ్మగారి మంచితనం కాని, విశ్వం, అనూరాధలకు ఆమెమీద గల ప్రేమకాని, హైమ, నిధి, శైలజ వంటి వారికి ఆమె మీదున్న భక్తి శ్రద్ధలు కాని, వైద్యుని ప్రతిభగాని ఆమె ప్రాణాల్ని కాపాడలేకపోయాయి.

అనూరాధ చంటిపిల్లలా ఏడ్చేసింది. హైమకూడ దుఃఖం ఆపుకోలేకపోయింది. నిధి కళ్ళు చెమర్చాయి

ఇందరిలో బాధపడినట్టు కనబడనిది ఒక్క విశ్వమే. విశ్వం తట్టుకోలేడేమోనని అనుమానించి భయపడిన అనూరాధకు అతని నిశ్చలత్వం ఆశ్చర్యం కలిగించింది. కాని కొంపదీసి లోపలే కుమలడం కాదుగదా అని కలవరపడింది తల్లి అస్వస్థతనే సహించలేక ఏడ్చేసిన అతను, తీరా తల్లిపోతే ఇంత ధైర్యం ప్రకటించగలగడం ఆమె నమ్మలేక పోయింది.

ఎప్పుడూ కటువుగా మాట్లాడి ఎరుగని విశ్వం అనూరాధను ఊరుకోపెట్టడానికి కఠినంగా మాట్లాడవలసి వచ్చింది.

పరామర్శకు వచ్చిన తండ్రిని చూసి బావురుమంది అనూరాధ. తక్కువ కాలమే కలిసిఉన్నా శాంతమ్మగారి తోడి సాన్నిహిత్యం రక్త సంబంధంకంటే ఎక్కువ వేళ్ళు పాతుకుపోయినట్టు చేసింది ఆమెలో. అందుచేతే అత్త గారుపోతే తల్లి పోయినంతగా బాధపడిందామె. అసలే సున్నితమయిన హృదయం కావడంతో ఆమె విచారానికి అంతు లేకపోయింది. నిమిష నిమిషానికీ ఆమెను తలుచు కుని కుమిలిపోయేది.

కూతురిని, అల్లుణ్ణి కూడా తీసుకువెళ్ళి నాలుగు రోజులుంచుకుందా మనుకున్న రామనాథంగారికి ఆశా భంగం అయింది. విశ్వం తనకు పనులున్నాయనీ, అనూ రాధను తీసుకువెళ్ళమని అన్నాడు మామగారితో. అనూ రాధ అంగీకరించలేదు.

"చూడమ్మా! కనీసం వాతావరణం మార్పుకోస

మైనా నాలుగు రోజులుండి వద్దుగాని రా అమ్మా!" అన్నా డాయన.

"లేదు. రాలేను నాన్నా" అంది అనూరాధ మొండిగా.

ఎదురుగా ఉన్న విశ్వం, అనూరాధకు కనుసైగ చేసి లోపలికి వెళ్ళాడు.

"ఇప్పుడే వస్తాన్నాన్నా!" అంటూ విశ్వాన్ననుస రించింది అనూరాధ.

"ఏం పిలిచారు!" అంది విశ్వంతో బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిన తరువాత.

"నామాట విని వెళ్ళురాధా! ఇక్కడ కూర్చుని ఊరికే బాధపడడంకన్న మీవాళ్ళతో నాలుగు రోజులు కలిసి ఉండిరారాదా?" అడిగాడు విశ్వం.

"నా కక్కడికి వెళ్ళినా సుఖం ఉండద్దూ? నన్నిలా ఉండనిద్దురూ."

"చూడు రాధా! పోయినవాళ్ళకోసం అనవసరంగా బాధపడి ఆరోగ్యం పాడుచేసుకోకు. అమ్మకేం లోటు! హాయిగా వెళ్ళిపోయింది. చూడవలసినవన్నీ చూసింది. నాలుగునాళ్ళు మంచంమీద ఉండి నలుగురిచేత చేయించు కో నక్కరలేకుండా వెళ్ళిపోయింది. ఆమెను గురించి మనస్సు పాడుచేసుకుంటున్నావు నువ్వనవసరంగా."

"మీరేనా మాట్లాడేది?"

"అంటే అమ్మ పోయేముందు రోజున వచ్చిన నేనేనా అని అడుగుతున్నావు? రాధా! ఆరోజు వేసు.

బ్రతికిఉన్న అమ్మ పోతుందేమోనని బాధపడటం, దుఃఖించడం సహజం మనకి చేతనైనంత చెయ్యడం కర్తవ్యం పోయిన ఆమె ఎల్లాగూ పోయిన తరువాత గుండెలు పగిలేలా ఏడ్చినా, బాధపడి మనస్సు కుళ్ళబెట్టుకున్నా పోయిన వారిని తిరిగి తీసుకురాలేం. తప్పనిసరిని అంగీకరించి ఊరుకోవడంకంటే ఏమీ చెయ్యలేం. తిరిగిరాని వాటికోసం బాధపడి ప్రయోజనం లేదు. పోయినవారితో మనమూ పోతామా? పోనీ పోయి ఏమయినా సాధించగలమా? ఆలోచించి చూడు. చదువుకున్న దానివి. కని ఇన్నేళ్ళు పెంచిందే నన్ను—అల్లాంటి నేనే సహించి ఉరుకున్నాను, ఏంచెయ్యలేక! అంతకన్నా ఎక్కువా నువ్వు? పోయినవాళ్ళకోసం విచారించి మనస్సు పాడుచేసుకోవడం కేవలం బలహీనత! నామాట విని నాలుగురోజులు మీ ఇంటికి వెళ్ళిరా" అన్నాడు. విశ్వం సానునయంగా.

అనూరాధకు మతిపోయింది. కాని ససేమిరా కదలనంది.

రామనాథంగారు మరోసారి కదిపి చూసి లాభంలేక తిరిగి వెళ్ళిపోయాడు.

అనూరాధకు ఇంకో సమస్య ఎదురైంది.

తను అర్థం చేసుకున్నాననుకున్న భర్త మనస్తత్వం ఒకలా చూస్తే ఏమీ అర్థం కానట్టనిపిస్తూంది. తల్లిపోయే ముందురోజు తల్చుకుని తల్చుకుని ఏడ్చినవాడు, ఆ ఊహే భరించలేనివాడు, తీరా పోతే ఒక్కసారిగా తన మనఃఫలకం

మీదనుంచి ఇవన్నీ ఎల్లా తుడిచేసుకోగలిగాడు ? ఇంత నిర్లిప్తంగా ఎల్లా ఉండగలుగుతున్నాడు ? స్వాభావికంగానే అంత ఉదాసీనుడా? కాదే! ఎంత తెలివైనవాడు! ఎంత ఓర్పు, అనుభూతి, సానుభూతి గలవాడు! అయితే పరస్పర విరుద్ధమైన ఈ గుణాలు ఆయనలో ఎల్లా ఇమిడాయి!అంత సుతిమెత్తని మనస్సులో ఇంత కాఠిన్యం ఎలా చోటు చేసుకుంది! దేనిమీంద మమతనైనా చూస్తూ చూస్తూ ఇంత సులభంగా వదిలి వేయగలడా ? వదిలేసి బాధపడకుండా నిశ్చలంగాను, నిర్వికారంగాను ఉండగలడా ? ఈ ప్రశ్నలను గురించి వాటికి సమాధానాలు వెదకడంకోసం ఆలోచించేసరికి అనూరాధ తల వేడెక్కిపోయి భయం ఆవరించిందామెను.

శాంతమ్మగారు పోయిన తరువాత విశ్వం, అనూరాధల దైనిక చర్యలలో కొన్ని మార్పులు వచ్చాయి. ఇదివరకు లాగ కాక అనూరాధకు వంటింటి పెత్తనం ఒకటి పైనపడింది. విశ్వం వంటమనిషిని కుదర్చడంగాని, క్యారియర్ తెప్పించడం గాని చేస్తానన్నాడు గాని అనూరాధే అందుకు అంగీకరించలేదు. దీనివల్ల ప్రొద్దున్నే వంట పని చెయ్యవలసిరావడం, రాత్రి వంట—దినచర్యలలో మార్పులు వచ్చాయి.

కొన్ని సంఘటనల ప్రభావం కొందరిమీద విచిత్రంగా ఉంటుంది. అందరూ అన్ని సంఘటనలూ సహజమైనవిగా తీసుకుని సమాధానపడలేరు. పరీక్షపోతే ఆత్మ

హత్య చేసుకున్న విద్యార్థులను గురించి చాలాసార్లు వింటూంటారు. నిజానికి ఒక పరీక్ష జీవితంలోని ఎన్నో ఘట్టాలలో కేవలం ఒక్కటి. ఒక్క విషయంలో అపజయం సిద్ధిస్తేనే మహా న్యూనపడి ప్రాణత్యాగం చెయ్యడం అవివేకమని చాలామంది భావిస్తారు. కాని అటువంటివి జరుగుతూనే ఉన్నాయి. ఇటువంటి బలహీనతకు కారణాలు వ్యక్తినిబట్టీ, పరిస్థితుల ననుసరించీ ఉంటాయి. పెంపుడు కుక్కపోతే బెంగపెట్టుకుని ఆరోగ్యం పాడుచేసుకున్నవాళ్లు ఉన్నారు. స్నేహితులు మరణిస్తే చాలాకాలంపాటు తేరుకోలేని వారు ఉంటారు. వాటికి విరుద్ధంగా ప్రపంచం ఏమైపోయినా చలించని ధైర్య స్థయిర్యాలు గలవారూ ఉంటారు. ఈ రెండు వర్గాలకూ చెందని ఎక్కువమందికి రెండూ విదూరంగానే ఉంటాయి.

అత్తగారు చనిపోతే సంతోషించే కోడళ్ళు ఉండవచ్చు. సామాన్యంగా బాధపడేవారు ఉన్నారు. అతిగా బెంగపెట్టుకుని కృశించేవారు ఉండడంకూడా అసహజం కాదు. అత్తగారు పోయినంతమాత్రాన అంత బాధపడి మనస్సు కుళ్ళబెట్టుకోవాలా అనే ప్రశ్నకు సమాధానం రాదు. ఆ బాధకు కారణాలు అసలే కనబడవు. అది కేవలం ఆ వ్యక్తి మనస్సుమీద మాత్రమే ఆధారపడి ఉంటుంది. ఇది బలహీనతమాత్రమే అన్నా వ్యతిరేకించలేము

శాంతమ్మగారి మరణం అనూరాధమీద ఎక్కువ ప్రభావం కనబరిచింది. అనూహ్యం అయినా అతి వాస్త

వికంగా పరిణమించిన ఆమె నిష్క్రమణ అనూరాధను దుఃఖసాగరంలో ముంచివేసింది. దానినుంచి ఆమె తేరుకోలేకపోయింది. మామూలు మనిషి కాలేక పోయింది. ఉదాసీనంగాను, నిర్లిప్తంగాను తయారైంది. ఒక విధమైన వేదాంతభావం అలవడి, ఏది ఏమైపోతేనేం అనే స్థితికి వచ్చింది. ఎవరుమాత్రం శాశ్వతం అనే దృక్పథం అలవడింది. దానికి కారణం ఆమెకూ పూర్తిగా తెలియదు. ఒక్కొక్కప్పుడు తన బలహీనతకు తానే ఆశ్చర్యపడేది. కాని ఎవరైనా ఎత్తి చూపితేమాత్రం ఆమెకు అభిమానం, కోపం పట్టరానంతగా వచ్చేవి.

ఏదో పని చేస్తుండగా హఠాత్తుగా ఏదో జ్ఞాపకానికి వచ్చి అప్రయత్నంగా కన్నీళ్లు వచ్చేవి ఆమెకు. శాంతమ్మగారి గంభీరమూర్తి, అద్వితీయమైన ఓర్పు, అన్నిటినీ మించిన సంస్కారం, మధువులూరే మాటలు పదేపదే గుర్తుకు వచ్చేవి. 'ఇన్నేళ్ళు పెంచి పెద్దచేసిన కొడుకుని చేతులారా అమ్ముకోలేను బాబూ.' అంత సున్నితంగా చెప్పింది కట్నంవద్దని. అందులో తనెంత త్యాగంచేస్తున్నా ఆ ప్రసక్తే లేదు. కట్నం తీసుకోకపోవడం ఒక గొప్పగా భావించనైనా లేదు. తానేదో ఇతరులను ఉద్ధరించినట్టు వ్యక్తం చెయ్యలేదు. కటువుగా మాట్లాడడం ఆమెకు చేతకాదు. తమకన్నా తరంముందు వ్యక్తి పెళ్ళి తరువాత తనకు ఉన్నత విద్యను ప్రోత్సహించింది. 'అమ్మాయి ముచ్చటపడి చదువుకోమంటే వద్దనాన్నావుటేం?' నిష్ఠూర

మాడింది తన్ను....తాను చదువుకోనంటే—అదేదో మహా పరాధమైనట్లు. నిజంగా తప్పు చేసినప్పుడు పల్లెత్తుమాట అనేదికాదు. మానవత్వంమీద ఆమె నమ్మకానికి అంతు లేదు. ఎంత బలహీనులనైనా ఇట్టే క్షమిస్తుంది. శైలు పెళ్ళి విషయంలో ఆమె తప్పకుండా బాధపడుతుందని తా నూహించింది 'అయినా ఈ చదువుకున్న పిల్లలకేం చెప్పగలం? ఏది ఏమైనా అది నా కూతురు కాకపోయిందీ!' చాలా సహజంగాను, అతి సులువుగాను, వెలువరించిన ఈ మాటల మాటున ఉన్న క్షమ, ఉన్నత సంస్కారం తనను వేలెత్తి చూపించాయి. పరాయి వాళ్ళయిన హైమనూ, నిధినీ కన్నబిడ్డలకంటె ఎక్కువగా ఆదరించేది - నిధికి జ్వరం వచ్చినప్పుడు! తనూ, విశ్వం చిలిపిగా తగువు లాడుకుంటే ఇద్దర్నీ నొప్పించకుండా రాజీ కుదిర్చేది. ఆమె ప్రేమమయి! దైవస్వరూపిణి !

నెలలు గడిచినా ఇటువంటి ఊహాలు, బాధ, కుమ లడం అనూరాధకు తప్పలేదు. పీటితో చదువుమీద శ్రద్ధ సన్నగిల్లేది. విశ్వం బాధపడేవాడు. చదువుమీద శ్రద్ధ తగ్గి పోతున్నదని ఆమెను అదలించేవాడు. ఆమెను అది మరింత రెచ్చగొట్టేది.

హైమ, అనూరాధ కలిసి చదివేవారు. రోజూ అథమం గంటైనా విశ్వం వారికి పాఠాలు చెప్పేవాడు.

ఒకరోజున గంట పాఠం చెప్పి దానిమీద అనూ రాధను ప్రశ్నించాడు.

అంతవరకు పాఠం వినకుండా ఆలోచనా ప్రవంతిలో మునిగి తేలుతున్న అనూరాధ ఈ ప్రశ్నతో ఉలిక్కిపడి ఈ ప్రపంచపు పరిధులలోకి అడుగిడింది. ప్రశ్నకు సమాధానం చెప్పలేక తెల్లబోయింది. అసలు ప్రశ్నేమిటో ఆమెకు తెలియలేదు.

ఇది సహించలేని విశ్వం, "గంటనుంచీ చెప్తే ఏం విన్నావ్?" అని గద్దించాడు.

"నాకు ఇవాళ మనస్సు బాగుండలేదు" అంది అనూరాధ ఉదాసీనంగా. కనీసం వినకపోయినందుకు బాధైనా వ్యక్తం చెయ్యలేదు.

దానితో విశ్వానికి కోపం వచ్చింది.

"అసలు ఎప్పటికైనా బాగుపడుతుందా?" విసురుగా అడిగాడు.

పరిస్థితి విషమిస్తుందేమోనని భయపడిన హైమ తను కల్పించుకోబోతూండగా అనూరాధ అడ్డంవచ్చి, "పడదు. అసలు ఏమీ బుర్రకెక్కటంలేదు. నాకీచదువూ వద్దు; పట్టుబండలూ వద్దు" అని, కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుని ఒక్కసారిగా వెళ్ళిపోవడానికి ఉద్యమించింది.

"వదినా!" ఆశ్చర్యపోయిన హైమ, అనూరాధను ఆపబోయింది.

"నన్నింక విసిగించకు హైమా!" అంటూ ఏడుస్తూ వెనక్కయినా తిరక్కుండా వెళ్ళిపోయింది అనూరాధ.

హైమ నిశ్చేతనురాలైంది. విశ్వం ఎక్కువ ఆశ్చర్యపడలేదు.

"ఏమిటన్నయ్యా ఇది?" కొంతసేపటికి తేరుకుని అడిగింది హైమ, విశ్వాన్ని.

"అమ్మని మర్చిపోలేక పోతున్నది." తేలిగ్గా అన బోయిన విశ్వం ముఖంలో బాధ గూడు కట్టుకుంది.

అవాళిటికి హైమ సెలవు తీసుకుంది.

ఇటువంటి సంఘటనలు అప్పుడప్పుడు జరుగుతుండేవి. విశ్వానికి అనూరాధ మనస్సును వీటినుంచి మళ్ళించడం ఒక సమస్యగా ఘనీభవించసాగింది. అనూరాధ తానై శ్రద్ధ కనబరిచేది కాదు. విశ్వం కోపగిస్తే ఆమె బలహీనత మరింత విజృంభించేది. ఇటువంటి సమయాలలో తాను తెగేదాకా లాగితే మూడేళ్ళ చదువూ వృథా అయి పోతుందని విశ్వం ఎక్కువ ఓర్పు ప్రదర్శించవలసి వచ్చేది.

అనూరాధ, హైమల చదువు పాడుచేసినట్లవుతుందని నిధి తన రాకపోకలు తగ్గించాడు, విశ్వం ఇంటికి.

ఒకరోజు విశ్వం బజారునుంచి తిరిగివస్తుంటే సాయంత్రం దారిలో నిధి తారసిల్లాడు. స్నేహితులతో కలిసి ఏ సినిమాకో కార్యక్రమం కాబోలు. విశ్వం అతన్ని పలకరించకుండానే ముందుకు సాగిపోబోయాడు గాని నిధే చూశాడు.

"బావగారూ!" అంటూ వచ్చి భుజంమీద చెయ్యి వేశాడు.

"కనబడటమే లేదేమయ్యా?" అడిగాడు విశ్వం. నిధిచేతిని తన చేతిలోకి ఆప్యాయంగా తీసుకుంటూ.

"నేను వస్తే ఏదోవిధంగా కాలం వృధా అయి పోతుంది. అక్కవాళ్ళకి పరీక్షలా రెండు నెలల్లోకి వచ్చాయి."

"ఏదో కార్యక్రమంమీద బయలుదేరినట్టున్నావు వెళ్ళిరా. వాళ్ళు నీకోసం ఆగిపోయారు కూడాను."

"కనబడక కనబడక ఈవేళ కనబడ్డారు. మిమ్మల్ని వదుల్తానా?"

"కొంపదీసి నన్నుకూడా రమ్మంటావేమిటి?"

"అక్కర్లేదు" అంటూ నిధి వెళ్ళి స్నేహితులకేదో చెప్పాడు. వాళ్ళు కూడా "ఆల్‌రైట్" అంటూ వెళ్ళి పోయారు.

"అదేమిటయ్యా వాళ్ళని వదిలేశావ్?" ఆశ్చర్యంగా అడిగాడు విశ్వం

"మాకు రోజూ ఉండేదే లెద్దురూ! ఒకసారి తప్పి పోతే మించిపోయేదేమీ లేదు. ఇంతకీ ఎల్లా చదువు తున్నారు వాళ్ళిద్దరూ!" అడిగాడు నిధి

"హైమ ఫరవాలేదు గాని మీ అక్క బొత్తిగా అశ్రద్ధ చేస్తూందోయ్. ఇదివరకటి ఉత్సాహం లేదు మని షిలో."

"కొన్ని సంఘటనల ఫలితాలు కొందరిమీద చాలా ఎక్కువగా ప్రతిబింబిస్తాయి బావగారూ. అందులో ఆమె బొత్తిగా సుతిమెత్తనిది."

"నువ్వుకూడా రావడం మానేశావు. వాళ్ళకు అసలు మరొక ప్రసక్తిలేక బొత్తిగా నిరుత్సాహ పడిపోతున్నారు. నిమిషం తీరిక దొరికితే చదువు గొడవో, అమ్మ గొడవో తప్ప కాస్సేపు కూడా సంతోషంగా ఉండలేక పోతున్నారు."

"నేను వాళ్ళ చదువులకు ఆటంకమేమోనని రావడం లేదు."

"రోజులో ఇరవై నాలుగు గంటలూ చదువుతారటయ్యా! వీళ్ళు చదివేదానికన్నా దాన్ని గురించి ఆలోచించడంలో ఎక్కువ కాలం వృధా చేస్తున్నారు, బెంగతోటీ దిగులుతోటీనూ. ఒక్కరోజు నిజంగా విశ్రాంతి తీసుకుంటే మరునాడు రెట్టింపు చదివి ఆకళింపు చేసుకోగలరు, మెదడుకు భారం తగ్గి. రేపు ఆదివారమేగా! ఎక్కడికో అక్కడికి అధమం ఒకరోజేనా ఈ గొడవలు మర్చిపోయి నవ్వుతూ హాయిగా గడిపెయ్యగల చోటుకి వాళ్ళని బయలుదేర తియ్యరాదూ ? వాతావరణంలో మార్పైనా ఉంటుంది! ఇదివరకు మనం కూర్చుంటే నిమిషంలో గడిచిపోయేది. అల్లా ఉండాలి."

"అల్లా అయితే రేపే వెళదాం బావగారూ. ఇటు శాంతి ఆశ్రమం పక్కనించి సముద్రపు ఒడ్డంటే 'లాసన్స బే'కి పొద్దున్నే వెళ్ళి సాయంకాలం తిరిగి రావచ్చు."

"బాగుంది. అల్లాచేద్దాం. కాని ఇంకో చిక్కుంది.

ఈ ఊహ నీకు వచ్చినట్టుండాలి. ఇందులో నా ప్రోత్సాహం కనబడితే రానంటుంది. నువ్వు చెప్తే నిన్ను నొప్పించడాని కిష్టంలేకనైనా సరేనంటుంది. తెలిసిందా?"

"రైట్. అయితే ఇంక చూడండి మన తడాఖా" అంటూ నవ్వాడు నిధి.

ఇద్దరూ ఇంటికి దారితీశారు. అనూరాధ, హైమ పుస్తకాలు ముందు వేసుకుని ఏవో కబుర్లు చెప్పుకుంటు న్నారు. నిధిని చూసిన వారి ముఖాలు వికసించాయి.

"బ్రాత్రిగా కంట్లో నలుసైపోయావేం తమ్ముడూ. మీ బావగారు కనబడి లాక్కొచ్చినట్టున్నారు. ఇంత మందమరుపుంది నీకని తెలీదే!" నవ్వుతూ అంటించింది అనూరాధ.

"వచ్చి మీ చదువు చెడగొట్టడం తప్పించి ఏం లాభం!" అన్నాడు నిధి.

"ఊరికే బెంగపడడం తప్పించి చదవనేలేక పోతు న్నాం" అంది హైమ.

"అదే వద్దని నచ్చచెప్పలేక నానోరు పడిపోతున్నది" అన్నాడు విశ్వం.

"అవును. మీమాటంటే మాకేం లక్ష్యం? పైగా మేం వినడంలేదుట! వినకపోతే పాఠాలు చెప్పననీ, మూగ నోము పడతాననీ మేమేకదూ అంటూంట!" వ్యంగ్యంగా అంది అనూరాధ.

"చూడు నిధీ! ఇదేనా కృతజ్ఞత అంటే!" కృతజ్ఞత

[illegible]

"లేకపోతే ఏమిటన్నయ్యా, వేళాకోళం నువ్వాను? అసలు ఏం చదివినా అర్థంకాక మేం అవస్థపడుతుంటే ఇంకా ఈ మాటలొకటా?" ముద్దు ముద్దుగా అంది హైమ.

"ఈ మాటలకు అంతేక్కడ గాని ఇంక భోజనానికి లేవండి" అంది అనూరాధ.

"వట్టి భోజనమేనా?" నిధి అడిగాడు.

"దక్షిణ ఏమైనా కావాలా?" హైమ అడిగింది ఎదురు.

"మరి! తేరగా భోజనం మాత్రం పెట్టి పుణ్యం సంపాదిద్దామనా?" విశ్వం అన్నాడు.

"అయితే అడుగు తమ్ముడూ, ఏమిస్తారో!"

"అన్నపూర్ణవు నువ్వు చెప్పాలి ఏమిస్తావో!" విశ్వం అన్నాడు.

"అక్కడికి పెత్తనం అంతా నాదైనట్టు! ఆమాట మీదే నిలబడండి వీళ్ళిద్దరూ సాక్ష్యం. కోరుకో తమ్ముడూ ఏంకావాలో. హైమ మొగుణ్ణి అడిగినట్టు నువ్వు పెళ్ళాన్ని మాత్రం అడగకేం!" అంది అనూరాధ నవ్వుతూ.

నిధీ, విశ్వం నవ్వారు.

"పో వదినా! అక్క ఏదో అంటే అస్తమానూ అదేనా!" సిగ్గుపడింది హైమ.

"ఆవిడ అనడం, నువ్వు పడడం రెండూ బాగానే ఉన్నాయి. మధ్య నాకా అక్షింతలు! బాగా నేర్చావమ్మా

మాటలు! అయినా అక్కగారంటే బంధువు. మరి నేనేమో పరాయిదాన్ని. కలికాల మాహాత్మ్యం !" అంది బుగ్గలు నొక్కుకుంటూ.

అందరూ నవ్వేశారు.

"నామాట చెప్పలేదు—" నిధి నసిగాడు.

"ఏం కోరుకుంటే అదే — మీ బావగారి సెలవ యిందిగా."

"అయితే రేపు ఆదివారంకదూ. పిక్నిక్‌కి రావాలి" చల్లగా వదిలాడు నిధి. అసలు ఈ విషయం ఎత్తేషం ఎల్లాగా అని సతమతపడుతున్న అతనికి ఈ రకమైన సంభాషణ మంచి అనువిచ్చింది సులువుగా చెప్పెయ్యడానికి.

"ఏమిటీ !!!" అనూరాధ, హైమ ఒక్కసారే అన్నారు నిశ్చేష్టులైపోతూ.

మళ్ళీ చెప్పాడు నిధి.

"నీకేమైనా మతిపోతోందా తమ్ముడూ ! రెండు నెల్లు కూడా లేవుకదా మా పరీక్షలు ! చదవవలసింది కొండంత ఉందాయె. దీనికితోడు టైం గడవక బాధపడి పోతున్నట్టు పిక్నిక్ ఒకటా!"

"అంత క్షణాలు వృథా చెయ్యకుండా చదవగల వటమ్మా! చదివినా ఎక్కడంలేదని హైమ అంటుండే! ఇంత మెదళ్ళు వేడెక్కేలా చదివి ఏంలాభం? కొంతైనా విశ్రాంతి ఉండవద్దూ ?"

"మీకింకా చాలా రోజులున్నాయి గనక నీపని హుషారుగా ఉన్నట్టుంది!" అంది అనూరాధ.

"ఒక్కరోజుకేం పోదులెద్దూ. పరీక్షలంటే నాకూ తెలుసు!" అన్నాడు నిధి.

"ఇది నీకు పుట్టిన బుద్ధేనా లేక—" విశ్వంకేసి అనుమానంగా చూస్తూ అంది అనూరాధ.

"సరి సరి! ఇక నీకు నేనే దొరికాను అన్నిటికీ. అతన్నేదో కోరుకోమన్నావు. తీరా కోరుకున్న తరువాత వెనక్కి తగ్గుతావా? ఇదేనా గృహిణీ ధర్మం అంటే?"

"ఏమిటన్నయ్యా, నువ్వూను! మా చదువంటే నీకింత అలుసుగా ఉంది?" హైమ అడిగింది గోముగా.

"రేపొక్క రోజుకీ నామాట వినమ్మా! నీకు క్లాస్ వచ్చే పూచీ నాది." విశ్వం హైమకు హామీ ఇచ్చాడు.

"మరి నామాట?" అనూరాధ అడిగింది.

"నీకు తెలియాలి!" తనకేమీ పట్టనట్టు అన్నాడు విశ్వం.

"చూశావా తమ్ముడూ, ఆయనగారి మాటలు. నేనేమైపోయినా ఆయన కక్కర్లేదు."

"మీలో మీరేదో అనుకుని నామాట వదిలేశారు" అన్నాడు నిధి మళ్ళీ గుర్తుచేస్తూ.

"నేను రాలేను నాయనా! నన్ను బలవంత పెట్టకు నీకు పుణ్యం ఉంటుంది."

"అయితే మాకేనా! అతనేదో ముచ్చటపడి అడిగితే కాదంటే నీ సొమ్మేం పోయింది?" ఏమమ్మా నువ్వూ

అంతే అంటావా మీ వదినలాగ !" ఇద్దరినీ కలిపి అడిగాడు విశ్వం.

"సరే అన్నయ్యా. ఒక్కరోజు కేమిట్లే !" అంది హైమ సమాధానపడి.

"సరే. అయితే నువ్వు వెళ్లు. నీకు మీ అన్నగారి భరోసా ఉందిగా? నేను మాత్రం రాలేను" అంది అనూరాధ.

"ఓహ్హో! పెద్ద చదివావు లేవమ్మా చదువు ! ఒక్క రోజుకి ఏకోపుట్టి మునిగిపోతుంది గాబోలు. నువ్వు చదివిన చదువే గాబోలు మా అవుదూడ కూడా తెగవల్లిస్తోంది ! రాదుట!—గొప్ప-పోనీ అన్నయ్యా, వానివాళ్ళ నొందాక పోరతాం!" చంటిపిల్లలా మూతి మూడు వంకర్లు తిప్పుతూ అంది హైమ.

"సరే ! నేనూ వస్తాను. మీ అందరి దృష్టీ పడ్డ తరవాత నేనింటి దగ్గర కూర్చున్నా నా చదువు సాగదు. ఇంతకీ ఎక్కడికిట!"

"కొంచెం లావు తగ్గేచోటికే" నవ్వుతూ అన్నాడు విశ్వం.

"ఏమాత్రం దూరం నడక ?" అనూరాధ అడిగింది.

"శాంతి ఆశ్రమందాక బండి. అక్కడినుంచి సుమారు మైలున్నర ఇసుకలో నడక. లాసన్స్ బే అని చెప్పలేదూ? అక్కడికి" అన్నాడు నిధి.

"మరి తిరిగిరావడం?" హేమ అడిగింది.

"సాయంకాలం. ఆపైన సినిమా, అంతా నైట్ ప్రోగ్రాం" నిధి అన్నాడు.

"పొద్దుననుంచి సాయంకాలందాక అక్కడే! ఏం పొద్దుపోతుందయ్యా!" అనూరాధ అడిగింది.

"నువ్విక్కడకూర్చుని ఆలోచిస్తే అలా గేఉంటుంది. అసలక్కడికి వెళ్ళిం తరవాత తిరిగి రావడాని కెంత బాధ పడతావో!"

"సరే ఒప్పుకున్నాంగా. భోజనాలకి లేవండి" అంది అనూరాధ.

"నా కక్కడ భోజనం దండుగ: ఇక్కడ నువ్వు మళ్ళీ వండుకోవడం. ఎందు కివన్నీ? మళ్ళీ వస్తాను పొద్దున్నే" అన్నాడు నిధి.

"చాల్చాల్లే నేర్చుకున్నావ్! ఇంత సేపూ ఇంత మారాంచేసి ఇప్పుడు వెళ్ళిపోతాననటావ్? నీ కోసం నే నిప్పుడేం వండి వార్చటంలేదు లే. మీ ఇంటికి వచ్చినప్పుడు మిమ్మల్ని ఇబ్బంది పెట్టకుండా ఎక్కడైనా భోంచేసి వస్తాం లే!" నిష్ఠూరంగా అంది అనూరాధ.

"పోనీ అతన్ని వెళ్ళనివ్వరాదూ? పొద్దున్నే లేవ గలడా ఇక్కడ భోంచేస్తే!" విశ్వం కన్నుగలుపుతూ అన్నాడు.

"నా చేతి కూడుతింటే లేవలేడంటున్నారే, మరి మీరు పూట పూట ఇక్కడే భోంచేస్తున్నారు. మీరు

కడుపునొప్పిగాని, వాంతులుగాని వచ్చినట్టు నాకు గుర్తు లేదే" అంది అనూరాధ వెక్కిరింపుగా.

"అయితే బావగారూ, నేనిక్కడే ఫోంచేస్తాను. ఆ కడుపునొప్పి అంతో, మీ ఈర్ష్య అంతో తేల్చుకోవాలి."

"బాగా చెప్పావు తమ్ముడూ. వండిపెడితే తినడం చేతకాక దెప్పులొకటి!"

"బాగా కనిపెట్టావమ్మా! నోబెల్ ప్రైజు ఇవ్వవచ్చు నీకు. నువ్వు ముప్పితంగా పెడతానంటే గునిశా రాయన. అన్నయ్య వేళాకోళం చేసేసరికి తనే తింటా నంటున్నారు. అన్నయ్యెందుకలా మాట్లాడాడో బాగా కనిపెట్టావ్!" హైమ అనూరాధను ఎత్తి పొడిచింది.

"నీపాటి నాకూ తెలుసు లేవమ్మా! ముందు వచ్చిన చెవులకంటె వెనకొచ్చిన కొమ్ములు వాడిట! నిన్నకాక మొన్నవచ్చి నాకు చెప్తావు మీ అన్నగారి సంగతులు! తల్లి పుట్టిల్లు మేనమామ కెరుక!" తల తిప్పుతూ అంది అనూరాధ.

"ఎంత బాగా మాట్లాడతావమ్మా నువ్వు! నీకు నోబెల్ ప్రైజు తప్పకుండా సిఫార్సు చేస్తాను. అదిసరేగాని పొద్దున్న వెళ్ళి సాయంకాలానికి వస్తే ఈ లోపున తిండి మాట?" అడిగింది హైమ, అట్నుంచి అనూరాధకు మాట అందించి.

"ఇద్దరు ఆడవాళ్ళున్నారు. మీకివి మేం నేర్పాలా! ఇన్ని బియ్యం, ఇంత పప్పు, కాస్త ఆవకాయ, పెరుగు తీసుకు వెళ్ళితే నాలుగు చితుకులు ఏరి ఏదో వండెయ్య లేరూ!" అన్నాడు నిధి.

"నచ్చావోయ్ నాకు" అంటూ నిధి బుజం తట్టాడు విశ్వం.

హైమ మరునాటి చదువు చెడిపోబోతున్నందుకు నిధిని నిష్ఠూరం ఆడుతూ పొద్దున్నే వస్తానంటూ ఇంటి దారి తీసింది.

మర్నాడు పొద్దున్న ఏడు గంటలకల్లా హైమ వచ్చేసింది. నిధి ఊళ్ళోకి వెళ్ళి ఒక కుర్రవాణ్ణి, ఒక బండీని లాక్కు వచ్చాడు. తగినసామాను, ఒక జంబుఖానా అన్నీ తీసుకునే తయారైంది అనూరాధ.

బీచ్ రోడ్డంట సాగుతూంది బండి. హవామహల్ దాటి స్కాండల్ పాయింట్ వరకు తారు రోడ్డు అక్కడ మూడురోడ్ల కూడలి. ఎడం పక్కకు పోయేరోడ్డు వాల్తేర్ క్లబ్ మీదుగా యూనివర్సిటీ ఇవతల నాలుగు రోడ్ల జంక్షన్ మీదుగా వాల్తేరు స్టేషన్ వరకు పోతుంది. తిన్నగా సముద్రపు టొడ్డునే వెళ్ళేది ఆనందగజపతి రోడ్డు. స్కాండల్ పాయింట్ దగ్గరే రామకృష్ణా మిషన్ సత్రం. అక్కడి నుంచి కుడిచేతివేపు ఏరాడకొండ, డాల్ఫిన్సునోస్, లైట్ హౌస్ అన్నీ కనబడతాయి. ఎదురుగుండా అనంత జల రాశి. ఎడమచేతివైపు చెట్లు, కొండలు కనబడతాయి. ఈ

ఆనందగజపతి రోడ్డు వట్టి నేతిబీరకాయ! అన్నీ గతుకులే! కంకరరోడ్డు. పైన వేసినమట్టి గాలికి కొట్టుకుపోతే సూదుల్లా గుచ్చుకుంటూ ఉండే రాళ్ళు. అయినా ఆ సముద్రపు అందం అనుభవిస్తూ పోవాలంటే అదేదిక్కు. మైలు దూరంలో ఉండే పిఠాపురం హోస్టలు అక్కడినుంచీ కనబడుతూనే ఉంటుంది. ఆ రోడ్డమ్మటే తిన్నగా వెళ్ళి పిఠాపురం హోస్టలు అవీ గడిచి పామ్ బీచ్ పక్కనుంచి చినవాల్తేరు మీదుగా శాంతిఆశ్రమం చేరుకోవాలి. బండి అక్కడ ఆగింది.

శాంతి ఆశ్రమం ప్రకృతి వైద్యాలయం. ఆ పేరెంత ఆలోచించి పెట్టారో గాని మరో ప్రపంచంలో అడుగిడినట్టుంది. అక్కడికి చేరేసరికి నిశ్శబ్ద వాతావరణం. రెండు చిన్న బంగళాలలాంటివి ఉన్నాయి. సరుగుడు చెట్ల మధ్యనుంచి దారులు. అడుగడుగునా నీతిని బోధించే సైన్ బోర్డులు. ఎల్లాంటివారికైనా మనస్సంతా ప్రశాంతతతో నిండిపోతుంది అక్కడికి వస్తే. ఎదురుగుండా సముద్రం. ఒడ్డున పల్లెవాళ్ళు వలలుపరిచి ఎండబెట్టుకుంటారు. బెస్తలు చిన్నచిన్న నావలమీద సముద్రంలోకి చొచ్చుకుపోతారు చేపలకోసం. ఉవ్వెత్తుగా ఎగిరిపడే కెరటాలతో పైకీ కిందకీ పడుతూంటాయి పడవలు. మరీ దూరం వెళ్ళిపోయిన పడవల తెరచాపలు మాత్రం కనబడతాయి. నీలంగా ఉండే నీళ్ళలో కెరటాలు విరగడంవల్ల ఏర్పడిన నురుగు తెలుపు రంగూ యీ నావల తెరచాపల తెలుపు రంగూ వింతగా కనబడతాయి.

కుడిచేతి పక్కకు తిరిగి ఒడ్డమ్మటే ఇసకలో వెళ్లాలి లాసన్సబే కు. ఎదురుగా నీటిని తాకుతుందా అనిపించేలాగ ఉంటుందొక పెద్దకొండ. అరఫర్లాంగు దూరంలో ఉందని పించే కొండ ఎంత నడిచినా దగ్గరకు గాదు.

అప్పటికి ఎనిమిదిన్నరో ఎంతో అవుతుంది. శీతా కాలపు ఎండ సుఖాన్నే కలిగిస్తున్నది. అనూరాధ, హైమ వగురుస్తూ నడుస్తున్నారు. విశ్వానికీ, నిధికీ ఈ ప్రపంచపు ఉనికే గుర్తులేదు. ప్రకృతిలో లీనమై యాంత్రికంగా నడుస్తున్నారు.

అక్కడ కనబడే ప్రతి అణువులోనూ అవధులు లేని సౌందర్యమే గోచరిస్తున్నది వారికి. ప్రకృతి చూసి ఆనందించగల హృదయమే ఉండాలి గాని తన్మయం పొందడం ఎంత సులువు! అవధులులేని జలనిధి ఎక్కడో ఆకాశంతో చేతులు కలుపుతున్నట్టే ఉంది. ఒకటి లేత నీలిరంగుది. మరోటి ముదురు నీలపుది. ఈ సముద్రపు ఒడ్డున ఆలోచించేనేమో విశ్వ వైజ్ఞానికుడు రామన్ తన కృషిలో సఫలత పొందడం! ఆ ఇసుక-చిన్న చిన్న రేణువులు నల్లగా మెరుస్తుంటాయి— మోనజైట్ ఇసుక అని అనుమానం కూడాను ఆ ఒడ్డున నిలబడి ఆలోచిస్తుంటే, న్యూటన్ మొదలు ఐన్‌స్టయిన్ వరకు భౌతిక విజ్ఞాన వేత్తలందరూ జ్ఞప్తికి వస్తారు.

ఎదురుగా కనబడే కొండ తిరిగితే అదే లాసన్స బే.

ఒక అరమైలు దూరంపాటు సముద్రం ఒడ్డుకు చొచ్చుకు వచ్చింది అర్థచంద్రాకృతిగా. అక్కడ ఒక యాభై అరవై గజాలపాటు లోపలికి సముద్రం. అట్టే లోతుండదు. విశాఖపట్నం దుప్పాడుగునా పదపదిహేను అడుగులు సముద్రం లోపలికి వెడితే ఇంక అఖాతమే అటువంటిది ఇక్కడమాత్రం లోపలికి వెళ్ళడానికి వీలుగా ఉంటుంది. ఉవ్వెత్తుగా ఎగిరిపడే కెరటాలతో ఆడుకుంటూ ఆ మాత్రం దూరం సముద్రంలోకి పోగలిగితే ఆనందం అనుభవించిన వాడికే తెలుస్తుంది.

ముందు సముద్రం. వెనకాల కొండలు కలుసుకునే దృశ్యం. కొండలు కలుసుకున్న చోటునుండి సముద్రంవేపు కొంతదూరం ఏటవాలుగా ఉంటుంది. ఆ తరువాత ఇసుక. అందులో చక్కని తాటితోపు. రకరకాల ఎత్తులతో శోభాయమానంగా ఉంటాయా చెట్లు ఒక్క తాటిచెట్టు చూస్తే అసలందమే కనబడ దందులో. అదే వందల గుంపులో ఒక తోపులా వున్నప్పుడు చూస్తే ఆ సౌందర్యం చెప్పతరంకాదు. కుడిచేతిపక్క ఇప్పుడు తిరిగివచ్చిన కొండ. ఎడంచేతి పక్కకి పర్వత శ్రేణులు ఎదురుగా అపారజలరాశి. బాధ్యతలు లేకపోతే అక్కడ ఒక కుటీరం వేసుకుని రోజూ సముద్రస్నానంచేస్తూ దొరికినవి తిని సంతృప్తిపడితే, ప్రపంచం ఏమైపోయినా విచారించని నిర్లిప్తత ఆవరించి ఒక్క ఆనందంతో మాత్రమే మనస్సంతా నింపుకోవచ్చు!

అక్కడికి చేరేవేళకు ఇంతసేపూ ఆవహించిన

నిస్పృహా, ఆయాసం ఒక్కసారి వీడిపోయినట్లయింది అనూ రాధ, హైమలకు.

నిధి, విశ్వం ఒక్కసారిగా చంటిపిల్లలై పోయారు. చొక్కాలు గట్టున పడవేసి నీళ్ళలో దూకారు. అనూ రాధ, హైమలకు నవ్వాగింది కాదు వాళ్ళ చిలిపితనం చూసి. గంటసేపు నీళ్ళలో ఆడి ఆడి గట్టుకు వచ్చారు.

ఇంతలో నిధికి ఒక ఊహ వచ్చింది. అక్కడి పడవ వాళ్ళతో మాట్లాడి పడవ ఒకటి కుదిర్చాడు, ఒకటి రెండు మైళ్ళు అలా సముద్రంలో తిప్పి తీసుకురావడానికి. అనూ రాధ, హైమ ఇంతసేపూ వాళ్ళిద్దరే ఆ ఆనందం అనుభ వించడం చూసి మానవ సహజంగా అసూయపడ్డారు గాని, దీనితో వారి కా బాధ తీరిపోయింది.

అంతా నావలోకి ఎక్కి కూర్చున్నారు పల్లెవాడు పదం అందుకుంటూ తెడ్డు వేస్తున్నాడు. అదిగదిగో అను కుంటుండగానే వచ్చేసింది కెరటం ! పడవ ముందుభాగం ఒక్కసారిగా పైకిలేచింది తరంగంతోపాటు. గుండెలు జల్లుమనేలోగానే ఒక్కసారిగా అగాధంలోకి దించుకు పోయింది. గుండెలు చేతపట్టుకుని కూర్చున్నారు అనూ రాధ, హైమాను. కాని ఆ అనుభవంలో ఉన్న 'థ్రిల్' మాత్రం వారిని ఆ భయానికి అతీతులను చేసి వారి హృద యాలను సంతోషంతోనే నింపింది.

మానవత్వంలోని వైరుధ్యం అక్కడే ఉంది. వరద లలో ఎంతో భయానకంగా, బీభత్సంగా నదులు విజృం

భిస్తుంటే- ఇల్లు కొట్టుకుపోయినవారు, పశువులు నష్టపడినవారు, పంటలు నాశనం అయినవారు దుఃఖంతో ఆక్రోశిస్తుంటారు. కాని వరదలు ఎల్లా ఉంటాయో, అంగుళం అంగుళం చొప్పున నీటిమట్టం ఎల్లా పెరుగుతుందో, కూలిపోయిన ఇళ్ళకప్పులు, పశువుల శవాలూ అవీ ఎల్లా కొట్టుకు వస్తాయో— భయం, ఉద్వేగం, ఉత్కంఠలతో ఒడ్డున నిలబడి చూస్తుంటారు జనం. మైళ్ళకు మైళ్ళు సైకిళ్ళమీద, బస్సులమీద, బళ్ళమీద, కార్లమీద వచ్చి చూసిపోతుంటారు ఆ దృశ్యం. అప్పటివారిభావాలకు అర్థం చెప్పడం సాధ్యంకాదు. ఇంకా ఉత్కంఠ తీరనివాళ్ళు, ప్రాణాలకు తెగించి ఆ వరదలో నదిలోకి చొచ్చుకు పోతారు పడవవాళ్ళకు అడిగిన ధనం ఇచ్చి, ప్రవాహంలో కొట్టుకువచ్చే కలపకోసం, గోనెలమీద బయలుదేరుతారు పల్లెవాళ్ళు. ఇదీ మానవ ప్రకృతి.

ఆ సముద్రంలో అలల మధ్య పైకిలేస్తూ కిందికి దిగుతూ సంభ్రమాశ్చర్యాందోళన మిశ్రమమైన అనుభూతితో ఒక గంటసేపు తిరిగి వచ్చారు ఒడ్డుకు. బట్టలన్నీ పూర్తిగా తడిసిపోయాయి. నీళ్ళలో నానిపోయారంతా. ఏ జ్వరమేనా రావచ్చుననే ఊహకూడా వదిలివేసి సంచరించారు.

ఒడ్డుకువచ్చి బట్టలు మార్చుకున్నారు. అప్పటికే పదకొండున్నర అయింది. ఈ ఆయాసాలతో పొద్దున్న

తిన్నదంతా అరిగిపోయి ఆకలి ముంచుకు వచ్చింది అందరికీ.

వదినా మరదళ్ళిద్దరూ అటు ఇటు తిరిగి చితుకులు ఏరుకువచ్చి మూడు రాళ్ళు పొయ్యిగా అమర్చి పెసర పొప్పు బియ్యం కలిపి ఇంత పులగం కలియబెట్టారు.

చెట్ల నీడను జంబుఖానా పరిచి అంతా దానిమీద ఆసీనులయ్యారు. ఆ పక్కనేదో మర్రిచెట్టుంటే దాని ఆకులు నాలుగు కోసుకు వచ్చి విస్తళ్ళు కుట్టారు. ఇంతింత ఊరగాయ, నెయ్యి కలుపుకునీ, పెరుగు కలుపుకునీ, ఆ పులగంతో కడుపులు నింపుకున్నారు. 'క్షుధాతురాణాం న రుచిర్నపక్వం!' అన్న సూక్తి అక్షరాల సత్యమని నిరూపించారు.

భోజనాలు అయ్యేసరికి ఒంటిగంట అయింది. ఒక్క క్షణంలా గడిచిపోయింది. చల్లనిగాలి, పట్టణపు గడబిడలు లేని ప్రశాంత వాతావరణం ప్రకృతి రామణీయకం అన్నీ కలిసి వారి మనస్సులలోని విషయాల నన్నిటినీ కొంతసేపు పూర్తిగా అవతలకు నెట్టాయి. రెండు నెలలలోపున పరీక్షలు, చదవవలసినది కొండంత ఉన్నదంటూ యిటు రావడానికే భయం వెలిబుచ్చిన అనూరాధ, హైమలకు ఆ విషయమే గుర్తు లేదు.

అంతా తీరుబడిగా కూర్చుని పేక బయటకు తీశారు. విశ్వం, హైమ, అనూరాధ, నిధి పార్టీలుగా ఏర్పడి, ఆడ్డటకు ఉపక్రమించారు.

ఆట గడిచే కొలది విశ్వం చిలిపిగా దొంగ ఆట ఆడడం మొదలుపెట్టాడు. ముక్కలు హైమకు చూపించి తురుపు చెప్పించి ఆటలు నెగ్గడం ఆరంభించే వేళకు అనూరాధకు ఉక్రోషం ఎక్కువై విరుచుకుపడింది.

"అంత స్వార్థం ఎందుకు? డబ్బు పోయేదేం లేదు గదా! అయినా ఆ దొంగాట ఎందుకో?" అంది అక్కసుగా ముక్కలు కింద పడేస్తూ.

"స్వార్థమా! సరదాకి ఆడే ఆటలోనే యీ మాత్రం ఓర్చలేకపోయావే, నీదా, నాదా స్వార్థం?" నవ్వుతూ అన్నాడు విశ్వం.

"నాదా స్వార్థం? అనడానికి నోరెల్లా వచ్చిందడీ? నేను న్యాయం కోసం చెప్పాను. తప్పుడు ఆట ఆడింది మీరు. పైగా నాది స్వార్థంట! తమ్ముడూ, ఊరుకుంటావేం?"

"తమ్ముడు ఊరుకోక ఏం చేస్తాడు! సరదాకి ఆడే ఆటకదా! స్వార్థం కాకపోతే ఆ మాత్రం ఓర్చలేవా!" విశ్వం రెట్టించాడు.

"హవ్వ!!" అన్న అనూరాధకు తెరిచిన నోరు అల్లాగే ఉండిపోయింది కొన్ని క్షణాలు ఆశ్చర్యంతో. కావాలని తప్పు ఆట ఆడింది ఆయన! తానూరుకోలేకపోవడం తన స్వార్థంట! ఇంకేం చెప్పగలిగింది గనుక!

"స్వార్థం ఉండడం తప్పనటం లేదు. కాని నువ్వు స్వార్థం ఉంచుకుని యితరుల ననడం తప్పంటున్నాను" అన్నాడు విశ్వం మందహాసంతో.

"అయితే బావగారూ! స్వార్థం ఉండడం తప్పు కాదంటారా?" అన్నాడు, వాదనలంటే చెవి కోసుకునే నిధి.

"అయితే యింతకీ తప్పంటావేమయ్యా నువ్వు?" అదే నిష్కల్మషమైన నవ్వుతో అన్నాడు విశ్వం.

"అబ్బే అల్లా ఎందుకంటాడూ-మానవులకు ఉండవలసిన మంచి గుణాల్లో మొదటిది అంటున్నాడు. లేకపోతేనూ—" అంది అనూరాధ వెటకారంగా.

హైమ పెదాలు బిగించి నవ్వు అణుచుకుంటూంది ఆ ముగ్గురి మాటల తీరుకు.

"రాధా! నేను నవ్వుతూ అన్నాను గాని వేళాకోళంగా అనలేదామాట! నిజంగా మానవులకి స్వార్థం అంటూ లేకపోతే యీ విజ్ఞానం యింత పురోభివృద్ధి పొంది ఉండేది కాదు" అన్నాడు విశ్వం.

"ఏమిటీ!" అంది అనూరాధ మహాశ్చర్యంగా.

"నిజమే! విజ్ఞాన చరిత్ర అడుగడుగునా అదే చాటు

తున్నది. పదార్థాలమధ్య పరస్పరం ఒరిపిడివల్ల ఉష్ణం ఉత్పన్నమౌతుందని తెలియడం — తుపాకులు తయారు చేసేటప్పుడు ఆ గొట్టాలను తయారుచెయ్యడంలో యినుము దొల్చినప్పుడు పుట్టిన వేడివల్ల వాళ్ళచేతులు బొబ్బ లెక్కితే ఆ ఉష్ణం ఎందుకు వస్తున్నదనే పరిశీలన జరపడం వల్ల. తుపాకి అంటే — మారణాస్త్రం. మానవుల స్వార్థానికి చిహ్నం. ఆత్మరక్షణ పేరుతో అఘాయిత్యాలకుపయోగించే సాధనం. దీని కేమంటావ్? ఇంకా కావాలా? మోటారు కారులో యంత్రం ఏమిటి? అంతర్దహన యంత్రం. అదెలా ఉద్భవించింది? తుపాకి సూత్రం మీదే! తుపాకి మందును హఠాత్తుగా వ్యాకోచం చెందిస్తే ఆ ఒత్తిడికి శరవేగంతో గుండు దూసుకుపోతోంది. మొట్టమొదటి అంతర్దహన యంత్రంలో అదే చేశారు. ఒక సిలెండరులో ఒక పిస్టన్ ఉంచి కింద తుపాకిమందు పేల్చారు. ఆ ఒత్తిడికి పిస్టన్ పైకి లేచింది. దాన్నే మల్చుకుని ఆధునికమయిన మోటార్లను నిర్మించారు. రాడార్ జననానికి మూలం ఏమిటి? శత్రు విమానాలని గురితప్పకుండా కొట్టగలగాలనే వాంఛ! ఆటంబాంబు! మానవుని విజ్ఞానపథంలో మైలురాయి. కాని అదెందుకు ఉపయోగించింది? విజ్ఞానాభివృద్ధిలో చాలా భాగం స్వార్థపు టూహలమీదే జరిగింది. లేకపోతే అణు విచ్ఛిత్తిమీద జరిగిన పరిశోధనల ఫలితంగా మొదట ఉద్భవించినది మారణాస్త్రమే ఎందుకు

కావాలి ? అణుగర్భం ఛేదిస్తే అనల్పమైన శక్తి లభ్య మౌతుందని తెలియగానే ఆ శక్తిని మారణ శక్తిగా రూపొందించడానికే వైజ్ఞానికులు ఉపయోగించబడ్డారు. కాని ఆ ప్రయత్న ఫలితమే గదా అణుశక్తి ఉత్పన్నానికి దారితీసింది? విద్యుత్కేంద్రాలకు, తదితర శాంతియుత ప్రయోజనాలకు మార్గం చూపింది ? స్వార్థమే లేకపోతే సంతృప్తి పెరిగిపోతుంది. సంతృప్తి అంటే పురోభివృద్ధికిఅడ్డుకట్ట. ఉన్నదే చాలనుకుంటే లేనిదాన్ని వెతకడమే జరగదు. ఎక్కువ సంపాదించాలనే స్వార్థమే లేకపోతే ఎక్కువ చదువు అక్కర్లేదు ఎక్కువ శ్రమ అవసరంలేదు. ఎక్కువ తెలివి అవసరం లేదు. దాని ఉపయోగంతో మనకి పనీ లేదు" అని ఆగాడు విశ్వం.

ముగ్గురూ తెల్లబోయారు. వారి నోటమాటే రాలేదు. వారి మనసులలో మెదులుతున్న దొక్కటే ఒక ప్రశ్న! నవ్వుతూ, తుళ్ళుతూ, నిరాడంబరంగాను, సామాన్యంగాను కనబడే యీ వ్యక్తిలో యింతలోతు ఎక్కడి నుంచి వచ్చింది! అసలు అతను ఇంత ఎప్పుడు చదివాడు? సైన్సు వాళ్ళెందుకూ చాలకుండా విజ్ఞాన చరిత్రంతా ఏకరువు పెట్టాడే ? లోపల యింత తెలివీ తర్కం ఉంచుకుని కూడా సాధారణంగా పైకి తేలకుండా తనలోనే యిముడ్చుకుంటాడే, అదెలా సాధ్యం అని!

వారు తెల్లబోయారని గ్రహించిన విశ్వం గబుక్కున ప్రసంగం మార్చాడు.

"అరె! అటు చూడండి!" అంటూ ఆకాశం దిక్కుగా తల ఎత్తాడు.

యాంత్రికంగా ఊర్ధ్వ ముఖులైనవారంతా ముగ్ధులై పోయారు ఆ దృశ్యం చూసి.

సూర్యుడు రంగులు మార్చుకుని ఎర్రబడ్డాడు. ఆకాశంలో ఆ భాగం అంతా కుంకం పులిమినట్టుంది. ఆ ఛాయలో పచ్చని చెట్ల ఆకుల చివర్లు వింత కాంతితో మెరుస్తున్నాయి. అదొక విచిత్ర వర్ణార్ణవం. వర్ణనకు అతీతమైన అనుభూతిని కలుగజేసి మంత్ర బద్ధులుగా మానవులను నిలవేసే శక్తి ఆ దృశ్యాలకు ఉంది.

తనివి తీరకపోయినా మనస్సులు కట్టుకుని లేచారంతాను. వెళ్ళిపోవాలనుకునేసరికి ఎంతో నిస్పృహ ఆవరించిందందరిని. తిరిగి వచ్చేటప్పుడు ఆ మైలున్నర యిసుక దారే, పది మైళ్ళు నడిచినంత శ్రమ కలిగించింది. బస్సు కోసం అరగంట ఆగి, మొత్తానికి ఎలాగయితేనేం యిల్లు చేరుకునేసరికి రాత్రి తొమ్మిదయింది. సినిమా కార్యక్రమం రద్దుచేసి దారిలోనే నిధిని హాస్టల్‌కు పంపించేశారు.



# 15

మహిళా మండలి తోడి అనుభవాలు నేర్పిన పాఠాల ఫలితంగా శైలజకు కొత్త పరిచయాలన్నా, తానై కల్పించుకొని ఇతరుల ఇళ్ళకు వెళ్ళడం అన్నా విరక్తి బయలుదేరింది. రమణి గుర్తుకువస్తే ఈ భావం మరింత బలపడేది. అందుకే ఖాన్ కాంపులకు వెళ్ళినా పుస్తకాలు చదువుకోవడంతో గడిపేసేది.

ఒకరోజున శైలజ అప్పుడే కాలేజినుంచి వచ్చి దుస్తులు మార్చుకుని కూర్చుంది. ఖాన్ ఇంకా ఇంటికి రాలేదు.

వీధిలో కారు ఆగిన శబ్దం అయితే ఖానే అనుకుని చిరునవ్వుతో ఎదురు వెళ్ళబోయిన ఆమెకు ఒక అపరిచిత వనిత లోపలకు రావడం ఆశ్చర్యం గొలిపింది.

సభ్యతకోసం "రండి" అంటూ సాదరంగా ఆహ్వానించింది.

ఆ వచ్చినామె కుంకం భరిణె తెరిచి శైలజకు బొట్టు పెట్టి, "రేపు మా అబ్బాయి పుట్టినరోజు. మీరు తప్పకుండా రావాలి" అంటూ పిలిచింది.

"మీరు-" పరిచయంకోసం తడబడింది శైలజ.

"ఈ నాలుగిళ్ళ అవతలే మా ఇల్లు. నాపేరుఉమ" అంటూ ఎంతో కలుపుగోలుతనంతో మొదలుపెట్టి, తన

భర్త ఇన్‌కంటాక్స్ ఆఫీసరనికూడా ఎరుకపరిచింది. చాలా చక్కగా అనిపించా యీ మాటలు శైలజకు.

ఉమ వెళ్ళిన తరువాత, గృహిణి కాగానే ఇటువంటి బాధ్యతలు కూడా కొన్ని నెత్తిన పడతాయి కాబోలు అనుకొంది శైలజ. రమణితోడి పరిచయ పర్యవసానం జ్ఞప్తికివచ్చి మళ్ళీ ఈ కొత్తఃంకె ఎందుకా అని సంశయించింది. కాని బొత్తిగా గర్వం అనుకుంటారని వెళ్ళడానికే నిశ్చయించుకుంది.

మూడో పుట్టినరోజని ఉమ చెప్పడంవల్ల ప్యూన్‌ను పంపించి ఆ పిల్లవాడికి సరిపోయే లాగూ, చొక్కా తెప్పించింది.

మర్నాడు సాయంకాలం ఉమ ఇంటికి వెళ్ళింది శైలజ.

తమ ఇంటికి ఇంచుమించు ఫర్లాంగు దూరంలో ఉంది వాళ్ళిల్లు.

శైలజనుచూసి సంతోషంతో వికసించిన ముఖంతో లోపలకు తీసుకువెళ్ళి కూర్చొబెట్టింది ఉమ.

అతిథుల సంఖ్య తక్కువగానే ఉంది. ఇంచుమించు అంతా ఆఫీసర్ల భార్యలే. అందుకే తనకూ ఆహ్వానం వచ్చి ఉంటుందనుకుంది శైలజ.

తంతు ముగిసిన తరువాత అందరితోబాటు శైలజ కూడా సెలవు తీసుకోబోయింది.

"ఇంటిదగ్గర తొందర పన్లున్నాయా ?" అడిగింది ఉమ.

"అబ్బే!" అంది శైలజ.

"అయితే కొంచెం కూర్చోరాదూ ! ఇరుగు పొరుగునే ఉంటున్నా ఇంతవరకు కలుసుకోవడమే పడ లేదు" అంది ఉమ.

కాదూ కూడదని పట్టుబట్టడం ఎబ్బెట్టుగా తోచి శైలజ ఉండడానికే అంగీకరించింది.

శైలజకు ఇల్లంతా చూపించింది ఉమ. ఆధునిక పద్ధతిలో నిరాడంబరంగా అలంకరించి ఉంది ఇల్లు.

హాల్లో కూర్చున్నారు తిరిగి వచ్చి.

"మిమ్మల్ని ఇబ్బంది పెట్టినట్టున్నాను, క్షమించండి" అది ఉమ.

"ఇబ్బంది ఏమీ లేదండి—"

"మీతో పరిచయం వృద్ధి చేసుకోవాలనిపించింది. అందుకే ఆపేశాను, మీరేమైనా అనుకుంటారని తోచినా" అంది ఉమ. ఆమాట్లాడే తీరులో నిర్మలత ఉట్టిపడుతూంది. ఉమ ప్రవర్తనలో ఎక్కడో హైమ ఛాయలున్నాయేమో అనిపించింది శైలజకు. అందుకే కొత్త పరిచయాలు వద్దను కున్నా అల్లా ఉండలేకపోయింది. "ఏం, ఏమిటి నాలో ప్రత్యేకత ?" నవ్వుతూ అడిగింది.

"నన్ను గురించి మీకు తెలియకపోయినా మిమ్మల్ని

గురించి నాకు తెలుసు. మాధురీదేవి మా ఫామిలీ డాక్టర్. ఆమె మిమ్మల్ని గురించి ఎంతగానో చెప్పింది. అదీకాక స్వతంత్ర భావాలను ఆచరణలో పెట్టగలిగిన వాళ్లంటే నాకెంతో గౌరవం. ఇల్లా అంటున్నానని ఏమీ అనుకోకండి. క్రిందటి మూడు మాసాలుగా మీ పరిచయం చేసుకుందామనుకున్నా ఎల్లా మొదలుపెట్టాలో తెలియక ఊరుకున్నాను. ఇవాళ ఈ అవకాశం దొరకడం నాకెంతో ఆనందంగా ఉంది" అంది ఉమ, శైలజ ముఖంలోకి ప్రసన్నంగా చూస్తూ.

"మీరు నా గురించి లేని గొప్పలేవో ఊహిస్తున్నారు. మనమంతా పరిస్థితులకు బానిసలమే. మీ ఆదరణకి నా ధన్యవాదాలు. వారీపాటికి వచ్చి ఉంటారు. మళ్ళీ కలుద్దాం" అంటూ సెలవు తీసుకుంది శైలజ.

సగం దూరంవరకు సాగనంపింది ఉమ.

మర్నాడు ఉమ శైలజ ఇంటికి వచ్చింది.

మొదట్లో శైలజ తనకు తానై ఉమను తరచు కలుసుకోకపోయినా ఆమే ఇంచుమించు రావడంతో అనుకోకుండానే వారి స్నేహం బలీయం కాజొచ్చింది. రోజులు గడిచేకొలది ఉమ స్వభావంలో అవధులులేని మంచితనమే గోచరించడంతో శైలజలో ఉండే సహజ స్నేహశీలం విజృంభించి వారిద్దరినీ మరింత దగ్గరకు తీసుకు వచ్చింది. ఇంచుమించు రోజూ కలుసుకుంటూండేవారు.

ఒకమాటు రెండు రోజులపాటు ఉమ రాలేదు. శైలజ మనస్సు ఉండబట్టక ఉమ ఇంటికి వెళ్ళింది.

ఎందుకో బయటకు వచ్చిన ఉమ, శైలజను చూసి ఉప్పొంగిపోయింది.

"చుట్టాలొచ్చి ఈ రెండు రోజులూ కదలలేక పోయాను. ఇవాళ వద్దామనుకుంటుండగా నువ్వేవచ్చావ్" అంది ఉమ, నిండు హృదయంతో శైలజను హాల్లోకి తీసుకువెడుతూ.

"చుట్టాలెవరు?"

ఉమ సమాధానం చెప్పేలోగానే "అక్కయ్యా!" అని అరుస్తూ, చెంగున ఎగిరే లేడిపిల్లలా పరుగెత్తుకుంటూ పదిహేడేళ్ళ మెరుపుతీగలాంటి పిల్ల వచ్చి, అక్కగారు ఒక్కతే లేకపోవడం గమనించి, చిలిపితనం చాలించి, సిగ్గుపడి, పొందికగా ఒదిగి నిలబడింది.

శైలజ, ఉమ నవ్వారు.

"ఎల్లు పైబడుతున్నా చిలిపితనం వదల్లేదే నీకు!" అంటూ చెల్లెల్ని మందలించి, "ఇదే మా చెల్లి కమలం. మొన్న ఇదీ, మా వదినా వచ్చారు" అని శైలజతో అని, "కమలా, ఈమే శైలజ. మొన్న చెప్పానా—" అంది పరిచయంచేస్తూ.

"అంటే మిసెస్ అమీర్‌ఖాన్!" ఉరకలువేసే ఉత్సాహం మళ్ళీ పొంగింది కమలంలో.

"అవునమ్మా నేనే. మరి నువ్వేం చదువు కుంటు న్నావ్!" శైలజ అడిగింది కమలాన్ని.

"బి.ఎస్.సి. ఫస్ట్ ఇయర్!" అంది కమలం గర్వంగా.

"లోపలికి పద. మా వదిన్నికూడా చూద్దువుగాని" అంటూ లోపలికి నడిపించింది ఉమ.

"వదినా! వదినోయ్!" దగ్గరగా వేసిఉన్న గది తలుపుల దగ్గరికి వెళ్ళి గబగబ పిలిచింది కమలం.

"అబ్బ! ఏమిటమ్మా అంత మునిగిపోయే పని!" ముస్తాబులో ఆఖరి ఘట్టం బొట్టు పెట్టుకోవడం పూర్తిచేసి ఇవతలకు వచ్చింది ముప్ఫైఏళ్ళ మహిళ.

"ఈవిడేనండి మా వదిన, నళిని. వదినా! వీరే శైలజ—చిన్న అక్క చెప్పలా!" అంది తనే పరిచయం చేస్తూ కమలం.

నళిని, శైలజ పరస్పరం అభివాదం చెప్పుకున్నారు.

శైలజకు కమలం ఉత్సాహం, చైతన్యం ఎంతో ముచ్చటగొల్పాయి.

నలుగురు కూడితే కబుర్లకు లోటేమిటి!

మాటల సందర్భంలో ఉమ "మా నాన్న కింక దీని పెళ్ళిబెంగ ఒక్కటే!" అంటూ కమలాన్ని చూపించింది.

"నేనసలు పెళ్ళే చేసుకోను!" అంది పెంకెగా కమలం.

"ఓహో! ఇంతకంటె పెద్ద కబుర్లు చెప్పినవాళ్ళనే

చూశాం. ఆ మూగమనుషుల్నా పడేదాకానే ఇవన్నీ." వదిన గారు వేళాకోళం చేసింది ఆడపడుచును.

"నాన్నతో చెప్పి నీ ముక్కుకు తాడు వేయించక పోతేను—అందాకా ఇల్లాగే వాగుతూండు!" అక్కగారు అందుకుంది.

కమలం మాత్రం తక్కువతిందా!

"నాన్నవడు నాకు పెళ్ళి చెయ్యడానికి. అంతగా చేసుకోదలుచుకుంటే నేనే చేసుకుంటాను నాకు నచ్చిన వాణ్ని."

"చేసుకుంటావ్, చేసుకోవూ? అసలు ఆఖరి పిల్ల గదా అని గారాబంచేసి నిన్నిలా రణపెంకిలా తయారు చేశారు!" అంది నళిని నవ్వుతూ.

కమలం బుంగమూతి పెట్టి వదినగార్ని తినేసేలా చూసింది.

శైలజ ఏదో అనబోయి ఆగినట్లనిపించింది ఉమకు.

"ఏదో చెప్పబోయినట్లున్నావు!" ప్రోత్సహించింది శైలజను.

"అబ్బే. ఏంలేదు!" సంశయించింది శైలజ.

"ఫరవాలేదు చెప్పండి" అంది నళినికూడా.

"తమ మంచిచెడ్డలు తెలుసుకోగలిగిన వయస్సు వచ్చిన పిల్లలకు వాళ్ళ ఇష్టానికి వ్యతిరేకంగా పెళ్ళి చెయ్యడం మంచిదంటారా?" అంది శైలజ చివరికి.

"అల్లా చెప్పండి మా వదినకి! వాళ్ళు పెద్దల ఇష్టాల

కనుగుణంగా చేసుకున్నారు గదా అని అంతా అంతే అనుకుంటున్నారు!" శైలజ తనకు మద్దతు రావడం కమలానికి ఎంతో సంతోషం కలిగించింది.

"మేం పెద్దల మాటలు విని చెడిపోయిందేమిటి? మనకన్న అనుభవజ్ఞులు, మనకన్న ప్రపంచం చూసినవాళ్లు చేసిందానికన్నా నాలుగేళ్ళ అనుభవంతో మనం ఎక్కువ సాధిస్తామా!" అడిగింది నళిని.

"అరె! అల్లా అంటారేమిటి! పెద్దలు చెప్పారు కదా అని ముక్కు మొగం ఎరగనివాడిని చేసుకోవడంకంటె ముందు వారిని గురించి, వారి అభిరుచులను గురించి తెలుసుకుంటే, ఏకీభావం కుదిరితే సంసారాలు పొందికగా ఉండవూ! కీచులాడుకుంటారా!" శైలజ ప్రశ్నించింది.

"నన్నొకర్ని ముక్కు చెప్పమంటారా! మనం ఎన్ని మాటలు చెప్పినా ఒక మనిషిని గురించి పూర్తిగా తెలుసుకుని ఎన్నుకోగలమని నేను నమ్మలేను. ఎంతకాలం కలసి ఉన్నా ఒక మనిషి స్వభావం మనం పూర్తిగా తెలుసుకోలేం. ఒక మనిషిని మనం ఎంతో కాలంగా ఎరిగి ఉన్నా అతన్ని గురించిన రహస్యాలు తెలియకుండానే ఉంటాయి. తెలిసినా మనం నమ్మలేం, మనకే తటస్థపడితే తప్ప. ఇక సంప్రదాయానుసారంగా అయితే ఆ కుటుంబపు ఆచార వ్యవహారాలు, సామాన్యపు నడతలు పెద్దలవల్ల తేటపడతాయి. ఒక మనిషి ప్రవర్తన పుట్టి పెరిగిన వాతావరణం మీద ఆధారపడి ఉంటుంది గనక ఆ వాతావరణం

తెలుసుకుంటే ఆ మనిషిని గురించిన మన అంచనా నూటికి తొంభై పాళ్లు రైటవుతుంది" అంది నళిని.

"మీరల్లా అంటే నేనొప్పుకోను. పెద్ద పెద్ద సంప్రదాయాలుగల కుటుంబాలలోనుంచి వచ్చిన వాళ్ళెంతమందినో చూశాను. వారు పెరిగిన పరిస్థితులకీ వారి బుద్ధులకీ సహస్రాంశం తేడా ఉంది. ముందే పరిచయం చేసుకుని వారిని గురించి తెలుసుకున్న తరువాతే పెళ్ళి చేసుకున్న వారినీ ఎరుగుదును. వారిలో లోపం కనబడలేదు.. మీకు ప్రత్యక్ష సాక్షం నేనే. ఎంచుకుని చేసుకున్నందువల్ల నాకేమీ కష్టం కలగలేదు" అంది శైలజ.

"మీ విషయం నాకాట్టే తెలియదు. కాని నా అనుభవంలో ఇల్లా ముందే ప్రేమించుకుని తరువాత పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేంతగా తయారైన కుటుంబాలను నేను చూశాను. ఇదేకాదు. మీకు కోపంరాకుండా ఉంటే ఒక్క ప్రశ్న—" సంశయించింది నళిని.

"కోపం ఎందుకు ? అడగండి" అంది శైలజ.

"అయితే చెప్పండి. మీరు ఎంచుకునే చేసుకున్నారుగదా! మీ పెళ్ళికిముందు మీ భర్త ప్రవర్తన ఎటువంటిదో మీకు నిశ్చయంగా తెలుసా!" సూటిగాఅడిగేసింది నళిని.

ఈ ప్రశ్న తన కింతవరకు తట్టలేదు. ఆ విషయం తాను ఊహించలేదు. అందుకే చప్పున అవుననీ, కాదనీ చెప్పలేకపోయింది శైలజ.

శైలజ మౌనం వహించడంతో నళిని ఇంక ప్రసంగం మార్చింది.

తిరికి వచ్చేటప్పుడు మాత్రం శైలజ వెళ్ళినంత తేలిగ్గా రాలేకపోయింది.

నిజమే! తను వివాహానికి పూర్వం ఖాన్ ప్రవర్తన ఎటువంటిదో తా నేనాడూ ఆలోచించలేదు. ఖాన్‌ను తాను ఎరిగి ఉన్నదే తక్కువ. ఖాన్‌ను గురించి ఇతరుల నడగడానికిగాని, అతని సంబంధ బాంధవ్యాలను గురించి ప్రశ్నించడానికి గాని తాను ప్రయత్నించలేదు. తనకు తెలిసి ఉన్నవల్లా అతని విశాల భావాలు, అతని తర్కం, అతని శాస్త్ర పరిజ్ఞానం, ఏ సమస్యనైనా సులువుగా పరిష్కరించగల నేర్పు, ఇతరుల ప్రసక్తి లేకుండా మనగల స్థైర్యం. ఇవి తనను విశేషంగా ఆకర్షించాయి. దానికి తోడు పరిస్థితులు తెచ్చిన ఒత్తిడి కారణంచేత 'వనిత తనంత తా వలచి వచ్చిన చుల్కన' అవుతుందని అయినా సంకోచించకుండా అడిగేసింది ఖాన్‌ను. అతను కాదని ఉంటే ఏమయ్యేదో తనకే తెలియదు. విధివశాత్తు అనుకున్నవన్నీ అనుకున్నట్టు సమకూడాయి విశ్వం కూడా అంగీకారం తెలిపాడు. ఖాన్ మానవాతీతుడు కాకపోయినా ఉత్తమ మానవుడని ఊహించింది. తమ ఇద్దరి భావాలూ పాలు నీళ్ళంతగా కలిసిపోతాయని ఆశించింది. అంతకంటె ఎక్కువ ఆలోచించాలని తనకెన్నడూ అనిపించనూ లేదు; తాను ఆలోచించనూ లేదు.

నళినితో తనకేమీ లోపం కనబడడంలేదని ఇప్పుడు చెప్పినా తనకు సమస్యలు లేకుండా పోలేదు. తను ఊహించనిది మొదట్లోనే ఎదురైంది. ఖాన్ మాంసాహారి కావచ్చునే భావమే తనకు రాలేదు. కాని అది సులువుగానే పరిష్కరింప బడింది, ఖాన్ శాకాహారానికి అంగీకరించడంతో.

తరువాత తరువాత ఇతర సంఘటనల మధ్య ఖాన్ హృదయవైశాల్యం తా ననుకున్న దానికన్న ఎక్కువేమో నని తోచసాగింది. తా నెంతో పెద్ద విషయా లనుకున్న వాటిని అతి సులువుగా తేల్చేసేవాడు. అతని తర్కంతో తా నెన్నడూ సరితూగలేదు. అత నేది చెప్పినా అంత కట్టుదిట్టంగా చెబుతాడు.

శైలజకు 'సస్పెన్స్' కిట్టదు. అనుమానం వస్తే దాని అంతు తేల్చేవరకు ఆమెకు నిద్ర పట్టదు. ఖాన్ గత చరిత్రలో విశేషాలు ఉండవచ్చునని నళిని చేసిన సూచన శైలజను బాధించింది. ఖాన్ కాంపునుంచి రాగానే ఆ విషయం తేల్చేసుకోవాలనుకుంది.

మర్నాడు ఖాన్ కాంపునుంచి తిరిగి వచ్చాడు.

చిరునవ్వుతో ఎదురేగి స్వాగతం ఇచ్చింది శైలజ.

"మొన్ననే వస్తామన్నారు ?" అంది కోటు విప్పడంలో సాయంచేస్తూ.

"అనుకున్నవన్నీ జరిగితే లేం దేముంది! ఇవాళ

ఇదిగో అనుకుంటుండగానే ఆలస్యం అయిపోయింది" అన్నాడు పై ఉూడదీసి కుర్చీలో కూలబడుతూ.

"ఉండండి. మీకు కాఫీ పట్టుకొస్తాను" అని లోపలి కెళ్ళింది శైలజ.

ఖాన్ దుస్తులు మార్చుకుని వచ్చేసరికి టీపాయ్ మీద ప్లేట్లలో అల్పాహారం ఉంచి కుర్చీలు అమర్చింది శైలజ.

"ఏమిటి విశేషం?" ఖాన్ నవ్వుతూ అడిగాడు, ఖాద్యవస్తువులు మస్తుగా ఉండడం చూసి.

"ఇవాళ ఉమా వాళ్ళూ వచ్చారు."

"వాళ్ళను రోజూ రమ్మనరాదూ?" చిలిపిగా నవ్వాడు ఖాన్.

"అల్లానే" అంది క్లుప్తంగా శైలజ.

అదే మరొకప్పుడైతే "ఎవరూ రాకపోతే మీ కడుపు మాడుస్తున్నానా!" అంటూ కృత్రిమ కోపం ప్రకటించి ఉండేది శైలజ.

అలా అంటుందని ఎదురు చూసి నిస్పృహ చెందిన ఖాన్, "డిపాజిట్టు పోయింది" అన్నాడు.

"అదేమిటి!" కొంచెం ఆశ్చర్యం ప్రకటించింది శైలజ.

"కాక మరేమిటి, నా పిట్టు అంతా వృథా అయిపోతే!"

"నా మనస్సెందుకో బాగులేదు."

"ఏం, మళ్ళీ ఏమైనా జరిగిందా?"

"ఏం జరగలేదు," మామూలుగా అని "ఆలోచనలను అరికట్టడం ఎల్లాగ?" అంటూ ప్రశ్నించింది మళ్ళీ.

"ఆలోచించడం మానెయ్యడమే!" మందస్మితం చేశాడు ఖాన్.

"నా మొహంలా ఉంది" అంటుంటే ఆమెకే నవ్వు వచ్చింది.

"అయితే రెండో పద్ధతి-ఆలోచనలకు తీరిక లేనంత పని కల్పించుకోవడమే."

"ఇదీ డొంకతిరుగుడుగానే ఉంది. అసలు ఊహంటూ వస్తే ఇంకేపనీ తోచదుగా! ఇంక పనిలో మునిగిపోవడం ఎల్లా?"

"మూలకారణం వెతికి అక్కడ చికిత్స చేస్తేసరి!"

"బావుంది. అయితే మరి ఆలోచనలకి కారణం?"

"మనసులో సందేహాలు ఉత్పన్నం కావడంవల్లగాని, ఎక్కువ ఉద్రేకానికి గురికావడంవల్ల గాని, ఒక సంఘటనని సహజంగా తీసుకోలేక, దాన్ని గురించి అదేపనిగా ఆలోచిస్తాం. దానికేంగాని, ప్రస్తుతం నిన్ను పీడిస్తున్న సమస్య ఏమిటి?" నవ్వుతూ అడిగాడు.

"మీ నుంచి ఏదీ దాచలేను" అంటూ ఉమా వాళ్ళింట్లో జరిగినదంతా అతనికి ఎరుకపరిచి, "ఆమె అడి

గిన ప్రశ్న నన్ను కలతపెట్టింది. అందుకే సమాధానం చెప్పలేకపోయాను. ఓటమి అంగీకరించవలసి వచ్చింది. అప్పటినుంచి ఎంత మరిచిపోదామనుకున్నా కుదరలేదు. మీరు చెప్పండి సమాధానం" అంటూ పరిశీలనగా ఖాన్ ముఖంలోకి చూసింది.

ఖాన్ తొణకలేదు. బెణకలేదు. ముఖంలో ఏ మార్పూ రాలేదు. అదే చిరునవ్వుతో శైలజ ముఖంలోకి చూస్తూ, "నా వెనకటి ప్రవర్తన చెడుగా ఉంటుందని నీ అనుమానమా?" అని అడిగాడు.

శైలజ సిగ్గుపడి ముఖం దించుకుంది. తన బలహీనత కప్పిపెట్టుకోగలిగితే ఎంత బాగుండును అనుకుంది. ఇంత చదువుకుని ఉద్యోగం చేస్తున్నా సామాన్య సంసారిణిలాగే ప్రవర్తించింది తను. కనీసం తన అనుమానాలకు ఆధారాలు ఉన్నాయో లేవో కూడా చూసుకోలేదు. ఛీ! ఎంత పలుచనై పోయింది తను!

"క్షమించండి!" అంది అపరాధినిలా.

"చూడు శైలూ, ప్రతివిషయం తీవ్రంగా తీసుకునే తత్వం మానుకోలేవూ!" అన్నాడు.

ఖాన్ ఆ విషయం తరిచి తరిచి తనను నిందించక పోవడం, ఆ విషయం అతి సామాన్యంగా తీసుకుని నవ్వెయ్యడం శైలజకు తాత్కాలికంగా ఉపశాంతి కలుగ జేశాయి. కాని ప్రతి విషయం ఇంత తేలికగా తీసుకోవ

డమే అతని లక్ష్యమేమో అనే అనుమానం మాత్రం బల పడసాగింది.

ఒకరోజున శైలజ, ఖాన్ సినిమాకు వెళ్ళారు. సినిమాహాలు కిక్కిరిసి ఉంది. ఒక వరసలో రెండు సీట్లు ఉన్నాయి, ఒక యువ్వని పక్కన. ఆమె చాలా అందంగా ఉంది. పలుచని తెల్లనిచీర, పారదర్శకమైన జాకెట్టు, అరంగుళం మందాన్ని పౌడరు, సిగనిండా మల్లెచెండు, చిరునవ్వుతో ఆహ్వానిస్తూ ఎటూ నిలవని చంచల వీక్షణాలు— ఇవన్నీ కలిసి ఆమె స్వభావాన్ని స్పష్టీకరిస్తున్నాయి. ముందు వచ్చిన శైలజ వెనక్కు తిరగబోయింది. ఖాన్ కూడా తిరగబోతుండగా ఆ యువ్వని 'నమస్కారం!' అంది. ఖాన్ కూడా తప్పక ప్రతి నమస్కారం చేసి ఇంకెక్కడా ఖాళీ కనబడక పోవడంతో శైలజను తప్పించుకుని వచ్చి, ఆమె పక్కన కూర్చుని తన పక్కన శైలజకుచోటు చూపించాడు. శైలజ ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుంది.

"మమ్మల్ని బొత్తిగా మరిచేపోయారు!" అంది ఆ నూతన వనిత వయ్యారాలొలకబోస్తూ.

"ఈమె నా భార్య" అని పరిచయం చేశాడు ఖాన్ శైలజను.

శైలజ ముఖం తిప్పుకుంది. ఆ తరుణి కూడ ఇంక కదిలించకుండా మౌనం వహించింది.

ఖాన్ మాత్రం నిశ్చలంగా ఉన్నాడు.

శైలజ మనస్సు ఈర్ష్యతోను, తాను వంచించబడి

పట్లు తెలియడంవల్ల జనించిన క్రోధంతోను జ్వలించింది. ఖాన్‌మీంద ఆమెకు పట్టరానికోపం వచ్చింది. కాని అది అంకుడే ప్రదర్శించేటటువంటి అశిక్షితురాలు కాకపోవడం వల్ల మిన్నకున్నది.

దీర్ఘం అనిపించిన సినీమా ముగిసింది.

దారిలో కూడా శైలజ మూగనోమే పట్టింది.

కాని ఇంటికి వచ్చిన తరువాత మాత్రం నిగ్రహిం చుకోలేక పోయింది.

"నన్నెందు వంచించారు? చెప్పండి" సాధ్యమై నంత అణుచుకుని అడిగింది.

"'వారిజాక్షులందు వైవాహికములందు' అని ఘోషి స్తోంది నీతిశతకం." తేలిగ్గా నవ్వాడు ఖాన్.

"నీతిశతకం నా కక్కర్లేదు!" కటువుగా అంది శైలజ.

"నిజం అన్నివేళలా రుచికరంగా ఉండదు, శైలూ! నే నానాడే చెప్పేసి ఉంటే నీ మనస్సు ఇంకా క్షోభించి ఉండును. ఇవాళటి సంఘటన జరక్కపోయి ఉంటే ఇది బయటపడి ఉండేదే కాదు. కటువైన సత్యాన్ని తెలుసుకోక పోవడంలోనే ఉంది సుఖం."

"అందుకని వంచనకి దిగుతారా?"

"నేను వంచించలేదు. ఆవేళ నేనిచ్చిన సమా ధానం జ్ఞాపకం ఉండి ఉంటే నేను నీకు సూటిగా ఏ జవాబూ ఇవ్వలేదని నువ్వే గ్రహించగలవు. అదీకాక నువ్వ

నా జీవితంలో ప్రవేశించక పూర్వమే నేను రాబోయే నీకోసం వాంఛలను అరికట్టుకోవాలని నువ్వు కోరడంలో సబబులేదు. పోనీ నీ గత జీవితాన్ని గురించి నేనెన్నడైనా అడగడం నీకు గుర్తుందా!" అడిగాడు ఖాన్.

ఖాన్ చెప్పింది శైలజకు నచ్చింది. అయినా బింకం వీడలేదు. అంగుకని ఏమీ చెప్పకుండా ఊరుకుంది.

ఖాన్ మళ్ళీ అన్నాడు: "చూడు శైలూ! గతాన్ని అనవసరంగా తవ్వుకుని బాధపడడంవల్ల ప్రయోజనం లేక పోవడమేకాకుండా అశాంతి ప్రబలడానికి ఆస్కారంకూడా వుంటుంది. ఈ ముక్కను నువ్వు జ్ఞాపకం వుంచుకోవడం ఇరువురికీ శ్రేయస్కరం."

రెండు రోజులు మదనపడి శైలజకూడా సమాధాన పడింది

ఒకరోజు రాత్రి తొమ్మిది గంటలవరకు ఎదురుచూసి విసుగెత్తి భోజనానికి కూర్చుంది శైలజ. ఇది ఇప్పటికి మూడోసారి ఈవారంలో, ఖాన్ చెప్పకుండా ఆలస్యంచేయడం. రెండుసార్లు భోజనం ముగించుకునే వచ్చాడు ఎవరో స్నేహితులు కనబడితే మాంసాహారం తీసుకొన్నాడట! ఈ పది నెలలలోనూ అతను తనతోడి సాన్నిహిత్యంవల్ల శాకాహార భక్షణే చేస్తున్నాడు. రెండుసార్లు ఎక్కడో తిని ఇంటివంటకు స్వస్తి చెప్పడంతో ఆమెకు కోపం వచ్చి నాలుగు దులిపింది. అతను నవ్వేసి ఊరుకున్నాడు.

ఖాన్ మాంసభక్షణ మానేస్తానని ఒప్పుకుని తనతో చెప్పకుండా ఎక్కడో తినిరావడం శైలజకు కిట్టలేదు. రోజూ అతనెక్కడో తిండి తినడం, తాను వండి పారెయ్యడం బాగా అనిపించలేదామెకు. అతనికి నిజంగానే మాంసాహారంమీద మోజు ఉంటే రోజూ ఇంటిదగ్గరే ఎవరిచేత అయినా వండించుకుని తినవచ్చుగా! ఆ మాత్రం దానికీ వంచనెందుకు?

ఈ భావంవచ్చి ఖాన్ గత ప్రవర్తనలోని లోపాలను క్షమించ గలిగిన ఆమె ఈ విషయాలను సులువుగా తీసుకోలేకపోయింది

మానవులలోని బలహీనతలు ఇలాగే విచిత్రంగా ఉంటాయి. ఒక్కొక్కప్పుడు ఎంతో పెద్ద తప్పులనుకున్న వాటిని ఇతర్లలో క్షమించగలిగినా మరొకప్పుడు అతి చిన్న విషయాలలోనే నిగ్రహం కోల్పోతారు. ఇదేకాక కాలం గడిచినకొద్దీ చిన్న చిన్న తప్పులు అధికమై రోజు రోజుకూ విరక్తి పెంపొందుతుంది. ఆ భావమే పోషింపబడి వృద్ధి పొందుతుంది. అటుతరువాత ఏ చిన్న కారణమైనా పెద్ద పెద్ద అఘాయిత్యాలకు దారితీస్తుంది. ప్రపంచయుద్ధాలకు మూల కారణం వెతికితే ఇదే ననిపిస్తుంది. సరిహద్దుగీత దాటి ఒకమనిషి ఇంకో ప్రాంతంలో అడుగిడిన చిన్న సంఘటన మూలంగా అదివరకే రగులుతున్న మంట ఒక్కసారి భగ్గుమంటుంది.

ఏమైనా ఖాన్ రాలేదు. విరక్తితోను, కోపంతోను పడుకుని ఊహాస్రవంతిలో మునిగి తేలుతున్న శైలజకు ఎప్పుడు పట్టిందో కునుకు.

"శైలూ!" అనే పిలుపుతో మెలుకువ వచ్చింది.

టైంచూస్తే పదకొండున్నర అయింది. "ఇప్పటికన్న మాట అయ్యగారు వేంచేస్తే!" అనుకొంటూ వెళ్ళి తలుపు తీసింది. చిరునవ్వుతో ప్రత్యక్షమైన ఖాన్ దగ్గర స్పిరిట్ వాసన గుప్పుమంది.

శైలజకు ఉక్కుకెత్తిపోయింది.

"క్షమించు ప్రియా" అంటూ ఖాన్, శైలజవీపు తట్టబోయాడు. కాని ఆమె గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది మౌనంగానే.

"కోపమా దేవీ!" అన్నాడు నాటకంలో లాగా ఆమె ననుసరిస్తూ.

అప్పటికీ మాట్లాడ లేదు శైలజ.

"ఏయ్! ఏమిటామూగనోము!" అంటూ శైలజ జడపట్టుకుని లాగాడు.

"వదలండి జడ!" అంటూ విదిలించు కుందామె.

గట్టిగానే కోపం వచ్చిందని గ్రహించాడు ఖాన్.

"చూడు, నువ్వింత మొండిదానవని అనుకోలేదు. చదువుకుంటే ఏం లాభం!" అన్నాడు వ్యంగ్యంగా.

అప్పటికే విస్తరిస్తున్న శైలజ కోపాన్నికి అది మరో సమిధ అయింది.

"మనం మాత్రం చదవలేమా చదువు!" అంది రెండో చదువుమీద ఒత్తి పలుకుతూ.

"అంటే!"

"అంటే—వాదనలెందుకుగాని భోజనానికి లేవండి" అంది కొంచెం విసుగ్గా.

"నా సాపాటు అయింది."

"అయితే సరిగ్గా నేననుకున్నట్టే జరిగిందన్నమాట. మామూలే కదూ!"

ఖాన్ మాట్లాడలేదు.

"నేను పూట పూటకీ వండిపోయడం, మీరెక్కడో తిని రావడం, మీకోసంచూచి విసుగెత్తడం. ఎందుకీ వంచన! ముందే చెప్పకూడదూ రానని!"

"శైలూ, పొరబడుతున్నావ్. అనుకోకుండా జరగడంవల్ల నీతో చెప్పడం కుదరలేదు."

"ఈ వారంలో మూడుసార్లూనా? ఇంక రోజూ జరుగుతుందేమో! అంత మాంసాహారంమీద మోజుఉంటే స్పష్టంగా చెప్పెయ్యొచ్చుగా! దానికీ దాపరికం, ఇంకొకర్ని అడ్డువేసుకోవడం ఎందుకూ!"

ఖాన్ ఊరుకున్నాడు.

"పైగా ఇదోటి! అన్నింటికీ మౌనం వహించడం, వాగి వాగి నా నోరే నొప్పెడుతుందికదా అని! అదేగా మీ ఘనత!" అంది విసుగ్గా.

ఖాన్‌కు ఆమె పలుకుల తీరు నవ్వు తెప్పించింది. అది చూచి మరింత రెచ్చిపోయింది అధరం పండ్లమధ్య బిగించి కోపాన్ని అణుచుకోవడంలో ముఖం అరుణిమ దాల్చింది.

"హద్దుమీరి మాట్లాడేవాళ్ళకీ, ప్రతి విషయానికీ కోపం తెచ్చుకునేవాళ్ళకీ మౌనంమాత్రమే మంచి సమాధానం అవుతుందని చిన్నప్పుడు మా మేష్టారు చెప్పారు" అన్నాడు సావధానంగా ఖాన్.

అతని మాటలు అగ్గిమీద గుగ్గిలంలా పనిచేశాయి.

"హద్దుమీరింది నా నోరా? మీ ప్రవర్తనా?" గొంతు చించుకుని అరిచింది శైలజ.

"నాకంటే నీకే బాగా తెలుసు. ఎమ్. ఎ. విగా!!"

"నిజంగానే తెలుసు. ఇంతవరకు అనుమానంగా మాత్రమే ఉండిపోయినా ఈరోజు స్పష్టపడింది. అది తెలుసుకునేందుకు ఎమ్.ఎ. కానక్కర్లేదు కాని ఆదర్శాలు వల్లించి తప్పినవాళ్ళకి జవాబు ఎల్లా చెప్పాలో మాత్రం మా చదువు నేర్పనందుకు విచారిస్తున్నాను. ఇంతకీ మీకు ఇష్టం అయితే రోజూ మొంగుకు తెప్పించుకు తినకూడదూ! నన్ను వంచించడానికే నన్నమాట—ఇన్నాళ్ళూ మానేస్త! ఎందుకీ వంచన!"

"నిన్ను వంచించానని నువ్వనవసరంగా నామీద నిందం వేస్తున్నావు. నీకిష్టం ఉండదని యెన్నో యేళ్ళుగా

ఉన్న అలవాట్లని మార్చుకున్నాను. అది గ్రహించలేదు నువ్వు. యెప్పుడైనా తినాలని అనిపించినా ఆ వాంఛ అరికట్టుకున్నాను. పోతే రెడ్డితో మర్యాదకు తీసుకోవలసి వచ్చింది. అల్లాగే మరి రెండుసార్లు జరిగింది. ఇంతమాత్రమే సహించలేకపోయినది నువ్వే. నేను మానేస్తానని నీతో అనలేదు. గొప్పలు చెప్పలేదు. త్యాగంచేసినట్టుకూడా భావించలేదు. నిన్ను నా దారికి (అంటే నిన్ను కూడా నా పద్ధతి ఆహారానికి అలవాటు పడేటట్టు చెయ్యడం) తీసుకురావాలనికూడా ప్రయత్నించలేదు. ఒకటి రెండుసార్లు నీకు నచ్చని పని చేశానని నీకు కోపంవచ్చింది. ఇవన్నీ నేను చెప్పదల్చుకోలేదు. కాని నీ బలవంతంవల్ల పైకివచ్చాయి" అన్న ఖాన్ ముఖంలో యేభావం ద్యోతకం కాలేదు.

"నేను నిజంగానే పొరబడ్డాను. నాకోసం మీరివన్నీ వదులుకున్నారని తెలిస్తే నేనెన్నడూ మీరు నా పద్ధతికి అలవాటుపడాలని కోరి ఉండేదాన్నికాదు."

"అవును. నీకెలా తెలుస్తుంది? నువ్వాదృష్టితో ఆలోచించవలసిన పనేముంది? కాని నేనేమనుకున్నానో తెలుసా-సాఫీగా సహజీవనం సాగాలంటే, కలతలు కలుగకుండా ఉండాలంటే కొన్ని కొన్ని విషయాలలో ఒకరికి నచ్చవిని మరొకరు మానివెయ్యాలి. నీ పద్ధతికి నేను అలవడడం సులువు గాబట్టి ఆ పనిచేసి నిన్ను నొప్పించడం మానేశాను."

అక్కడ తనవాదం వీగిపోవడంతో శైలజ ప్రూాన్పడి పోయి, మళ్ళీ సర్దుకుని మరో అస్త్రం ప్రయోగించింది.

"సరే. అయితే తాగుడుమాట?" అంది కసిగా, శైలజ.

"నీ కిష్టమయిన కూర నీవు వండుకుని తిన్నట్టే. రోజూ తినవుగా! తినాలని అనిపించినరోజున ఎన్నిబాధలు పడి అయినా సాధిస్తావు. ఒక వస్తువుమీాది మమత అంతది. నీకు తెలియకపోవచ్చు కాని నాకు లైసెన్సు కూడా ఉంది."

"దానికీ దీనికీ సామ్యమూ! తాగి తందనాలాడడం తప్పు లేదంటారా?"

"తందనాలాడి ఇతర్ల నవస్థపెట్టకూడదు. పెట్టినా వాళ్ళూరుకోరు. నాలుగు తన్నుతారు. అది ఒప్పుకుంటాను. అంతవరకు రానివ్వకుండా ఉంటే నీ కూర వండుకుతినడానికీ దీనికీ తేడా లేదు."

"అంతకన్న ఏమీాకాదా? అది తప్పుడుపని కాదా? అది మీా ఆదర్శాలకు విరుద్ధం కాదా?" పట్టలేని కోపంతో అంది శైలజ.

"తప్పుడు పనా! ఇది తప్పు. ఇది మంచి అంటూ ఏ రెంటిమధ్యనైనా గిరిగీసి చూపగలవా! ఆదర్శం ఆదర్శం అంటూ తెగ చెప్తున్నావు దానికిమాత్రంపరిపూర్ణత ఏమైనా ఉందా? ఎవడికి నచ్చిన పని వాడికి ఆదర్శం, ఆనందం. ఇవన్నీ పూర్తిగా సాపేక్షం. పడి కట్టుతో మారేవి. పక్క-

వాటితో పోల్చిచూస్తేతప్ప ఒక వస్తువు విలువ కట్టలేం. పిట్లకి యేవో పేర్లు పెడితే ఆపేర్లమై కూర్చుంటుందా?"

"ఇదా మీనిజస్వరూపం? సుశీల విషయంలో ఎంత ఆదర్శవంతంగా మాట్లాడారు! అంతా తేనెపూసిన కత్తి వాటమేనా? ఆదర్శాలు హద్దులు లేకపోతే మనుష్యులకూ పశువులకూ తేడా ఏమిటి?"

"సుశీల విషయంలో నేను ప్రదర్శించినది ఆదర్శం కాదు. మానవులమధ్య ఉండవలసిన సానుభూతి. మన మనస్సులలో పెంచుకున్న విలువలకి ఏదో పవిత్రత ఆపాదించి, ఆదర్శాలు ఆశయాలు అంటూ గిరిగీసి అవతలి వారందర్నీ నీచంగా చూడటం నాకు చేతకాదు. అంతగా వస్తే అవి వాళ్ళ బలహీనతలని సరిపుచ్చేసుకుని, వాళ్ళనిసానుభూతితో చూడటం నేర్చుకున్నాను. సుశీలవిషయంలో నేను చూపినదిదే. అది ఆదర్శం అనుకుని, నేనేదో ఉన్నతి పొంది స్వర్గంనుంచి ఊడిపడ్డానని నువ్వూహించి నాతో సహజీవనానికి అంగీకరిస్తే నిన్ను నివ్వే మోసగించుకున్నావన్నమాట! తేనెపూసిన కత్తివాటం అన్నావు. అది పొరపాటు. నేను నాస్వభావాన్ని కప్పిపెట్టేటందుకు ఎన్నడూ ప్రయత్నించలేదు. అయితే అనవసరంగా నా తత్వం ఇదీ అని నేను చెప్పుకోనూ లేదు. నేనేదో మానవాతీతుడులా కనబడడానికికూడా యెన్నడూ ప్రయత్నించలేదు. నువ్వు చాలా విషయాలలో పొరపడ్డావు. ఆదర్శాలు హద్దులు లేకపోతే మానవులకీ తేడా ఏమిటన్నావు. అంటే నీ దృష్టిలో మానవులు పశువులకంటే అధికులనా?"

ఈ ప్రశ్నవిన్న శైలజ ముప్పిరిగొన్న ఆశ్చర్యంతో మునిగింది. రెండునిమిషాలు కళ్ళప్పగించి అలాగేచూస్తూ ఉండిపోయింది.

కొంతసేపటికి తెప్పరిల్లి, "అయితే మానవులు పశువులకంటే ఏమీ ఉన్నతిలో లేరని మీ భావనా? మానవులు సాధించిన యింత పురోభివృద్ధి, విజ్ఞాన సాంకేతికాదులలో తెచ్చిన ప్రగతి—వాటికి విలువలేదని మీ విశ్వాసమా?" అంది.

"శైలూ! పశువులని ఎంతో ఆక్రోశంతో నీచంగా చిత్రించుకుంటున్నావు నీ మనస్సులో. ప్రకృతిలో వివిధ జీవాలున్నాయి. పశువులు ఒక తెగ. మానవులు ఒక తెగ. ఇంకా క్రిమి కీటకాదులు, చెట్లు చేమలు, ప్రాణం లేని రాళ్ళు, రప్పలుకూడా ఉన్నాయి. ఇందులో ఏవీ మరొకరికన్న ఆధిక్యం సంపాదించుకొన్నవి కాదు. అన్నీ పరిసరాల మీద ఆధారపడి ఉన్నవే. ప్రతికూల పరిస్థితులలో ఏవీ మనలేవు ఈమాత్రం దానికే మనం ఏదో సాధించామని డబ్బా కొట్టుకోవడం దేనికి? ఇవి మనం సృష్టించుకుని, మనలో అనుకునే మాటలు మాత్రమే. మానవులు ఎందులో ఎక్కువ? మనలో మనకెన్ని ఓర్వలేనితనాలు! మాత్సర్యాలు! పక్కవాడు పచ్చగా ఉంటే మనకి కిట్టదే! మనం లక్ష తప్పులుచేస్తూ ఇతర్లని నిందించడానికి వెనుకాడమే! వారిని క్షమించలేమే! వారిమీద కక్షలు పెంచుకుంటామే! అదే జంతువులలో—క్షణం పోట్లాడుకున్నా మరుక్షణం

మందలో కలిసిపోతాయి. ఒకపిట్ట చనిపోతే వందలాది పిట్టలు దానిచుట్టూ తిరుగుతూ విచారం ప్రకటిస్తాయే! మళ్ళీ చెప్తున్నాను. ప్రకృతిలో వివిధపాత్రలు ధరించిన రూపాలే యీ జీవులన్నీ. మానవుడు మారణాస్త్రాల్ని తన బుద్ధితో సంపాదించి, జంతువులను లోబరుచుకున్నా డనుకోవడం కూడా బుద్ధి పొరపాటే. ఇంతాచేసి తను లోబరుచుకున్న దేమిటి? గూళ్ళు కట్టుకున్నట్లు పట్నాలని నిర్మించుకుని తన ప్రభావానికి తానే మురిసిపోవడం తప్పించి నిజంగా అడివిలోకి వెడితే ఏం చెయ్యగలడు? ప్రపంచ వైశాల్యంలో మానవుని స్వాధీనంలో ఉన్న భాగంఎంత, లేనిదెంత? తాలూకా పటం చూడు. మనుష్యులున్న ప్రతి పల్లె సూచించినా మనం నివసించే ప్రదేశాలన్నీ చుక్కల్లా కనబడుతాయి. చుక్కకీ చుక్కకీ మధ్యభాగం జంతువులదే గా? కుర్చీమీద కూర్చుంటే తప్ప, శయ్యమీద పవళిస్తే తప్ప, పక్వంచేసిన ఆహారం భుజిస్తేతప్ప, జీవించలేని బలహీనతలు మానవులలోనే హెచ్చు."

ఆశ్చర్యంతోను, అసహాయతతోను ఉక్కిరి బిక్కిరి అయిపోయింది శైలజ. అయినా దీని అంతేదో తేల్చెయ్యాలని సంకల్పం కలిగింది. తను ఒకలా ఊహించిన వ్యక్తి పూర్తి నిజస్వరూపమేదో బయట పడిపోవాలనే ఉబలాటం కలిగింది.

అందుకే, "అయితే ధర్మానికి న్యాయానికి గూడా మీదృష్టిలో విలువలేదా?" అని అడిగేసింది.

"ధర్మానికి, న్యాయానికి కూడా అని ఒత్తి పలుకుతున్నావే....అవేంఅంత గొప్పవా, వాటికి విలువ యివ్వని వారిని నీచంగా చూడడానికి! ఇంతకీ ఈ న్యాయధర్మాలకు అర్థం వుందా? ఉంటే ఏమిటి? ధనహీనుడు ధనవంతుని కొల్లగొట్టడం అన్యాయం అంటాం. అదేం న్యాయం? ఎక్కువఉండి మురిగిపోతున్నవాడు లేనివాడి కివ్వడం న్యాయం. అది అతనికి తెలియకపోతే తెలియజెప్పినవాణ్ణి మనం దొంగ అంటాం. అసలీ భేదాలు లేకపోతే నష్టం ఏమిటి! ఎవడికిష్టమైన పని వాడు చేస్తే తప్పేమిటి? మనకేదో స్వాతంత్ర్యం వచ్చిందనుకుంటున్నాం. మనది ప్రజా పరిపాలన—ఇటువంటి ప్రభుత్వ లక్ష్యం ఎలా ఉండాలి? ప్రజలకు తగిన శిక్షనిచ్చి అసలు ప్రభుత్వం అవసరం లేకుండా చెయ్యాలి. అది జరుగుతోందా? లేదు. సరిగ్గా దానికి వ్యతిరేకం జరుగుతోంది. ప్రభుత్వం తన్ను తాను బలపరుచుకుంటోంది. ఎన్నికల పేరు చెప్పి మనమీద అధికారం చెలాయించమని కొంతమందిని మనమే ఎన్నుకోవడమా? ఇందులో నలుగురు పెద్దలకు నచ్చింది న్యాయమా? ఈ న్యాయాన్ని సంపుటీకరించేవారిలోనేగా దాని స్వరూపం ఉంట? నూటికి యాభై ఒక్కమందికి నచ్చిందా న్యాయం! దీని పేరుతో లెక్కన నలభై తొమ్మందుగురిని శాసిస్తారా? అసలివి లేకపోతేనేం అంటే? క్రమం తప్పదా అంటారు. అసలిదీ క్రమం అని ఎవరు స్థిరపరచగలరు? ఏదో నలుగురు సాంప్రదాయికంగా అనుకున్నదేగా యీ క్రమం

అంటేను? అయితే ఈ క్రమపద్ధతులమీద ప్రవేశపెట్టబడిన ఆఫీసులలో అసలు జరిగే పనికన్న కాగితాలమీద పని పదింతలౌతుందేం? ఇవన్నీ లేకపోతే అసలింకేమీ జరగవని మీ అభిప్రాయం. కాని మానవులలో ఒక గుణం ఉంది. ఎవరుచెప్పినా చెప్పకపోయినా కొన్నిపనులు వారు చేస్తూనే ఉంటారు. ఆ గుణమే లేకపోతే ఏదీ యింత అభివృద్ధి అనుకునేదానిలోకి వచ్చేదికాదు. ఈనాటి ఈ విజ్ఞాన పురోగమనం అంతా బలాత్కారంవల్లనే సాధింపబడినదని ఎవ్వరూ అనలేరు. ఒకరిబుద్ధి ఒకలా ఆలోచించి కొన్ని కొన్ని విషయాలు పరిశీలించాలని ఎవరైనా ఒత్తిడి తేగలరా? అసంభవం. కొందరువ్యక్తులు పద్దన్నా, ఎన్ని నిర్బంధాలు కలిగించినా కొన్నిపనులు చేస్తూనే ఉంటారు. అటువంటివారిని శక్తితోను, బలప్రయోగంతోను ఎదిరించలేం. చట్టాలతో శాసించలేం. స్వాతంత్ర్యసమరం ప్రతికూల శక్తులవల్ల నిలిచిపోయిందా? అందుచేత ఈ ప్రభుత్వం ఉండి మాత్రమే మానవులను క్రమపద్ధతులలో నడిపించగలుగుతూందనుకోవడం హాస్యాస్పదం. దైనందిన పరిపాలన సాగించడంతో ప్రభుత్వం బాధ్యత తీరిపోదు. ప్రజలతో—పక్కమనిషిని తనతో సమానంగా ఆదరించి ఎవరి పని వారుచేసుకుంటూ మొత్తం జనానికి అన్ని అందుబాటులోకి తెచ్చే కృషిజరగాలి. అంతేగాని చట్టంన్యాయం అంటూ ఏమిటి సాధించేది? తాగుడు మానిపిద్దామని చట్టం చేశారు. దానిద్వారా సాధించిన దేమిటి? పూరినే అవి

నీతే. చాటున తాగడం, పోలీసులకి లంచా లివ్వడం, ఆత్మవంచనా, ప్రభుత్వవంచనాను. చట్టం తెచ్చి భార్యా భర్తలను కలపగలరా? ఇంక మీ నీతి ఏమిటి? ఎవడిమీదో మమతలు పెంచుకుని చట్టానికి లోబడి మరొకడితో కాపు రం చెయ్యడమా? ఇదా మీ సాంఘిక సంప్రదాయం! ఇదా నీతి? ఈ నీతి న్యాయాలకేనా అందరూ లోబడాలి? నీతి అంటే మనోవ్యభిచారమా? మాట్లాడవేం?"

"ఏం మాట్లాడను! నా సంస్కారమే వేరు. నా ఊహాలు ఇటు తిరగవు. కాని—మీరయితే—నాకు మాటలు దొరకటం లేదు" అంటూ గమ్మున ఊరుకుంది శైలజ.

"నా మాటలన్నీ కంటగింపుగా ఉన్నాయి కదూ! నీతికి విలువ లేదన్నానని కోపం వచ్చిందికదూ? కాని చూసేదృష్టినిబట్టి ఉంటాయివన్నీ. మీ లెక్కప్రకారం ఒక స్త్రీ, ఒక పురుషుడు ఒకరొకరికరు నమ్ముకుని ఉండాలి. ఒక స్త్రీ భర్తతో రెండేళ్ళు కాపరం చేసింది. భర్త మర ణించాడు. రెండో వివాహం చేసుకుంది. అది ఇప్పటి మీ సంస్కర్తలు హర్షిస్తారుగా! మరో స్త్రీ భర్తతో రెండేళ్ళు కాపరంచేసి అతను నచ్చక మరొకడితో వుంటుంది. అది ఎవ్వరూ అంగీకరించరు. ఆమెకు నీతి లేదంటారు. యీ రెంటిలో తేడా ఏమిటి? ఒకటి చట్టబద్ధం. రెండోది చట్ట విరుద్ధం. అయితే రెంటిలో వున్న నీతిలో తారతమ్యం

లేదే! ఇందులో ఏది నీతి, ఏది అవినీతి? పునాదులు లేని ఇటువంటి ఆచారాలను ఒక బురఖా తగిలించి నీతి అంటే అయిపోతుందా?" కసిగా నవ్వాడు ఖాన్.

శైలజ రాతిబొమ్మలా కూర్చుంది.

"నన్ను గురించి లేనిపోనివేవో సృష్టించుకుని అవి వట్టి పుకారులు మాత్రమేనని యివాళ తెలిసి బాధపడుతున్నట్లున్నావ్. కాని నీ విషయంలో నేనూ పొరబడ్డాను. నీ చదువు, సంస్కారం, శిక్షణ చూసి నేనూ కొంతవరకు మోసపోయాను. ఇతరులను అర్థం చేసుకుని వారి బలహీనతలని ఉదార దృష్టితో చూడగలవనుకున్నాను. అందుకే నువ్వు అడిగితే అంగీకరించాను. కాని నువ్వూ సామాన్యులందరిలాగే ప్రవర్తించావు. దానికి నిన్నేమీ తప్పుపట్టను. నా మాటలు నీకు నచ్చకపోయినా నీ ఆదర్శాలని నేను మన్నించాను. కాని నా స్వాతంత్ర్యానికి అడ్డు రానంతవరకే! ఈ పదినెలలు బాగానే గడిచాయి. ఈ పదినెలల నీ సాహచర్యానికి కృతజ్ఞుణ్ణి."

ఇంతసేపూ ఏం ఆలోచిస్తున్నదో శైలజకే తెలియదు. వంచిన తల ఎత్తేసరికి ఆ మోముఖంలో ఏ భావమూ లేదు.

"ఇన్నాళ్ళనుంచి మీ గురించి నాకెంతో తెలుసుననుకున్నాను. ఆ తెలిసిందంతా భ్రమేనని యివాళ తెలిసింది. మీలాంటి వారితో చెప్పినా తెలుసుకుంటూ ఉండిపోయినా బాగుండేది. ఉండేదైతే ఇక్కడ తెలిసి ఇంక మీతో ప్రసంగం చేసు

నేనెంత చదువుకున్నా, సంస్కారం సంపాదించుకున్నా మీతో మాత్రం ఏకీభవించలేను. ఏకీభావం లేకుండా మీతో కలిసి వుండలేను. అది నా ఆశయాలకే విరుద్ధం. నేనే ఆదర్శంకోసం మిమ్మల్ని స్వీకరించానో ఆ ఆదర్శం యీనాడు మంటగలిసింది. జీవితంలో ఓటమి అంగీకరించవలసి వచ్చినందుకు బాధగా వుంది" శైలజ కంఠం వణికింది.

"అయితే మనం మొదట్లో అనుకున్నట్టే స్నేహితులుగానే విడిపోవచ్చు. స్నేహితురాలుగా నిన్ను విడిచిపెట్టడం బాధగానే ఉంటుంది. ఈ ఊళ్ళోనే వుంటావా?"

"ఉహుఁ! రేపే రాజీనామా ఇచ్చేస్తాను. ఇక్కడే వుంటూ వేరుగా వుండలేను. నలుగురూ హేళన చేస్తూంటే భరించగల ధైర్యం అలవడలేదింకా నాకు."

"అయితే ప్రయాణ మెప్పుడు?"

"రేపే. కాని యింకొక్క విషయం అడగాలని వుంది—ఎటూ విడిపోతున్నాం గనుక" అంది బలవంతాన నవ్వుతూ.

"అడుగు."

"అయితే నన్నంత సులభంగా దూరంచేసి వదిలి పోగలరా?"

"చిత్రంగా వుంది ప్రశ్న. మొగుణ్ణి విడిచివెడుతూ, 'అత్తా, నీకొడుక్కి ఆకలెక్కువ. జాగ్రత్త' అందిట వెనుకటి కోడలు. తెలుసుకొని ఏం లాభం?"

"స్త్రీబుద్ధి—కాని మిమ్మల్ని నేనంత తేలిగ్గా మరిచిపోలేనేమో అనిపిస్తుంది."

"స్నేహితుని వీడిపోయిన బాధ కలుగుతుంది" అన్నాడు ఖాన్.

"అంతకన్నా మరేమీ కాదా!" ఆతృతగా అడిగింది శైలజ.

"ఎందుకు నాచేత అన్నీ చెప్పిస్తావు? విని బాధపడతావు."

"ఫరవా లేదు చెప్పండి. అంతకన్నా ఏమీ కాదా!"

"నీకు తెలిసివున్నదే. నాకు నీతిమీద విలువలేదు. మరో స్త్రీని వెతుక్కోవలసిన అవసరం కలుగుతుంది"

తలమీద పిడుగుపడినట్లయింది శైలజకు. నీతి నియమాలను గురించిన అడ్డంకులు అతనికేమీ లేవని అతని నోటే విన్నా తనస్థానే ఇంకో స్త్రీని తెచ్చిపెట్టుకుంటాడని, అదీ తనముందే అంటాడనీ కలలో కూడా ఊహించని ఆమె ముఖం నల్లబడింది.

"నే చెప్పలేదూ? బాధపడుతున్నావా?"

"లేదు. మీ ధైర్యానికి అంజలు లర్పిస్తున్నాను. ఈ ఇంట్లో నాస్థానమెంతో ఈవాళ తెలిసివచ్చింది" అంది శైలజ కటువుగా.

"నువ్వు మళ్ళీ పొరపడుతున్నావు. ఈ ఇంటిలో నీ స్థానానికి ఏ హానీ రాలేదు. లేక నిన్ను నే నెన్నడూ

అవమానించడానికి తీర్మానించలేదు. నువ్వు సూటిగా ఒక ప్రశ్న అడిగావు. సమాధానంకోసం రెట్టించావు. ఆ సమాధానం నిగ్రహంతో తీసుకోలేకపోయావు. నువ్వు నన్ను విడిచివెళ్ళిపోతే, విచారిస్తూ కూర్చోవడం తప్ప ఇంకేమీ చెయ్యకూడదా నేను? కోర్కెల నరికట్టాలా? ఇదా నీ భావం! నీకు విడిచివెళ్ళడం బాధగా వుంటుందా అనైనా అడిగానా నేను? నువ్వేం చేస్తావో అదైనా అడగలేదే నేను. నీ స్నేహానికి భరతవాక్యం పలకలేదే. అయినా నీకెందుకంతకోపం?నువ్విక్కడినుంచి వెళ్ళిపోవడం నా అభిమతంకాదు. కాని నీయిష్టం లేకుండా నిన్నిక్కడ ఉండిపొమ్మనికూడా నేను అనను.నేను ద్వేషంతో చెప్పడం లేదీమాటలు. నువ్వు మరో సహచరుణ్ణి తీసుకున్నా నేనేం బాధపడను. నిన్ను మనస్ఫూర్తిగా అభినందిస్తాను. నన్ను వదలికూడా నువ్వింకా క్షోభించడంకాదు నాకోరిక. ఈ విషయంలో నన్నపార్థం చేసుకోకు. నువ్వెక్కడున్నా నేను నీ శుభాకాంక్షినే."

శైలజ మాట్లాడలేదు. స్త్రీ సహజమైన బలహీనత ఆమెనావరించింది. తన్ను తాను సంభాళించుకోలేకపోయింది. ఎంత ఆపినా అశ్రువులు ఆగడంలేదు. ఆ బలహీనతను అరికట్టలేకపోవడం ఆమెను మరింత వ్యథకు గురిచేసింది.

ఖాన్‌కు జాలి వేసింది. భావాల్లో ఏకీకరణం కావాలనే ప్రకృతిని విడనాడకపోతే ప్రతిచోటా ఆమె దెబ్బ

తింటుందే అని బాధవేసింది. దాన్నిగురించే రెండుముక్కలు చెప్పాలనుకొని యిల్లాఅన్నాడు:

"చూడు శైలూ, వెళ్ళిపోయేముందు మరొకమాట. నీకంటె వయస్సులో పెద్దవాణ్ణి నేను. అనుభవం కలవాణ్ణి నువ్విప్పుడే జీవితంలో అడుగుపెట్టావు. నిన్నింకా ఆదర్శాలు వదిలిపోలేదు. అందుకే యివి చెప్తున్నాను. మనం సంఘజీవులం. మరొకరితో నిమిత్తంలేకుండా ఎల్ల కాలం బతకలేం. స్నేహం, సానుభూతి వాంఛిస్తాం. ఇతరులతో కలిసేటప్పుడు ఒక్కవిషయం గుర్తుంచుకో! నీభావాలతో ఇతరుల భావాలు ఏకీభవిస్తేనే స్నేహం సంభవమని అపోహపడకు. భావాలలోను, ప్రకృతులలోను వైరుధ్యం ఉన్నా స్నేహానికీ సాహచర్యానికీ ఇవి అడ్డురావు. అందరూ నువ్వుచెప్పినట్లే నడుచుకోవాలని గాని, నీ ఆదర్శాలనే ఆదరించాలనిగాని, నీభావాలతోనే ఏకీభవించాలని గాని కోరకు. ఎంత స్నేహితుడైనా నీభావాలతో పూర్తిగా ఏకీభవించలేడు. అంతమాత్రాన అతన్ని విడిచేస్తావా? లేక నిన్నతడు విడిచెయ్యాలా? అదీగాక భావవైరుధ్యమే లేకపోతే జీవితమంతా ఒక గాడిలోపడి యాంత్రికంగా తయారవుతుంది. జీవం ఉండదు. నువ్వితరుల బలహీనతలని సానుభూతితో క్షమించి వారిని ఆదరించిననాడే ఇతరులు నిన్ను గౌరవిస్తారు, నీతో స్నేహం చేస్తారు, నిన్ను ప్రేమిస్తారు. ఇదిమాత్రం తప్పక గుర్తుంచుకో. జీవితంలో వివిధ వ్యక్తుల అవసరం వస్తుంది. ఎందరితోనో మెలగవలసి వస్తుంది. అందరిలోనూ భావైక్యంకావాలంటే వలను

పడదు. నీకు ఏమైనా పరిహారం ఇస్తానని నిన్నవమానపరచ దలచుకోలేదు. అయితే జీవితంలో డబ్బు అందరికీ అవసర మవుతుంది. ఎప్పుడు అవసరంవచ్చినా నీకో స్నేహితుడున్నా డనిమాత్రం మరిచిపోకు. ఇప్పటికే నీ మనస్సు చాలా కల వరపడింది. ఇంకా దీన్నిగురించి ఆలోచించి బాధపడకు. వెళ్ళి నిశ్చింతంగా పడుకో. నువ్వింక స్వతంత్రవు."

శైలజ నిలువలేకపోయింది. ముఖం చేతులతో కప్పు కుని అక్కడినుంచి వెళ్ళిపోయింది.

పక్కమీద పడుకున్నాక కూడా ఆమెకు దుఃఖం ఆగలేదు. అలా కన్నీరు స్రవిస్తూనే ఉంది. మనస్సు పరిపరి విధాలపోయింది. ఆ చీకటిలో ఆమె కళ్ళు తెరచుకొని కన బడని దేన్నో చూడాలని ప్రయత్నించింది.

ఎన్నో ఆదర్శాలు సృష్టించుకున్న తనకు పదినెలల వైవాహిక జీవితంలోని అనుభవం, తన ఆదర్శాలు తన కిచ్చిన సందేశాన్ని సందేహాస్పదంగా మార్చివేశాయి. అన్నీ అనుకూనాలే వస్తున్నాయి.

ఆలోచించి, ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చి నిశ్చింతగా నిద్రపోయింది శైలజ.

తెల్లవారిన తరువాత లేచిన కళ్ళు బరువుగాసూ, ఎర్ర గానూ ఉన్నాయి. కాని రాత్రి ఒక నిశ్చయానికి రావడం వల్ల మనస్సెంతో ప్రశాంతంగా వుంది. చప్పున కాలకృ త్యాలు కానిచ్చి ప్రత్యేకంగా అలంకరించుకుంది.

ట్రేతో కాఫీ ఫలహారాలు తీసుకుని డ్రాయింగ్ రూమ్‌లో వార్తాపత్రిక పట్టుకు కూర్చున్న కాన్ దగ్గరకు వెళ్ళింది.

చప్పుడు విని తలపైకెత్తాడు కాన్. ఆమెను చూచి ఒక్కసారి చలించాడు. పది నెలలు అతి సన్నిహితంగా వున్న ఆమె ఆ వేళ వెళ్ళిపోతుందనే భావం రాగానే గుండెలలో సూదిపొడిచినట్టనిపించిం దొక్కసారి అతనికి.

ట్రే టీపాయ్ మీద పెట్టి, నాప్‌కిన్ చేతి కందించింది శైలజ. మోకాళ్ళమీద నాప్‌కిన్ పరిచి ఫలహారానికి ఉపక్రమించాడు కాన్.

పది నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి. ఏం మాట్లాడితే ఏం ప్రమాదమో అని ఇద్దరూ వెనకాడుతున్నట్టే ఉంది.

కాఫీ తాగుతూ కాన్ అడిగాడు—

"ఇవాళే వెడతావా?" అని.

"లేదు. నా నిశ్చయం మార్చుకున్నాను" అంది శైలజ సరళంగా.

ఒక్కసారిగా లేచాడు కాన్.

"నిజం!!!" అంటూ ఆమె చెయ్యిపట్టుకున్న అతనికళ్ళలో వెయ్యి విద్యుద్దీపాలు ఒక్కసారిగా వెలిగిన కాంతి స్ఫురించింది.

పరీక్షలు మొదలుపెట్టేవేళకు అనూరాధ, హైమలు మానసికంగాను శారీరకంగానుకూడా చాలా క్షీణించిపో యారు. ముఖ్యంగా నెల్లాళ్ళముందు నుంచీ రేయింబవళ్ళన కుండా చదివారు ఇద్దరూ.

ప్రతిరోజూ పరీక్షలు అయ్యేవేళకు విశ్వం వెళ్ళి కనుక్కొని, జరిగినదానినిగురించి వారు ఆలోచించడానికి వీలు లేకుండా చూచి, వారిని మరునాటి పరీక్షకు తయారు చేసేవాడు.

కాని ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నా నాలుగో పేపరు పూర్తిగాపాడుచేసిన అనూరాధను ఓదార్చడం అతని తరం కాలేదు. మరీ సున్నితమైన హృదయంగల వారితో పేచీ యే యిది. వాళ్ళమనస్సులు వికలమైతే ఒకదారికి తీసుకు రావడం తేలికైన పనికాదు. చప్పున తేరుకోలేరు వారు. అందుకే నాలుగో పేపరు ప్రభావం యితర పేపర్లమీద కూడ కనబడింది అనూరాధ విషయంలో. తక్కిన పేపర్లు కూడా అనుకున్నంత బాగా వ్రాయలేకపోయింది.

హైమకు విశ్వందగ్గర ఎంత చనువో అంత భయంకూడా వుంది. నాలుగో పేపరు ఆమెకూడా పాడు చేసినా విశ్వం ఆ విషయం మరిచిపొమ్మని నిర్దేశించగానే శిరసావహించింది హైమ. తత్ఫలితంగా హైమ మనస్సు మళ్ళించడంలో విశ్వం కృతకృత్యుడయ్యాడు. అందుచేతే హైమ మిగతా పేపర్లు బాగా వ్రాయగలిగింది.

ఆఖరి పరీక్షకు ముందురోజున అనూరాధ నిలద్రొక్కుకోలేకపోయింది. ఇంటికి వస్తూనే బేలముఖం పెట్టింది. ఇంక మర్నాటి పరీక్షకు కూర్చుంటే రాబోయే ఫలితం విధిగా అంగీకరించాలి. అనుమానాలేమైనావుంటే మర్నాడు పరీక్షకు వెళ్ళడం మానేసి ఉపసంహరించుకోవాలి. ఏం చెయ్యడానికీ తోచక గిజగిజకొట్టుకుంది అనూరాధ.

ఈ పరిస్థితి విశ్వానికి విషమ సమస్యఅయికూర్చుంది. యెన్నివిధాలో ఊరడించ ప్రయత్నించాడు.

"చూడు రాధా! నువ్వు అనవసరంగా బాధపడుతున్నావు. నువ్వనుకునేటంత పాడుచేసి వుండవని నా నమ్మకం" అన్నాడు విశ్వం.

"కాదంటే! నాకు పాసవుతానని కూడా నమ్మకం లేదు. వుపసంహరించుకొంటా" అంది ఏడుస్తూ.

"తొందరపడి ఒక నిశ్చయానికి రాకు రాధా! ముందు నీ పేపర్లన్నీ యిల్లా పట్రా. దాన్ని బట్టి తేలుద్దాం" అన్నాడు విశ్వం.

అనూరాధ వెళ్ళి పేపర్లన్నీ పట్టుకునివచ్చింది.

విశ్వం ప్రతిఒక్క పేపరూ ప్రశ్నలవారీగా చూసి ఆమె వ్రాసినవి తెలుసుకొని వుజ్జాయింపుగా మార్కులు వేశాడు.

"ఈ లెక్కన చూస్తే నాలుగోదాన్లోమాత్రమే ముప్పై దరిదాపుల్లో వచ్చేటట్టున్నాయి. మొదటి మూడింట్లోనూ ఎట్లా ఫస్టుగానే వస్తాయి. యింక నువ్వు

చూసినా సగటున సెకండ్ క్లాస్ మార్కులు వస్తాయి" అన్నాడు విశ్వం.

"మీ ఆశలన్నీ పాడుచేశాను. ఇప్పుడు మానుకొంటే ఇంకో ఏడాది వ్యవధి వుంటుంది. బొత్తిగా నమ్మకంలేకుండా చూస్తూ చూస్తూ మూడేళ్ళచదువు ఎల్లా గంగలో కలిపెయ్యను?"

"నీ నమ్మకం మాట దేవుడెరుగు! మీదటికి అంటే అంతా మొదటికి వస్తుంది. నువ్వు గుండె గట్టిచేసుకోకపోతే మీదటి పరిస్థితి మరింత కష్టంగా వుంటుంది. ఇప్పుడు ఒక పేపరు పాడుచేసి దాని ప్రభావం ఇతర వాటిమీద చూపావే! ఇంక మీదటి మాట ఆలోచించు. ఇప్పుడయితే ఇంకో అవకాశం ఉంది. మీదటికి అదీ వుండదు. అప్పుడు ఇంక అవకాశమే లేదనేభావం వుంటే ఇంకా బాధకదూ? అదీకాక ఏ జ్వరమైనావచ్చినా అంతేకదా? నా మాట విని రేపుకూడా వెళ్ళి వ్రాయగలిగినంత వ్రాసిరా" అంటూ నచ్చజెప్పాడు విశ్వం.

"కాని ఇంతా చదివి ఇదేనా ఫలితం? యింత చదువూ ఎందుకూ లేకుండా పోదూ?"

"క్లాస్ వస్తే మంచిదేకాని రాకపోతే నష్టమేముంది చెప్పు? ఒకవేళ నీకు థర్డ్ క్లాస్ వస్తేమటుకు నీకు వచ్చిన చదువు విలువ పోతుందా? కాని మీదటికి వాయిదా వేస్తే మాత్రం పరిస్థితులు మరింత విషమంగా వుంటాయి"

"అంత థర్డ్‌క్లాస్ వచ్చేసాటికి మీదటికే పరీక్షకు వెడితేపోదూ! ఇంకో అవకాశమన్నా చూడవచ్చుగా!"

"రాధా! నీ వెర్రిగాని నీకు థర్డ్‌క్లాస్ వస్తుందని నేననుకోను. ఒకవేళ అదే వచ్చినా నీవిలువ నాకు తెలుసు. నువ్వే లేనిపోనివి కల్పించుకుని బాధపడకు. కాని మీదటికి మాత్రం వాయిదా వెయ్యకు. అనుకోని వెన్నయినా జరగచ్చు. ఏది జరిగినా అంతా వృధా అయిపోతుంది. ఇప్పటి పరిస్థితే చాలా మెరుగు. అందుచేత నా మాట విను."

"సరే అయితే! ఒకవేళ ఏమైనా, నన్నేం అనకండేం!" అమాయకంగా అడిగింది అనూరాధ.

"ఛీ! పిచ్చిపిల్లా!" అంటూ అక్కున జేర్చుకుని ఊరడించాడు విశ్వం.

మొత్తాని కెలాగయితేనేం, పరీక్షలు అయ్యాయనిపించారు అనూరాధా, హైమానూ.

అనూరాధ పరీక్షలు పాడుచెయ్యడం అనూరాధకంటె హైమను ఎక్కువ బాధించింది. విశ్వం పట్టుపట్టకపోతే తను ఆ మాత్రం వ్రాసి వుండనని ఆమె అభిప్రాయపడింది. విశ్వం పరిచయం తనకు అనూరాధ మూలంగానే. అనూరాధకూడా కష్టపడి చదివినా విధివశంవల్ల యిల్లా జరగడం ఆమెకు నొప్పి కలిగించింది.

కాని హైమ కృతకృత్యురాలు అయినందుకు విశ్వం, అనూరాధకూడా సంతోషించారు మనఃపూర్వకంగా.

నాలుగురోజులు పూర్తిగా విశ్రాంతి తీసుకొన్న తరువాత విశ్వం అనూరాధ, హైమల పేపర్లు పునఃపరిశీలన చేసి ఇలా అన్నాడు:

"చూడమ్మా! నేనిదివరకే చెప్పినట్టు నీకు ఫస్ట్ క్లాస్ తథ్యం! రాధకి తప్పకుండా సెకండ్ క్లాస్ వస్తుంది, ఊరకే విచారిస్తూందిగాని. ఉపసంహరించుకొంది కాదు నయం! రాధ విషయం ఏమైనా బెంగలేదు నాకు. నీ విషయమైమాత్రం బాధపడుతుండేవాడిని. నా బాధ తీర్చేశావమ్మా!"

"ఆవాళ బాధపడ్డాను గాని నిజంగా యివాళ ఆలోచిస్తుంటే ఇదే నయమనిపిస్తూంది. యెటో అటు అయిపోయిందిగానీ ఈ బాధలోపడి ఊగిసలాడకుండా చేసి బతికించారు. నిజంగా చాలా సంతోషంగా ఉంది" అంది అనూరాధ.

"ఇద్దరం ఒక్కలా చదివినందుకు నువ్వుకూడా బాగా రాసివుంటే నాకు నిజంగా సంతోషంగా వుండి వుండును. కాని యిప్పుడు నాకేమిటోగా వుంది" అంది హైమ బాధగా.

"బాధపడవలసిన నేను నిక్షేపంలావుంటే నువ్వెందుకమ్మా బాధపడతావ్? ఇంతకీ నా పరీక్ష ఏమైనా అన్నింటికీ మీ అన్నయ్యే వున్నారు. నువ్వు బాగారాయడం మీ కుటుంబానికే సంతోషం. వాళ్ళ శ్రమకి మంచి ఫలితం యిచ్చినట్టు!" అని ఊరడించింది అనూరాధ హైమను.

పరీక్షలైపోవడంతో ఒకవిధమైన ఆందోళన తగ్గి యిల్లు మళ్ళీ కళకళలాడసాగింది.

హేమా వాళ్ళ పరీక్షల ముందు యేవో సెలవులు వస్తే యింటికి వెళ్ళిన నిధి వాళ్ళ పరీక్షలైన వారానికి ఊడిపడ్డాడు.

హాల్లోకివచ్చి అనూరాధ, హేమ వంటింట్లో గిన్నెలతో కుస్తీ పట్టుతున్నారు. విశ్వం యింట్లో లేడు. తలుపుతీసిన అనూ రాధ ముఖం నిధిని చూసి వికసించింది.

"రా తమ్ముడూ! పరీక్షలైంది మొదలు నీకోసమే ఎదురుచూస్తున్నాం"—అంటూ ఆప్యాయంగా ఆహ్వానించింది.

"బాగా రేరీ!" అడిగాడు నిధి.

"నీకు సెలవులుగదా అని ఆయనకీ అంతే అనుకున్నావా? స్కూలో?"

"అభినందనలు అందుకో" అన్నాడు నిధి పరీక్షలైపోవడం గుర్తు తెచ్చుకుని.

"ఎందుకు?"

"పరీక్షలైనందుకు. క్లాస్ తథ్యంగా?"

"సున్న నిశ్చయం నావంతుకి. పోతే హేమ విషయంలో నీ అంచనా నిజం. ఆమెకు చెప్పు అభినందనలు. పద, వంటింట్లోకి. పీటవేస్తాను కూర్చుందువుగాని. ఒక్కడవు యిక్కడేం కూర్చుంటావు!" అంది నవ్వుతూ.

"నువ్వు సున్న చుట్టావా? అసంబద్ధం! నేను నమ్మను."

"నువ్వు నమ్మినా నమ్మకపోయినా, అంతే. ముందు పద!" అంటూ లోపలకు నడిపించింది నిధిని.

"ఎవరిది వదినా ఆ కంఠం?" అంటూ ఇవతలకు రాబోయిన హైమకు ఇద్దరూ ఎదురయ్యారు.

"నమస్కారం!" అంటూ చేతులు జోడించింది నిధిని చూసి.

"అభివందనలు హైమా!" అన్నాడు నిధి.

"థాంక్స్!" అంది హైమ.

పీట వేసి "కూర్చో!" అంటూ పళ్ళెంనిండా పకోడీలు పెట్టి నిధిని కూర్చోపెట్టింది అనూరాధ.

"అయ్యబాబోయ్! ఇన్నే!!" హడిలిపోయాడు నిధి.

"ఈ రెండూ తినలేకపోతే యెందుకూ!" గదిమింది అనూరాధ.

నిధికి నవ్వు తెర వచ్చింది.

"ఎందుకబ్బా అంత నవ్వు?" అడిగింది అనూరాధ.

"నీకో సామెత తెలుసా! 'ఆ స్తంభంచాటున కుంభం ఎవరికి?' అని ఒకడడిగాడట! 'ఆ ఒక్క మెతుకేనా! నాకే!' అని సమాధానం వచ్చిందట! అది గుర్తుకొచ్చింది" అన్నాడు నిధి నవ్వుతూ.

ముగ్గురూ నవ్వుకున్నారు.

నిధి పకోడీలు కరకరలాడిస్తూ మళ్ళీ ఏదో జ్ఞాపకం వచ్చి నవ్వాడు.

"ఈ మాటు ఏమిటి మహాత్మా!" హైమ అడిగింది.

"పకోడీలమీద చిలకమర్తి వారిపద్యాలు ఉన్నాయి. ప్రకాశంగారి కోరికమీద పద్యానికో పకోడీవంతున చెప్పారట ఆశువుగా. అక్షర లక్షలిచ్చేరోజులు వెళ్ళిపోయి పద్యానికో పకోడీ యిచ్చేరోజులు వచ్చాయికదా అని వాపోయాడుట! పద్యాలు పూర్తిగా గుర్తులేవుగాని ముక్కలు మాత్రం గుర్తున్నాయి. ఒకటి—'వనితల పలుకుల నమృతము కలదనుటెగాని లేదట, కనుగొన నీయందమృతము కలదు పకోడీ!' ఇంకోటి—'ఆ రామానుజుడా తీరుగ పోరున మూర్ఛిల్ల సంజీవి యుందెచ్చె మారుతి ఎరుగడు గాక య్యారే నినుగొనిన బ్రతుకడటనె పకోడీ!' ఇంకోటి మరీ చిత్రంగా ఉంటుంది. 'కోడిని తినుటకున్ సెలవువేడిరి ముక్ బ్రాహ్మణులు... కోడివలదా బదులు పకోడి తినుమంచు చెప్పె కూర్మి పకోడీ!' హాస్యం అంటే ఆయనదే హాస్యం" అన్నాడు నిధి నవ్వుతూ.

అనూరాధ హైమలకు పట్టలేని నవ్వు వచ్చింది.

"అయితే నువ్వింటికెందుకెళ్ళినట్టు? పరీక్షల గొడవ నీకేం పట్టినట్టులేదు." మందలింపుగా అంది అనూరాధ.

"ఏవో సెలవులు వస్తే ఎటొచ్చినా యెవరో ఒకర్ని చదువు పాడుచెయ్యడమే అవుతుందని ఇంటికి వెళ్ళి

పోయాను. పరీక్షల విషయమూ—యింకా ఉందిగా టైమ్!"

"అయితే మాత్రం అంత యధాలాపంగా తీసుకుంటే ఎల్లా?" అడిగింది అనూరాధ.

"తీవ్రంగా తీసుకుని నువ్వేం చేశావ్? గాభరాపడి పాడుచేశావ్. మాకీ గాభరా ఏం లేదు. ఒకసారి కాకపోతే నాలుగుసార్లు కట్టుకోవచ్చు పరీక్షకి. ఆ ధైర్యం మాకు చాలా ఉపకారం చేస్తుంది. వచ్చినంత మటుకు పాడుచెయ్యకుండా రాయగల శక్తినిస్తుంది. ఇంతకీ మా వృత్తికి డిగ్రీ విలువతో పనిలేదుగా?"

"నువ్వు చెప్పింది అక్షరాలా నిజం తమ్ముడూ."

"ఏమిటి మీ తమ్ముడికివాళ యిలా తైరు కొట్టేస్తున్నావ్?" అప్పుడే యింట్లోకి అడుగెడుతూ ఆఖరి వాక్యాలు విన్న విశ్వం అని, మళ్ళీ నిధిని "ఎప్పుడయ్యా రాక?" అని అడిగాడు.

"ఇవాళే బావగారూ! వీళ్ళ పరీక్షలు కాదుగాని మీరు సగమై పోయారు!" నవ్వుతూ అన్నాడు నిధి.

"మీ అక్క చేసిన ఘనకార్యం విన్నావా?"

"ఆఁ ఆఁ!"

"ఏం విన్నావు? ఆయనకు చీమ కుట్టినట్టేనా లేదు. పైగా హైమ ఏం చేస్తుందోనని బెంగెట్టుకున్నారట! ఎల్లా

గయినా మనమే పరాయివాళ్ళం తమ్ముడూ!" అంది అనూరాధ నవ్వుతూ.

"ఈ విషయంలో మాత్రం నీతో ఏకీభవించ లేనమ్మా! హైమ బాధ్యత ఆయన తీసుకోగానే అల్లా అను కోవడం సహజం. ఎందుకంటే నీ పరీక్ష ఫలితం మీ ఇద్దరి మధ్యనే ఉంటుంది. ఏది ఎట్లైనా దాని ప్రభావం మీ మీద ఆట్టే ఉండదు. విజ్ఞాన సముపార్జనే మీ ప్రధాన లక్ష్యం. కాని హైమ విషయం వేరు."

"బాగా చెప్పావోయ్! రాధా, మీ తమ్ముడే చెప్తూంట! నేను కాదు!" అన్నాడు దెప్పి పొడుస్తూ విశ్వం.

"ఊరుకో అన్నయ్యా! అవిడ అసలే బాధ పడు తూంటే నువ్వొం కాస్త కారం జల్లుతావ్!" కోపంగా అంది హైమ.

"నువ్వు ఆమెతోనే ఏకం అయ్యావ్? మొత్తానికి నిన్ను బుట్టలో వేసుకుందన్నమాట!" విశ్వం ఉడికించాడు. "నిజం, నిజం! ఆమె చంటిపిల్ల కదూ, నేను చెప్పినట్లల్లా ఆడడానికి! నోట్లో వేలుపెడితే కొరకను కూడా లేదు పాపం!" సాగదీసింది అనూరాధ.

"ఇంతకీ మీ పరీక్ష లెప్పుడయ్యా?" విశ్వం నిధి నడిగాడు.

"జూన్ మొదటి వారంలో. అయినా పరీక్ష ఫలితం గురించి నా కంత పట్టింపులేదు బావగారూ! ఇవాళ కాక

పోతే మరోసారి పాసవుతాం. పరీక్ష లయిపోయాయి కదా, ఇవాళ సినీమాకి పోదాం పద్దురా!" అన్నాడు నిధి.

అంతా సరే నన్నారు

* * *

మే మూడోవారంలో ఫలితాలు తెలిశాయి. విశ్వం చెప్పినట్టే హైమ ఫస్టుక్లాసులోను, అనూరాధ సెకండ్ క్లాసులోను పాస్ అయారు.

"నే చెప్పలేదూ! ఊరికే కంగారు పడిపోయావ్! ఏ కళనున్నావో కాని మొత్తానికి నా మాట విన్నావు. లేకపోతే ఇదంతా వృథా అయిపోయి మరో ఏడాదిపాటు యీ ఆందోళన మిగిలి ఉండును" అన్నాడు విశ్వం.

"నిజమే ననుకోండి! కాని ఆ బాధ పడ్డవాళ్ళకే తెలుస్తుంది. అయినా ఇంతా చదివి సెకండ్ క్లాసే గదా!" నిట్టూర్చింది అనూరాధ.

"ఇదిగో! అక్కడే నాకు కోపం వచ్చేది! నిన్నటి వరకూ అసలు పాసైతే చాలు ననుకున్నావు. ఇప్పుడంత కంటే ఎక్కువే వచ్చింది. కాని సంతృప్తి చెందలేకపోతు న్నావ్! ఫస్టుక్లాస్ రాలేదని విచారిస్తున్నావు. ఇంక తృప్తి అనేది ఎక్కడ? నీ విధి నువ్వు నెరవేర్చాలి. ఫలితం ఎల్లా ఉన్నా స్వీకరించడమే బుద్ధిమంతుల లక్షణం. మన ప్రయ త్నలోపం లేనప్పుడు మనం బాధ పడకూడదు. ఏమం టావ్ హైమా?" హైమ నుద్దేశించి అన్నాడు విశ్వం.

"అంత తేలికగా ఉండడం అందరికీ చేతౌతుందా

అన్నయ్యా? కాని వెయ్యి జన్మలెత్తినా నీ ఋణం తీర్చుకో లేను. నువ్వే లేకపోతే ఈ చదువుకు నే నేమై ఉండే దాన్నో" అన్న హైమ కళ్ళు కృతజ్ఞతతో మెరిశాయి.

"అదేనమ్మా పొరపాటు! నాదేముంది? నేను చెప్పక పోయినా నువ్వు చదువుకోగలవు. నేను చెప్పకపోతే ఇలా జరిగివుండేది కాదనే ఆలోచనకు తావేలేదు. నీ పట్టుదల వల్లనే ఫలితం పొందావు. నేను చేసిన దేముందీ? ఇద్దరికీ సమానంగానే చెప్పాను. రాధ కంగారు పడి పాడుచేసింది. నువ్వు నిలదొక్కుకొని సాధించావు. నన్నూరికే అలా కృతజ్ఞతతో ఉక్కిరి బిక్కిరి చేసెయ్యకు!"

"నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు. ఇక్కడ మాత్రం నీ మాట ఒప్పుకోను. నువ్వు విప్పి చెప్పకపోతే అవన్నీ నా కీ జన్మలో అర్థమై ఉండేవికావు. అంతేకాదు. ఆ పరీక్ష రోజుల్లో నువ్వు చెప్పిన ధైర్యం—ముఖ్యంగా ఆ నాలుగో పేపర్ రోజున—లేకపోతే ఎప్పుడో సున్నపెట్టి వచ్చేదాన్ని."

"నీ నిర్మలహృదయం నీ చేత అల్లా మాట్లాడిస్తోంది. మీ క్లాసులో నీతోపాటు ఫస్టుక్లాసు తెచ్చుకున్న వాళ్ళంద రికీ నేనే చెప్పానా నీ వెర్రిగాని!"

"వాళ్ళ విషయం నా కెలా తెలుస్తుంది? నా విష యం మాత్రం నాకు బాగా తెలుసు! కాని నువ్వు మాత్రం ఏమీ ఎరగనట్టుండా లనుకుంటావ్! నీతో వచ్చిన చిక్కే ఇది!"

"పోనీ నువ్వు చెప్పు రాధా!" విశ్వం అనూరాధను అడిగాడు.

"ఏం చెప్పను?"

"తీర్పు!"

"మీ ఆయన గదా అని అటు చెప్తే నే నూరుకో నమ్మాయ్!" అంది హైమ తల తిప్పుతూ, చిన్నపిల్లలా నవ్వుతూ.

"ఇది మరీ బాగుంది. 'తినమంటే కప్పకోపం! వద్దంటే పాముకోపం!' ఎలా చచ్చేది? సరే. అయితే వినండి. వీరి అసమాన బోధనా పటిమవల్లా, నీ అకుంఠిత దీక్ష వల్లాను. సరిపోయిందా?" గోడమీది పిల్లి వాటంలా అంది అనూరాధ.

"కోమటి సాక్ష్యం లాగుంది!" అన్నారు విశ్వం, హైమ నవ్వుతూ.

"వీటికేం గాని అక్క ఈ సెలవులకి వచ్చే సూచన లేమీ లేవా?" అంది హైమ, శైలజను గుర్తుచేస్తూ.

"ఇప్పుడిక ఆవిడ కదలడం అంత తేలికా? అయినా ఆరు నెల్లయి ఉత్తరాలు లేవు. నేనూ రాయలేదనుకో. రేపైనా తప్పకుండా రాసి పడెయ్యాలి. మీరూ రాయడం లేదా?" అనూరాధ అడిగింది.

"అన్నట్టు ఉత్తరం అంటే జ్ఞాపకం వచ్చింది. రెండు నెల్ల క్రితం వచ్చింది శైలు దగ్గిరనుంచి. అప్పట్లో పరీక్షల ముందు చూపించడం ఇష్టంలేక అట్టే పెట్టేశాను.

తరువాత ఇతర విషయాల మధ్య మరిచేపోయాను. సమాధానం రాశానుకో!"

"ఏదీ ఉత్తరం ? ఏమంత మునిగిపోయే సంగతులుంటాయని చూపించడం మానేశారు బాబూ !"

"తినబోతూ రుచులెందుకు!" అంటూ విశ్వం లోపలికెళ్ళి ఉత్తరం తెచ్చి యిచ్చాడు.

ఆతృతగా విప్పి అనూరాధ, హైమ ఒక్కసారి చదవడం మొదలెట్టారు. ఉత్తరం పూర్తయేలోగా వారి ముఖాలు వివిధ రంగులు మార్చుకున్నాయి.

"అయితే మీరూహించినట్టు ఆత్తరాల జరిగిందన్న మాట! నేనందుకే చెప్పాను, గట్టిగా రాసెయ్యమని" అంది అనూరాధ తేరుకుని.

"కాని నువ్విప్పుడూ యిదివరకు మాట్లాడినట్టే మాట్లాడుతున్నావు. అనుభవం నేర్పిన పాఠం మనస్సుకి నాటినట్టు ఇతరుల చెప్తే నాటదు! నే నేదైతే చెప్పాలనుకొని చెప్పలేకపోయానో అది ఖాన్ ఆమెకు అనుభవపూర్వకంగా చూపించాడు. ఇంక ఆమెకు జీవితంలో ఓటమి లేదు నాకు నిజంగా సంతోషంగా ఉంది. ఆమెలో మార్పు రావలసిన విధంగానే వచ్చినందుకు. నీకు పరీక్షల ముందిది చూపిస్తే అస్తమానం దీన్ని గురించే ఆలోచిస్తావని చూపించలేదు. తరువాత మరిచిపోయాను."

"ఏమని రాశారు ?"

"మనః పూర్వకంగా ఆశీర్వదిస్తున్నానని, సంతో

పిస్తున్నానని, తాను నిర్ణయించుకున్న విధానమే మంచి దనీ రాశాను" అన్నాడు విశ్వం.

* * * *

జూన్ మొదటి వారంలో నిధి పరీక్షలైపోయాయి. పరీక్షలైపోయినా నిధి కొన్నాళ్ళపాటు విశాఖపట్నంలోనే ఉండిపోవడానికి నిశ్చయించుకున్నాడు, రోజూ వరుస తప్పకుండా విశ్వం ఇంటిలో హాజరు వేయించుకుంటూ ఉండేవాడు. చిటికెలమీద దొర్లిపోయేది కాలం.

ఒకనాడు సాయంకాలం నాలుగు అయింది. విశ్వం యింటి తలుపు తట్టాడు నిధి. అనూరాధ తలుపు తీసింది. ఆమె ఒక్కతే ఇంట్లో ఉంది.

"బాబూ, లోపల కూర్చుందువుగాని రా. నా పని అవుతుంది. నీకు ఊసూ పోతుంది" అంటూ పాకశాలలోకి దారితీసింది.

"ఎవ్వరూ లేరా యింక?" నిధి అన్నాడు.

"మీ బావగారు పనుందని స్కూలుకెళ్ళారు. హైమ గంట క్రితంవరకు యిక్కడే ఉంది. ఏదో హడావిడిగా కనబడుతున్నావ్, ఏమిటి విషయం?" కుంపటి విసురుతూ అడిగింది.

"మా స్నేహితులంతా కలిసి 'యువజన సమితి' అని ఒక సంఘం స్థాపించబోతున్నాం యివాళ."

"ఏమిటట ఆ సమితి ఆశయాలు?"

"వరకట్న నిషేధం. సాంఘిక సేవ. మా క్లబ్బులో

కొంత భాగమైనా యువజన విద్య మొదలైన వాటికి ఉప యోగించడం వగైరా—"

"బాగున్నాయి" అంది అనూరాధ క్లుప్తంగా.

"ఇట్టే తేల్చేశావే! సన్నంతో అభినందించి మద్దతు యిస్తావనుకున్నాను" అన్నాడు దెబ్బతిన్న నిధి.

"నిన్ను నిరుత్సాహ పరచడం నా కిష్టంలేదు. కాని నాకీ సమితులమీదా సంఘాలమీదా నమ్మకం లేదు" అన్నది అనూరాధ.

"ఎందుకనీ!" సాశ్చర్యంగా అడిగాడు నిధి.

"ఉదాహరణకి వరకట్నం విషయం చెప్పావే? అది వ్యక్తిగత సమస్య. సమితి అంటూ గద్దెలెక్కి ఉపన్యాసా లిస్తే సరిపోయేదికాదు."

"అయితే వరకట్నాల్ని నువ్వు అంగీకరిస్తావా? వాటిని నిర్మూలించడానికి సంఘాలుపెట్టి కృషి చేస్తామంటే నీకు వేళాకోళంగా ఉందా? కట్నాల భయం వల్ల ఎంత మంది తలిదండ్రులు క్రుంగి కృశించి పోతున్నారు? ఈ రోజుల్లో ఆడపిల్ల పెళ్ళికావాలంటే ఎంతకష్ట మవుతూంది? దమ్మిడీ చెయ్యని వాడు కూడా వేలకు వేలు కట్నం అడుగుతాడే ఈ దురాచారం పోవద్దా? ఇది సాంఘిక సమస్య కాదు, వ్యక్తిగతం అంటున్నావే తేలిగ్గా!" ఆవే శంగా అన్నాడు నిధి.

"ఉపన్యాసానికి సిద్ధం అయి వెడుతున్నట్టున్నావే!" నవ్వింది అనూరాధ.

"మాట తప్పించకు..."

"బాబూ! నువ్వు ఆవేశంలో ఏవో అనుకుంటు న్నావు కాని యిది కేవలం వ్యక్తిగతం. సాంఘికం కాదు. అందుకే మార్పు కూడా వ్యక్తిగతంగానే రావాలి. ఇది ఒకళ్ళకువర్తింపజేసినట్టు అందరికి వర్తింపజెయ్యలేం .ఇంకా ఏమిటంటే ఇదిఎవర్నీఎవరూ నిర్బంధించడానికి కానిఇది, ఈ విధంగా జరగాలని ఆదేశించడానికి కానివీలు లేనిది. ఇటువంటి విషయాలలో తనయిష్టంవచినట్టు తాను పోవాలిగాని, సమితి అంటూ,ఆశయాలంటూ ఉద్రేకపడిసాధించేదేమీ లేదు."

"ఎంతసేపూ వ్యక్తిగతమో అనే అంటావుగాని కారణాలు చూపించవేం ?"

"ఈ సమస్య చాలా విచిత్రమైనది. దీనికి చాలా విషయాలతో సంబంధం ఉంది. నీకు ఓపికవుంటే విను. ఉదాహరణకి నువ్వు లక్షాధికారివి.నీకు కట్నం అక్కర్లేదు: ఎటువంటి పిల్లను చేసుకుంటావ్ ? నీతాహతు పిల్లని చేసు కుంటే కట్నం నీ విషయంలో సమస్యేకాదు. నువ్వు కోర కుండానే ఆ వధువు తండ్రి నీకు అన్నీ ముట్టచెబుతాడు. అది తప్పనలేవు నువ్వు. కడుపున పుట్టిన కూతురికి ఆయన కిష్టమైనవన్నీ యిచ్చుకుంటానంటే వద్దనే అధికారం నీకు లేదు. నువ్వు కాదన్నా వధువు తన తండ్రి ఆస్తిలో తమ్ముడితో సమానమైన వాటా తెచ్చుకొంటే నువ్వు కాదనడానికి వీలు లేదు. ఇలా పరీక్షిస్తే యిది కేవలం వ్యక్తిగతంగా కనబడడం లేదూ !"

"నచ్చిన వధువుని కట్నంకోసం మానుకున్న సందర్భాలు లేవూ? అక్కడ నీ తర్కం ఎలా వర్తింపజేస్తావ్?" అన్నాడు నిధి అనూరాధను మధ్యలో ఆపి.

"నన్ను పూర్తిగా చెప్పనియ్! ఒకడు కట్నం పుచ్చుకోకూడదు. సరే! వాడి చెల్లెలికి పెళ్ళి చెయ్యడానికి యివ్వకుండా తప్పదే! ఒకవేళ తప్పుతుందే అనుకో. అంటే కట్నం అక్కర్లేకుండా చేసుకొనేవాడు ఒక చవట అయితే నీ చెల్లెల్ని అతని కిస్తావా? ఇవ్వవు. కనీసం నీ స్థాయి వరుడు కావాలి నీ చెల్లెలికి. ప్రతివాడూ అల్లాగే అనుకుంటాడు. ఈ అనుకోవడంలోనే పోటీలు వస్తాయి. తాను కట్నం తీసుకోకుండా చేసుకున్నా తన తాహతు వరుణ్ణి తాను కట్నంలేకుండా తన చెల్లెలికి తేగలడా? ఇది వదిలేసి నీ మాటే ఒప్పుకుందాం వాదనకోసం. కట్నం ఎవ్వడూ తీసుకోకూడదు. సరే. అయితే పెళ్ళి ఎవర్ని చేసుకోవాలి? అందవిహీనురాలు, నిర్ధనురాలు, సంస్కార విహీనురాలు, విద్యావిహీనురాలు అయిన అమ్మాయిని, విద్యాధికుడు, ధనవంతుడు, సౌందర్యరాశి అయిన యువకుడు పెళ్ళిచేసుకోవాలని నిర్బంధించగలవా? ఇంకా ఈకట్నాల ఆశచూపి కొంతవరకైనా పెళ్ళిళ్ళు చెయ్యగలుగుతున్నారు. అసలు యీ సమస్య వ్యక్తిగతం అనడానికి ఇంకా ఋజువులు చూపిస్తాను. నీకు నచ్చిన పిల్లను నువ్వు చేసుకునేందుకు కట్నం అడ్డురాకపోతే, అంటే కేవలం నిర్ధనురాలైన ఏకైక కారణంవల్ల నీకు నచ్చిన పిల్లను నువ్వు కట్నంకోసం మానేస్తేనే అసలు కట్నం ప్రసక్తి వస్తుంది! ఇక

ఈ నచ్చడం అనేది ఎంత చిత్రంగా ఉంటుందో ఆలోచించు. నచ్చడం అంటే వధువుకుండే డబ్బు నచ్చడమా, అందం నచ్చడమా? ఏమిటి నచ్చడం! వీటిలో దేనికైనా కొలబద్ద ఏది? ఇద్దరు నచ్చిన వధువులలో కట్నం యివ్వ గలిగిన వధువుని కాదని ఇంకొకతెను చేసుకోమని ఎవరు నిర్బంధించగలరు ? లేక ఏదో సంస్కారం అనే పేరుతో నచ్చని వధువుని చేసుకుని ఆజన్మాంతం ఆమెను అసౌఖ్య పరిచి తానూ అదే పొందడమా ? ఏమిటి మీ ఆశయం ?"

"మరి ఈ సమస్య పరిష్కారం ఎట్లా ?"

"పరిష్కారం ఏమిటయ్యా ! స్త్రీ, పురుషునిమీద ఆధారపడినంతకాలం, స్త్రీ తాను స్వతంత్రంగా బతక లేనంతకాలం దీనికి నిష్కృతిలేదు. మీరు ఎన్ని సమితులు పెట్టినా నేను చెప్పిన నచ్చడం, నచ్చకపోవడం అనేది ఎదురవుతూనే ఉంటుంది. ఎవరి గొడవో ఎందుకుగాని, నీమాట చెప్పు. నీ అభిరుచులకు తగే పిల్ల ఎటువంటిది ? ఒక కురూపిని, దరిద్రురాల్ని, పొట్టపొడిస్తే అక్షరం లేని దాన్ని, సంస్కారవిహీనురాల్ని నువ్వు పెళ్ళాడతావా ? చేసుకోమని నిన్నెవరైనా నిర్బంధిస్తే నువ్వు సహిస్తావా ? అసలు అటువంటి ప్రయత్నం ఎవరు జరిపినా నీ స్వాతంత్ర్యాన్ని అరికడుతున్నారన్నమాట. ఆలెక్కని, ముఖ్యంగా నీ వివాహ విషయం తీసుకుంటే కట్నంసమస్య కానేకాదు. ఇతర లక్షణాలు నచ్చినకన్యకి, కట్నం తీసుకోకుండా

నువ్వు తాళికడితే సంఘం ఒళ్ళో ఏం పడుతుంది? మాట్లాడవేం ?"

నిధి మాట్లాడలేదు. అతనికి ఏమనడానికి తోచలేదు.

"చూడు తమ్ముడూ, లేనిపోని ఆటంకాలు కల్పించుకుని ఆశయాలంటూ మనస్సు పాడుచేసుకోకు. మీ యింటి కోడలు కాదగిన పిల్లకి మీ సమాన తాహతు ఉండాలని మీ తలిదండ్రులు కోరడం అసహజం కాదు. మీ తాహతువారిలో కట్నం ప్రసక్తేరాదు. ఒకవేళ వచ్చినా అది సమస్యగా ఘనీభవించే అవసరం కలుగదు. పోనీ, ఆ గొడవలన్నీ ఎందుకుగానీ, ఆదర్శం. ఆదర్శం అంటున్నావు. నువ్వెంతో త్యాగంకూడా చెయ్యక్కర్లేదు. హైమను చేసుకుంటావా ?" అని అడిగింది అనూరాధ.

"హైమనా?" నిధికి మతిపోయింది.

"ఏం తమ్ముడూ, అంత కంగారు పడిపోతున్నావ్ ? ఆమె మీ తాహతుకి తగినది కాకపోవచ్చు. వాళ్ళనాన్న కట్నం యివ్వలేక పోవచ్చు. అంతే లోపం ఆమెలో. అయినా నా ప్రశ్న నిన్ను కలవరపెట్టింది. తమ్ముడూ, నీకు కోపం వచ్చినాసరే, ఒక్క ముక్కమాత్రం చెప్తాను. గద్దెలెక్కి ఉపన్యాసాలిస్తేనూ, సమితులు పెడితేనూ, చట్టాలు తెస్తేనూ సమస్యలు పరిష్కారం కావు. నీటి విషయంలో వ్యక్తుల వ్యక్తిత్వం ప్రాధాన్యం వహిస్తుంది.

లేనిపోని గొడవలు పెట్టుకొని అనవసరంగా బాధపడకు" అంది అనూరాధ.

నిశ్చేష్టుడయ్యాడు నిధి. కొంతసేపటికి తేరుకుని, "అక్కా, నువ్వు అపార్థం చేసుకున్నావు. ఇందాకా నువ్వు చెప్పినవన్నీ నిజమే కావచ్చు. కాని హైమ విషయంలో సమాధానం చెప్పలేకపోవడానికి మాత్రం నువ్వనుకున్నవి కారణాలు కావు. నే నిదివరలో ఎన్నడూ అలా ఆలోచించలేదు. నా మనస్సుకి యీ విధంగా ఎప్పుడూ తట్టలేదు. ఒక్కసారిగా ఆ ప్రశ్న అడగటంతో ఉక్కిరి బిక్కిరి అయి జవాబు చెప్పలేకపోయాను."

"అయితే చేసుకుంటావా ?"

"అది నా ఒక్కడిమీదే ఆధారపడిలేదుగా? ఆమెకు యిష్టం కావద్దూ ?"

"ఆ సంగతి నేను కనుక్కుంటానులే ! చాలా కటువుగా మాట్లాడి నిన్ను నొప్పించాను క్షమించు తమ్ముడూ! కాని యిప్పటికీ నీతో ఏకీభవించలేను. దానికేం ? నా బలహీనత ఒకటి బయటపడి అంత కఠినంగా మాట్లాడేశాను. హైమనీ నిన్నూ ఒకచోట చూస్తే నాకీ ఊహే వచ్చేది. కాని యీ విషయం ఎల్లా ఎత్తాలో తెలియలేదు. ఇవాళ ఏదోవిధంగా బయటకు వచ్చింది. నిజంగా నువ్వు హైమను చేసుకుంటే చాలా సుఖపడతావు తమ్ముడూ !" అంటూంటే సంతోషంతో నిండుకొచ్చింది అనూరాధ కంఠం.

"అసలు సంగతి వదిలేశాం. ఇంతకీ మా సమితి మాట ఏం చెబుతావు?"

"ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్ళు చెయ్యడం, ఎవరి పరిస్థితు లనుకూలించినట్లు, వాళ్లు ప్రవర్తించడం జరగాలి. సాధ్యమైనంత వరకు ఇతరులను నొప్పించే పనులు చెయ్యకుండా ఉండి వీలైతే కష్టాలు తీసుకోవద్దని చెప్పండి. ప్రచారంకోసం పాటుపడకండి. వేదికలెక్కి ఉపన్యాసాలివ్వడమే గొప్పగా భావించకండి. మీకు తోడుకాని వాళ్ళని నీచంగా చిత్రించడం మానండి. ఇంతే నేను చెప్పగలిగింది" అంది అనూరాధ.

"అయితే నేను వెళ్తొస్తాను. సన్నూ మా సమితినీ చవటల్ని చేశావ్!" అన్నాడు నిధి నవ్వుతూ.

"అల్లా అనుకోకు తమ్ముడూ. ఇంతకూ నేను చెప్పిందంతా నువ్వు వినాలనిగాని, నా తర్కానికి విలువ యివ్వాలనిగాని, ఇవ్వకపోతే బాధ పడాలనిగాని అనుకునే టంత మూర్ఖురాల్ని కాను బాబూ!"

"నేను రేపు మళ్ళీ కనబడతాను. వాళ్ళంతా నాకోసం ఎదురు చూస్తుంటారు గూడాను. మా సమితికి పురిట్లోనే సంధి కొట్టేటట్టుంది" అన్నాడు నిధి నవ్వుతూ.

"మంచిది తమ్ముడూ" అంది అనూరాధ.

"మా సమితి పతనమూ మంచిదే?"

"అబ్బ, అదికాదయ్యా నువ్వు వెడతానంటేనూ—"

నిధి కదిలాడు.

అనూరాధ హృదయం పరవళ్ళు తొక్కింది సంతోషంతో. ఎవరికో ఒకరికి చెప్పెయ్యకపోతే ఉండబట్టేట్టు లేదు. అబ్బ! విశ్వం ఎంతకీ రాడేం! అనుకుంది. ఈ వార్త వింటే, విశ్వం ఎంతో ఆనందిస్తాడు. అతన్ని కొంచెం ఉడికించాలి. ఎల్లాగ?

నిధి వెళ్ళిన గంటకు వచ్చాడు విశ్వం.

అన్నం వడ్డిస్తూ అంది అనూరాధ—

"నిధికి పెళ్ళట!" అని.

ఒకసారి తల పైకెత్తిన విశ్వం ముఖంలో ఒక్క పిసరు నిరాశ తొంగి చూసినట్లనిపించింది అనూరాధకు. అదే ఆమె కోరుకున్నది.

"అదేమిటలాగయ్యారు ?"

"అబ్బె, ఏమీ లేదే !"

"మా తమ్ముడి పెళ్ళంటే మీకు బాధగా ఉన్నట్టుందే!" ఉడికించేలాగ అంది అనూరాధ.

"అదేమిటి రాధా! నాకెందుకు బాధ ?"

"హేమ విషయమై ఆలోచిస్తున్నట్టున్నారు."

"అరె! నీ కెల్లా తెలిసింది!"

"మీ మనస్సు నడగండి!"

"కవిత్వంలోకి పోతోందే ధోరణి!"

"ఇంతకీ పెళ్ళికూతురు రెవరో అడగ రేం!"

"అతనికి నచ్చిన అమ్మాయిని అతను చేసుకుంటాడు. మధ్య మన పెత్తన మేమిటి?"

"'మన' అని నన్ను కలుపుతా రేమిటి? మీ పెత్తనం లేకపోతే లేకపోయిందిగాని మా తమ్ముడి విషయంలో నా పెత్తనం లేకపోవడ మేమిటీ?"

"అయితే హైమనేనా అతను చేసుకుంటూంట? నాకు మాట మాత్రమైనా చెప్పావు కాదే యింతకు ముందు?"

"మీరు మహా చెప్పినట్టు!"

"కాని హైమను చేసుకుంటే అతను చాలా సుఖ పడతాడు. ఆమెలా—మోతాదుకు మించిన మంచితనం, ఇతరులను కష్టపెట్టకుండా ఉండేందుకు తను బాధపడడం, మాటకు ఎదురు చెప్పలేక పోవడంలాంటి గుణాలున్న వాళ్ళకి—చక్కని వరులని చూసి పెళ్ళి చేసెయ్యడమే మంచిది. హైమది చూడు. మరీ మెత్తని మనసు. శైలు వేరు మళ్ళీ. అదింకో తత్వం. అల్లాంటి వాళ్ళకోసం మనం బాధ పడక్కర్లేదు. ఎక్కడైనా నెగ్గుకు రాగలరు వాళ్ళు. కాని హైమ ప్రకృతి అల్లాంటిది కాదు. ఆమె మంచి తనాన్ని లోకువగా తీసుకునేందుకు ప్రయత్నించే వాళ్ళుం టారు. అందుచేత హైమలాంటి వాళ్ళకి వివాహమే సరైన మందు. నిధికి పెళ్ళంటే యీ విషయం తలపు కొచ్చే కొంచం బాధ కలిగింది. వాళ్ళిద్దర్నీ చూస్తుంటే

విషయం చెప్పేసరికి కలుక్కుమంది గుండె. ఇంతకీ యీ విషయం ఎల్లా ఎత్తావు?"

అనూరాధ చెప్పింది.

"మరి హైమని అడగద్దూ,"

"అదంతా నేను చూసుకుంటాను లెద్దురూ!"

రాయబారి ఉద్యోగానికి నిన్ను రికమెండ్ చెయ్యొచ్చు!" నవ్వాడు విశ్వం.

"మీరు చెప్పలేదని!" కోపంగా చూసింది అనూరాధ.

మర్నాడు మధ్యాహ్నం హైమకోసం ఎదురు చూస్తూంది అనూరాధ

గుమ్మంలో హైమ అడుగెట్టగానే—

"ఇదుగో అమ్మాయ్! అల్లా కుర్చీమీద కూర్చో!" అంది పరాయివాళ్ళతో మాట్లాడినట్టు.

హైమ తెల్లబోయింది మొదట. కాని అనూరాధ ముఖంలో కనబడిన సంతోషం, అడ్డుపెట్టినా ఆగకుండా బయట పడుతున్న నవ్వు చూసి తేరుకుని తనుకూడా గంభీరమైన ముఖం పెట్టుకుని కుర్చీమీద కూర్చుంది.

అనూరాధ హుందాగా నడుస్తూ హైమను ఆపాదమస్తకం పరిశీలించింది. హైమ దగ్గరకు వచ్చి గడ్డం పట్టుకుని పైకెత్తి సూటిగా కళ్ళలోకి చూసి, 'ఫరవాలేదు' అనుకుంది పైకే. తదుపరి "ఏదీ—నవ్వు అమ్మాయ్!" అంది గంభీరంగా. 'ఇహీహీ!' ఇకిలించింది హైమ. "అల్లాకాదు.

చిరునవ్వు. అంత పెద్దగా నవ్వడం శోభకాదు." మందలించింది అనూరాధ. హైమ చిరునవ్వు నవ్వింది. 'అదీ! బాగుంది' అనుకుంది అనూరాధ ప్రకాశముగా.

"ఏమి టాదినా యిదంతా? నాటకమా ?"

"ఇస్! ఇంతకీ అమ్మాయ్, నీ పేరేమిటన్నావ్?"

"హైమ అంటారండి!"

"ఎంతవరకు చదువుకున్నావ్ ?"

"ఏవో వానాకాలం చదువులేనండి ! ఎమ్మే పాసయ్యాను" అంది హైమ అమాయికత ఉట్టిపడేలా.

"ఫరవా లేదు !" అంది అనూరాధ బలవంతాన నవ్వు అణిచిపట్టి.

"అయితే వంటా పెట్టూ అవేమేనా వచ్చునా ?" అడిగింది మళ్ళీ.

"ఏవోనండి ! అదీ అంత మాత్రమేనండి ! మా అమ్మ యింట్లోకి రానప్పుడు నేనే వండుతానండి ! మా యింట్లో మొత్తం ఆరుగురమే ఉన్నామండి."

"బాగుంది. కుట్లు, అల్లికలు — అటువంటివి తెలుసా!"

"చెపితే నేర్చుకుంటానండి !"

"బుద్ధిమంతురాలిలాగే కనబడుతున్నావ్! ఏది అటు ఇటు కొంచెం నడు - ఆఁ! ఆఁ! అంత గబగబా కాదు — అబ్బే — మరీ అంత మెల్లిగానూ కాదు — ఆఁ! అల్లాగే. బాగుంది! అయితే మాటకు ఎదురు చెప్పడం, అవునన్నది

కాదనడం అటువంటి అలవాట్లేమీ లేవనుకోవచ్చునా అమ్మాయ్!"

"హవ్వ! అటువంటివి మా యింటా వంటా లేవండి!" అంది నోరు నొక్కుకుంటూ హైమ.

"ఓకే అంతా బాగుంది" అని గంభీర్యం అంతా ఒక్కసారిగా వదిలేసి ఇంతసేపూ బలవంతాన అణచి ఉంచిన నవ్వు అంతా నవ్వడంతో పక్కలు నెప్పిపెట్టి కళ్ల మ్మట నీళ్ళు వచ్చాయి అనూరాధకు.

హైమ శ్రుతి కలిపింది.

ఆయాసం వచ్చేవరకు నవ్వి తేరుకున్నా రిద్దరూ.

"ఏమిటోదినా యిదంతా? రిహార్సలా?"

"అవును మా తమ్ముడికి పిల్లని చూడడానికి వెళ్లాలి. ఆడపడుచుతనం ఎల్లాగ చూపించాలా అనీను, పిల్లని ఎలా, పరీక్షించాలా అని ఆలోచిస్తున్నాను. ఇంతలోకే నువ్వొచ్చావు!"

"ఎవరికి, నిధిగారికా?"

"కాకూడదా!"

"అబ్బ! ఏమిటమ్మా ఈ డొంకతిరుగుడు? కాకూడదని నేనన్నానా?"

"ఏమో మా తమ్ముడికి పెళ్ళంటే నీకు, మీ అన్నయ్యకు యింత బాధెందుకో నా కర్థం కావటంలేదు" ంది నవ్వుతూ.

"నాకా! బాధా!" అన్నదే గాని హైమ మాటలో ఏ మూలో రవ్వంత బాధ ధ్వనిస్తూనే ఉంది.

"అవును. నీకే కాదు మీ అన్నగారికి కూడా!"

"ఎందుకు?"

"మీకు తెలియాలి!"

"అది సరేగాని పిల్ల ఎవరు!"

"ఎందుకో నీ కింత కుతూహలం?"

"మూడేళ్ళనుంచి కలిసిమెలిసి ఉంటున్నాం గదా, ఆ మాత్రం హక్కు లేదా?"

"లేదని నే నన్నానా?"

"మరి!"

"మరీ లేదు. మర్రీ లేదు. నీ బాధ కక్కరాదూ! నే నెవరితోనూ చెప్పన్లే!" అంది అనూరాధ హైమ బుగ్గ గిల్లుతూ.

"ఛీ! పో!" సిగ్గు పడింది హైమ.

అయినా కుతూహలం మాత్రం చంపుకోలేక పోయింది.

"అందంగా ఉంటుందిటా? చదువుకుందిటా?" అడిగింది.

"అందంగానే ఉంటుందిట! కనీసం అందంగా ఉండదు అని చెప్పేందుకు వీల్లేకుండా ఉంటుందిట! బాగానే చదువుకుందిట! అయినా నీ కెందుకు చెప్పు యీ వివరాలన్నీ?"

"ఎందు కేమిటి! నేను కూడా పిల్లని చూస్తాను."

"నీకు తెలిసి ఉన్న పిల్లే!"

"ఎవరబ్బా !"

"మన క్లాస్‌మేటు కూడాను"

"ఎవరు! భారతా!!"

"ఎవరో ఒకరు. తలుచుకుంటే నువ్వు కూడా కావచ్చు!"

"ఛా వదినా! వేళాకోళానికైనా హద్దుండాలి" అంది హైమ నవ్వుతూ.

"వేళాకోళం కాదు. నీ కిష్టం లేకపోతే చెప్పెయ్యొచ్చు!" అంది అనూరాధ గంభీరంగా.

హైమ నోరు కట్టుబడిపోయింది. ఆశ్చర్యంలో మునిగిపోయిందామె. అనూరాధ అంత గంభీరంగా ఆ మాట అనకపోయి ఉన్నట్టయితే హైమ కూడా నవ్వుతూ ఏదో ఒకటి చెప్పేసి ఉండును. కాని ఒక్కసారిగా అటువంటి ప్రశ్నకు సమాధానం యివ్వలేకపోయింది. అనూరాధ పోనీ వేళాకోళం ఆడుతూందనైనా అనుకుందుకు వీలులేకపోయింది

"ఏం మాట్లాడవు?" రెట్టించింది అనూరాధ.

"ఆయన తరఫున మాట్లాడుతున్నావుగా! నా తరఫున కూడా నువ్వే సమాధానం చెప్పు. లేకపోతే—కారప్పూస కావాలా వద్దా అని అడిగినంత తేలిగ్గా అడిగేస్తున్నావు గంభీరంగా ముఖం పెట్టి. ఏం చెప్పను?"

"ఇంత ఒక్క ముక్కకి సమాధానం చెప్పలేని దానవు. నువ్వుద్యోగాలకి పనికిరావు. మా తమ్ముణ్ణి కట్టు

కుని సుఖంగా ఉండు. నా మాట విను. మీ అన్నయ్యా అదే అన్నారు. మీ నాన్నగారితో మీ అన్నయ్య మాట్లాడతారు. కాని నీ క్లిష్టం లేకపోతే మాత్రం నిశ్చయంగా చెప్పెయ్యి. నా దగ్గర సిగ్గెందుకమ్మా!" అంటూ హైమను దగ్గరగా తీసుకుని చుబుకం ఎత్తి కళ్ళల్లోకి చూసింది. సిగ్గుతో కూడిన చిరునవ్వు మెరుస్తూందా కళ్ళలో.

"ఇంత సిగ్గుపడే పిల్ల మా కెందుకమ్మా! వద్దని చెప్తాను మా తమ్ముడితో" అంటూ హైమ నుదుట ముద్దు పెట్టుకుంది అనూరాధ.

హైమ కళ్ళలో ఆనందాశ్రువులు నిల్చాయి.

## 17

మూడు నెలలు గడిచాయి. కనపడిన ప్రతివాటికీ అనూరాధ దరఖాస్తులు పెట్టింది. ఒక్కటీ రాలేదు.

శైలజ, హైమల దగ్గరనుంచి ఉత్తరాలు వస్తుండేవి.

విశ్వం స్కూలు మామూలుగానే ఉండేది.

ఉద్యోగం రాలేదనే బాధ అనూరాధకు ఎక్కువగా ఉండడం, విశ్వం ఆమెకు అనేక విధాల ఊరట కలిగించడం ఒక కార్యక్రమం అయిపోయింది. ప్రతి దానికీ వస్తుందని ఎంతో ఆశతో దరఖాస్తు పంపడం, ఆఖరి తేది అయిన దగ్గరినుండి పిలుపుకోసం ఎదురుచూడడం, విసిగి వేసారి పోవడం జరిగేది.

ఒకనాడు విశ్వం స్కూలునుంచి వస్తూనే చేతిలో పత్రిక అనూరాధకు అందించి—

"రాధా! అందులో స్త్రీ సంక్షేమ శాఖాధికారిణులు 15 ఉద్యోగాలకు ఎడ్వర్టయిజ్‌మెంటు ఉంది. ఎమ్మే యికనామిక్స్ వాళ్ళు కావాలి. ఇంక వారం రోజులే ఉంది వ్యవధి. గడువులో దరఖాస్తు పెట్టితే తప్పకుండా రావచ్చు" అన్నాడు.

"తప్పకుండా అంటూ, రావచ్చు అని సందేహం వెలిబుచ్చుతారేం? మీకు పుణ్యముంటుంది, నన్నింక చంపకండి. ఇక్కడికి పెట్టినవి చాలు" నిస్పృహగా అంది అనూరాధ.

"ఛ! యింత మాత్రానికే నిరాశ చెందిపోతే ఎల్లా! మనం అనుకున్నవన్నీ అనుకున్నట్టు జరిగిపోతే అందులోని ఆనందం చచ్చిపోతుంది."

"మీరు వెయ్యి చెప్పండి, లక్ష చెప్పండి నేను మాత్రం యింక దరఖాస్తు పెట్టలేను. ఎన్నింటికి, ఎన్నింటికి పెట్టాను, ఒక్కటంటే ఒక్కటీ రాలేదుకదా! మొన్న నీ కాలేజీలో ట్యూటర్ పోస్టుకు పెడితే ఫస్ట్‌క్లాస్ గ్రాడ్యుయేటుని తీసుకొన్నారు నన్నొదిలేసి. పోనీ ఏ రీసెర్చి చేదామన్నా 75 రూపాయల స్కాలర్‌షిప్‌లు గూడా లేవుట! పోస్టులు ఖాళీగా ఉన్నాయిట గాని అవి ఫస్ట్‌క్లాస్ వాళ్ళకి రిజర్వ్‌డ్‌ట! మనకి వచ్చిన సబ్జెక్టు ఎవడికీ అక్కర్లేదుగదా! మన

తెలివితేటలు ప్రదర్శించడానికి అవకాశం అయినా యివ్వరుగదా! 59%కీ 60%కీ ఎంత తేడా? 5.%కి ఫస్టుక్లాస్ యిచ్చే యూనివర్సిటీలో 55% వచ్చినవాడికంటే మన యూనివర్సిటీలో 59% వచ్చినవాడు తీసికట్టేగదా! అనుభవంలోకి వచ్చేవరకూ యివేమీ తెలియవు. చదువుకునే రోజులలో క్లాస్ రావాలనే ఆకాంక్ష, పట్టుదలతప్ప దాని ఫలితం యింత ఘోరంగా ఉంటుందని తెలీదు. తెలిస్తే యింకా శ్రద్ధ చూపించి ఉండేవాళ్ళం యింకా స్వార్థం చూపించి వుండేవాళ్ళం. మా నోట్సు చదివిన ఒకరిద్దరికి క్లాస్ వచ్చింది. క్లాసులో ఎంత పరస్పర సహకారంతో మెలిగేవాళ్ళం! క్లాస్ పరీక్షలకి ఒకరిద్దరు రామంటే అంతా మానేసి సమైక్యం చూపించేవాళ్ళం, ఒకరిద్దరు రాకపోతే వారిమీద విరుచుకు పడతారు. కాని అంతా మానేస్తే ఏం జేస్తారు, అంత సంఘీభావంతో మెలిగే వాళ్ళం. అనుభవం నేర్పిన పాఠాల్లో సహస్రాంశం అప్పుడు తెలిస్తే మాలో మేము పోటీలుపడి ఎంత చచ్చే వాళ్ళమో! చీ! తలుచుకుంటే సిగ్గు వేస్తుంది కూడాను—"

"నువ్వు చెప్పినవన్నీ నిజమే! కాని అవన్నీ తలుచుకుని చెయ్యగలిగిన దేముంది, దాన్ని అతిక్రమించే ఉపాయం చూడాలిగాని."

"నన్నెందుకు ఏడిపిస్తారు చెప్పండి. ఈ సెకండ్ క్లాస్ ఇబ్బంది తప్పించుకోనడం ఎల్లాగ? ఇంక హాయిగా యింటి పట్టున కూర్చోవడమే ఉత్తమం."

"ఏమిటి రాధా, అంత నిర్లిప్తత! ఈ కూసుఉద్యోగాలు రాకపోతేనే యింత నిర్లిప్తత, ఉదాసీనత, ప్రకటిస్తావా? నీ నిజమైన ప్రజ్ఞ ప్రదర్శించేందుకు మార్గాలే లేవా!"

"ఏమున్నాయి చెప్పండి? భమిడిపాటి వారన్నట్లు యిది వదల్లు! ఇది కావరాకపు జీడి! జన్మ రక్ష! శిక్ష! వందలమంది ఫస్ట్‌క్లాసులు దొరుకుతుంటే సెకండ్ క్లాస్ ఎవరికి కావాలండి? ఈ ముద్ర చూడగానే అసలు యింటర్వ్యూకైనా పిలవడం లేదు, పోనీ వాడేమైనా అడిగితే చెప్పి నాకింత వచ్చునని చూపెట్టడానికి! అసహాయత, ఆక్రోశాలతో కడుపుడికి పోతోంది. మీ రేదో నన్నూనరడించడానికింకా ఆశ చూపిస్తారు."

"లేదు రాధా! నిజంగానే నీకు పట్టుదలఉంటే యీ క్లాసులకి విలువ లేదని చూపెట్టడం ఎంత సేపు!"

"ఎలాగ?"

"కేంద్ర ప్రభుత్వ పరీక్షకి కూర్చో!"

"మీరూ వేళాకోళమేనా!"

"కాదు. నిజంగానే అంటున్నాను."

"ఉట్టి కెగర లేనమ్మ స్వర్గాని కెగురుతా నన్నదట! ఒక పరీక్ష యిల్లాగైంది. యింక మూడు అనర్సుల స్టాండర్డ్‌తో నేను పరీక్షకు కూర్చోవడం ఒకటి తక్కువైంది. వింటే నవ్వుతారుకూడా ఎవరైనా!"

"అయితే ఒకరి ఇష్టా ఇష్టాలమీద ఆధారపడి అన్న మాట మనం పనులు చేస్తుంటే! ఎవరో నవ్వుతారని భయ పడుతూ కూర్చుంటావా!"

"యూనివర్సిటీ ఫస్టులూ, ఫస్ట్‌క్లాసులూ తిరిగి వస్తు న్నారు. ఇంత ఉత్త సెకండ్‌క్లాసుని నేను వెళ్ళి వాళ్ళకంటె ఎక్కువ వెలగబెడతాననా మీ రనేది!"

"అటువంటిభావాలు పెంచుకోవద్దంటాను. నువ్వు చెప్పేది స్కూల్‌ఫైనల్ ఒకసారితప్పినవాడు ఇంక జన్మలో ఉన్నత విద్య అభ్యసించకూడదనే ట్టుంది. దెబ్బలు తగి ల్తేనే ఒళ్ళు గట్టి పడుతుంది. రెట్టించిన ఉత్సాహంతోను, కసితోను చదివి జౌననిపించడానికి ప్రయత్నించాలి గాని నిరుత్సాహ పడిపోతే ఎల్లా? ఇంతకీ పరీక్షలు పాసుచెయ్య డానికీ, నీకు వచ్చిన సబ్జెక్టుకీ సంబంధం లేదుగా!"

"అందుకనే నాకీ పరీక్షలమీద నమ్మకం పోతూంది. కేంద్ర ప్రభుత్వ పరీక్ష అంటూ కూర్చున్నా అదీ ఒక పరీక్షేగా? మళ్ళీ ఆ మూడుగంటల బాధ—అబ్బ! పుణ్యం ఉంటుంది మీకు, నన్నింక బాధించకండి!"

"సరే! ఎప్పుడూ నీ మీద ఒత్తిడి తెచ్చి నే నేమీ చెయ్యడానికి ప్రయత్నించలేదు. కాని ఊహించుకో. ఇంత కష్టపడి యింతవరకు చదివి నిజంగా సారం ఉండికూడా నీ విలువ గ్రహింపబడడంలేదు. కేంద్ర ప్రభుత్వ పరీక్షలకి మామూలు పరీక్షలకీ తేడా ఉంది. ఒకే సబ్జెక్టు మీద ఎక్కువ

పేపర్లుండవు. వీటన్నిటికి మించిన దేమిటంటే పరీక్షపోతే కించిత్తుకూడా బాధపడ నవసరంలేదు. వస్తే మంచిదే. లేకపోయినా శ్రద్ధగా చదువుతావు గనక మరో రెండు సబ్జెక్టులలో చక్కని పరిచయం మిగులుతుంది."

"కాని—"

"కాని అంటూ అనుమానాలకు తావివ్వకు రాధా! ఇప్పుడు నవ్వి హేళన చేసినవాళ్ళే నువ్వు నిజంగా శక్తి అంతా ధారపోసి అకుంఠితదీక్షతో చదివి ఎన్నిక అయితే ఓహో అంటారు. ముందే నీ ప్రజ్ఞ వారు గ్రహించినట్టు ప్రకటించడానికి ఉబలాట పడతారు. మనకు నచ్చినా నచ్చకపోయినా చుట్టూ ఉన్నవారు ఈ ఉన్నతి అనుకునే దాన్ని సాధిస్తేనే వాళ్ళ దృష్టిలో మనం పైకి వెడతాం. ఒక గొప్ప హోదా, గౌరవం, వీటన్నిటికన్నా మిన్న మన ప్రజ్ఞ మనం తెలుసుకుని ఇతరులకు చూపెట్టడంలోని ఆనందం—పట్టుదల కోసమైనా చదువు రాధా!"

"కాని, అబ్బ! మీతో ఎల్లా మాట్లాడాలో తెలియడం లేదు."

"పోనీ, వాదన లెందుకుగాని, ఒక్కమాట విను. ఆనర్స్ పరీక్షలలో సెకండ్‌క్లాస్ వచ్చినంతమాత్రాన వాళ్ళు నిజంగా పనికిరానివాళ్ళని నిరూపించడానికైనా కట్టు."

"పోనీ అల్లాగే అనుకుందాం. అయితే ఇప్పటికే మూడేళ్ళనుంచి చదువుతో విసుగెత్తిపోయిన నేనింకేం చదవగలను? అయినా ఇదంతా ఎందుకు లెద్దురూ!"

"ఎందు కెందుకంటూ అంతా కూర్చుంటే మానవ మేధస్సు మరుగునపడిపోదూ!"

"నన్నుబ్బించడానికి పెద్దపదాలు విసురుతున్నారే. కాని చూడండి. ఒక్క విషయం! నన్నుగురించి ఆలోచించడంలో మీరు స్వార్థానికి మరీ తావు ఇచ్చి నన్ను గురించి గొప్పగా ఊహించుకొంటున్నారేమో! నామీద నాకేలేని నమ్మకం మీకుంది. ప్రతిపరీక్షా తగలపెట్టి మీ నమ్మకాలను చెదరగొడుతున్నానేమో, మీనమ్మకం నిలబెట్టగలనన్న ఆశ నాకులేదు. నా ఓటమి నాకంటే మీ కెక్కువ బాధ కలిగిస్తుంది. నా మాట విని నన్ను బల వంతం చెయ్యకండి."

"నువ్వు నీ కిష్టంలేదని నిష్కర్షగా చెపితే నిన్నింకో మాటు అడగను. కాని ఏవో చిన్న చిన్న కారణాలు చూపి తప్పించుకునేందుకు ప్రయత్నించకు. రాధా, నేను ఉపాధ్యాయుణ్ణి. విద్యార్థులకి శ్రద్ధగా బోధించడమే నా వృత్తి. వాళ్ళఫలితాలతో నాకు సంబంధంలేదు. నీ విష యంలోనూ అంతే. నీకు అనుభవం తక్కువకావడంతో ప్రతిదీ ఇతరులెలా గ్రహిస్తారో అనే అనుమానం పీడి స్తోంది. ఇదేకాక నువ్వనవసరంగా నీ గురించి తక్కువగా అభిప్రాయపడుతున్నావు.ఒకప్పుడు ఈ భావమే మనస్సులో

పనిచేసి ప్రమాదం తెస్తుంది. ఒకపని చెయ్యలేం అనుకుంటూ కూర్చుంటే అసలు చెయ్యలేం. ఒకపని చెయ్యగలం అనే ధైర్యం ఉంటే శక్తి దానంతట అదే వస్తుంది."

"వస్తుందనుకుంటే సరిపోయిందా? బుర్ర ఉండద్దూ!"

"మానవ మేధస్సుకి హద్దులు లేవు రాధా! పరీక్షలలో చూడు. ఆ మూడు గంటలలో నీ బుద్ధి పనిచేసినంత నిశితంగాను, తీవ్రంగాను, ఎప్పుడైనా పనిచేస్తుందా? అంత యేకాగ్రత ఎప్పుడైనా ఉంటుందా? పక్కన పిడుగులు పడుతున్నా పేపరుమీదనుంచి తల ఎత్తమే! ఆ ప్రభావం ఉండదే. వచ్చిన సబ్జెక్టు అంతా తిరగేసి ఆ ప్రశ్నకి సమాధానం యేమాతుందో ఆలోచించి అది కావలసినంత మేరకు కుదించి అరగంటలో సరిపెడతామే! అదంతా ఎలా చెయ్యగలుగుతాం? అల్లా చెయ్యగలిగినవాళ్ళం మిగతా అప్పుడు శ్రద్ధ చూపించలేమే? అంతా భావనలో ఉంది. ప్రయత్నించి చూడు. నేనేదో బాధపడతానని నువ్వనుకుంటున్నావే? నేను కాదు బాధపడుతూంట. నువ్వే. నువ్వు బాధపడడంలేదని మభ్యపెట్టుకునేందుకు నేను బాధపడుతున్నానని ఊహించుకుంటున్నావ్. అది వదిలెయ్యి. ఫలితం యేమైనా కానీ, ఆశ వదులుకోకు."

"అబ్బ, ఎంత ఉపన్యాసం ఇచ్చారు! అయితే మీకింకా చాలా ఓపిక ఉందన్నమాట!"

"అంటే!"

"అంటే.—మరి ఇప్పుడు మొదలుపెట్టి అన్నీ చదవద్దూ మీరు?"

"కాస్త అర్థమయేలా చెప్పు."

"నాకు చెప్పాలంటే ఇవన్నీ మీరు చదువుకోవద్దూ మొదట! ఇది నాకంటె మీకే ఎక్కువ శ్రమ!"

"ఈమాటు ఆ పప్పులేం ఉడకవ్!"

"అయితే అది మీకే నష్టం! పరీక్ష ఫీజు దండుగౌతుంది."

"నీ తత్వం ఇలా తయారైందేమిటి?"

"నేనేకాదు. కావలిస్తే హైమ నడగండి."

"పైగా సాక్ష్యం ఒకటా? అయినా ఆమె ఇక్కడ లేదుగా? సధితో కూడబలుక్కుని నీకో మేనల్లుణ్ణిచ్చే ప్రయత్నంలో ఉంది" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"ఎంత సిగ్గులేని వారయారు!" అంది అనూరాధ నవ్వుతూ.

"సిగ్గు లేనివాణ్నా? ఇలా అనుకునే ఈ రోజుల్లో కుర్రాళ్ళంతా చెడిపోతున్నారు. ఒక స్వాభావికమైన చర్యకు అనవసరపు ముసుగు వేసిమూసిన పిడికిలిలా తయారు చేశారు. ఇవన్నీ పైకి అంటే తప్పు. అచరిస్తే తప్పులేదు. మనం పైకి యేదైతే అనకూడదని ఆంక్ష పెట్టుకుంటామో దాన్ని గురించే రెట్టింపు ఆలోచిస్తుంటాం. ఏ విషయంలోనూ అవసరమైనదాన్ని మించి దాపరికం చెయ్యకూడదు. యీ

కాలంలో నైతికంగా మరీ క్రిందికి దిగజారడానికి కారణం 'సెక్స్'ని గురించిన తప్పుడు అభిప్రాయాలే. యువకులకు స్త్రీలని గురించిన ఒకభావమే ఉంటుంది. ఆ మెహంలో వారికి కనిపించేది స్త్రీత్వమే. అందుకనే స్త్రీతో కలిసిమెలిసి ఉండలేరు. ఒకవేళ ఉన్నా అది విపరీత పరిణామాలకి దారి తీస్తుంది. స్త్రీని కూడా పురుషునితో సమానంగా చూడగలిగితే ఇటువంటి బాధలు రావనుకుంటా. హాలీవుడ్ సినిమాలలో ఎవరో అర్ధనగ్నంగా ఉన్నా మనం అంత ఉద్రిక్తులంకాం. ఎందుకంటే వాళ్ళని అల్లాగే చూడడానికి అలవాటుపడి ఉన్నాం. మన దృష్టిలో అది సహజంగానే ఉంటుంది. అదే మన భారతీయ తారలు ఆ దుస్తులలో ఉంటే మన అవస్థ వర్ణనాతీతం. ఇంకోటి; మనం దేన్నయితే ఒకరి దృష్టినుంచి మరుగుపరచాలని చూస్తామో అలా చెయ్యడంలో నిజంగా వారికి మరింత ఉత్సుకత యెక్కువచేసి అవే మరింత వారి హృదయాలకు హత్తేటట్టు చేస్తాం. అది విపరీతాలకు దారితీస్తుంది. సినిమాలలో చూడగాదూ—'ఎ' సర్టిఫికెట్ ఇస్తే ఆ పిక్చర్‌కి గొప్ప ప్రచారం అన్నమాట!"

"అయితే అందర్నీ దేవతా వస్త్రాలు ధరించి ఊరేగమన్నారా?" అంటూ నవ్వింది అనూరాధ.

"అదికాదు నేననేది. సెక్స్‌కి సంబంధించిన విషయాలలో మనం అక్కర్లేనంత యెక్కువదాపరికం పెంగబెట్టి

యువతీ యువకులలో అనవసరపు ఉద్రేకాలను రెచ్చగొడుతున్నాం."

అనూరాధ అంగీకారం ఫలితంగా మళ్ళీ యింట్లో దీక్ష ఆరంభమైంది.

రోజూ లైబ్రరీకి వెళ్ళి పుస్తకాలు తెచ్చుకోవడం, విసుగులేకుండా చదివి నోట్సు తయారుచెయ్యడం దినచర్యలో భాగాలైపోయాయి ఇంట్లో.

యెనిమిది ఋతువులు తిరిగేసరికి అనూరాధ పరీక్షకు కట్టి తృప్తిగా పరీక్షలు వ్రాయడం జరిగింది. అన్నీ అనుకున్నవి అనుకున్నట్టు జరగడంతో అనూరాధ, విశ్వం కూడా యెంతో సంతృప్తులయ్యారు. ఫలితాలకోసం ప్రతీక్షించసాగారు.

ఒక శుభ ముహూర్తాన అనూరాధకు ఢిల్లీ ఇంటర్వ్యూకు రమ్మని పిలుపు వచ్చింది. అనూరాధ, విశ్వం మహానందమగ్నులు అయినారు. ఏడాది అంతా నిద్రాహారాలు మానివేసి కష్టించిన రైతుకు కళ్ళంలో ధాన్యపురాశి చూసినప్పుడు కలిగే ఆనందం వారి హృదయాలను నింపింది విశ్వం సంతోషానికి పట్టపగ్గాలు లేకపోయాయి. తానెంతో కృషిసలిపి అనుకున్నది సాధించగలిగాననే భావం అతని కెంతో ఆనందాన్నాపాదించింది. యెంతో హుషారుగా అనూరాధకు అన్నీ చెప్పేవాడు—ఎలా మెలగవలసిన-

అదీను. ఇంటర్వ్యూ వస్తే యింక యెన్నిక అయినట్టే నన్నాడు ముఖ్యంగా అనూరాధ విషయం ఇంక తథ్యమే నన్నాడు.

కాని అనూరాధ పరిస్థితి వేరుగా తయారైంది. మొదట్లో నిండు హృదయంతో ఆనందించింది. తన అక్కసు తీరిందని మురిసింది. తన దీక్ష, శ్రద్ధ ఫలించాయని పొంగి పోయింది. తాను విశ్వం అంచనా తప్పకుండా అతనికి నిస్పృహ కలిగించనందుకు సంతసించింది. తను ఇంక సెకండ్ క్లాస్ యం. ఏ. కాదు, మొదటి క్లాస్ గజెటెడ్ అధికారిణి!

కాని యీ తలపులు యెంతోసేపు నిలువలేదు.

తానొక గజెటెడ్ ఆఫీసర్! కాని భర్త? స్కూల్ మాస్టర్! అతను తనతో వస్తాడా? అతన్ని ఉద్యోగం మానెయ్యమనీ, తన సంపాదనమీద ఆధారపడి తనతో రమ్మనీ కోరగలదా తను! కోరినా అతను వస్తాడా? తనను ఆ ఊళ్ళోనే వేస్తారని నమ్మకమేమిటి?

ఇంకెక్కడైనా వేస్తే అతనొకచోట! తానొక చోట! ఒకవేళ ఈ ఊళ్ళోనే వేసినా తా నెవరి కృషి ఫలితంగా యింత పదవి అలంకరించిందో అతను తక్కువ పదవీ, తా నెక్కువ పదవీనా? అంత విజ్ఞానమూర్తిని ప్రజలు తనకంటె తక్కువగా గౌరవించడం తాను సహించ

గలదా? ఇంక యిద్దరూ చెరో ఊరూ అయితే తనకీ ఉన్నతి అంతా ఎందుకు?

డబ్బు చాలకనా తాను ఉద్యోగం చెయ్యాలను కున్నది?

ఇంత చేస్తే మిగిలే ఫలితం—తనను ఎవరైతే ఉన్న తికి తెచ్చారో, తానెవరినైతే గాఢంగా ప్రేమించి పూజి స్తూందో ఆ వ్యక్తితో ఎడబాటా? తను కృషికి యిదా ఫలితం!

కేంద్ర ప్రభుత్వపరీక్షకు కూర్చోవడమంటే తాను అందనివాటికి అర్రు చాచినట్లు అవుతుందని భయపడింది మొదట్లో. తరువాత ఆయన ధైర్యం యివ్వడంతో రెట్టిం చిన ఉత్సాహంతో చదివింది. తనకు చాలా వచ్చుననీ, తన డిగ్రీలో సెకండ్ క్లాస్ ముద్రపడినంతమాత్రాన తా నెవరికీ తీసిపోననీ చూపెట్టాలనే కసితో చదివింది. అంతకు మించి అప్పట్లో ఆలోచించలేకపోయింది తను. తానుపడ్డ శ్రమంతా యిటువంటి విపరీత పరిణామాలకు దారి తీస్తుం దనే ఊహే ఆనాడు ఉంటే అసలిటువంటి దానికి తాను సమ్మతించి ఉండేదే కాదు.

ఇంక మారునాడు బయలుదేరితే తప్ప యింటర్వ్యూకు చేరుకోలేమనేవరకు అనూరాధ మథనపడుతూనే ఉంది. తనలో తాననుకుంటూ బాధపడుతున్నదే కాని ఏదో నిశ్చయానికివచ్చేవరకువిశ్వంతో చెప్పకూడదనేపట్టుదల!

రోజులు గడిపింది. కాని, ఒక నిశ్చయం అంటూ కలుగలేదు. కలిగిన ఊహలన్నిటినీ అతనితో చెప్పడానికి మనస్కరించలేదామెకు.

ఈలోగా విశ్వంమాత్రం చాలా ఉత్సాహంగా ఉన్నాడు. రోజూ ఆమెకు ఢిల్లీ కబుర్లే చెప్ప ప్రయత్నించేవాడు.

ఇక మర్నాడు బయలుదేరా లనగా—

"రాధా, రేపే ప్రయాణం. అన్నీ సర్దుకున్నావా? చలి విపరీతంగా ఉంటుంది ఢిల్లీలో. దుప్పట్లు మరిచిపోకు. అక్కడ మీ కల్యాణి స్కూల్ ఆఫ్ సోషల్ వర్కులో చదువుతోందిగా. ఆమెకు టెలిగ్రాం యియ్యి. స్టేషన్‌కి వచ్చి తీసుకువెడుతుంది. ఆ మాత్రం చేయదా! అదీకాక నువ్వింక ఆఫీసర్‌వి కాబోతున్నావని తెలిసినా చెయ్యదా" అన్నాడు విశ్వం నవ్వుతూ.

"ఆమె చేస్తే చెయ్యనూవచ్చు. లేకపోతే మాననూ వచ్చు. కాని నేననేదేమిటంటే అటువంటి వాటితో పని లేదూ అని" అంది అనూరాధ స్థిరంగా.

"అంటే!!!!" విశ్వం ఆశ్చర్యంలో మునిగిపోయాడు.

"నేను వెళ్ళననే నేననేది" అంది చలించకుండా అనూరాధ.

ఆమె వేళాకోళంగా అంటున్నదన్నైనా అతనను కొందుకు వీల్లేకపోయింది. రెండుక్షణాలు అతను ఆవేశంతోను ఉద్రేకంతోను అసహాయతతోను వణికిపోయాడు. ఆమె

మొండిపట్టుదల ఎల్లా సడలించాలో అతనికి అర్థం కాలేదు. ఇంతా అయి ఇంక మీద బయలుదేరకపోతే వీలులేని పరిస్థితిలో అతనికి తగినంత అవకాశమన్నా మిగులలేదు ఆమెకు నచ్చచెప్పడానికి.

తేరుకుని అన్నాడు.

"ఏమైనా పిచ్చి ఎత్తుతోందా రాధా! ఏడాది నానా అవస్థపడి చదివి అది అక్కరకు వస్తే చేజేతులా నాశనం చేసుకుంటావా? గానివాళ్ళు రాక గోలపెడుతుంటే వచ్చిన నువ్వీ అవకాశం జారవిడుచుకుంటావా? ఒకసారి జారవిడుచుకుంటే మళ్ళీ నెగ్గుతామనే ఆశైనా లేదుకదా! ఏమిటి నీ మొండి పట్టుదల!"

"నేను పిచ్చిదాన్ని కానివ్వండి. నాది మొండిపట్టుదల కానివ్వండి. కాని నేనంటే మీ కిష్టం లేకపోతే ఎదురుగా చెప్పెయ్యండి. అంతేకాని నాకో ఉపకారం చేసి నన్ను తరిమెయ్యకండి!" అంది ఉబికి వస్తున్న కోపాన్ని అణుచుకొంటూ.

"ఏమిటి రాధా, నేను నిన్ను తరిమెయ్యాలని చూస్తున్నానా! నా రాధేనా యిల్లా మాట్లాడుతూంట!"

"ఆ, మీ రాధే! ఏ రాధనైతే మీరు ఒక ఉన్నతోద్యోగిని చేసి వదిలించుకుందామని చూస్తున్నారో ఆ రాధే!"

"కొంచెం అర్థం అయేలా చెప్పు రాధా!"

"మీకు తెలియనట్లు నటించకండి! నేను శ్రమపడి చేసిన కృషి ఫలితం మన ఎడబాటుకి దారితీస్తుందని తెలిస్తే నేనింత వ్యర్థప్రయత్నం చేసి ఉండేదాన్నా! తెలిసి ఇంక ఇంటర్వ్యూకి వెడతానా? పదవికోసం మిమ్మల్ని త్యజించేటంతటి నీచురాలుగా భావించారా నన్ను?"

రెండు నిమిషాలు నిశ్శబ్దముగా ఉండి అన్నాడు విశ్వం:

"ఎడబాటు ఏముంది రాధా? కావాలనుకుంటే కలుసుకోలేక పోతామా? ఇదే ఎడబాటనుకుంటే ఎలా?"

"కావాలనుకున్నప్పుడు కలుసుకునేందుకేనా పెళ్ళి చేసుకున్నది? మీరొకచోటా, నేనొకచోటా అయితే నా కొరత కలిగించేది నా సంపాదనా, నా హోదాయా, గౌరవమా? మీరు లేనిదే నాకీ ఆనందాలన్నీ ఎందుకు? ఎవర్ని నొప్పించడం యిష్టంలేక, ఎవరి ఆనందంకోసం నేనిన్ని తిప్పలు పడ్డానో వారిని వదిలెయ్యడమా ఫలితం? మీకు నిజంగా నేనామీద యిష్టంలేకపోతే చెప్పెయ్యకూడదా? నేను డబ్బు సంపాదించి హోదాలో ఉండి అన్నీ అనుభవించగలనా మీరు లేకుండా? ఎందుకిలా చేశారు చెప్పండి?" అని తీక్షణంగా అడిగిన అనూరాధ కళ్ళలో నీళ్ళు నిల్చాయి.

"ఎందుకేమిటి రాధా? అందరూ తలుచుకున్నా కాగలరా? ఎంతో కష్టపడి సాధించిన నువ్విలా బలహీనత ప్రదర్శిస్తావా? తెలివి ఉపయోగించుకుని ఉన్నతి పొంద

వద్దూ? ఇంతా కష్టపడి గోళ్ళు గిల్లుకుంటూ యింట్లో కూర్చుంటావా? చదవేస్తే ఉన్నమతీ పోయిందన్నట్టుంది నీ మాట! పాత వాసనలు నిన్నింకా వదలలేదు."

"పోనివ్వండి. నేను పురాతన సంప్రదాయాల్నే, సంస్కృతినే కలిగి ఉన్నాననుకోండి. సంస్కార వికాసమే లేదనుకోండి. నాకేం బాధలేదు. కాని, మీరన్నారే— తెలివిఉండి వున్నతికి వెళ్ళ నిచ్ఛగించనివాళ్ళనిగురించి ? మరి మీ మాటేమిటి! మీ తెలివిని గురించి మీ రెంత తగ్గించుకున్నా నాపేపర్లన్నీ మీరే రాసినట్టు జమ! మీరింకా బడిపంతులు జీవితమే సాగిస్తారా? ఇతరులకు చెప్పడమే కాని తానాచరించ నక్కర్లేదా? పోనీ, నన్ను నిందించకండి. మీ మాటవింటాను. కాని ఒక్క షరతు" అని ఆగింది అనూరాధ.

"ఏమిటి?"

"రేపు రాబోయే పరీక్షకి మీరుకూడా కూర్చోండి. మీరు తప్పకుండా ఎన్నికఅవుతారు. ఈ ఒక్క ఏడాదీనె నెలాగో ఓర్చుకుంటాను."

"రాధా! యించుమించు యిటువంటి విషయం మీదే నీకిదివర కొకసారి చెప్పాను. నేను నీకు చెప్పగలగడానికీ, నేనే రాయడానికీ సంబంధం లేదు. నేను పరీక్షకు కూర్చుంటే అసలేమీ రాయలేకపోవచ్చు. ఒకవేళ నానా తంటాలూ పడి ఎన్నిక అవుతానన్నా నా కది యిష్టంలేదు. నే నేదో నాకు నచ్చిన విధంగా నలుగురు కుర్రాళ్ళకు పాఠాలు చెప్పగలను గాని కిందవాళ్ళని నీచంగా చూసి, పైవాళ్ళచేత నీచంగా చూడబడే ప్రభ

త్వోద్యోగం చెయ్యలేను రాధా! అసలీ ప్రభుత్వాలమీద, వాటి ప్రయోజనాలమీద కూడా నాకు నమ్మకంలేదు. అంతేకాదు. బాధ్యతాయుతమైన పదవులలో ఉంటే స్వేచ్ఛ ఉండదు. ఎన్నో లాంఛనాలకోసమనీ, సభ్యత కోసమనీ యిష్టంలేని పనులెన్నో చెయ్యవలసివస్తుంది. ఇటువంటివన్నీ నా తత్వానికి పడవు రాధా!”

“ఇన్ని కబుర్లు చెప్పేవారు నన్నెందుకిందులోకి లాగారు?”

“నాకిష్టంలేనివన్నీ మరొకరు ఆచరించకూడదని నేనెల్లా అంటాను? అర్హతగల ఒక వ్యక్తికి మద్దతు యివ్వడం నా స్వభావం. అంతేకాదు రాధా! స్త్రీలు ఉన్నత పదవులు అలంకరించే స్థితికి రావాలి. స్త్రీలు ఎంతో అభివృద్ధికి రావలసి ఉంది. అర్హతగల ఒక స్త్రీ ఉదాసీనత వహించినా మొత్తం స్త్రీజాతికే యెంతో నష్టం వాటిల్లుతుంది. అదే నిన్ను ప్రోత్సహించడానికి కారణం.”

“ఏమిటీ! మీరూ అందరిలాగే భావిస్తారా? యీ కాలం స్త్రీలు బానిసలుగా ఉంటున్నారని ఎలుగెత్తిచాటడం స్త్రీ పురుషు లందరికీ ఫాషనైపోయింది. స్త్రీకి జరిగిన లోటేమిటో చెప్పండి. ఆమెకు లోపించిన స్థానమేమిటి? సంపాదించిపెడితే మెక్కి ఉండలేక పోవడమా?”

“రాధా! అక్కడే ప్రధానమైన లోపం ఉంది. మీలోకి పురుషులు ఎక్కించిన బలహీనత యెంత ఎక్కువైందంటే మీరు భావదాస్యానికికూడా అలవాటు పడిపోయారు. మీకు స్వతంత్రంగా ఆలోచించే శక్తికూడా లేకుండా

చేశారు పురుషులు పురాణాలలోను. మీరు చదివే పుస్తకాలన్నిటిలోను స్త్రీ ధర్మం, పాతివ్రత్యం అంటూ బానిసత్వం మీ భావాలలోకి ఎక్కించారు. పురుషునికి యెంత పెద్ద బానిస అయితే అంత పతివ్రత అన్నమాట! అలాగే చిత్రించారు. అవన్నీ సాక్షికంగా లేవూ? కుష్ఠురోగి అయిన భర్తను వేశ్యయింటికి తీసుకు వెళ్ళిన సుమతిని పతివ్రతగాను, ఆదర్శ స్త్రీగాను చూపించారు. అంతకన్న వంచన ఉందా? అదా స్త్రీకి ఆదర్శం? ఇదే భావం మీలో వర్ధిల్లజేసే తర తరాలుగా మిమ్మల్ని భావ దాస్యానికి గురిచేశారు. రామాయణంలో నిష్కల్మషురాలైనా సీతాదేవిని అడవుల పాలు చేస్తే, విధిలేక ఆమె సహించి ఊరుకుంటే ఆ బలహీనతకు తోడుగు తోడిగి ఆమెను సతీత్వానికి ఆదర్శంగా చూపారు. ఏ పురాణాలు చూసినా యిదే కనబడుతుంది—"ఆగాడు విశ్వం.

అనూరాధ కొయ్యబొమ్మైపోయింది. ఇటువంటివి వినడం ఆమెకు మొదటిసారి. ఏ విషయమూ యెక్కువగా వాదించని విశ్వం హృదయంలో ఇంత విప్లవాత్మకమైన భావాలు ఉన్నాయని ఆమె ఊహించలేకపోయింది. అనుకోని కొత్త లోతులు ఎప్పటికప్పుడు కనబడుతున్నా ఇటువంటి తర్కం అతనిలో ఉన్నదని గాని, అతని నమ్మకాలు యీ విధంగా ఉంటాయనిగాని ఆమె కలలో గూడా అనుకోలేదు.

ఏమనడానికి అమెకు మాట పెగలలేదు. విశ్వం మళ్ళీ మొదలుపెట్టాడు: "ఇంతేకాదు రాధా, అసలు

ప్రాకృతికంగానే స్త్రీని బలహీనురాలుగా రూపొందించారు. స్త్రీకి పురుషుడు రక్ష అనే భావం కలిగించారు. చదువుకున్న మీరు గూడా యీ నాటికీ అవే పట్టుకు పాకులాడుతున్నారు. అంటే అర్థం ఏమిటి? నువ్వన్నావు — ఇదివరలో స్త్రీకే ఎక్కువ స్థానం యివ్వబడుతోందని. ఎంతో చదువుకున్న స్త్రీ, ఉన్నత పదవిలో ఉన్న స్త్రీ నిరుద్యోగిని, విద్యా విహీనుని చేసుకుంటే ఆ జంట నెలా చూస్తారు? అదే ఉన్నతోద్యోగి అయిన మగవాడు, ఏమీ చదువుకోని ఆడదాన్ని పెళ్ళాడితే ఆ జంటని సహజంగానే చూస్తారు. కాని మొదట చెప్పిన జంటని సహించలేరు. ఎందుకని? ఇదేనా స్త్రీ ఉన్నతిని సహించడం అంటే? అర్ధాస్థానం యివ్వడం? సమానంగా చూడడం? స్త్రీ బలహీనురాలు. ఆమె అలా ఉండడమే అందరికీ యిష్టం. అదే వేనోళ్ళ చాటుతారు. అవే ఆదర్శాలని నిరూపించ ప్రయత్నిస్తారు. చరిత్రహీనుడైనా పురుషుని సంఘం క్షమిస్తుంది. సహిస్తుంది. అదే స్త్రీ అయితే ఎందుకు సహించలేరు? చరిత్ర హీనత ఉన్నతియా, పతనమా అనే ప్రశ్న వదిలేస్తే యీ తేడా ఎందుకుండాలి? పురుషుని పునర్వివాహానికి లేని అభ్యంతరం స్త్రీ కెందుకు ఉండాలి? ఇవన్నీ యిలాగే ఎందుకు రాసిపెట్టబడి ఉన్నాయి? అవి రాసినవారు పురుషులు గనక. ఇవన్నీ నువ్వు కాదనగలవా రాధా?"

అనూరాధ మళ్ళీ మౌనమే అవలంబించింది.

"అర్థంలేని పదాలకు ఏవో పేర్లు తగిలించి సతీత్వం, పాతివ్రత్యం అంటూ ఎన్నో యుగాలుగా స్త్రీని వంచించారు రాధా! వారి మెదళ్ళు ఆలోచించే తీరు కూడా యిలాగే ఉండి వారికెన్నటికీ స్వతంత్ర భావాలు రాకుండా ఉండేందుకే 'మంచి' అనే ప్రతి దాన్లోనూ యివే ఉల్లేఖించారు. అంతా యింతే గాబోలునని నమ్మించేందుకు తంటాలు పడ్డారు. ఇంతకన్న పెద్ద మోసం ఏమిటీ? స్త్రీని పురుషుడు తేలిగ్గా వదిలెయ్యగలడు. స్త్రీ పురుషుణ్ణి అంత తేలిగ్గా వదిలెయ్యలేదు. ఎందుచేత? ఆర్థిక పరాధీనతకి తోడు సంఘం నిరసన. స్త్రీకి ఆర్థిక పరాధీనత కల్పించడం కోసమే ఆమెకు ఆస్తి హక్కు లేకుండా చేశారు. స్వతంత్రంగా బ్రతకలేకనే కదా ఎంతోమంది స్త్రీలు చరిత్రహీనులైన భర్తలతో కాపురం చేస్తూ ఆత్మవంచన చేసుకుంటున్నారు? భర్త పోతే సహగమనం పేరుచెప్పి నిర్దాక్షిణ్యంగా బ్రతికి ఉండగా కాల్చి చంపేసేవారే! అదేనా మానవత! భర్త పోయినంత మాత్రాన స్త్రీ జీవితానికి విలువే లేదా? ఇంతకన్న తార్కాణా లేం కావాలి రాధా, స్త్రీకి యుగయుగాలుగా జరుగుతూ వచ్చిన అన్యాయాలకి: యజ్ఞ పశువుకి దాన్నే బలికి తీసుకోవడం దాని పూర్వజన్మ సుకృతమని నచ్చచెప్పినంత హాస్యాస్పదంగా ఉంటుంది—స్త్రీని పూజిస్తూ అగ్రస్థానం యిస్తూ వచ్చామంటే. మీకు న్యాయం చేకూరుస్తామనే న్యాయస్థానాలలోను, అన్యాయాలను చట్టాలను క్రోడీకరించే వారిలోను పురుషులేకదా!—ఇవి తొలగాలంటే శాస్త్రీయ అవగాహనతో కూడిన ప్రతి పనిలోనూ

స్త్రీ పురుషుడికి సమానంగానూ, అతన్ని అధిగమించి నిల బడి మొదట తమలోని భావదాస్యాన్ని వదుల్చుకోవాలి. తిన్నగా ఆలోచించి తమ బాగోగులు తామే గ్రహించ గల స్థితికి రావాలి. ఇల్లా వచ్చిన కొందరు యితరులను ఉద్ధరించాలి. స్త్రీలు ముందుకువచ్చి ఉన్నత పదవుల నందుకుంటేనే యివన్నీ కూరడానికి అవకాశం వుంటుంది రాధా! అందుకే నిన్ను ప్రోత్సహించాను. అవకాశం యిస్తే స్త్రీలు పురుషుల కెందులోనూ తీసిపోరనే విశ్వాసం ఎక్కువ మందిలో ప్రబలాలనే నిన్నింత బలవంత పెట్టాను. నువ్వయినా గ్రహించు రాధా!" ఆవేశంగా ముగించాడు విశ్వం.

అనూరాధ తల తిరిగిపోయింది. కొద్ది క్షణాలు ఆలోచించలేక పోయింది. అతను చెప్పినవన్నీ ఆకళింపు చేసుకునేందుకు ఆమెకు కొంత వ్యవధి పట్టింది. అవి అర్థమై అతని విశాలహృదయం తేటపడేటప్పటికి అప్రయ త్నంగా ఆమె కళ్ళు కాల్వలు కట్టాయి.

"క్షమించండి! అపార్థం చేసుకున్నాను" అంది గాద్గదికంగా.

"అయితే ప్రయాణాని కంగీకరించినట్టేనా!"

"లేదు. నన్ను బలవంత పెట్టకండి."

"ఇదేమిటి రాధా, అంతా విని మొదటికొస్తావు! ఇంత చెప్పినా గ్రహించలేవా!"

"మీ రెంతచెప్పినా నేను గ్రహించేది మీ విశాల హృదయం, మీ మహదాశయాలు. ఇంత మహత్తరమైన

మిమ్మల్ని వదిలెయ్యమంటారా, మీ కెన్నయినా తెలియ వచ్చు. మీరు చెప్పినవన్నీ నిజమే కావచ్చు. కాని స్త్రీ హృదయాన్ని మీరు అర్థం చేసుకోలేదో, చేసుకునే ఇలా అంటున్నారో తెలీదు నాకు. ప్రపంచమంతా ఏమై పోయినాసరే! నేను స్వార్థమూర్తినని నిందించినా నా కేం బాధలేదు. కాని మీ సాన్నిహిత్యం మాత్రం వదలలేను. నా సంస్కారమంతా నాశనమైందని మీరనుకున్నా లెక్క చెయ్యను. నాచదువంతా వ్యర్థమైందనుకున్నా బాధపడను. నన్ను మాత్రం దూరం చెయ్యకండి!" అంటూ అనూరాధ దుఃఖం ఆపుకోలేకపోయింది.

"అంతేనా?"

"క్షమించి నన్నింక ఒత్తిడి పెట్టకండి!"

"సరే. నీ యిష్టం రాధా!"

విశ్వం ఆ ప్రసక్తి అంతటితో నిలిపివెయ్యడంతో అనూరాధ గుండెల మీదనుంచి పెద్ద బరువు దింపినట్ట యింది.

మర్నాడు పొద్దున విశ్వం స్కూలుకు వెళ్ళేవరకు పని తోనే సరిపోయిందామెకు.

విశ్వం వెళ్ళిన తరువాత ఏకాంతంగా కూర్చున్న ఆమెకు గత దినం సంఘటనలు నెమరుకొచ్చాయి.

ఎంత నిస్వార్థ భావాలతనివి! ఎంత కార్యదీక్ష గలవాడు! స్త్రీ జనోద్ధరణపట్ల అతని కెంత ఆసక్తి! అతని యిల్లాలు కావడం తన పూర్వజన్మ సుకృతం!

ఇటువంటి అతన్ని తాను విడిచి వెళ్ళగలదా!

ప్రపంచం ఏమైపోయినా అతను తనకు కావాలి. ప్రపం
...ని కంటకూ తనకు పట్టమహిషి పదవి వచ్చినా తన
...క్కర్లేదు.

అతని దెంత క్షమాబుద్ధి! తనంత మొండి పట్టుదల పట్టినా తనను నిందించలేదే! తనను ఒత్తిడి చెయ్యలేదే!

కాని, ఈ భావం ఆమెకు సంతసం చేకూర్చే బదులు భయం కలుగజేసింది. అసహాయతతో అంగీకరించలేదు గదా! అనే అనుమానం వచ్చింది.

ఈ ఊహ ఆమెను కలతపెట్టి గత సంఘటనను వివిధ దృక్పథాలలోంచి తరిచి చూసేటట్టు చేసింది.

తన బాధ సడలిపోవడంలో అతనెల్లా అయి ఉంటాడు అనే ఆలోచనకు తాను తావివ్వలేదనే విషయం ఆమెకు స్ఫురించింది.

'సరే నీ ఇష్టం!' అన్నప్పుడు అతని ముఖంలో ఏ భావాలున్నాయో గుర్తుకు రాలేదామెకు. ఎంత తన్నుకున్నా అప్పుడతని ముఖం ఎలా ఉందో మనస్సుకు అందదు.

...గూడు కట్టిన బాధ ఉన్నట్టుందా అతని కంఠ...రం? లేక సామాన్యంగా ఉందా? అనే ప్రశ్నకు కూడా ...మాధానం దొరకకపోవడంతో ఒకవేళ అతను విపరీత...మైన నిస్పృహతోను, నిరాశతోను, వేదనతోను ఏమీ ...చెయ్యలేక ఆ మాట అన్నాడా అనే సందేహం పీడించ...నారంభించింది.

గతంలో వివిధ సంఘటనలలో అత నెలా ప్రవ
చినదీ జ్ఞప్తికి తెచ్చుకుని దీనికి సమాధానం వెతుకుదామ
దాని కుపక్రమించింది అనూరాధ.

ఖాన్‌ను శైలజ పెళ్ళి చేసుకుంటానని ఉత్తర
వ్రాసిన రోజున విశ్వం అన్న ముక్కలు స్ఫుర
కొచ్చాయి.

"ఎంత స్థైర్యంగల మానవుడైనా తను ఎంతో
తర్కంతో నిర్మించుకొన్న భావాల మేడలు పునాది
మట్టంగా కూలిపోతే విచలితుడు కాక మానడు" అన్నాడు
విశ్వం, తాను వద్దని శైలజకు వ్రాయమంటే !

అటువంటి తీవ్ర వేదనకే విశ్వం గురికాలేదు గదా

స్త్రీకి యుగయుగాలుగా జరిగిన అన్యాయాలన
ప్రతిఘటించాలని, వారిలో భావదాస్యాన్ని పోగొట్టాలని
ఎంతో ఆశతో, పట్టుదలతో, ఓర్పుతో తన ద్వారా
కార్యసాధనకు ఉపక్రమించిన అతనికి తన మొండి పట్టు
దల వల్ల పరాజయం సిద్ధించింది. ఫలించబోతున్న సమ
యంలో కథ అడ్డం తిరిగింది. దానికి అతను ఎల్లా విచలి
తుడు అయ్యాడో!

ఈ ఆలోచనతో ఆమె కంపించిపోయింది !

తనెంత ఘోర అపరాధం చేసింది !

కొంపదీసి తాను మొదటినుండీ భయపడుతున్నట్లు
తన అపరాధాలను క్షమించి తన దారినుండి వైదొలగడు
గదా !



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 105 B 181 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 449 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 43,44 |
| తయారు చేసినది | prathyush |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |